స్వార్థిశ్రీ

# తెలుగు భాషాచరిత్ర



మహతీ గ్రంథమాల

అరండ

# తెలుగు భాషా చరిత్ర


‘స్ఫూర్తిశ్రీ’

బి. భాస్కరరావు. ఎం. ఏ.,

సీనియర్ లెక్చరర్, ఏ. సి. కాలేజి - గుంటూరు.



మహతీ గ్రంథమాల

అరండల్ పేట - గుంటూరు-2

మొదటి ముద్రణ 1964

రెండవ ముద్రణ 1969

మూడవ ముద్రణ 1972

(పరివర్ధిత సంస్కరణము)



ప్రాప్తిస్థానము

ది బుక్ వరల్డ్

అరండల్ పేట – గుంటూరు -2

ముద్రణ :

శ్రీ లక్ష్మీ ప్రెస్

అరండల్ పేట – గుంటూరు-2

# విషయసూచిక

# తోడ్పడిన గ్రంథములు

## తెలుగు

ఆంధ్ర భాషా వికాసము
ఆంధ్ర భాషా చరిత్రము
ఆంధ్ర భాషా భూషణము
ఆంధ్ర భాషానుశాసనము
ఆంధ్రుల చరిత్ర
ద్రావిడ భాషలు
సంధి
అప్పకవీయము
బాల వ్యాకరణము
ప్రౌఢవ్యాకరణము
వ్యావహారిక భాషా వ్యాకరణం
ఆంధ్రుల చరిత్ర
ఆంధ్రకౌముది
ఆర్యభాషా విభాగము
ప్రాకృత భాషోత్పత్తి
శాసన పద్య మంజరి
దక్షిణభారత సాహిత్యములు
విజ్ఞాన సర్వస్వము
సూర్యరాయాంధ్ర నిఘంటువు
చింతామణీ విషయ పరిశోధనము
వ్యాకరణ సంహితా సర్వస్వము
ద్రావిడ భాషా పరిశీలనము
ప్రాఙ్నన్నయ యుగము
నన్నయ భారతము
ఆంధ్ర శబ్ద తత్త్వము
అర్ధానుస్వార తత్త్వము
శబ్ద లక్షణ సంగ్రహము
మన లిపి పుట్టు పూర్వోత్తరాలు

## సంస్కృతము

సిద్ధాంతకౌముది
ప్రతాపరుద్రీయము
కావ్యమీమాంస
ఆంధ్రశబ్ద చింతామణి
అధర్వణ కారికావళి
కవి శిరోభూషణము
సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము
సాహిత్య దర్పణము
నాట్యశాస్త్రము
భాషాశాస్త్ర ప్రవేశిని

## హిందీ

భాషాలోచన్
భాషా రహస్య
ఆర్యభాషా ఔర్ హిందీ
భాషా విజ్ఞాన్

## ఆంగ్లము

History of Kannada Language
Dravidian Languages.
A study of Telugu Compounds
A study of Telugu Semantics
Comparative grammar of Dravidian Languages
Dravidian philology
Dravidian Etymological Dictionary
The grammatical structure of Dravidian Language
Linguistic survey of India
Our Language
The Romance of words
Language
The Miracle of Language
Primer of Philology
Telugu verbal Bases

పరమోదారులు మద్గురూత్తములు యద్భాషాపయోరాశి యా
విరి గావించి యనుగ్రహించి రదియే విద్యార్థి సద్యః పయో
ధరమై చల్లని గాలి సోకి యనుమోదస్ఫూర్తి వర్షించె సు
స్థిరమై లక్షణసత్ఫలోత్కరణము వాసింగాంచ నాంధ్రోర్వరన్.

# ముందుమాట

## మొదటిముద్రణ పీఠిక

ఏ జాతియైనను తన చరిత్రను తాను తెలిసికొనవలయునన్న దేశచరిత్రతో పాటు సాంఘికచరిత్రను భాషాచరిత్రను గూడ తెలిసికొనుట యవసరము. ఈ త్రితయము నేకత్వము నొందినగాని చరిత్ర సమగ్రత్వము నొందదు.

ఆంధ్రుల సాంఘికచరిత్రను సమ్మానభాజనముగా రచించిన గౌరవము శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు దక్కించుకొనిరి. భాషాచరిత్ర రచనమున నాకు గౌరవ పాత్రులు ముగ్గురు – శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, శ్రీ గంటి జోగిసోమయాజిగారు, శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు.

శ్రీ చిలుకూరి ఆంధ్ర భాషా చరిత్రమును రచించిరి, తెనుగును కూడ ఇతర ద్రావిడ భాషలతోపాటుగ ప్రాకృతజన్యముగా పరిగణించిన వీరివాదము నాకు సమ్మతము కాదు. అయినను భాషా పరిశోధనమున వీరిగ్రంథ మమూల్య విశేషములను వెలువరించిన దని నా నిశ్చయము.

శ్రీ గంటి ఆంధ్ర భాషా వికాసమును రచించిరి. చాలకాలముగా అధ్యయ నాధ్యాపనములందు ప్రశస్తినొందిన యేకైక గ్రంథము. ద్రావిడభాషా కుటుంబ వైశిష్ట్య నిర్ణయమున నిరుపమానములైన దీక్షను, దక్షతను నిరూపించుకొన్నది.

శ్రీ వజ్ఝల ద్రావిడ భాషా పరిశీలనము రచించిరి. కాల్డ్వెల్ గ్రంథాను వాదముతో, అనుకూల ప్రతికూల వాదములతో, తమిళ కర్ణాట మలయాళ బహు లక్ష్యములతో మహాగహనముగా సాగినది. నిశితపరిశీలన దృష్టికి, నిరుపమ పాండిత్యమునకు నిధానము.

ఈ మూడు గ్రంథములును విషయముననే కాక పరిమాణమున కూడ ఘన తను సాధించుకొన్నవి. పరీక్షార్థికిగాని, సామాన్య పాఠకునికిగాని ఆసక్తిని గలి గింపవలయునన్న నింతకన్న తక్కువ పరిమాణములో, సరళసుందరముగా వ్రాయుట యవసరము. దానికై నేనొక ప్రణాళికను సిద్ధము చేసికొని, దాని కను గుణముగా విషయమును సేకరించుకొని, యీ గ్రంథమును వ్రాసితిని. ఇది పరి శోధనగ్రంథ మని కాని, సర్వవిషయసమగ్ర మని కాని కించిన్మాత్రమును నాకు భ్రమ లేదు. ఇందలి ప్రతి ప్రకరణమును విస్తృతి నపేక్షించును. ఐనను, భాషా చరిత్రలోని వివిధాంశములతో పరిచయము గావించి యాసక్తిని గలిగించి పెంపొందించుటకీ గ్రంథము పర్యాప్తము కాగలదు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వ్రాసిన 'సంధి', శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు వ్రాసిన 'ప్రాఙ్నన్నయయుగము' 'నన్నయ భారతము' అను రెండు సంపుటములు, శ్రీ తిరుమల రామచంద్రగారు వ్రాసిన 'మనలిపి పుట్టుపూర్వోత్తరాలు' అను గ్రంథము నేక దేశముగా రచింపబడిన మహత్తర గ్రంథములు. ఇట్టివే యింకను రావచ్చును; రావలయును.

విపులీకరణమున కొకవిధమైన ప్రయోజన ముండగా సమీకరణమునకు మరొకవిధమైన ప్రయోజన ముండును. ఆ ప్రయోజనమే యీ గ్రంథమునకు పరమార్థము

గ్రంథరచన మొక యెత్తు; గ్రంథప్రకటనము మరొక యెత్తు, 'బుక్స్ ఆఫ్ ఇండియా' సంస్థవారు గ్రంథ ప్రకటన భారమును వహించుటయే కాక. నిరంతర ప్రోత్సాహముతో గ్రంథరచనకు కూడ కారణభూతులైరి.

నా సర్వవ్యాసంగమునకు కార్యరంగమైన ఆంధ్రక్రైస్తవ కళాశాలకు, విద్యార్థిజిజ్ఞాసువులకు నా కృషిలో తగినంత భాగమున్న దనుట యథార్థము. నా యభిలాషకు తగినట్లుగా, అందముగా ముద్రించి యిచ్చిన గౌరవము శ్రీ లక్ష్మి ప్రెస్ వారిది.

అందరకు నా ధన్యవాదములు.

# మ రొ క మా ట

## రెండవముద్రణ పీఠిక

తెలుగు భాషా చరిత్ర కిది రెండవ ముద్రణ. ఇటువంటి గ్రంథములు పునర్ముద్రణకు నోచుకొనుట పుణ్యవిశేష మనియే యెంచవలయును. అందును మూడు నాలుగేండ్లలోనే అట్టి యవసరము కలుగుట మరింత విశేషము. దీనికి వెనుకనుండి చేయూత నిచ్చి, అట్టి యవసరమునకు హేతువైన పెద్దల సౌమనస్యమునకు నా హార్దిక ధన్యవాదములు.

ఇది కేవలము రెండవ ముద్రణ కాదు. మొదటి ముద్రణకంటె దరిదాపు రెట్టింపు గ్రంథము పెరిగినది. మిత్రుల సూచనల ననుసరించి, విద్యార్థుల యావశ్యకములను గమనించి పెక్కువిషయములను క్రొత్తగా చేర్చుట జరిగినది. అయినను వీలయినంత సంగ్రహముగా, విశదముగా చెప్పుటయే నా లక్ష్యము; దానిని విడనాడలేదు. కొందరు మిత్రులు ఇందలి ప్రకరణములను పెంచి వ్రాయుమని సూచించిరి. కాని, అది నా లక్ష్యమునకు అనుకూలము కాకపోవుట చేత, అట్టి విస్తరణ కార్యక్రమమునకు వీలు కలిగింపలేక పోయితిని. ఉన్నది యున్నట్లుగా విద్యార్థుల యవసరములను తీర్పగలదని, భాషాభిమానులకు సంతృప్తిని చేకూర్ప గల దని నా విశ్వాసము.

భాషాశాస్త్ర విషయమున తెలుగుదేశము బాల్యము నింకను దాటలేదు; తగినన్ని గ్రంథము లింకను వెలువడలేదు; పారిభాషిక పదప్రయోగ విషయమున బహుజనసమ్మతమైన ఏకరీతి యేర్పడలేదు. కాబట్టి ప్రస్తుతగ్రంథమునందు ప్రయుక్తములయిన పారిభాషికపదములను, తుల్యములయిన ఆంగ్లపదములను అకారాది క్రమముననొక పట్టికగా వ్రాసి చేర్చితిని. పరీక్షార్థులు ఆంగ్లపదములను గూడ గుర్తుంచుకొనుట యవసరము.

పూర్వముద్రణగ్రంథమువలె ఇదికూడ పాఠకుల యాదరమునకు పాత్రము కాగలదని, అంతకంటె నెక్కువ ప్రయోజనవంతము కాగలదని నా యాశంస.

# ప్రాస్తావిక ప్రకరణము

మానవుడు సర్వసృష్టియందు నుత్తముడు. పుట్టినది మొదలు పెక్కువిధములుగా పెరుగుదలను సంపాదించుకొనును. ఇతరజీవులకులేని ఆలోచనాశక్తి మానవునకు కలదు; అందువలననే అత డాలోచించును. తన జీవితమందలి యెన్నియో ఘట్టములు, పరిసరములందలి యెన్నియో సన్నివేశములు ఆతని కాలోచనలను కలిగించును. వానిని చుట్టుప్రక్కలవారికి వ్యక్తము చేయవలయును. మానవుడు సంఘజీవి యగుటవల్ల తన భావములను ఇతరులకు తెల్పుటయు, ఇతరుల భావములను తాను తెలిసికొనుటయు తప్పవు. కావున తన భావములను వెల్లడించుటకు ప్రాక్తన మానవుడు మూడు మార్గముల ననుసరించియుండె నని భాషాశాస్త్రిల యభిప్రాయము.

మొదటిది అరచుట. ఈ విధానము భయము, శోకము మున్నగు భావములను గాని, ఆహారపదార్థము లభించు ప్రదేశము మున్నగువానిని గాని తెలియజేయుటకు సరిపోవును. ఆ యా భావములనుబట్టి స్వరమునందు మార్పులు కలిగి ఆవేశము, ఉత్సాహము మున్నగువానిని నిరూపించును. ఈ పద్ధతివలన ప్రాచీనమానవుని కనీసపువ్యవహారము గడచిపోయెడిది.

రెండవది ఆంగికచలనము. కాళ్లను చేతులను ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కవిధముగా కదలించి ప్రాచీనమానవుడు తన భావములను వ్యక్తము చేసెడివాడు. ఇప్పుడును మూగవారికి తెలియజెప్పునప్పుడు గాని, చెవిటివారితో మాటాడునప్పుడుగాని కరచరణాద్యవయవములతో కొన్ని సంకేతములను గావించుట చూచుచునే యున్నాము. అన్యభాషీయులతో వ్యవహరింపవలసి వచ్చినపుడు కూడ ఇదే పద్ధతి నవలంబించుచున్నాము. ఇది యెంత ప్రాచీనభాషయైనను కానిండు! బహుభాషాపండితులైనను కాళ్లేతులు కదలింపకుండ మాటాడరు. కాని, యీ ఆంగికచలనము దూరవర్తులకు ఉపయోగపడదు.

మూడవది వాగ్వ్యవహారము. ఇదే మన భావములను, అనుభూతులను, ఆలోచనములను చుట్టుప్రక్కలవారికి అందించుటకు సమర్థమగు సాధనము. ఆంగికచలనమందు కరచరణాదులతో చూపిన సంకేతములే యిప్పుడు భాషా రూపము నొంది యింకను స్పష్టము లగును. కావున వస్తువులకు, భావములకు, అనుభూతులకు, ఆలోచనలకు సంకేతము లగు మాటల సమూహమే భాష యని నిర్వచింపవచ్చును. దీనిని బట్టి భాషకు భౌతికధర్మములు, మానసికధర్మములు కూడ ఉన్న వనవచ్చును. ముఖయంత్రముకదలికవల్ల మాటలు పుట్టును; శ్రవో యంత్రము సాహాయ్యమున మాటలు వినిపించును. ఇది యంతయు భౌతికధర్మము. మాటలు భావాదులకు సంకేతములు గదా! హృదయ స్పందనములను, బుద్ధిగతాలోచనములను గూడ మాటలు వ్యక్తీకరించును. ఇదంతయు మానసికధర్మము.

ఇంతే కాక, భాష సంప్రదాయలక్షణములతో పాటు వైయక్తిక విశేషములను కూడ వ్యక్తము చేయును. సనాతన మైయుండియు, అభ్యుదయలక్షణములను ప్రదర్శించును. ఏ యొక్కడును దీనిని మార్చుటకు గాని, మరొకదానిని దీనిలో చేర్చుటకు గాని సమర్థుడు కాజాలడు.

భాష సర్వసామాన్యము; అందరకు నర్థము కావలయును; లేని యెడల, దాని ప్రయోజనమే భగ్నమగును. కావున వ్యక్తిగతము లగు అభిరుచు లెట్లున్నను భాషా విషయమున మార్పు అంగీకార్యము కాదు. పిల్లలు తల్లిదండ్రుల దగ్గర, చుట్టుప్రక్కల పెద్దల దగ్గర భాషను సంపాదించుకొందురు. భాష తెలిసినవారు మాటలాడుచుండగా, తెలియని వారు దానిని విని ప్రయత్నపూర్వకముగా నేర్చుకొందురు. అంతేకాని ఒకజాతియందు పుట్టినంతలో ఎవ్వరికిని భాష స్వత్వముగా సంక్రమింపదు. వైయక్తిక వైలక్షణ్యములను కలియగలుపుకొని భావవ్యక్తీకరణమునకు సామాజికముగ సహకరించు సాధనము భాష.

## భాషోత్పత్తి

భాష పుట్టుకనుగూర్చి అనేక వాదములు గలవు. భాష భగవద్దత్త మని కొందరి భావము. భాషను మనుష్యుడు నిర్మింపలేదనియు, భగవంతుడే కల్పించి మానవునికి ప్రసాదించెననియు వారి నిశ్చయము. ఈడెను తోటలో భగవంతుడు స్వీడిషుభాషను, ఆదము డేనిషుభాషను, పాము ఫ్రెంచిభాషను మాటలాడెనని ఒక స్వీడిషుభాషాశాస్త్రవేత్త నిర్ణయించెను. భారతీయులు సంస్కృతమును అమరభాష యని సంభావించుచున్నట్లే మహమ్మదీయులు అరబ్బీభాషను, క్రైస్తవులు హీబ్రూభాషను దేవతలభాష లని భావించి మన్నించుచున్నారు. దీనినిబట్టి భగవంతుడే మానవునకు భాషను ప్రసాదించె నను విశ్వాసము బలీయముగా నున్నట్లు స్పష్టము కాగలదు.

కాని, యిది తర్కసహ మగు అభిప్రాయము కాదు. మానవులకు దూరముగా, ఎక్కడనో, ఏకాంతముగా, ఒకనిని బాల్యముననే విడిచిపెట్టితి మనుకొందము. మానవుల సంబంధము లేకుండగనే ఆహారాదికము నేర్పాటు చేయవచ్చును. అతనికి మానవులమాట నేమాత్రము వినిపింపకుండ జేసినచో, అతడు వయసున వృద్ధిపొందుచున్నను భాషను సంపాదించుకొనలేడు. మూగవాడుగనే వ్యవహరించును. ఇట్టి ప్రయోగములను పెక్కింటినిబట్టి భాషను భగవంతుడే యిచ్చె నను వాదము అపాస్తము కాక తప్పదు. కాని ఒకటిమాత్రము నిజము. ఇతరజీవులకు లేని సౌకర్యము మానవునికి కలదు. మానవుని కంఠమున గల స్వరపేటిక యెట్టిశబ్దముల నైనను స్పష్టముగా నిర్దిష్టముగా పలుకగలదు. ఇదియు భగవదనుగ్రహమే. అట్టి స్వరపేటిక సాహాయ్యమున మానవుడు వివిధశబ్దములను భిన్నభిన్నస్వరములలో అవస్థానుగుణముగా పలికి, భాషను కల్పించుకొనును. దానినే తరువాతివారు స్వప్రయత్నము వల్ల సముపార్జించుకొని రనుట సత్యసంగతమై కనిపించును.

సంకేతములనుండి భాషలు సముద్భవించె నని కొందరవాదము. ప్రాచీనమానవుడు తన భావములను వెల్లడించుటకు కరచరణాద్యవయవముల నొకపద్ధతిలో కదపెడివాడు. దానితోపాటుగా "ఏ, ఓ" మున్నగు ధ్వనులుకూడ చేసెడివాడు. ఆ ధ్వనులును, మూకసంకేతములును నేటిభాషకు మూలరూపములని వారి యభిప్రాయము. ఈ వాదము "పూ పూ" (Pooh Pooh) వాద మని పేరొందినది. దీనికే "టట్-టట్" వాద మనియు మరొక పేరున్నది.

కాని, ఇది అంగీకార్యము కాదు. భాష లేనప్పుడు సంకేతముల నుపయోగించుట సహజము. ఇప్పటికిని అన్యభాషీయులకు మన భావములను వెల్లడి చేయవలసి వచ్చినపుడు సంకేతముల నాశ్రయించుట తప్పుట లేదు. కావుననే వీనిని భాషకు మూలరూపముగా భావించుట పొరపాటు. ధ్వన్యాత్మకమయిన భాష కర చరణాదిసంకేతములవల్ల ఏర్పడెననుట యుక్తిసహము కాదు.

అనుకరణము కారణముగా భాషలు పుట్టినవని కొందరవాదము. మానవుడు తన చుట్టుప్రక్కలనుండి ధ్వనిచేయుచున్న పశుపక్ష్యాదులను అనుకరించెను. కాకి "కాకా" అని యనును; కావున అది "కాకము" అని మైనది. అట్లే "భే" యని యఱచుటచే కప్పకు "భేకము" అను పేరు కల్గినది అట్లే కోకిలకూత "కూకూ" అనునట్లుగా నుండు నను భావమున "Cuckoo" అను వ్యవహారము కలిగినది. చిన్నపిల్లల వ్యవహారమున "మేక" యనుటకు బదులుగా, అరపునుబట్టి "మే" యని వాడుట వినిపించును. అట్లే రైలుబండి యనుటకు బదులుగా కూతనుబట్టి "కూ" యని వాడుట కలదు. ప్రాక్తన మానవుడీవిధ మగు మనస్తత్వముతోనే అనేక శబ్దములను సాధించికొనియుండు ననుటకు సందేహము లేదు. స్వాభావికము లయిన ధ్వనులనే కాక ధ్వన్యనుకరణశబ్దములను గూడ అనుకరించుట భాషాప్రాథమికరూపము. మానవులు చేయు ధ్వనులనుగూడ మరొకమానవుడు విని గ్రహించుటయు, దానికి బదులుగా

మరొకధ్వనిని చేయుటయు స్వాభావికము. కావున ప్రకృతిలోని శబ్దము లను, పశుపక్ష్యాదులు చేయు శబ్దములను అనుకరించుట యాధారముగా భాష యేర్పడుచున్నదని సిద్ధాంతము.

ఎన్నోభాషలలో ఇట్టి ధ్వన్యనుకరణాత్మకము లయిన శబ్దము లున్నమాట సత్యము. కాని చుక్కలు, సూర్యుడు, చంద్రుడు మున్నగు మౌనపదార్థము లెన్నో కలవుగదా ! వీనికిని పేళ్లు గలవు. కావున ధ్వన్యనుకరణమే భాషోత్పత్తికి కారణమని చెప్పుట సర్వత్ర సమంజసము కాదు. ఈ లోపమును గమనించియే "మాక్సుముల్లరు" దీనికి "బౌవౌ" వాద మని పరిహాస పూర్వక మగు పేరిడెను.

మాక్సుముల్లరు తన పక్షమున తాను "డింగ్‌డాంగ్" వాదమును ప్రతిపాదించెను. ధ్వనికిని భావమునకును అనురూపమైన సంబంధ మొకటి యుండును. ప్రకృతియంతయు లయాత్మక మనియు, ప్రతిపదార్థమును ప్రకంపనములను కలిగియుండుననియు, ఆ ప్రకంపనములకు అనుగుణము గనే శబ్దము వక్తనోట వెలువడు ననియు ఈవాదమునందలి సారము. Whisper అని యన్నపుడు చెవిలో రహస్యముగా గుసగుసలు చెప్పు కొను నప్పటి శబ్దము వినిపించును. తెలుగునందలి 'గుసగుస' యనునది కూడ అట్టి ధన్యాత్మకతను కలిగియే యున్నది. Glow అని యన్నప్పుడు ఏదో ఒకవికాసము, ఒక దీప్తి యున్నట్లు అనిపించును. Zig Zag అని యన్నపుడు 'వంకర టింకర' యని తెలుగున అన్నట్లుగానే ఒకవక్రత భాసించును. ఇట్లే గణగణ, దబాలున, చట్టున మున్నగు పదములు క్రియాసందర్భ సముద్భూతము లగు ధ్వనులను అనుకరించు చున్నట్లు అనిపించును.

కాని, ఇది శాస్త్రసిద్ధాంతముగా నిలుచునంతటి శక్తిమంతము కాదు. కవితాహృదయము కలవారి కేశబ్దమైనను విశిష్టముగా కనిపింప వచ్చును. శబ్దములతో నిత్యపరిచయము సంపాదించుకొన్న పిమ్మట ఆయాశబ్దములలో ఈనాడు మనము విశిష్టధ్వనులను కనుగొనవచ్చును.

అంతమాత్రమున ఇదే సత్యమనుట కవకాశము చాలదు. పైగా ఇట్టి పదము లేభాషయందైనను అల్పసంఖ్యాకములై యుండును. వీనికే సర్వప్రాధాన్య మిచ్చుట సమంజసము కాదు.

బరువులను మోయునప్పుడు, బట్టలను ఉతుకునప్పుడు, పరుగెత్తుకొని వచ్చునప్పుడు ఉచ్ఛ్వాసనిశ్వాసములు దీర్ఘముగను బరువుగను సాగును. ఇటువంటి సమయములందు కండరములు బిగిసి, నాదతంత్రులు ప్రకంపనమునొంది కొన్ని విధములగు ధ్వనులను పుట్టించును. ఇంతవరకు చేయుచున్న పనివల్ల కలిగిన శ్రమ యీ విధముగా ధ్వని పూర్వకముగా ఉచ్ఛ్వాస నిశ్వాసములను గావించుటతో కొంత ఉపశమించినట్లు కనిపించును. సామూహికముగా, ఒక తెగ జనులు తమ పనిపాటులలో ఉపయోగించుకొన్న యీధ్వనులే క్రమక్రమముగా అర్థవంతములై భాషారూపము ధరించె నని కొందర వాదము. దీనినే **Muscular Theory** అని యందురు. పడవలను లాగువారు వెలువరించు "యోహిహూ" అను ధ్వనినిబట్టి దీనికి "యోహిహో వాద" మనియు పేరు గలిగినది.

ఇతరవాదములందువలెనే దీనియందును లోపము గలదు. అర్థహీనము లయిన ధ్వనులే అర్థవంతమయిన భాషకు మూల మని స్థాపించుట పొసగదు. పైగా ఇట్టి శబ్దములు ఏ భాషయందైనను అల్పసంఖ్యాకములు.

వివక్షాప్రేరణమే కారణముగా మాటలు పుట్టిన వని కొందర వాదము. విట్నీ మున్నగువారు చెప్పినట్లు "వ్యక్తీకరణాభిలాషయే భాషాభివృద్ధికి ప్రప్రథమ లక్షణము." భయము, శోకము, విసుగు, సంకోచము, సంతోషము మున్నగు భావములను వెల్లడింపవలయునన్న అభిలాషవల్ల మొదట మాటలు వెలువడెనని వీరు చెప్పుదురు. అరణ్యజీవితమును గడపు ఆదిమమానవుడు క్రూరమృగములవల్ల కలుగు భయము చేతనో అటునిటు నడయాడుటలో శరీరమునకు తగిలిన గాయముచేతనో

గట్టిగా అరచెడివాడు. అట్లే చిన్నచిన్న జంతువులను భయపెట్టుటకు కేకలు పెట్టెడివాడు. ఇట్లు హృదయములోని భయాందోళనములను, సంతోష సంభ్రమములను వెల్లడించుటకు వేసిన కేకలు, పెట్టిన బొబ్బలు భాషాస్వరూపసంపాదకము లని అందురు. కాని, యేభాషలో నైన నిట్టి శబ్దములు స్వల్పముగా నుండును. అట్టియెడల, ఆ శబ్దములే భాషకు రూపము దిద్దె ననుట యుక్తిసంగతము కాజాలదు.

ధాతువులనుండి భాష పుట్టిన దని కొందఱి నిశ్చయము. మొట్ట మొదట ఎట్లో కొన్నిధాతువులు లభించినవి; వానినుండి అనేకము లగు శబ్దములు సిద్ధించినవి. ఆ ధాతువులే భాషలోని సర్వశబ్దములకు మూల మైనవి. ఇది అనేకులకు సమ్మతమైన వాదము. కాని, దీనియందు సైతము లోపము కనిపింపక పోదు. ప్రపంచమున గల కొన్ని భాషలలో ధాతువు పేరుమాత్రమునకైనను కనిపింపదు. సంస్కృతము మున్నగు భాషలందు ధాతువుయొక్క స్వరూపము స్పష్టముగా సాక్షాత్కరించు ననుమాట సత్యము.

ప్రాథమికదశయందు వాక్యములే వ్యవహృతములు కాగా, వాని యందలి సాదృశ్యవైదృశ్యములను పరిశీలించి పండితులు విశ్లేషణ కార్యక్రమము ననుసరించిరి. అట్లు వేరుపడినవి ధాతువులు. కావున, ధాతువులను మూలముగా చేసికొని భాషాపర్వతము నిల్చిన దనుట సత్యమును వ్యత్యస్తము గావించుటయే యగు నని కొందర నిశ్చయము. పండితులు భాషాపర్వతమును శకలీకరించి, వేర్వేరు శిలలకు వేర్వేరు పేళ్లుంచిరి. అట్టి వానిలో ధాతువులు ప్రధానములు. అనంతరకాలమున ధాతువులు హేతువులుగా అనేకశబ్దము లుత్పన్నమైన వన్నను విప్రతి పత్తి లేదు.

పరస్పరవిమర్శవల్ల భాష పుట్టెనని కొందర వాదము. కొందరు వ్యక్తులు కూర్చుండి, బాగుగా ఆలోచనముచేసి, భాషను కల్పించి రని వీరి యభిప్రాయము. తాము వాడుకొను వస్తువులకు సర్వసమ్మత

మగునట్లుగా సమాలోచనము జరిపి నామకరణము గావించియుందు రని వీరి యూహ. ఇది అభూతకల్పనము. భాషయే లేనినాడు వీరు సమాలోచనము జరుపు టెట్లు ? సంభాషించు టెట్లు ? అంతే కాక నలుగురును కలిసి నిర్ణయించినంతటిలో భాష యుత్పన్న మయ్యె ననుట యుక్తి సహము కాదు. అనంతరకాలమున భాషలో కొన్ని సంస్కారములు తీసికొని వచ్చుటకు ఇట్టి సమావేశములు పనికివచ్చు నేమో కాని భాషయే లేనినాడు సమాలోచన మనుమాట నేల విడిచి సాము చేయుట.

కాని, ఒకటి మాత్రము సత్యము. పైని చెప్పిన సర్వవాదములు యథోచితముగ భాషోత్పత్తికి సహకరించును. ప్రాథమికదశలో నెట్లున్నను పరిణామదశలో పై వాదములు చాలవరకు పనిచేసియుండును. "స్వీటు" మున్నగువారు సమన్వయవాదమునే సమర్థించిరి.

పైని చెప్పిన వాదము లన్నింటినిబట్టి మానవుడు కొంత కాలముపాటు మూగవాడై యుండియుండు నని చెప్పవలసి వచ్చుచున్నది. కాని, ఇది సరియైనది కాదు. ప్రారంభమునుండియు మానవుడు ధ్వనుల నుపయోగించెననియు, అట్టిశక్తి యాతనికి సహజావబోధము (Instinct గా సంక్రమించెననియు అనుకొనదగును. కుక్కలు, పిల్లులు మొదలగునవికూడ అశిక్షితముగనే ధ్వనులను చేయుచున్నవి గదా ! అట్లే ప్రాక్తనమానవుడును చేసియుండును. ఆహారసంపాదనము, దాంపత్యజీవనము, శిశుపోషణము, శత్రుసంహారము మున్నగు విషయములు సర్వజీవులకు సమానము. నోరు కేవలము ఆహారగ్రహణమునకే యేర్పడినను, మానవుడు తన స్వశక్తినలన దాని నింకను లాభదాయకముగా నుపయోగించెను. పరిసరములం దున్న పశుపక్ష్యాదుల ధ్వనుల ననుకరించెను. దీని కాతని అన్వేషణపరాయణత్వము కూడ తోడ్పడియుండును. సహజ వికాసము, పరిసరములను అనుకరించుట, క్రొత్త క్రొత్త మార్పులను సాధించు ప్రయత్నము – ఇవన్నియు భాషోత్పత్తికి సహకారులే అనవలసి వచ్చును.

మానవు డెప్పుడైనను, ఒక క్రొత్తవస్తువును చూచినయెడల ఇతరులకు చెప్పవలయు నని తహతహలాడుచుండును. పేరు తెలియని యెడల దాని గుణములను వర్ణించి, దాని స్వరూపమును వివరించి, యితరులకు తెలియజెప్పుటకు యత్నించునే కాని యూరకొనడు. ఈవిధ మగు వివక్ష మానవప్రయత్నమునకు కారణమై భాషోత్పత్తికి సహక రించినది. ఇట్లు అనేక కారణములు సమన్వయ మొంది భాషోత్పత్తికి సహకరించియుండు నని పరిశీలన చేసినమీాదట మనకు గోచరము కాగలదు. నేటి పరిస్థితులనుండి యెన్నియో సంవత్సరముల క్రిందటి పరిస్థితులను సమగ్రముగా అవగాహన చేసికొన్నగాని వాస్తవమును నిశ్చయింపజాలము. భాషయందు సారస్వతమునందువలె ఆంతరమైన అర్థమునకు కాక, బాహిరమైన శబ్దమునకు ప్రాధాన్యము హెచ్చు. 'భాష' అను పదము 'భాష్' అను ధాతువువల్ల ఏర్పడినది. దీనికి "వ్యక్తమైనవాక్కు" అనియర్థము. ఇందు అర్థవంతములైన అక్షరములు, పదములు, వాక్యములు నుండును. అర్థహీనములైనచో అవి భాషాశబ్ద వాచ్యములు కాజాలవు. ధాతువు, ప్రకృతి, ప్రత్యయము, వాక్యము - అనునవి భాషయందలి ప్రధానాంగములు.

## ప్రపంచ భాషలు

తొలుదొల్త ఒక్కటే భాష యయ్యును, క్రమముగా పెక్కు భాషలు వాడుకలోనికి వచ్చినవి. మానవజాతి పెరిగి, పెద్దదై ప్రపంచ మున విస్తరించుకొన్నట్లే భాషలును విస్తరించుకొన్నవి. ఈనాడు భాషాశాస్త్రిల పరిగణనమును బట్టి ప్రపంచము మొత్తముమీాద 2796 భాషలు కలవు. ఒకభాష మాటాడువారికి మరొకభాష యేమాత్రము నర్థముకానంతగా అనిపించును. భిన్నభిన్నములుగా కనిపించు నట్టి యీభాషలలో కొన్నింటికి ఆంతరికమైన సంబంధ మేదో యున్నట్లు పరిశీలననేత్రములతో చూచినవారికి తప్పక గోచరించును. భాషల

యొక్క రూపమునుబట్టి కాని, భాషలయొక్క పుట్టుకనుబట్టి కాని వానికి పరస్పరసంబంధమును స్థాపించుటకు అవకాశము కలదు.

ఈ వర్గీకరణము రెండు రకములుగా చేయవచ్చును. మొదటిది జాత్యాశ్రిత వర్గీకరణము. భిన్నభిన్న భాషలయందలి పదముల సాదృశ్యమును, ఆయాపదములకు మూలమైన ధాతువును నిర్ణయించి ఏక కుటుంబతను అంగీకరింప నగును. దీనినే ఆంగ్లమున **Genealogical classification** అని యందురు.

కాని భాషలలోని శబ్దములు, వాక్యములు అన్యభాషలలోని శబ్దములతో వాక్యములతో సంబంధమును కలిగి కనిపించుచున్నవి. కేవలము రూపమునుబట్టి కన్పించు సామ్యమే కాక అర్థసామ్యము, ధాతువిశేషము మున్నగు వానిని పరిశీలించినప్పుడు ఈ భిన్నభిన్న భాషలు ఒకే ఆశ్రయమునుండి వెలువడినట్లు ఊహింప వీలు కల్గును. మొట్ట మొదటగా ఈ భాషలను పరిశీలించినవారు ఈవిధముగా తలచిరి.

'తండ్రి' అను నర్థమున సంస్కృతమునందు 'పితృ' అను నామమున్నది. జందు భాషయందు 'పిత' యనియు, లాటిను భాషయందు 'పేతర్' అనియు, జర్మను భాషయందు 'ఫాటెర్' అనియు, పారశీకమునందు 'పిదర్' అనియు, ఆంగ్లమునందు 'ఫాదర్' అనియు రూపములు గలవు. వీనిలోని సామ్యమును చూచినప్పుడు ఈభాష లన్నియు ఏదో ఒక ప్రాచీనభాషనుండి పుట్టినట్లు నిర్ధారించు అవకాశము కల్గుచున్నది. ఈవిధముగా ఏయే భాషలలో ఏకార్థనిర్ణాయకములై పరస్పర సన్నిహితత్వము గల పదము లున్నవో పరిశీలించి, వాని నెల్ల ఒకతల్లి బిడ్డలుగా గాని ఒకే కుటుంబమునకు చెందిన భాషలుగా గాని ఊహింపవచ్చును. సంస్కృతము, లాటిను, ఆంగ్లము మున్నగు భాషలలోని చరిత్రసాదృశ్యమును బట్టి సోదరభాష లని నిర్ణయింపవచ్చును. అట్లే ప్రాచీనమగు లాటినుభాషాకుటుంబమునకు చెందినవిగా ఫ్రెంచి, స్పేనిషు, పోర్చుగీసు, రుమేనియను, ఇటాలియను మున్నగు భాషలు కనిపించును.

కాని కేవలపదపరికరమునుబట్టియే ఏక కుటుంబత్వమును నిర్ణయించుట సమంజసము కాదు. చారిత్రక రాజకీయ కారణములవల్ల గాని, వాణిజ్య వ్యాపారములవల్ల గాని, సంస్కృతి సాహిత్యముల ప్రభావమువల్ల గాని ఒక్కొక్క భాషలో అన్యభాషాపదములు విరివిగా ప్రవేశింపవచ్చును. స్థూలముగా చూచినప్పుడు నేటి పారశీకము అరబ్బీ భాషతో సోదర సంబంధము కాని, జన్యజనక సంబంధము కాని కలిగి యున్నట్లు అనిపించును. రాజకీయకారణముగా అరబ్బీభాషకు పారశీకముపై అట్టి ప్రాభవము లభించినది. అందువలననే పారశీకసాహిత్య చరిత్రలో "శుద్ధపారశీకోద్యమము" వంటివి కొన్ని మనకు సాక్షాత్కరించును. నిజమునకు పారశీకము "ఇండో-యూరోపియను" కుటుంబమునకు చెందినది. అట్లే ద్రావిడ భాషా కుటుంబమునకు చెందిన తెలుగు, మలయాళములందు సంస్కృత పదములసంఖ్య యత్యధికముగా గోచరించును. పదసామగ్రిని పెంపొందించుటకుగాను, సాహిత్య సౌష్ఠవమును సంపాదించుకొనుటకుగాను పొరుగుభాషలనుండి యనేకపదములను తెచ్చుకొనవచ్చును. ఎన్నిపదములు పైనుండి వచ్చినను, వ్యాకరణ విషయమున, వాక్యనిర్మాణవిషయమున ప్రతిభాషకును తన సంప్రదాయమును పాటింపవలసిన యవసర మొకటి అవశ్యముగా నున్నది. కేవల పదసామ్యమునుబట్టి జన్మసామ్యమును నిర్ధారించుట సమంజసము కాదు; సంప్రదాయమును కూడ పరిగణించుట అవసరము.

కేవల సాహిత్యపదములను, ఉన్నతభావబోధకములను కాక కుటుంబనిర్ణయమందు నిత్యవ్యవహారమునందలి పదములనే మెక్కువగా స్వీకరించుట సమంజసము. ఒకటి, రెండు, మూడు మున్నగు సంఖ్యావాచకములును; వాడు, అది మున్నగు సర్వనామములును; క్రియాపదములును; వాక్య నిర్మాణవిశేషమును ఇట్టి నిర్ణయమునకు ఉచిత దోహదము కలిగించును.

ఒకే కుటుంబమునకు చెందిన భాషలలోనే ఒకే పదము చిన్న చిన్న మార్పులతో వేర్వేరు రూపములలో కన్పింప వచ్చును. ఈ మార్పులు

ధ్వనిసిద్ధాంతముల ననుసరించి, నియతములై యుండును. 'శిరస్సు' అను నర్థముగల తెలుగు శబ్దము 'తల'. ఇది అరవమున 'తలై' అనియు, కన్నడమున 'తలె' అనియు కలదు. 'వెల' అనునది అరవమున 'విలై' అనియు, కన్నడమున 'బిలె' అనియు కలదు. దీనినిబట్టి అరవమందలి ఐకారాంతశబ్దములు కన్నడమున ఎకారాంతములుగాను, తెనుగున అకారాంతములుగాను ఉండు నని సాధారణముగా నిర్వచింపవచ్చును. ఇట్టి మార్పులనుగూడ ఏకకుటుంబ నిర్ణయసందర్భమున గుర్తించుట అవసరము.

## జాత్యాశ్రిత వర్గీకరణము

ఈవిధ మగు జాత్యాశ్రితవిభాగమునుబట్టి ప్రపంచభాషల నన్నింటిని కొన్ని కుటుంబములలో ఇమిడింపవచ్చును. అనేకత్వమునందలి యేకత్వమును గుర్తించి, సముచితముగా సంభావించుట మానవ సామాన్యధర్మము. ఆ ధర్మమే యిచ్చటకూడ పనిచేసినది. మొత్తము మీద ప్రపంచమందలి భాషలన్నింటిని ఇరువదిరెండు భాషాకుటుంబములలో అంతర్భవింపజేసిరి. వానియందును మిక్కిలి వ్యాప్తిని పొంది, అధిక సంఖ్యాకులచేత మాటాడబడు భాషలను గలవి పన్నెండు కుటుంబములు. అవి యివి. 1. ఇండో యూరోపియను 2. సెమిటో-హెమిటిక్ 3. సీనో-టిబెటను 4. జపానీ-కొరియను 5. ఆఫ్రికన్ నీగ్రో 6. ద్రవిడియను 7. మలయో పోలినీషియను 8. ఊరల్-ఆల్టాయిక్ 9. అమెరికను-ఇండియను 10. కకేసియను 11. బాస్కు 12. ఇతర భాషలు. ఇందలి యొక్కొక్క కుటుంబము యొక్క విశేషములను సంక్షేపముగా సమీక్షించుకొందము.

**1. ఇండోయూరోపియను కుటుంబము :** ప్రపంచ మంతటిలోను అత్యధిక సంఖ్యాకులచేత మాటాడబడు భాషలు ఈ కుటుంబమునకు చెందినవే. యూరోపు, ఈశాన్యభారతము, నైరృతాసియాల

నడిమి ప్రదేశము, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, తాస్మానియా, దక్షిణాఫ్రికాలయందు ఈ భాషలు కలవు. ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, డచ్చివారు, పోర్చుగీసువారు తాము వ్యాపించినంతమేర ఆయా వలస రాజ్యములలో తమ భాషలను నెలకొల్పుట జరిగెను.

సాధారణముగా ఈ భాషలన్నియు ప్రత్యయాత్మకములై సంశ్లిష్ట భాషావర్గమునకు చెందినవి. కాని కాలక్రమమున కొన్ని భాషలు సారళ్యము నపేక్షించి కొంతమార్పునకు లోనగుచున్నవి.

జర్మానిక్, ఇటాలిక్ (రోమాన్సు), కెల్టిక్, బాల్టోస్లావిక్, గ్రీకు, ఆల్బేనియను, ఆర్మీనియను, ఇరానియను, ఇండోఆర్యను - అను పేరులతో ఈకుటుంబము తొమ్మిదిశాఖలై కనిపించును. ఇందు ప్రతిశాఖయందును మరల భిన్నభిన్న భాషలు గలవు.

ఈ ఇండోయూరోపియనుభాషలు ధ్వనులనుబట్టి రెండు వర్గములుగా విభక్తములై కనబడుచున్నవి. ఇండోఆర్యను భాషాకుటుంబమునకు మూలభాషయని తలపబడుచున్న ప్రాచీనసంస్కృతమునందలి చవర్గము గ్రీకు లాటిను మున్నగు భాషలయందు కంఠ్యముగా మారుచుండగా, సంస్కృతము ఇరానియను మున్నగు భాషలయందు ఊష్మవర్ణముగా మారుచున్నది. 'వంద' యను నర్థమున 'చంతోమ్' అను నది మూల భాషాపదమని శాస్త్రకారుల కల్పనము. దీనికి లాటినుభాషయందు 'కెంటుమ్' అనియు జర్మను భాషయందు 'ఖుండ్' అనియు రూపములు గలవు. ఈ రెండుచోట్లను కంఠ్యవర్ణమే కలదు. సంస్కృతమునందు 'శతమ్' అనియు, ఇరానియనునందు 'సతమ్' అనియు రూపములు గలవు. కావున 'కెంటుమ్' మున్నగురూపములను గలిగిన భాషలను కెంటుమ్ వర్గమనియు, 'శతమ్' మున్నగురూపములను గలిగిన భాషలను శతమ్ వర్గమనియు పిలుతురు.

ఈవిభాగము ననుసరించి కెల్టిక్, జర్మను, లాటిను, గ్రీకు - మున్నగుభాషలు కెంటుమ్ వర్గమునకు చెందును; ఆల్బేనియను,

ఆర్మీనియను, బాల్టోస్లావిక్, ఇరానియను, ఇండోఆర్యను భాషలు శతమ్ వర్గమునకు చెందును. మొత్తముమీద దాదాపు వందకోట్లమంది ఈకుటుంబమునకు చెందిన భాషలను మాటాడుచున్నారు.

**2 సెమిటో హెమిటిక్ కుటుంబము** : అరేబియా, ఇరాక్, పాలస్తీను, సిరియా, ఉత్తరాఫ్రికా, ఎతియోపియా, ఎరిట్రియా, సోమాలీలాండు, జాంజిబారు, మడగాస్కరు, మాల్టా మున్నగుచోట్ల ఈకుటుంబమునకు చెందిన భాషలు వ్యాపించియున్నవి.

ఈభాషలు కూడ ప్రత్యయాత్మకములే. ఇందలి ధాతువులు సాధారణముగా మూడు హల్లులను కలిగియుండును. వీనిలో వలయునెడల అచ్చులు ప్రవేశించి, రూపము నర్థమును సమకూర్చును. 'వ్రాయు' అను నర్థమున 'క్ త్ బ్' అను మూడుహల్లులు కలవు. 'కతబ' అని యున్నప్పుడు 'అతడు వ్రాసెను' అని యర్థము. 'కుతిబ' అని యనగా 'అది వ్రాయబడెను' అని యర్థము. 'యక్తుబు' అని యనగా 'అతడు వ్రాయును' అని యర్థము. 'యుక్తబు' అని యనగా 'అది వ్రాయబడును' అని యర్థము. 'కితాబున్' అని యనగా 'పుస్తక' మనియు 'కాతిబున్' అని యనగా 'లేఖకుడు' అనియు నర్థములు. ఇట్లు స్వరములు మధ్యలో ప్రవేశించి, వేర్వేరుపదముల నేర్పాటుచేయుట యీభాషలయందు కలదు. ఇవి సంశ్లిష్ట భాషావర్గమునకు చెందినవి.

హీబ్రూ, అరబు, ఎతియోపియా భాషలతో సెమిటిక్ శాఖయు, లిబికోబెర్బర్, కుషితిక్, కోప్టిక్ భాషలతోకూడి హెమిటిక్ శాఖయు ప్రధానములై యున్నవి. ఆ రెండు శాఖల మూలముననే ఈ భాషా కుటుంబమునకు సెమిటోహెమిటిక్ కుటుంబము అనుపేరు వచ్చినది.

ఈభాషలను మొత్తముమీద ఏడుకోట్ల యేబదిలక్షలమంది మాటాడుచున్నారు.

**3 సీనోటిబెటను కుటుంబము** : టిబెట్టు, బర్మా, సయామము, ఇండోచైనా ఉత్తరభాగము, మంచుకూవో, సింకియాంగు మున్నగు

చోటులందు మాటలాడుభాషలు సీనోటిబెటను కుటుంబమునకు చెందినవి.

ఈకుటుంబమునకు చెందినభాషలు ఏకాచ్చవిభాగమునకు చెందినవి. అనగా ప్రతిపదాత్మకవర్గములో చేరిన విశ్లిష్ట భాషలని యర్థము. ఈభాషలను దాదాపుగా ఏబదికోట్ల మంది మాటాడు చున్నారు.

ఇందు చైనావిభాగము, టిబెటన్ బర్మా విభాగము, సయామీ విభాగము - అని మూడు ముఖ్యశాఖలు కలవు. అందుప్రధానమై నలువదియైదుకోట్లమందిచే మాటాడబడునది చైనావిభాగము. ఇందు మాండలిక విభేదము లనేకముగా కలవు. ఒకేమాట వేర్వేరుస్థానముల యందుండి, వేర్వేరు స్వరములతో ఉచ్చరింపబడి వేర్వేరర్థముల నిచ్చును. ఈభాష బొమ్మలలిపిలో వ్రాయబడును. ఇటువంటి బొమ్మలు సుమారు మూడువేలు వాడుకలో కలవు. ఒక్కొక్క బొమ్మయు ఒక ధ్వనికి కాక, ఒక పదమునకు గుర్తుగా వ్యవహరించును.

జనసంఖ్యనుబట్టి చూచినయెడల ఇండోయూరోపియను భాషా కుటుంబము తరువాత నిలువదగినది సీనోటిబెటను కుటుంబమే.

**4. జపానీ కొరియను కుటుంబము** : జపాను, కొరియాదేశములు ఈభాషాకుటుంబ వ్యవహారమునకు ప్రధానరంగములు. ఫార్మోజా, మంచుకూవో, కెరోలిన్ మార్షల్ దీవులు, చైనాలో చాలభాగము, డచ్ ఈస్టిండీసు, ఫ్రెంచి ఇండోచైనా, సయాము, మలయా, బర్మా, ఫిలిప్పీనులయందుకూడ ఈభాషలకు కొంతవ్యవహారము కలదు.

ఇవి సంయోగాత్మక భాషలు. ఈభాషలయందు లింగభేదము కాని వచనభేదము కాని కానరాదు. ఒకే అర్థమునందు వినయగౌరవాదులను నిరూపించుటకు వేరువేరుమాటల నుపయోగించుట యీభాషలయందు కలదు.

జపాను విభాగము, కొరియను విభాగము- అని రెండుశాఖలు గలవు. మొత్తముమీాద ఈకుటుంబమునకు చెందిన భాషలను పదికోట్ల మంది మాటాడుచున్నారు.

**5 ఆఫ్రికను నీగ్రోకుటుంబము :** ఈ కుటుంబమునకు చెందిన భాషలు ఆఫ్రికాయందును, సహారాకు దక్షిణభాగమునను, ఎతియోపియాకు పశ్చిమభాగమునందును వ్యవహారమునం దున్నవి.

సూడానీ గినియను విభాగము, బంటూవిభాగము, హాటెన్‌టాట్ బుష్మన్‌విభాగము - అని యీ కుటుంబమును మూడు ముఖ్యశాఖలుగా విభాగింపవచ్చును.

వీనినన్నింటిని ఒకే భాషావర్గమునకు చేర్చుట కవకాశము చాలదు. పైగా ఈభాషలన్నియు ఆదిమావస్థలోనే దాదాపుగా మిగిలియున్నవి. ఇంగ్లీషు, ఫ్రెంచి, పోర్చుగీసు మొదలయిన భాషలు ఆప్రాచీనభాషలను వాడుకనుండి తొలగించి వాని స్థానము నాక్రమించుట కూడ క్రమక్రమముగా జరుగుచున్నది.

సూడానీ విభాగమునందు విభక్తుల యుపయోగము దాదాపుగా లేదనియే చెప్పవచ్చును. అట్లే లింగభేదముకూడ కానరాదు. ప్రతిపదాత్మక భాషావర్గమునకు చెంది ఏకాచ్క ధాతువులను కలిగి విశ్లిష్టరూపములైనవి యీాభాషలు. దక్షిణాఫ్రికాయందు అధికభాగము నాక్రమించుకొనియున్నవి బంటూవిభాగమునకు చెందినభాషలు. వీనియందును లింగభేదము కానరాదు. కాని యివి ప్రత్యయాత్మక భాషావర్గమునకు చెందియున్నవి. ఇందు మాటలకు ముందు ప్రత్యయములు చేరి అర్థవిశేషమును కల్పించును. 'తు' అని యనగా 'మనుష్యుడు' అని యర్థము. 'జురి' అనియనగా 'అందము' అని యర్థము. 'అందమైన మనుష్యుడు' అని చెప్పవలసి వచ్చినప్పుడు 'మ్తుమ్జురి' అని వాడబడును. 'మ్' అను ఏకవచన ప్రత్యయము విశేషణ విశేష్యములు రెండింటికిని

ముందు చేరును. ఇట్లే బహువచనమున 'వతు వజురి' అని యనగా 'అందమైన మనుష్యులు' అని యర్థము. ఇక్కడ 'వ' యనునది బహు వచన ప్రత్యయము. ఈ ప్రత్యయములును ఆయానామవాచకములను బట్టి పెక్కువిధములుగా భేదించును. హాటెంటాట్ బుష్మను విభాగము నకు చెందిన భాషలయందు జడములు, చేతనములు – అను విభాగము కనబడును. ఇక్కడకూడ బహువచన ప్రత్యయములు పెక్కువిధములుగా కలవు.

మొత్తముమీద ఈభాషలను పదికోట్లమంది వ్యవహరించు చున్నారు.

**6. ద్రావిడ కుటుంబము :** ఈకుటుంబమునకు చెందిన భాషలు భారతదేశమున దక్షిణభాగమునందును, సింహళదేశమున ఉత్తర భాగమునందును వ్యవహారమునందున్నవి.

ఇవి సంయోగాత్మక భాషావర్గమునకు చెందును. నామములపైని వచనప్రత్యయములు, విభక్తిప్రత్యయములు చేరుచుండును. జడములు, పశుపక్ష్యాదులు, స్త్రీలు ఒకతరగతికిని పురుషులు ఒకతరగతికిని చెంది నట్లు పరిగణించుట యీభాషలలో లింగవిభాగము స్థానమున కనబడు ప్రధానలక్షణము.

ఇందు తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము, తుళు, కొడగు – అనునవి ప్రధానభాషలు. ఇవికాక ఇంకను చెదరువాటుగా అక్కడక్కడ అల్పసంఖ్యాకులచే వ్యవహరింపబడుచున్న భాషలు కూడ కలవు. మొత్తముమీద ఈకుటుంబమునకు చెందిన భాషలను పదికోట్ల మందికిపైగా మాటాడుచున్నారు.

**7. మలయో పోలినీషియను కుటుంబము :** మలయాద్వీపకల్పము నందును, జావా సుమత్రా బోర్నియో బాలీ మున్నగు దీవులయందును, ఫిలిప్పీన్సు, మడగాస్కరు, న్యూజిలాండు. సమోవా మున్నగు ప్రదేశము లందును ఈకుటుంబము వ్యవహారమునందు కలదు.

ఈకుటుంబమునకు చెందిన భాషలయందు ధాతువు ద్వ్యచ్క-మై (రెండచ్చులను గలది) యుండును. నామములకు పైని ప్రత్యయముల వంటివి చేరుట యేమియు నున్నట్లు కానరాదు. అట్లే వచనభేదముకాని, లింగభేదముకాని ఆయా భాషలలో గమనింపబడదు.

ఈకుటుంబమునందు ఇండోనీషియను విభాగము, మలనీషియను విభాగము, మైక్రోనీషియను విభాగము, పోలినీషియను విభాగము - అని ప్రధానములయిన శాఖలు కలవు. ఇవి మొత్తముమీద తొమ్మిది కోట్లమంది వ్యవహారమున వ్యాప్తి నొందియున్నవి.

8. **ఊరల్ ఆల్టాయిక్ కుటుంబము** : ఫిన్‌లండు, కరేలియా, ఎస్తోనియా, ఉత్తరనార్వే, స్వీడను, హంగేరీ, ప్రాచ్య (యూరోపియను) రష్యా, తుర్కీ, సోవియట్ ఆసియా, మంగోలియా, చైనీసు తుర్కీస్తాను, మంచుకూవో - మున్నగుచోట్ల ఈకుటుంబమునకు చెందిన భాషలు వ్యవహారమునందున్నవి.

ఈభాషలు సంశ్లిష్ట భాషావర్గమునకు చెందినవి. ఇండోయూరోపియను భాషలలోవలెనే ధాతువుపై పరప్రత్యయము (Suffix) ను చేర్చి పలుకుట యిందును కాననగును. కాని యీలక్షణ మిక్కడ మరింత వ్యాప్తిని పొందియున్నది. 'సెవ్' అనుధాతువునకు తుర్కీభాషయందు 'ప్రేమ' యని యర్థము. 'సెవ్‌మెక్' అని యనగా 'ప్రేమించుట'; 'సెవ్‌దిర్ మెక్' అని యనగా 'ప్రేమింపజేయుట'; 'సెవ్‌మెమెక్' అనియనగా 'ప్రేమింపకుండుట'; 'సెవ్ ఇల్ ఎమెమెక్' అని యనగా 'ప్రేమింపబడుట కసాధ్యమగుట' అని యర్థములు. ఇట్లు ప్రత్యయముపై ప్రత్యయమును చేర్చుకొనుచు పోవుటవలన వివిధార్థములను సాధింపవచ్చును. ఈకుటుంబమునందు సమస్వరత యొకటి కనిపించును. హంగేరీభాషలో 'కేజ్' అని యనగా 'చేయి' యని యర్థము. 'లోపల' అనునర్థమున 'బెన్' అనునది వచ్చి 'కేజ్‌బెన్' అని యగును. ఇదే ప్రత్యయము 'ఇల్లు' అనునర్థముగల 'హాజ్' శబ్దముపై వచ్చినపుడు అత్వాయుక్తమై 'హాజ్

బన్' అని యగును. ఈ భాషలయందును లింగవిభేదము గోచరము కాదు.

ఫిన్నోఉగ్రిక్ విభాగము అను నామాంతరముగల ఊరలిక్ విభాగము, ఆల్టాయిక్ విభాగము – అని రెండుశాఖలు గలవు. ఊరలిక్ విభాగమునందు ఫిన్నిషు, లాప్సు, మగ్యారు (హంగేరీ), ఓస్ట్యాకు, సమోయిడు భాషలు కలవు. ఆల్టాయిక్ విభాగమునందు తుర్కీ, మంగోలు, తుంగుస్ భాషలు కలవు. మొత్తముమీద ఈకుటుంబమునకు చెందిన భాషలను ఆరుకోట్లమంది మాటాడుచున్నారు.

!! అమెరికను ఇండియను కుటుంబము : ఈ కుటుంబమునకు చెందిన భాషలు పశ్చిమార్ధగోళమునం దంతటను వ్యాపించియున్నవి.

ఈ భాషల రూపనిర్మాణవిషయము ఒకరీతిగా లేదు. కాని ఎక్కువ భాషలనుబట్టి చూచినచో 'బహుసంశ్లిష్టత' కనిపించుచున్నది. 'గ్నగ్లాస్లిజక్స' అను పదవాక్యమునకు 'నేనొక గ్రామముకొరకై చూచుచున్నాను' అని యర్థము. ఇచ్చట 'గ' అనునది 'నేను' అను నర్థమును బోధించుచున్నది. 'నగ్లా' అని యనగా 'జీవించుట' యని యర్థము. తరువాత నున్న 'స్ల' అనుదానితో కలిసి 'నగ్లాస్ల' అనిమై 'గ్రామము' అను నర్థము నిచ్చుచున్నది. 'ఇ' అనునది పూర్వప్రత్యయముగా వ్యవహరించి, తరువాతి పదమునకు క్రియాత్వము కల్పించుచున్నది. 'జక్' అనగా 'చూచుట' యని యర్థము. చివర నున్న 'స' వర్తమానార్థకత్వమును సూచించుచున్నది. ఇందులో ఏభాగమును విడిగా నుపయోగించుటకు వీలులేదు; వానికి పైనిచెప్పిన యర్థములు కుదురవు.

ఈకుటుంబమును శాఖలుగా విభాగించుటకూడ కష్టము. వైవిధ్యము మరింత అధికముగా నుండుటవలనను, ప్రస్తుతము ఇండోయోరోపియను భాషలే ఆయాభాషలను తొలగించి వానిస్థానము నాక్రమించుకొనుచుండుట వలనను విభజనము వీలు కాకుండనున్నది. మొత్తముమీద ఈభాషలను దాదాపు కోటిమంది మాటాడుచున్నారు.

**10. కకేసియను కుటుంబము :** సోవియట్ యూనియను నందలి కాకససు ప్రాంతమునందు ఈకుటుంబమునకు చెందినభాషలు వ్యవహారమునందు కలవు.

ఈభాషలయందు పూర్వప్రత్యయములను, పరప్రత్యయములను కూడ వాడుపద్ధతి కలదు. వీనిరచన మిక్కిలి క్లిష్టముగా నుండుటచే శాస్త్రజ్ఞులు మొట్టమొదట వీనిని ప్రత్యయాత్మక భాషలుగా పరిగణించిరి. కాని, తరువాత సంయోగాత్మక భాషావర్గమునకు చెందినట్లుగా నిర్ధారించిరి. వీనియందు మాండలికములును, ఉపభాషలును పెక్కువిధములుగానుండి యివన్నియు నొకేకుటుంబమునకు చెందిన వన్న విషయమునకే సందేహము కలుగజేయుచుండును. కాని రష్యాభాష ఆయాభాషల స్థానము నాక్రమించుకొనుటచే వ్యవహారమున వాని ప్రాధాన్యము పలుచబడి పోవుచున్నది.

కిర్కాసియను, క్రిస్టియను, లెస్గియను మున్నగుభాషలతో కూడి ఉత్తరకకేసియను విభాగము - జార్జియను, సువానియను, మింగ్రేలియను మున్నగుభాషలతో కూడి దక్షిణకకేసియను విభాగము - అను రెండు ప్రధానశాఖలుగా ఈకుటుంబము నిరూపింపబడుచున్నది.

దాదాపుగా ఇరువది లక్షలమంది యీభాషలను వ్యవహరించుచున్నారు.

**11 బాస్కు కుటుంబము :** ఈ కుటుంబమునకు చెందిన భాషలు స్పెయినుయొక్క ఈశాన్యభాగమునందును, ఫ్రాన్సు నైరృతిభాగము నందును వాడుక యందున్నవి.

ఈ భాషలు సమ్మిశ్రణాత్మక భాషావర్గమునకు చెందినవి. బహుసంశ్లిష్టతాలక్షణము వీనియందు అధికముగా కలదు. నామములకు పైని విభక్తులు చేరి, సన్నిహితముగానై, ఏకపదముగా నగును. 'జల్దియ' అనగా 'గుఱ్ఱము' అని యర్థము. సంబంధార్థమున 'జల్దియరేన్' అనినమో 'గుఱ్ఱముయొక్క' అనునర్థము నిచ్చును. 'జల్దిక' అని

యనగా 'గుట్టముమీాద' అని యర్థము. విశేషణములపై వేర్వేరు ప్రత్యయములు చేరి తరతమభావమును నిరూపించుట కూడ కలదు. 'హన్దియ' అని యనగా 'ఘనుడు' అని యర్థము. 'జుహన్దియగో బణో' అని యన్నప్పుడు 'నీకంటె ఘనతరుడు' అని యర్థము. 'హన్దిమెన' అని యనగా 'ఘనతముడు' అని యర్థము. ఈ కుటుంబమునకు చెందిన భాషలలో జ, ట్జ - అను ధ్వనులు మిక్కిలి అధికముగా వినిపించు చుండును.

స్పెయిను దేశమునకు చెందిన 'గైపుజ్కోవా' విభాగమును, ఫ్రెంచి దేశమునకు చెందిన 'లబార్డిను' విభాగమును ఈ కుటుంబమునందు రెండు ప్రధానశాఖలై యున్నవి. మొత్తముమీాద ఈ భాషలను దరి దాపు పదిలక్షలమంది వ్యవహరించుచున్నారు.

**12 ఇతర భాషలు :** పైని చెప్పుకొన్న యే కుటుంబము నందును చేరక విడివిడిగా నుండు కొన్ని భాషలు కలవు. కేవల మొక్క మనుష్యుని మాత్రమే తీసికొని ఒక్క కుటుంబమని పరిగ ణించుట యుచితముగా నుండదు. అట్లే ఒకే భాషను చూచి దాని కొక కుటుంబమును నిర్ధారించుట సరికాదు. అట్లు కుటుంబ నిర్ధారణము నకు వీలుకాక భిన్నభిన్నములుగా నున్న భాషలనే యితర భాషలను పేరున పరిగణించుట జరుగుచున్నది.

ఇటలీయందలి అత్యంత ప్రాచీనభాషయైన 'ఎట్రూస్కను' అను నది అటువంటివానిలో నొకటి. అది యిప్పుడు వాడుకయందు లేదు. కాని, ఆభాషలో ఉన్న కొన్ని శిలాశాసనములును ఒక గ్రంథము నిప్పటి కిని మిగిలియున్నవి. సుమేరియనుభాష క్రీ. పూ. ఏడవశతాబ్దినాటికి మృతప్రాయమైనది. అయినను విజేతలయిన అస్సీరియనులు ఆభాష నభ్యసించి, ఆ భాషాగ్రంథములకు తమభాషలో టీకలు టిప్పణులు రచించి రక్షించుకొనుచు వచ్చిరి. ఇప్పటికిని అస్సీరియనుల అనువాద ములతోపాటు సుమేరియను భాషాగ్రంథములు సురక్షితములై యున్నవి.

ఈశాన్య సైబీరియాయందు లేనానదినుండి సఖాలిన్ వరకు వ్యవహారముననున్న హైపర్ బోరియనుభాషలు; ఉత్తర జపానునందున్న ఐనూభాష; ఆగ్నేయాసియాయందు వ్యవహారమునందున్న మోన్ ఖ్మేర్, అన్నామీ, ముండాభాషలు; భిన్నభిన్నలక్షణములను కలిగి యేయొక్క కుటుంబమునందును పూర్తిగా ఇముడకున్నవి.

## రూపాశ్రిత వర్గీకరణము

రెండవది రూపాశ్రిత వర్గీకరణము. భాషలయొక్క ఆకృతినిబట్టి, నిర్మాణమునుబట్టి యేకత్వమును నిర్ణయించి సంబంధమును నిరూపించుట యీ వర్గీకరణమందలి విషయము. ఆంగ్లమున దీనిని (Syntactical or Morphological Classification) అని యందురు. దీని ననుసరించి ప్రపంచ భాషలన్నియు 1. ప్రతిపదాత్మకభాషలు 2. సంయోగాత్మకభాషలు 3. ప్రత్యయాత్మకభాషలు 4. సమ్మిశ్రణాత్మక భాషలు - అని నాలుగు వర్గములుగా విభాగింపబడును. ఒక వర్గమునకు చెందిన భాషయందు మరొక వర్గమునకు చెందిన లక్షణములు కూడ కొంతవరకు కనిపింపవచ్చును. లక్షణ ప్రాచుర్యమును బట్టి, తదావశ్యకతను బట్టి వాని నాయావర్గములలో పరిగణించుట జరుగుచుండును. కావున, నేదో యొక్క లక్షణమును బట్టి యే భాషను కాని ప్రత్యేకవర్గమునందును చేర్చుట సమంజస మనిపించుకొనదు. ఆ విషయమును గుర్తుంచుకొనుట యవసరము.

**1 ప్రతిపదాత్మక భాషలు :** చైనా, టిబెట్టు, బర్మా, సయామీ, మలయా మున్నగుభాషలును ఆఫ్రికాయందలి సూడానీ భాషయు ప్రతిపదాత్మక భాషావర్గమునకు చెందినవి. ఈభాషలయందు ప్రతిశబ్దము నింకొకశబ్దముపై నాధారపడక స్వతంత్రముగా ప్రయుక్తమగును. ఈపదములు దాదాపు నిపాతముల వంటివి. ప్రకృతియని ప్రత్యయమని విభాగించుట కవకాశము లేనివిధముగా ఇందలి పదములు

చాలవరకు ఏకాచ్కములై యుండును. అనగా ప్రతిపదమునందు హల్లు లెన్నియున్నప్పటికి అచ్చుమాత్ర మొక్కటే యుండును.

ఇచ్చట విభక్తులు కాని యితరప్రత్యయములుకాని యుండక పోవుటవలన పదముల క్రమమునుబట్టియే వాక్యమున కర్థ మేర్పడు చుండును. ఒకేపదము స్థానమునుబట్టియు, స్వరమునుబట్టియు, వేర్వే రర్థములను దెల్పును. చైనాభాషలో 'తో' అను ఒకేశబ్దము స్వర భేదమునుబట్టి ధ్వజము, ధాన్యము, మార్గము, కప్పుట. చేరుట మున్నగు భిన్నభిన్నములయిన యర్థముల నిచ్చును. ఇట్లే 'లూ' అనుమాటకు బండి, మంచు, త్యాగము మున్నగునర్థములు కలుగును. ఇట్లే నేత్రము, ముఖ్యము, అభిప్రాయము మున్నగు భిన్నార్థములలో 'ము' అను నొకే శబ్దము స్వరభేదమునుపొంది యుపయుక్తమగును.

స్వరభేదమువలెనే స్థానభేదముకూడ చైనాభాషయందు ప్రధాన ముగా పరిగణింపబడును. 'తాలేన్' అని అన్నప్పుడు 'పెద్దమనుష్యుడు' అని యర్థము. 'మనుష్యుడు పెద్దవాడు' అను నర్థమున అవేపదములను వెనుక ముందులుచేసి 'లేన్‌తా' అని యందురు. 'వాంగ్‌పా ఓమిన్' అని యనగా 'రాజు ప్రజలను రక్షించుచున్నాడు' అని యర్థము. కారకమునందు భేదము కలిగినప్పుడు చిన్నమార్పుతో 'వాంగ్‌పాఓ చీమిన్' అని యగును. దీనికి 'రాజువలన రక్షింపబడిన ప్రజలు' అని యర్థము. 'నేను నిన్ను కొట్టుచున్నాను' అను నర్థమున 'న్గోతని' అని యుండి కర్మకర్తలు వ్యత్యస్తమై 'నీవు నన్ను కొట్టుచున్నావు' అని అర్థమైనప్పుడు 'నితన్గో' అని యగును. ఇట్లు శబ్దములు భిన్నభిన్నము లుగా ప్రయుక్తములగుటచేతనే యీ భాషలకు ప్రతిపదాత్మక భాషలని పేరువచ్చెను. వీనినాంగ్లమున **Isolating languages** అని యందురు. ఇవి ఏకాచ్కములయిన పదములను గలిగియుండుటచేత **Mono-syllabic languages** అని కూడ పరిగణించుట కలదు.

**సంయోగాత్మకభాషలు** : తుర్కీ, కాఫిర్, జులూ, సంతాలీ, మఫోర్ మున్నగుభాషలును, ద్రావిడభాషలును సంయోగాత్మక భాషావర్గమునకు చెందినవి. ఈ భాషలయందు ప్రకృతిప్రత్యయముల కూడికవలన పదములేర్పడును. కావుననే వీనికి సంయోగాత్మక భాషలను పేరు వచ్చెను. పదములకే యీ లక్షణము కలదన్న సత్యమును సూచించుటకై కొందరు వీనిని సంయుక్త పదరూపభాషలనియు పిలుచుట కలదు.

సాధారణముగా పదములయందున్న భిన్నాంశములలో నొక యంశము స్థిరముగా నుండును. దీనిని ప్రకృతి యనవచ్చును. దీనికి ముందుగాని, వెనుకగాని, నడుమగాని యితరాంశములు వచ్చి చేరును. అవి ప్రకృతియందు ఏవిధమైన మార్పును తీసికొని రాకుండ, అవసరమైనచో తామే కొలదిగా మారును. కాని యీ మార్పు పదాంశములను మాటు పరుపగలిగినంతగా ఎప్పుడును జరుగదు. ఏపాటి పరిచయమున్నను, ఆయాయంశములను స్పష్టముగా గుర్తుపట్టవచ్చును. వీని కలయికకూడ కేవలము నామమాత్రముగానే యుండును. అనగా ఒకదానిప్రక్క నొకటి చేరి అంటుకొని యుండును.

తుర్కీభాషయందు 'ఏవ్' అని యనగా 'ఇల్లు' అని యర్థము. బహువచనమున దీనికి 'లేర్' అను ప్రత్యయము కలిగి 'ఏవ్‌లేర్' అని యగును. దీనికి 'ఇండ్లు' అని యర్థము. దీనికి చివర 'ఇన్' అని చేరి 'ఏవ్‌లేరిన్' అనినయెనప్పుడు 'నాయిండ్లు' అని యర్థమగును. కాఫిర్ భాషయందు 'కు' అను ఉపసర్గకు షష్ఠీప్రత్యయమగు 'కు' వర్ణముతో సమానమగు నర్థము కలదు. 'కు-తి' అని యనగా 'మాకు' అనియు 'కు-ని' అని యనగా 'వారికి' అనియు, 'కు-జే' అని యనగా 'వానికి' అనియు నర్థమగును.

ఫిలిప్పీను దీవులయందలి 'టగలోగ్' భాషయందు 'సూలత్' అని యనగా 'లేఖ' యని యర్థము. దీనియందు 'స' అని యొకయంశము

'ఊలత్' అని మరొకయంశము కలవు. వీనినిడుమ 'ఉమ్' అను మరొక యంశము క్రొత్తగాచేరి 'సుమూలత్' అని కాగా 'లేఖకుడు' అని యర్థమగును. 'ఇన్' అను ప్రత్యయము చేరి 'సినూలత్' అని యైన యెడల 'లిఖింపబడెను' అను నర్థమేర్పడును.

న్యాగినీయందలి మిఫోర్ భాషయందు 'వినుట' అను నర్థమున 'మ్నఫ్' అను పదము కలదు. 'జమ్నఫ్' అని యన్నప్పుడు 'నేను వినుచున్నాను' అనియు 'జమ్నఫఉ' అని యన్నప్పుడు 'నేను నిన్ను వినుచున్నాను' అనియు నర్థములు. అనగా 'జ' యన్నది 'నేను' అను నర్థమునందు 'అఉ' అన్నది 'నిన్ను' అను నర్థమునందు ముందును వెనుకను చేరియున్నవి.

తుర్కీభాషయందు 'ఎవ్' అన్నది ప్రథమైకవచనరూపము. దీనికి 'ఇల్లు' అర్థము. 'ఇండ్లు' అను నర్థమున 'ఎవ్‌లేర్' అని యగును. ద్వితీయాదివిభక్తులు ఈ రెండింటిమీదను సమానముగా అనుప్రయుక్తమగును.

| | | ప్రత్యయము | ఏ. వ. | బ. వ |
|---|---|---|---|---|
| ద్వితీయ | – | ఇ | ఎవి | ఎవ్‌లేరి |
| చతుర్థి | – | ఎ | ఎవే | ఎవ్‌లేరే |
| పంచమి | – | దేన్ | ఎవ్‌దేన్ | ఎవ్లేర్దేన్ |
| షష్ఠి | – | ఇన్ | ఎవిన్ | ఎవ్లేరిన్ |
| సప్తమి | – | దే | ఎవ్దే | ఎవ్లేర్దే |

ఇట్లే ద్రావిడ భాష లన్నింటియందును సంయోగాత్మక స్థితి స్పష్టముగా కనుపట్టును. 'తోట' అను శబ్దము ప్రథమైక వచనరూపము. దీనిపై 'లు' వర్ణము చేరి 'తోటలు' అని యగును. ఇది బహువచన రూపము. ఈరెండు రూపములపై ద్వితీయాది విభక్తులు చేరును. అప్పుడు ప్రకృతియందు కాని ప్రత్యయములందు కాని మార్పేమియు కలుగదు. బహుత్వమున ఇతర విభక్తులకు ముందున్న 'లు' వర్ణము అత్వము నొంది 'ల' అని యగును.

| | ప్రత్యయము | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| ద్వితీయ | ను | తోటను | తోటలను |
| తృతీయ | తో | తోటతో | తోటలతో |
| చతుర్థి | కొఱకు | తోటకొఱకు | తోటలకొఱకు |
| పంచమి | వలన | తోటవలన | తోటలవలన |
| షష్ఠి | కు | తోటకు | తోటలకు |
| సప్తమి | అందు | తోటయందు | తోటలయందు |

ఇట్లే తోటదారి, దిగుడుబావి, మామిడితోట, ఏరువంక, ఏనికతోలుదాలుపు మున్నగు సమాసములయందు భిన్నపదములు సన్నిహితములగుటయే కలదు. ఇంతకుమించిన మార్పేమియు నిచ్చట జరుగలేదు. ఇట్లే కలిమి, బలిమి, ఆక, పోక మున్నగు కృదంతరూప ములును మంచితనము గడుసరితనము, పెద్దఱికము, చిన్నఱికము మున్నగు తద్ధితరూపములును సంయోగాత్మక స్థితినే వెల్లడించును. 'వచ్చుచున్నాడు' మున్నగు క్రియాపదములు 'వచ్చు-చు-ఉన్నాడు' అను భిన్నాంశముల కలయికవలన నేర్పడిన సమాసరూపములే.

ఏతెంచు, వీతెంచు, చనుదెంచు, అరుదెంచు, తలపడు, విడివడు, పరుగెత్తు, మొలకెత్తు, ఎసలారు, పెంపారు - మున్నగు క్రియాధాతువు లన్నియు సమాసరూపములే. కావుననే వీనిని కొందరు 'సంచయాత్మక భాషలు' అనికూడ అనుట జరుగుచున్నది. ఆంగ్లమున **Agglomerating Languages** అని యన్నప్పుడిదే యభిప్రాయము గోచరించును. సంయోగాత్మకత్వమును తెలుపుటకై ఆంగ్లమున **Agglutinative Languages** అనుపేరును ప్రసిద్ధముగా వాడుచుందురు.

**3 ప్రత్యయాత్మక భాషలు** : సంస్కృతము, పారశీకము, గ్రీకు, లాటిను మున్నగు భాషలు ప్రత్యయాత్మక భాషావర్గమునకు చెందినవి. ఈభాషలయందు ప్రకృతి ప్రత్యయముల కలయికవల్లనే పదము లేర్పడును. అయినను ప్రకృతిని ప్రత్యయమును స్పష్టముగా

నిరూపించుటకు వీలులేనంతగా ఏకీభావము నొందుట యిందలి విశేషము. ఇందలి ప్రత్యయములు రూపమునేకాక అర్థమును సైతము స్వాతంత్రముగా నిల్పుకొనజాలవు. ఇచ్చటి ప్రత్యయములకు సాధారణముగా స్వతంత్ర మైన యుపయోగము, అనగా ప్రకృతిని విడిచి వ్యస్తముగా ప్రయో గించుట యన్నది యుండదు. ప్రత్యయము చేరినప్పుడు ప్రకృతియందు కూడ కొన్నిమార్పులు కలుగుట యీభాషలయందు పరిగణింపదగిన యొక ముఖ్యలక్షణము. ప్రకృతియందును మార్పు కలిగి ప్రత్యయము నందును మార్పు కలుగుటచేత, రెండును మరింత సన్నిహితములై స్థూలదృష్టికి విడదీయుటకు వీలులేని ఏకాంగముగనే కనిపించును.

సంస్కృతమునందు 'రామ' యనునది ప్రాతిపదికము. దానిపై నితరవిభక్తులు చేరినప్పుడు భిన్నరూపములు కలుగును. 'రామః' అనునది ప్రథమావిభక్తిరూపము. రామమ్, రామేణ, రామాయ, రామాత్, రామస్య, రామే - మున్నగువిధముగా ఏకవచనరూపము లుండును. ఇట్లే క్రియలందును మార్పు కానవగును. 'కరోతి' అనునది ప్రథమైకవచనరూపము. ద్వివచనమునందు 'కురుతః' అనియు, బహు వచనమునందు 'కుర్వన్తి' అనియు నుండును. అనగా ప్రత్యయము తుదిని చేరుచున్నప్పుడు ప్రకృతియందును కొన్ని యెడల మార్పు స్పష్ట ముగా కనిపించుచున్నదని యర్థము.

సంస్కృతమునందు 'సమ' అను ధాతువుపై 'త్వ' అన్న ప్రత్యయము కలిగి 'సమత్వ' మున్నగురూపము లేర్పడును. అట్లే 'తా' అను ప్రత్యయము కలిగి 'సమతా' అనియు నగును. ఇచ్చట ప్రకృతి యందు మార్పు కలుగలేదు. కాని 'సామ్య' మున్నగుచోట్ల కొంత మార్పు కనుపట్టును. ఇట్టి మార్పులు తద్ధితప్రత్యయములు వచ్చి నప్పుడును కృత్ప్రత్యయములు వచ్చినప్పుడును కూడ జరుగుచునే యుండును.

లాటిను భాషయందు గోడ యను నర్థమున 'మురస్' అని యుండును. కర్మార్థమునందు 'మురమ్' అనియు, సంప్రదానార్థము నందు 'మురో' అనియు, సంబంధార్థమునందు 'మురి' అనియు రూపము లుండును. క్రియాపదములయందును ప్రక్రియ యిట్లే కనిపించును. 'ముగించు' అను నర్థమున 'ఫిని' యనునది మూలధాతువు. దీనిపై కాలసూచక పురుషసూచక ప్రత్యయములు చేరును. 'ఫినివి' అని యనగా 'నేను ముగించితిని' అని యర్థము. దీనికి బహువచనరూపమగు 'ఫినివిమస్' అనుదానికి 'మేము ముగించితిమి' అని యర్థము. ఇట్లే మధ్యమపురుషయందు 'ఫినివిస్తి' అనియు, ప్రథమపురుషయందు 'ఫినివెరున్త్' అనియు బహువచనరూపము లుండును.

నేటి ఉత్తరహిందూస్థానభాషలయందు ప్రత్యయములు పైభాషలలోవలె సన్నిహితములుకాక విడిగా కనిపించును. 'ఇల్లు' అనునర్థమున 'ఘర్' అనుశబ్దము హిందీయందు కలదు. 'ఘర్ మేఁ' అని యనగా 'ఇంటిలో' అని యర్థము. అట్లే 'ఇంటికి' అను నర్థమున 'ఘర్ కో' అనియు 'ఇంటినుండి' అను నర్థమున 'ఘర్ సే' అనియు 'ఇంటి యొక్క' అను నర్థమున 'ఘర్ కా' అనియు నుండును. ఇచ్చట మూల శబ్దము మారుట కనిపింపదు. కాని 'మైఁ' అను అస్మదర్థకైకవచనము ఇతరవిభక్తులు చేరినప్పుడు మారుట కనుపట్టును. ముఝ్ మేఁ, ముఝ్‌కో, ముఝ్‌సే, మేరా - మున్నగువిధముగా మార్పుచెందును. ఇట్లే తూ, వహ్ మున్నగు సర్వనామశబ్దములును మార్పుచెంది కనిపించును.

ఆంగ్లమునందు 'ఐ' అనునది ద్వితీయావిభక్తియందు 'మి' అనియు షష్ఠియందు 'మై' అనియు మారును. ఇంతేకాక టు, ఆఫ్, ఫ్రమ్, బై, ఆన్, ఇన్ మున్నగు ప్రత్యయములను పూర్వమందు చేర్చుకొనును. ఇట్లు విడిగా ప్రత్యయములు చేరుటచేతనే వీనికి 'విశ్లిష్టభాషలు' **(Analytic Languages)** అనుపేరు కలిగెను. సంస్కృతము, గ్రీకు

మున్నగుభాషలలో ప్రత్యయములు ప్రకృతితో కలిసిపోవును. కావున వానిని సంశ్లిష్టభాషలు (Synthetic Languages) అని యందురు.

సంస్కృతాది భాషలలో అంతమునందును, ఆంగ్లాదిభాషలలో ఆదియందును ప్రత్యయములు చేరుచున్నట్లు చూచితిమి. ఇట్లుచేరిన సందర్భములందు ప్రకృతి మారుటయు, మారకుండుటయు కూడ కలదు. ప్రకృతిని విడిచి యీప్రత్యయములు ప్రయోగింపబడ వన్నది కూడ స్పష్టముగనే తెలియుచున్నది. ప్రత్యయములను చేర్చుకొనుటచేతనే రూపమును, అన్వయమును పొందినట్టిపదములను గలిగియుండుటచేత, ఈ భాషలకు ప్రత్యయాత్మక భాష లనుపేరు కలిగెను. వీని నాంగ్లమున **'Inflexional Languages'** అని యందురు.

**4 సమ్మిశ్రణాత్మక భాషలు** : దక్షిణ అమెరికా యందును గ్రీనులాండునందును గల కొన్ని భాషలును, బాస్కు భాషలును సమ్మిశ్రణాత్మక భాషావర్గమునకు చెందినవి. ఇందు వేరు వేరు పదములు కొంత కొంత భాగమును విడిచిపుచ్చి వాక్యమంతయు ఒక్కటే పదముగానై ప్రయోగింపబడుచుండును.

దక్షిణ అమెరికాయందలి 'చైరీ' భాషయందు 'నాథోలినిన్' అని ఒక వాక్యము కలదు. దీనికి 'మా కొరకు నావను తెమ్ము' అని యర్థము. ఇందు కనీసము మూడుమాటలైనను లేకున్నయెడల వాక్యము కాదు. అయినను ఒకేమాట వలెనే మొత్తము వాక్యము కనిపించుచున్నది. 'నా తేన్' అని యనగా 'తెమ్ము' అని యర్థము. 'ఆమోఖల్' అని యనగా 'నావ' అని యర్థము. 'నిన్' అని యనగా 'మేము' అని యర్థము. ఈ మూడుపదములును 'నాథోలినిన్' అని యయ్యెను.

గ్రీనులాండులోని ఎస్కిమోభాషయందు "వాడు చేపలవేటకు వెళ్ళుటకు తొందరపడుచున్నాడు" అని నర్థమున 'అఉలిసరి ఆర్తోర్ సువర్పోర్' అని యందురు. 'అఉలిసర్' అని యనగా 'చేపలవేట'

యని యర్థము. 'పే అల్తోర్' అని యనగా 'ప్రవర్తించుట' యని యర్థము. 'పిస్నే సువర్పోక్' అని యనగా 'వాడు తొందర చేయును' అని యర్థము. ఇందు పే, పిస్నే - అనునవి పూర్తిగా లోపించిపోయిన పిమ్మటనే వాక్యమేర్పడినది.

బాస్కు భాషయందును "నేను ఇతనిని వానికడకు కొనిపోవు చున్నాను" అను వాక్యమున కంతటికిని బదులుగా 'దకార్క్ఓత్' అని యందురు. 'దకార్సు' అని యనగా 'నీవు నన్ను తీసికొని పోవు చున్నావు' అని యర్థము. 'అక్రి' అని యనగా 'మోయుట' అని యర్థము. 'నేను దానిని మోయుదును' అను నర్థమున 'దకర్త్' అనియు 'నీవు దానిని మోయుదువు' అను నర్థమున 'దకర్జు' అనియు 'నేను వాటిని మోయుదును' అను నర్థమున 'దకర్జ్కత్' అనియు 'నీవు వాటిని మోయుదువు' అను నర్థమున 'దకర్జ్కజు' అనియు నుండును. ఇందు వాక్యములను పోల్చి చూడగా 'త్' అనునది ఉత్తమ పురుషను, 'జు' అన్నది మధ్యమ పురుషను తెల్పుచున్నట్లు స్పష్టమగును. 'ద్' అనునది 'దానిని' అను నర్థమును దెల్పుచుండగా 'వాటిని' అను బహుత్వమును గల్గించుటకై 'జ్క' అనునది వాడబడినది. 'అక్రి' అనుదానిలోని చివరి 'రి' యను నక్షరము అన్నిరూపములందును లోపించిపోయినది.

లబార్గిన్ భాషయందు 'నేను వారిని ఎరుగుదును' అను నర్థమున 'దకిజ్కత్' అని యందురు.

ఇట్టి లక్షణము సంస్కృతభాషయందును కొంచెముగా క్రియా పదములయందును, సమాసములయందును కనిపించుచుండును. 'నమామి' అని యనగా 'నేను నమస్కరించుచున్నాను' అని యర్థము. 'వదతి' అని యనగా 'అతడు మాటాడుచున్నాడు' అని యర్థము. 'మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి' మున్నగు సమాసములందు 'మకరాంకుని వలె శశాంకునివలె మనోజ్ఞమైన మూర్తికలవాఁడు' అను నొక వాక్యమే

యర్థమగును. ఇట్లు సమ్మిశ్రణముచెందు స్వభావ ముండుటచేతనే వీనికి సమ్మిశ్రణాత్మకభాష లనుపేరు గలిగును. వీని నాంగ్లమున **Incorporating Languages** అని యందురు. అనేకపదము లేక పదముగా చేరు లక్షణమునుబట్టి వీనిని **Polysynthetic Languages** అని పిలుచుట కూడ కలదు.

## భౌగోళిక వర్గీకరణము

కొందరు వ్యవహరింపబడు ప్రదేశములనుబట్టి కూడ భాషలను వర్గీకరించుట కలదు. ప్రపంచమంతయు స్థూలముగా పంచఖండాత్మకముగా పరిగణింపబడుచున్నది. ఆయాఖండములయందు వ్యవహరింపబడు భాషలను అమెరికాఖండభాషలు, ఆఫ్రికాఖండభాషలు, యూరోపుఖండభాషలు, ఆసియాఖండభాషలు, ఆస్ట్రేలియాఖండభాషలు - అని విభాగించుట కలదు. ఇట్టి వర్గీకరణమును 'భౌగోళిక వర్గీకరణము' అని యందురు. దీనినే ఆంగ్లమునందు **Geographical Classification** అని యందురు.

ఈవిధముగు వర్గీకరణము ననుసరించినచో ఆసియాఖండభాషలలో రష్యా, మంగోలియా, మంచూరియా, చైనా, టిబెట్టు, ఆఫ్గనిస్తాను, బర్మా, సయాము - మున్నగు దేశభాషలతోపాటు భారతదేశభాషలు కూడ చేరియుండును. ప్రస్తుతము భారతదేశభాషలను గూర్చి పరిశీలింతము.

## భారతదేశ భాషలు

భాషలనుబట్టి చూచినప్పుడు భారతదేశము యూరేషియా ఖండమునందు మిక్కిలి ప్రముఖస్థానము నలంకరించును. స్థూలముగా చెప్పికొన్నప్పుడు ఉత్తరభారతమునందు ఆర్యకుటుంబమునకు చెందిన భాషలును, దక్షిణాపథమునందు ద్రావిడ భాషాకుటుంబమునకు చెందిన భాషలును వ్యవహృతము లగుచున్నట్లు పరిగణింపవచ్చును. భారత ప్రభుత్వము పదునాలుగు భాషలను మాత్రమే ప్రాంతీయభాషలుగా

గుర్తించినది. ఆ భాషలన్నియు చక్కనిసాహిత్యమును గలిగి, చరిత్రను గలిగి నిత్యమును వ్యవహృతము లగుచున్నవి. అవి భాషాతత్త్వమును బట్టి పై రెండుకుటుంబములలోనికి దాదాపుగా నిమిడిపోవును. ఇవికాక పెక్కుభాషలును, ఉపభాషలును హిమాలయములనుండి కన్యాకుమారి వరకు విస్తరించియున్నవి. అవి సంఖ్యనుబట్టి మాత్రమేకాక, ఇతర దేశ భాషలతోడి సామ్యసంబంధములనుబట్టి కూడ చాలముఖ్యములై ప్రాముఖ్యము వహించుచున్నవి. ఈభాషల వైవిధ్యము భారతమును కేవల మొకదేశముగా కాక, ఖండముగా నిరూపించుచున్నది. చారిత్రకముగా ఈభాషలకు, ఉపభాషలకును మిక్కిలి ప్రాధాన్యము గలదు.

భారతదేశభాషల నన్నింటిని స్థూలముగా ఐదు కుటుంబముల లోనికి విభజింపవచ్చును. 1. ఆర్యకుటుంబము 2. ద్రావిడకుటుంబము 3. ఏకాక్షరకుటుంబము 4. ఆస్ట్రిక్ కుటుంబము 5. అనిశ్చిత సముదాయము.

ఇందు తొలుదొల్తటిదయిన **ఆర్యకుటుంబము** సంఖ్యాబలమును బట్టి ప్రాధాన్యము వహించుచున్నది. దరిదాపుగా ఉత్తరభారత దేశమంతయు ఆర్యకుటుంబమునకు చెందినభాషలే నిండియున్నవి. వీనిని మరల మూడుశాఖలుగా విభాగింపవచ్చును. మొదటిది ఇరానీశాఖ. ఈశాఖకు చెందినభాషలు బెలూచీస్తాను నందును, సరిహద్దు ప్రాంతము నందును, పంజాబు సరిహద్దుల యందును వాడుకయందున్నవి. వీని యందు మిక్కిలి ప్రాచుర్య ప్రభావములుగల భాష 'పారసి'. మహమ్మదీయ పరిపాలనాకాలములో భారతదేశమున నిది సంస్కృతముతో పాటుగా, రాజభాషాపదవిని పొంది విరాజిల్లినది. ఈనాడు భారత దేశమునం దెచ్చటను పారశీకము వాడుకయందు లేకున్నను, ఉన్నత కుటుంబములకు చెందిన మహమ్మదీయుల ఉరుదూభాషపై తద్భాషా ప్రభావ మెక్కువగా కనిపించును.

ఇందు రెండవది దరదశాఖ. పామీరునకును వాయవ్య పంజాబునకును నడుమగల ప్రదేశమును దరదస్తానని యందురు. ఆ ప్రదేశమును బట్టియే అచ్చటి భాషాశాఖకు దరదశాఖయను పేరువచ్చెను. ఆభాషను పిశాచభాషయనియు, పైశాచియనియు పిల్చుటకూడ కలదు. గుణాఢ్యుడు బహుశః ఆభాషయందే తన బృహత్కథయను మహద్గ్రంథమును రచించియుండునని యూహింపబడుచున్నది. ఈనాడు లహందా, సింధీ, పంజాబీ, కొంకణ భాషలపైగల ప్రభావమునుబట్టి పైశాచీభాష ప్రాచీనకాలమున భారతదేశమునందు బహుదూరము వ్యాపించియుండియుండునని యనుమానించుట కవకాశము కలుగుచున్నది.

ఇంక మూడవది భారతీయశాఖ. ఈశాఖయందు మొత్తము పదునేడు భాషలను పరిగణించి డాక్టర్ గ్రియర్సన్ మూడు ఉపశాఖల లోనికిని, ఆరు వర్గములలోనికిని విభాగించెను. కాని యీవిభాగమువలన తూర్పుకొసనున్న భాషలను పడమటికొసనున్న భాషలను కలిపి యొక చోటనే పరిగణింపవలసి వచ్చుచున్నదని తెలిపి డాక్టర్ సునీతికుమార చటర్జీ ఆర్యభారతీయభాషలను ఐదు వర్గములుగా విభాగించెను. ఇందు మొదటిదైన ఉత్తరవర్గమునందు సింధీ, లహందా, పంజాబీ అను మూడుభాషలు చేరును. రెండవదయిన పశ్చిమవర్గమునందు గుజరాతీ, రాజస్థానీభాషలు రెండును చేరును. మూడవదయిన మధ్యమవర్గమునందు పశ్చిమహిందీ యొక్కటియే యుండును. నాలుగవదయిన ప్రాచ్యవర్గమునందు ప్రాచ్యహిందీ, బీహారీ, ఒరియా, బెంగాలీ, అస్సామీ అను నైదుభాషలు చేరును. చివరిదైన దాక్షిణాత్యవర్గమునందు మరాఠీ యొక్కటియే చేరును. ఈపరిగణనము ప్రకారము పండ్రెండు భాషలుమాత్రమే వివిధ వర్గములలోనికి వింగడింపబడినవి. ఇవిగాక ఇంకొకయైదు పర్వతీయభాషలు గలవు. వానినికూడ డాక్టర్ చటర్జీ రాజస్థానీ భాషాభేదములుగానే పరిగణించెను. ఉత్తరమున నేపాల్ నుండి దక్షిణమున మహారాష్ట్రమువరకు; పడమట సింధునుండి తూర్పున

వంగదేశమువరకు ఈభాషలు విస్తరించి వాడుక నొందుచున్నవి. వీని యన్నింటియందును మధ్యమవర్గమునకు చెందిన పశ్చిమహిందీ కేంద్ర స్థానమున నున్నది. ఇది శౌరసేని యను ప్రాకృతాపభ్రంశమునుండి వికాసమునొందినది. ఇదియే హిందీ, ఉరుదూ, హిందుస్తానీభాషలకు మూలాధారమై ముఖ్యరూపమై "ఖడీబోలీ" యనుపేరుతో ప్రామాణిక భాషగా పరిగణింపబడుచున్నది.

ఈభారతీయ కుటుంబమునకు చెందినభాష లన్నియు సంస్కృత మున కపభ్రంశ రూపములైన ప్రాకృతములనుండి ప్రాదుర్భవించినవే. కావున నీయార్యకుటుంబమునకు చెందిన భాషలయందే ప్రాచీనతమ ప్రామాణికసాహిత్యము లభించుచున్నది. పశ్చిమదేశీయుల భాషాశాస్త్రా ధ్యయనము ఆర్యభారతీయ భాషలతోడి పరిచయమువలననే యారంభ మయ్యె ననుట వాస్తవము.

ఆర్యకుటుంబమునకు పిమ్మట భారతదేశమున నంతటి ప్రాధాన్య మును వహించినది **ద్రావిడభాషాకుటుంబము** ఇది దాదాపుగా దక్షిణా పథమంతయు నలముకొనియున్నది. ఇందు మొత్తము ఇరువదిరెండు భాషలు పరిగణింపబడినవి. అందు నాగరకభాషలుగా ఆఱుభాషలు ప్రసిద్ధికెక్కినవి. ఈ ద్రావిడభాషలన్నింటిని సౌకర్యమునకై నాలుగు వర్గములుగా విభాగింపవచ్చును. ఇందు మొదటిది దాక్షిణాత్యవర్గము. ఇందు మిక్కిలి ప్రధానమును ప్రాచీనము నైనది తమిళభాష. ఈ నీస మిప్పటికి పదునైదువందల యేండ్లక్రితమే సాహిత్యస్వరూపమును సంతరించుకొన్నది. ఈభాషయందు పరిగణింపదగినంతగా మాండలిక భేదములు కనిపింపవు. ఇందు గ్రంథభాషను "శెందమిళ" మనియు, వాడుకభాషను "కొడుందమిళ" మనియు నందురు. తమిళమునకు జ్యేష్ఠపుత్రిక వంటిది మలయాళము. ఇది తొమ్మిదవ శతాబ్దమున తమి ళమునుండి వేరుపడి స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నట్లు భాషా శాస్త్రజ్ఞుల విశ్వాసము. ఇది కేరళదేశమునందలి బ్రాహ్మణుల ప్రభా

వశమువలన సంస్కృత ప్రభావమునకు చాల లొంగినది. అయినను, ఆర్యసంస్కృతికి దూరముగానున్న మోపలేలు దేశీయమైన శుద్ధ మలయాళమును మాటలాడుదురు. మైసూరురాష్ట్రమునందలిది కన్నడము. పదవశతాబ్దమునుండియు కన్నడము సాహిత్యసంపదను గలిగియున్నది. భాషారూపమునందు దీనికి తమిళముతో నెక్కుడు సంబంధమున్నను, లిపియందు తెనుగుతో నెక్కుడు సామ్యము గలదు. దీనికిని మాండలిక భేదము లంతగా కనిపింపవు. కాని ప్రాచీనభాషను "హలగన్నడ" మనియు, నవీన భాషను "హొసగన్నడ" మనియు పరిగణించుట కలదు. ఇదికాక 'తుళు' అను నొకభాష పరిమితప్రదేశమున వ్యవహృత మగుచున్నది. దీనియందు సాహిత్యమేమియు లేకున్నను, ద్రావిడభాషా లక్షణ పరిశీలమున నీభాషకు మిక్కిలి ప్రాధాన్యము నిచ్చి కాల్డ్వెల్ నాగరక భాషలలో పరిగణించెను. కన్నడమునకును తుళుభాషకును నడుమ 'కొడగు' అను భాష కలదు. భౌగోళికముగనేకాక భాషా లక్షణములనుబట్టి సైతము ఇది ఆ రెండు భాషలకును మధ్యస్థమై యున్నది.

ద్రావిడకుటుంబమునందు రెండవది ఆంధ్రవర్గము. ఇందు కేవలము 'ఆంధ్రము' అను నామాంతరముగల తెలుగు భాషయే ప్రధానమైనది. అప్రధానముగా ఉపభాషలు పెక్కులు గలవు. దక్షిణ దేశమునందలి తూర్పుప్రాంతమున చాలవరకు తెలుగు వినిపించును. ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమేకాక మైసూరు, బొంబాయి, మధ్యప్రదేశ ములలోకూడ తెలుగుభాష ప్రబలముగానే వినిపించును. ద్రావిడభాష లన్నింటిలోను ఆంధ్రభాషను మాటలాడువారే సంఖ్యయందెక్కువ. అట్లే సాహిత్యమునందును ఇతరద్రావిడభాష లన్నింటికంటె తెలుగున కున్న స్థానము మిక్కిలియున్నతము. ఇందు సంస్కృతపదములు దేశీయ పదములతో సమానముగా సమన్వయమునొందును. అజంతత్వమువలన ఆంధ్రభాష శ్రవఃపేయమై Italian of the East అను గౌరవమునకు పాత్రమైనది.

ఇందు మూడవదైన మధ్యమవర్గమునందు మిక్కిలి ప్రసిద్ధమైనది గోండి. ఇది భౌగోళికముగా తెలుగునకు సన్నిహితమై యున్నను, లాక్షణికముగ దాక్షిణాత్యవర్గభాషలతోనే ఎక్కువ సామ్యమును కలిగి యున్నది. గోండిభాషను మాటలాడు ప్రజలు ఆంధ్రదేశము, ఒరిస్సా, బీరారు, బుందేల్ ఖండము, ఛత్తీస్‌గఢ్ మున్నగుచోట్ల చెదరుచెదరుగా కలరు. మాళవదేశపు సరిహద్దు లందుకూడ గోండిభాషీయులు కలరు. అయినను 'చేదికోసలము' లను నామాంతరములుగల బుందేలుఖండ ఛత్తీసుగడములే కేంద్రస్థానములుగా తలంపబడుచున్నవి. గోండీభాషకు పొరుగు భాషగా "కుఇ" ఒరిస్సాయందు ప్రచారములో నున్నది. దీనికి తెలుగుతో ఎక్కువసంబంధము కలదు. ఈభాషకు ఉత్తరము వైపున పొరుగుభాషగా 'కురుఖ్' వాడుకలో నున్నది. దీనికి 'ఒరావొన్' అను మరొక పేరుకూడకలదు. దీనికి దాక్షిణాత్య వర్గముతో ఎక్కువసంబంధ మున్నట్లు కనిపించును. రాజమహాలు కొండలలో నివసించు 'పహ్రీ' జాతిప్రజలు మాటాడు 'మల్తో' యనునది కురుఖ్ భాషకు చెందిన ఉప భాషయే. పశ్చిమబీరారులో'కోలామీ' యను భాష వాడబడుచున్నది. దీనికిని తెలుగుభాషతో మిక్కిలి సామ్యము కనిపించును.

ద్రావిడభాషలలో బహిరంగవర్గము నాలుగవదిగా పరిగణింప బడుచున్నది. ఇందు బ్రాహుయీభాష యొక్కటియే కలదు. ఇది ఉత్తరమున సింధు బెలూచీస్థానమధ్యదేశమున వ్యాప్తిలో కలదు. ఒకప్పుడు ద్రావిడులు భారతదేశమంతయు వ్యాపించియుండి రనుటకు సాక్ష్యమిచ్చునట్లు ఈభాష ఉత్తరపు సరిహద్దులలో కొనయూపిరితో నున్నది. దీనిపై బెలూచీ, సింధీ మున్నగుభాషలు తమ ప్రభావమును విరివిగా చూపి లోగొనుచున్నవి. అయినను, ఇతరకుటుంబములకు చెందిన భాషలనడుమ ఇంతవరకు స్వీయవ్యక్తిత్వమును నిలుపుకొనుచు, నిలిచియుండుట నిజముగా ఆశ్చర్యకరమగు విషయము.

భారతదేశమునందలి భాషాకుటుంబములలో మూడవది ఏకాక్షర కుటుంబము. ఇందు టిబెట్టు భాషయు, చైనా భాషయు ప్రాధాన్యము

వహించుటచే దీనిని టిబెటన్ చైనా కుటుంబమనియు పిలుచుచుందురు. ఈ కుటుంబము తిరిగి 'సయామీచైనా' యనియు 'టిబెటన్ బర్మా' యనియు రెండువిభాగములుగా విభక్తమగును. సయామీచైనా విభాగమునందు రెండంతర్భాగములు గలవు. మొదటి దానికి 'సిమిటిక్' విభాగమని పేరు. ఈవిభాగమునకు చెందిన భాషలు చైనాలో మాత్రమే వినిపించును. రెండవ విభాగమునకు 'తాయి' యని పేరు. 'తాయి' యనునది సయామునందు నివసించు ప్రజల నుద్దేశించి జాతి వాచకముగా కూడ నుపయోగింపబడును. ఇండోచైనా యందు ఈజాతి జనులే అధికసంఖ్యలో నున్నారు. అస్సాము మొదలుకొని చైనా యందలి క్వాన్‌క్సీ ప్రాంతమువరకు ఈజాతి జనులు వ్యాపించియున్నారు. 'అహోం' అను నుపభాషయు, 'ఖాతమీ' అను నుపభాషయు అస్సామునకు తూర్పుభాగమునను బర్మా సరిహద్దులయందును వ్యవహారమునందు గలవు.

టిబెట్టునందును బర్మాయందును గల ప్రజ లొకేవర్గమునకు చెందినవారు. అందువల్లనే మానవ శాస్త్రజ్ఞులును, భాషాశాస్త్రజ్ఞులును వారిని టిబెటన్ బర్మావర్గముగా పరిగణించిరి. భాషలనుబట్టి చూచినచో టిబెటన్ బర్మావర్గము విశాలమగు టిబెటన్ చీనావర్గమునందు సరిగా సగముండును. ఈటిబెటన్ బర్మావర్గమునకే భారతదేశముతో అధిక సంబంధము కలదు. దీనికి మూడుశాఖలు కలవు – 1. టిబెట్టు హిమాలయశాఖ. 2. అస్సాముత్తరశాఖ. 3. అస్సాముబర్మాశాఖ.

టిబెట్టు హిమాలయశాఖలో టిబెట్టుదేశమునందలి ముఖ్యములైన భాషలు నుపభాషలును, హిమాలయముల ఉత్తరపుటంచుననున్న చిన్న చిన్న మాండలికములును పరిగణింపబడుచున్నవి. అస్సాము బర్మా శాఖలో బర్మాభాషయు, అస్సాము బర్మా సరిహద్దులందుగల చిన్న చిన్న మాండలికములును సమ్మిళితములై యున్నవి. ఈ రెండుశాఖలకు నడుమ, ఉత్తరపు కొండలయందలి భాషలు పై రెండుశాఖల లక్షణము

లను కలియగలుపుకొని అస్సాముత్తరశాఖ యనుపేర క్రొత్తశాఖగా నేర్పడినవి. భౌగోళికముగా కూడ వాని కా ప్రత్యేకత కలదు.

**ఆస్ట్రిక్ కుటుంబము** భారతదేశమునందలి భాషాకుటుంబము లలో నాలుగవది ఈ ఆస్ట్రిక్ కుటుంబము. మెడగాస్కరునుండి పసిఫిక్ మహాసముద్రమునందలి ఈస్టరుద్వీపము వరకును, పంజాబునుండి న్యూజి లాండ్ వరకును విస్తరించియున్న యనేకభాషలను కలియగలుపుకొని యున్నది.

ఆస్ట్రిక్ కుటుంబము ఇండోనేషియన్ శాఖయనియు, ఆస్ట్రో - ఏషియాటిక్ శాఖ యనియు రెండుశాఖలుగా విభాగింపబడినది. ఇందు మొదటిదయిన ఇండోనేషియన్ శాఖకే మలయాపోలినేషియన్ శాఖ యని నామాంతరము గలదు. ఇందు మలయాభాష బర్మాదేశపు దక్షిణపు సరిహద్దులయందును, దక్షిణమున నున్న ద్వీపసమూహము నందు సలోన్ భాషయు వ్యవహారమున నున్నవి.

ఆస్ట్రో - ఏషియాటిక్ శాఖ మరల మోన్‌ఖ్మేర్ భాగము, ముండా భాగము అని రెండుగా విభజింపబడినది. మోన్‌ఖ్మేర్ అనునది కాక పలౌంగ్‌వా, ఖాసీ, నికోబారీ విభాగములు ఇంకొక మూడు కలవు. ఇందు మోన్‌ఖ్మేర్ విభాగము విస్తృతమైనది. ప్రస్తుత మిది బర్మా సయాము లందును, భారతదేశమునందలి కొన్నియడవులందును వ్యవహరింపబడుచున్నది. 'మోన్' అనియు 'ఖ్మేర్' అనియు నున్న రెండు భాషలనుబట్టి యీవిభాగమునకు ఈపేరు వచ్చెను. 'పలౌంగ్' అనియు 'వా' అనియు రెండు భాషలుగల విభాగమునకు 'పలౌంగ్‌వా' అనిపేరు. అది బర్మాయందలి ఉత్తరపుటడవులలో వ్యవహారమున నున్నది. నికోబార్ దీవియందలి భాష నికోబారీ. ఇది మోన్‌భాష కును ముండాభాషలకును నడుమ శృంఖలముగా నున్నది. ఖాసీభాష అస్సాము పర్వత ప్రాంతమునందలి ఖాసీతెగకు చెందినజనుల వ్యవహార మున నున్నది. ఈఖాసీభాషను టిబెటన్ బర్మాశాఖకు చెందినభాషలు

చుట్టుముట్టియుండుటచే, ఆస్ట్రిక్ కుటుంబమునకు చెందినయితర భాషలతో దీనికి చాలకాలముగా సంబంధము తెగిపోయినది.

ముండాభాషలు భారతదేశమునందలి ఆస్ట్రిక్ కుటుంబ భాషలన్నింటిలోను ముక్కిలిముఖ్యమైనవి. పశ్చిమబెంగాల్‌నుండి బీహారు వరకు, భారతదేశవు మధ్యప్రాంతమంతటను, ఒరిస్సా యందు గంజాము జిల్లావరకును ఈభాగమునకు చెందినభాషలు వ్యవహృతమగుచున్నవి. వీని వ్యవహారక్షేత్రములో అక్కడక్కడ ద్రావిడభాషలుకూడ వాడుకయందు గలవు. మధ్యప్రదేశమునకు పశ్చిమభాగమున ముండాభాషలను ద్రావిడభాషలు చుట్టుకొనియున్నవి. ముండాభాషలకు చెందిన 'కనావరి' అను మాండలికము హిమాలయములయందు సిమ్లావరకు వ్యవహారమున కలదు. ముండాభాషలకు ఆశ్రయము వింధ్యపర్వత ప్రాంతము. అక్కడ ఖేర్వారీ, సంతాలీ, ముండారీ, హో, భూమిజ, కోఖా, కుర్కూ, ఖడియా, జువాంగ్, శాబర, గదబ మున్నగు పెక్కుమాండలికములు ముండాభాషావిభాగమునకు చెందినవే. ఈభాషలకు భారతీయభాషలన్నింటిపైని పర్యాప్తమైన ప్రభావము కలదని భాషాశాస్త్రజ్ఞుల నిశ్చయము.

ఇంక మిగిలినభాషల నన్నింటిని **అనిశ్చితభాషాకుటుంబ** మని ఒక వర్గముగా పరిగణింతురు. ఆ భాషల పేళ్ళును, నిశ్చితముగా వ్యవహరింపబడు స్థలములును గూడ వానిని పైని జూపిన ఏభాషాకుటుంబమునందును జేర్చుటకు వీలుగాకుండ నున్నవి. అవి చాలవరకు అడవిజాతులయందు మాటాడబడు అప్రధానభాషలు. వానియందు పదసామగ్రియు అధికముగా లేదు; సూక్ష్మభావములను తెల్పుటకు సమర్థమగు వాక్యవిన్యాస వైఖరియు కానరాదు.

# సిద్ధాంత ప్రకరణము

హిందూదేశమున నుత్తరభాగమున నున్న భాషలకు గౌడభాషలనియు, దక్షిణభాగమున నున్న భాషలకు ద్రావిడ భాషలనియు వ్యవహారము కలదు. ప్రజల నుద్దేశించి పంచగౌడు లనియు, పంచ ద్రావిడులనియు వ్యవహరించుట ప్రాచీనకాలమునుండియు వినిపించును. కాని స్థానికపండితులకు ద్రావిడభాషలు కూడ సంస్కృతజన్యములే యను నమ్మకము ఇటీవలివర కుండెడిది. నిత్యోపయోగి పదసామగ్రిని బట్టియు, సంఖ్యావాచక సర్వనామములనుబట్టియు, వ్యాకరణవిశేషములనుబట్టియు చూడగా ఉత్తర దేశభాషలకును దక్షిణ దేశభాషలకును భేదము స్పష్టముగా కనిపించుచున్నది. సామ్యమునుబట్టి యేక కుటుంబత్వమును, భేదమునుబట్టి భిన్న కుటుంబత్వమును సమర్థించుట సముచితము.

## ద్రావిడ భాషా వాదము

'రాస్మస్ రాస్క్' అను నొక భాషాశాస్త్రజ్ఞుడు బహుదేశ పర్యటనము చేసి యనేక భాషలనుగురించి ప్రత్యక్షపరిచయమును సంపాదించుకొనెను. క్రీ. శ. 1816 నుండి 23 వరకు సాగిన ఆయన పర్యటనమునందు స్వీడను, ఫిన్‌లాండు, రష్యా, కాకసస్, పర్షియా, ఇండియా దేశములను దర్శించి, ఆయా భాషలను బాగుగా అధ్యయనము చేసెను. అప్పటివరకు స్థూలముగా ఏర్పడియున్న యభిప్రాయమును మార్చుచు రాస్క్ పండితుడే తొలుదొల్త ద్రావిడభాషల యునికిని గూర్చి ప్రస్తావించెను. ఇవి సంస్కృత భాషనుండి పుట్టినవి కావనియు, దానికంటె భిన్నములనియు నీయనయే ప్రతిపాదించెను. ఈయన 'ద్రావిడభాషలు' అని యనక 'మలబారుభాషలు' అని వాడెను. ఈయనయే భాషా కుటుంబములను గూర్చి ప్రస్తావించుచు మొదటిదిగా ఇండియను కుటుంబమును దెల్పి, దక్కను విభాగము హిందూస్తాను విభాగము నని

రెండుగా విభజించెను. ఇది క్రీ. శ. 1818 లో జరిగిన విషయము. కావుననే భాషాచరిత్రలో ద్రావిడభాషావాదమునకు మూలపురుషునిగా 'రాస్మస్ రాస్కు' ను గుర్తించుట జరిగెను.

కాని, నిజమున కింతకు ముందే ద్రావిడభాషల యునికిని గుర్తించిన గౌరవము 'ఫ్రాన్సిస్ డబ్ల్యు, ఎలిస్' అను నాయనకు చెందవలసి యున్నది. ఆయన ఎ. డి. కాంప్‌బెల్ వ్రాసిన తెలుగు భాషా వాక్యరణమునకు భూమికను వ్రాయుచు, అందు'దక్షిణదేశభాషలు'అను పేరున ద్రావిడభాషలనుగురించి వ్రాసెను. తమిళము (గ్రాంథిక వ్యావహారికములు), తెలుగు (గ్రాంథిక వ్యావహారికములు), కన్నడి (ప్రాచీన నవీనములు), మలయాళము, తుళువ, కొడుగు–అను భాషలను పేర్కొనుటయే కాక రాజమహాలు భాషకు తమిళముతోను తెలుగుతోను సామ్య మెక్కువగా నున్న సంగతినిగూడ ప్రస్తావించెను. ఇది క్రీ. శ. 1816 నాటి విషయము.

దాదాపు రెండువేల సంవత్సరములుగా నిలువద్రొక్కుకొని యున్న యీ దేశీయ భాషల కన్నింటికి బిషప్ కాల్డ్వెలు సామూహికముగా 'ద్రావిడభాషలు' అని పేరు పెట్టెను. కొందరు పాశ్చాత్య రచయితలు ఈ భాషలను తములియను భాషలనియు, తములికు భాషలనియు, తల్మొలికు భాషలనియు కొంతకాలము క్రిందటివరకు పిలిచిరి. కొందరు మలబారు భాషలనియు, కోరమాండలు భాషలనియుకూడ పిలిచిరి. ద్రావిడ భాషలలో తమిళము మిక్కిలి ప్రాచీన కాలముననే సాహిత్యస్థితిని పొందిన దగుటవల్ల, తత్ప్రభావమునకు లొంగి యితర భాషలను తమిళ సంబంధులగు భాషలుగా పరిగణించువారు 'తములికు' మున్నగు పేర్లు పెట్టుట సంభవించెను. కాల్డ్వెలు భాషాకుటుంబమునకు ద్రావిడపదమును వాడి, భాషాపరముగా మాత్రమే తమిళశబ్దమును వాడెను.

'మలబారు' అనునది పడమటి కనుమల ప్రాంతమునకు పోర్చుగీసువారు పెట్టిన పేరు. ఇందు పూర్వభాగమయిన 'మల' యనునది

'మలయాళము' మున్నగుచోట గల 'కొండ' యను నర్థముగల శబ్దమే. ఉత్తరభాగము సంస్కృతమున సమూహార్థమందున్న 'వార' శబ్దమని కొందర యభిప్రాయము. డాక్టరు గుండెర్టు అరబ్బీ భాషయందలి 'బార్' శబ్దమే యిది యని యభిప్రాయపడెను. కాల్డ్వెలు పారశీకము నందలి 'బార్' శబ్దమును స్వీకరించెను. దీనినిబట్టి 'కొండలు గలదేశము' అను నర్థ మేర్పడును. పాశ్చాత్యులు సముద్రప్రయాణము ముగించుకొని ముందుగా చూచునది మలబారు. కావున ఆ పేరున తాము విన్న క్రొత్తభాషల నన్నింటిని పిలుచుట తటస్థపడి యుండును.

'కోరమాండలు' పదముకూడ విచిత్రమైనది. 'చోడులు' పాలించిన మండలము 'చోడమండలము'. డకారము రకారము కాగా 'చోర మండలము' కావచ్చును. దాక్షిణాత్యభాషలలో 'చ' 'క' లు పర స్పరము వినిమయము నొందుట కలదు. కావున 'కోరమండలము' ఏర్పడి పాశ్చాత్యోచ్చారణమున 'కోరమండల్' కావచ్చును. ఇదే యభిప్రాయమును కాల్డ్వెలు తొలుత చెప్పెను. అయినను తరువాత తన యభిప్రాయమును మార్చుకొని పులికట్టు సమీపమున గల 'కార మణల్' అను గ్రామమునుబట్టియే 'కోరమండల్' అను పదము వాడుక నొందె నని నిర్ణయించుకొనెను. ఏమయినను, ఇదియు మలబారువలె ప్రథమ స్థానమునుబట్టియే యేర్పడిన సంకేతము.

మలబారు భాషలని కాని, కోరమాండలు భాషలనికాని వ్యవహరించుట యిప్పుడేమాత్రమును వినిపింపదు. ద్రావిడ పదముమాత్రమే ప్రతిష్ఠను సంపాదించుకొన్నది. సంస్కృతమునందు భాషాపరముగను, జాతిపరముగను, ద్రావిడ పదము వాడుకలో నున్నది. మనుస్మృతి యందును, మహాభారత పురాణాదులందును ద్రవిడశబ్దము జాతిపరముగా వాడబడినది. 'ద్రావిడీ' అను పేరున ఒకభాష యున్నట్లు సంస్కృత వైయాకరణులు పేర్కొనిరి. బాబు రాజేంద్రమిత్రలాల్ అను పండితుడు 'ద్రావిడి' అనునది ప్రాకృతవిభేద మనియు దానినుండి యీ నాటి

భాషలు కొన్ని యుద్భవించె ననియు తెల్పెను. ఏడవశతాబ్దికి చెందిన కుమారిలభట్టు తన తంత్రవార్తికమునందు 'ఆంధ్ర ద్రావిడ భాషా యామ్' అని వ్రాసెను. దీనినిబట్టి కాల్డ్వెలును, గ్రియర్సనును ఆంధ్రులకు తమిళులకు ఒకేభాష యుండెనని కుమారిలభట్టు భావించినట్లు వ్రాసిరి. శ్రీగంటి జోగిసోమయాజి 'తద్యథా ద్రావిడ భాషాయామ్' అను పాఠము సరియైనదనియు, ఇచ్చట ద్రావిడ శబ్దమునకు తమిళ మను అర్థమే కలదనియు నిర్ణయించిరి. దండి దశకుమారచరిత్రయందు ద్రవిడ శబ్దమును దేశపరముగా వాడెను; బాణుడు కాదంబరియందు జాతి పరముగా వాడెను. మొత్తముమీద ప్రాచీనకాలమునుండియు 'ద్రావిడ' శబ్ద మొకటి దేశపరముగను, జాతిపరముగను, భాషాపరముగను కూడ వాడుకలో నున్నట్లు స్పష్టము.

కాల్డ్వెలు భాషాభేదమునకు 'తమిళము' అనుమాటను ఉపయోగించి, భాషాకుటుంబమునకు ద్రావిడశబ్దము నుపయోగించుటవల్ల వాడుకలో ఒక స్పష్టత యేర్పడినది. కొందరు ఇప్పటికిని ద్రావిడ మనగా తమిళ మనియు, అందుండి పుట్టిన భాషలు ద్రావిడభాష లనియు తప్పుగా భావించుచున్నారు. తెలుగు, కన్నడము మున్నగు భాషలవలెనే తమిళము కూడ ఒక సోదరభాషయే. వీని యన్నింటికిని మూలభూత మగు భాష యొకటి యుండవలయు ననియు, అది ప్రాచీన ద్రావిడభాష యనియు భాషాతత్త్వవేత్తల నిశ్చయము.

## ద్రావిడ భాషా పరిగణనము

కాల్డ్వెలు మొదటిమారుగా క్రీ. శ. 1856 వ సంవత్సరమున 'ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణము' అను గ్రంథము నాంగ్లమున ప్రకటించెను. ఆయన చేసిన పరిగణనము ప్రకారము ద్రావిడభాషలు మొత్తము పండ్రెండు. ఉత్తరహిందూస్థానమున 'బ్రాహుయీ' యను భాష కలదు. అదికూడ ద్రావిడభాషాకుటుంబమునకు చెందినదే. కాల్డ్వెలు ఆ భాష కాకయే పండ్రెండు భాషలను పరిగణించెను. అందు

ఆరు భాషలు నాగరకములు. 1. తమిళము 2. మలయాళము 3. తెలుగు 4. కన్నడము 5. తుళు 6. కొడగు.

ఆరు భాషలు అనాగరకములు. 1. తుద 2. కోత 3. గోండు 4. ఖోందు 5. ఒరావొను 6. రాజమహల్.

ఆధునికులు ద్రావిడభాషలు మొత్తము ఇరువదిరెండు కలవని, వానిని ప్రాదేశికముగా విభాగించుచున్నారు. వీరి విభాగము ననుసరించి ఉత్తర ద్రావిడభాషలు మూడు 1. బ్రాహూయీ 2. కురుఖ్ 3. మల్తో. మధ్య ద్రావిడభాషలు పదునొకండు 1. కుయి 2. కువి 3. కూబి 4. కోయ 5. పర్జి 6. నాయికీ 7. ఒల్లారి 8. కోలామి 9. గోండి 10. గదబ 11. తెలుగు.

దక్షిణ ద్రావిడభాషలు ఎనిమిది 1. తమిళము 2. కన్నడము 3. మలయాళము 4. తుళు 5. కొడగు 6. బడగ 7. తుద 8. కోత.

కాల్డ్వెలు పేర్కొనిన 'తుద' యనుభాషకే 'తొద' యను పేరు కూడ కలదు. ఒరావొనుభాషయే 'కురుఖ్' అను పేరున ఉత్తర ద్రావిడ భాషగా పరిగణింపబడుచున్నది. రాజమహల్ భాషకే 'మల్తో' అనియు 'మాలెర్' అనియు కూడ పేళ్లు గలవు. ఖోందుభాషను కూభాష యనియు కుయిభాషయనియు, కంధీభాష యనియుకూడ పిలుతురు. గోండుభాషకు గోండీభాష యని నామాంతరము కలదు.

ఇందు కాల్డ్వెలు చెప్పిన నాగరకభాషల కారింటికి సాహిత్యస్థితి కలదు. తక్కినవానికి వాగ్వ్యవహారమే కాని లేఖనవిధానము లేదు. ఐనను 'టటిల్' 'యూల్సుబ్లాక్' మున్నగు పండితులు కుయి, గోండి మున్నగు అనాగరకభాషలే ప్రాచీనద్రావిడభాషాస్థితిని స్పష్టముగా ప్రకటించు నను ఉద్దేశముతో పరిశ్రమ గావించిరి. నాగరకభాషల భాషాసంపదను గురించి కొంచెముగా పరిశీలింతము.

## నాగరకభాషలు

**తమిళము :** ప్రాచీనద్రావిడభాషనుండి తొలుదొల్త విడివడి, సాహిత్యసౌష్ఠవమును సుస్థిరత్వమును గడించుకొన్న భాష తమిళము. కొందరు తమిళపండితులు క్రీస్తు పూర్వము కొన్నివేల సంవత్సరములకు ముందు తమిళ మున్నట్లు నుడివిరి. శ్రీ యస్. వైయాపుర పిళ్ళై మున్నగు తమిళపండితులు క్రీ. పూ. మూడవశతాబ్దికి పిమ్మట తమిళము సుప్రతిష్ఠితమయ్యె నని నిశ్చయించిరి.

ద్రవిడ శబ్దమునుండి తమిళ శబ్దము వచ్చె నని బిషప్ కాల్డ్వెలు అభిప్రాయపడెను. సంస్కృతమునందు వకార మకారములు పరస్పరము మారుటకనిపించును. గుణవాన్, మతిమాన్ మున్నగుచోట్ల మతుప్ప్రత్యయమునందీ మార్పు గలదు. అట్లే ద్రవిడ యనునది 'ద్రమిడ' యైయుండు నని, ఆపిమ్మట డకారమునకు బదులుగా తమిళభాషకు సహజమయిన 'ఱ' కారము కలిగియుండు నని పర్యవసానమున తేలినది. 'తమిఱ' యనునది స్థిరపడినది. తమిళపండితులు మాత్రము తమిళము దేశ్యశబ్ద మనియే విశ్వసింతురు. దేశీయములగు వ్యుత్పత్తులను గూడ దెల్పుదురు. తమిళ మనగా తీపి యనియు, కరుణ యనియు తమిళ నిఘంటువులందు అర్థములు గలవు.

తమిళవాఙ్మయచరిత్రమున మొదటిది సంగయుగము. సంస్కృత సంఘ శబ్దమునకు 'సంగ' వికృతి యైయుండును. కవుల సమూహము అను నర్థమున 'సంగ' యనునది వాడబడెను. ఇట్టి కవిసంఘములు మూడు కలవు. 1. తలైచ్చంగమ్ 2. ఇడైచ్చంగమ్ 3. కడైచ్చంగమ్.

మొట్టమొదటి సంఘము తలైచ్చంగమ్. ఇందు శివుడు, మురుగన్, అగత్తియన్ మొదలగువారితోపాటు 549 మంది సభ్యులుగా నుండిరి. ఈకాలమున వెలసిన గ్రంథము 'పేరగత్తియమ్'. దీనిని అగస్త్యుడు వ్రాసె నని చెప్పుదురు. అతనిపై గౌరవముతో తమిళ భాషను 'అగత్తియమ్' అని యనుటకూడ కలదు. ఈ గ్రంథము

తమిళమునకు మొట్టమొదటి వ్యాకరణము. కాని, ఈగ్రంథము సమగ్రముగా లభింపలేదు.

రెండవ సంఘము ఇడైచ్చంగమ్. దీనియందు అగస్త్యుని శిష్యుడయిన తొల్కాప్పియనారుతోపాటు 59మంది సభ్యులుగానుండిరి. ఈకాలమున వెలసిన గ్రంథము తొల్కాప్పియమ్. తొల్కాప్పియనారు ఐంద్రవ్యాకరణము ననుసరించి దీనిని రచించె నని చెప్పుదురు. తొల్కాప్పియమునందు ఎఴుత్తు (వర్ణము), శొల్ (పదము), పొరుళ్ (కావ్యవస్తువు) అని మూడు భాగములు కలవు. వ్యవహారమునందు కలిసిపోయిన అన్యభాషాశబ్దములు స్వీకార్యములని తొల్కాప్పియనారు నిర్దేశము. కావ్యవస్తువివరణమున తమిళుల సామాజికజీవితము చక్కగా చిత్రింపబడినది.

మూడవసంఘము కడైచ్చంగమ్. ఇందు నక్కీరుడు, తిరువళ్లువరుతోపాటు 49 మంది కవు లుండెడివారు. తమిళ వేదమని పేరు పొందిన 'తిరుక్కురళ్' అను గ్రంథమును తిరువళ్ళువరు రచించెను. ఇందు మానవజీవితమునకు ఆవశ్యకము లగు సర్వవిషయములును సరసముగా, సహజసుందరముగా చిత్రింపబడినవి.

తిరువళ్ళువరునకు తరువాత 'అవ్వై' యను కవయిత్రిని పేర్కొనవలయును. ఈమె యనేక గ్రంథములను రచించెను. నేటికిని తమిళుల నిత్యవ్యవహారమున అవ్వై రచించిన గ్రంథముల సూక్తులు సజీవములై యున్నవి.

తరువాత బహుకర్తృకము లయిన సంకలనగ్రంథములు వెలువడినవి. వీనియందు దేశసాహిత్యమునకు మిక్కిలి ప్రాధాన్యము కనిపించును. ప్రణయగీతికలతోపాటు వీరగీతికలకు సైతము వీనియందు స్థానము లభించినది.

మణిమేకలై, శిలప్పదిగారమ్, జీవకచింతామణి, వళయాపతి, కుండలకేశి యనునవి తమిళ పంచకావ్యములు. క్రీ.శ. 8వ శతాబ్దికి

చెందిన శీత్తలై శాత్తనార్ అను నతడు 'మణిమేకలై' అను కావ్యమును రచించెను. ఇందు ముప్పదిగాథలు కలవు. రమణీయమైన ప్రకృతివర్ణనములో, రసోచితమైన సమాసరచనముతో బౌద్ధజీవన విధానమును కనులకు గట్టునట్లు చిత్రించుట శాత్తనార్ విశిష్టత.

శిలప్పదిగార మను కావ్యమును 'ఇళంగో' అను రాజకవి సృష్టించెను. ఇది తొమ్మిదవ శతాబ్దినడిమిభాగమున రచింపబడె నని పరిశోధకుల విశ్వాసము. ఇది తమిళుల సామాజికజీవితమును సర్వవిధముల ప్రతిబింబించు మణిదర్పణ మన్న అతిశయోక్తి కాదు. ఇందు జైన మతాచారము లధికముగా ప్రవేశించినవి. రచనావిధానమునుబట్టి 'నాటక కావ్యము' అను ప్రశస్తిని సంపాదించుకొన్నది.

'తిరుత్తక్కదేవర్' అను చోళవంశీయుడైన జైనముని శృంగార రసప్రధానముగా 'జీవకచింతామణి' అను గ్రంథమును రచించెను. రచనాకాలము 5వ శతాబ్ది యని కొందరును, 9వ శతాబ్ది యని కొందరును తలచుచున్నారు. ఇందు చతుర్విధ పురుషార్థములును చక్కగా వర్ణింపబడుటచే 'ముడిపొరుళ్ తొడర్ నిలై డెయ్యుళ్' అను పేరు కూడ వ్యాప్తిని గడించుకొన్నది. ఇందును జైనుల తత్త్వవిషయములు, ఆచారవ్యవహారములు వర్ణితము లయినవి. తరువాతి కవుల కిది మూదలగ్రంథ మైనది.

కుండలకేశి, వళయాపతి అను రెండు గ్రంథములును ఉపలభ్యములు కాలేదు. తమిళసాహిత్యచరిత్రలో నామమాత్రావశిష్టములై మిగిలిపోయినవి.

పవణంది రచించిన 'నన్నూల్' అను లక్షణ గ్రంథము మిక్కిలి ప్రశస్తికి వచ్చినది. తొల్కాప్పియము తర్వాత అంత ప్రాధాన్యమును పొందిన లక్షణగ్రంథ మిదే.

మొత్తముమీద మూడు సంగముల కాలము విషయమున వివిధ ప్రతిపాదనలు కలవు. క్రీ. పూ. 1000 సంవత్సరముల నుండి క్రీ. పూ.

150 సం॥రముల నడిమికాలమువరకు ఈనిర్ణయములు సాగినవి. ఏమైనను, ప్రాచీన తమిళమునకును నేటి తమిళమునకును చాల భేద మున్నది. సెందమిళమనియు, కొటుందమిళ మనియు రెండు భేదములు గలవు. మొదటిది ప్రాచీన తమిళము; రెండవది క్రొత్తతమిళము. తమిళమును తెలుగువారును కన్నడులును 'అరవము' అని పిలుతురు. దీనికి వ్యుత్పత్తిని నిశ్చితముగా చెప్పలేము. తమిళమున 'అరవన్' అనగా నీతిమంతుడని యర్థము. కావున నీతిని బోధించుసాహిత్యముగల భాష యగుటచే అరవమునకు ఆ పేరు కలిగెనని డా॥ గుండెర్టు అభిప్రాయము. ఈవిషయమున మరొకవాదము కూడ కలదు. 'అరివు' అనగా జ్ఞానము. దక్షిణ దేశీయులలో తమిళులు మిక్కిలి జ్ఞానవంతులు గనుక వారి భాషకు 'అరవము' అను పేరు గలిగె నట! తమిళదేశములో 'అరువ' అనుపేరున ఒకజిల్లా కలదు. అది అంత ప్రసిద్ధము కాదు. అయినను దానిపేరే తమిళభాష కేర్పడెనని ఒకవాదము కలదు.

ఇంతకును 'అరవము' అను పేరు తమిళభాషలో వినిపించునది కాదు. తమిళభాషను ఇతరు లాపేరున పిలుతురు. కావున అరవము అను పేరునకు తమిళభాషలో అర్థము వెదకుట నిరర్థకము. తెలుగు పండితుల యభిప్రాయములో 'అరవము' అనునది సంస్కృతపదము; ధ్వని లేని దని యర్థము. దీనియందు వర్గయుక్కులు లేవు గనుక ఈ అర్థమున 'అరవము' అను పదము తగియే యున్నది. అందువలన తెలుగు వారు భాషను, దేశమును గూడ అరవము అనియే పిలుతురు.

ఒక్కచిన్నమాట. తెలుగునందలి అరవము అరవవారి అరవముతో సమాన మని భ్రమపడరాదు. తమిళులకు 'అరవము' అనగా ధ్వని యని యర్థము. కావున, తెలుగువారు వాడెడి యర్థమునకు ఇది పూర్తిగా విరుద్ధము. తమిళమందు పదాదియందు రకార ముండదు. అందువలన ముందు 'అ' కారమును జేర్చి పల్కుదురు. రాజు అను శబ్దము 'అరసన్' అని యైనట్లే రవము అనునది 'అరవము' అని యగును.

తమిళమును రెండుకోట్ల యేబది లక్షల జనము మాతృభాషగా మాటాడుచున్నారు. దక్షిణభారతమున ఆగ్నేయ భాగమునను, సింహళమున ఉత్తరభాగమునందును తమిళము వాడుకలో నున్నది.

కొరవ (ఎరుకల), ఇరుల, కసువ, కైకాడీ, బుర్గణ్డీ - అను పేర్లతో తమిళమునకు ఐదు మాండలికములు ప్రధానముగా పరిగణింపబడినవి.

**మలయాళము** : మలయాళప్రదేశము నేటి కేరళదేశము. ఇందు మలబారు, కొచ్చిను, తిరువాన్కూరు అను మూడు ముఖ్యభాగములు కలవు. ఇది అరేబియా సముద్రమునకును, పడమటి కనుమలకును మధ్యగా నున్నది. 'కేరము' అనగా కొబ్బరిచెట్టు కావున కొబ్బరిచెట్లు సమృద్ధిగా గల ప్రదేశమగుటచే దీనికి 'కేరళము' అను పేరు వచ్చియుండునని కొందరు భావించుచున్నారు.

ఈ 'కేరళము' అను పదము 'చేరళమ్' 'చేరమ్' అనురూపములతోకూడ తమిళమలయాళాది సాహిత్యములందు కనబడుచున్నది. కేరళదేశస్థుడు అను నర్థమున 'కేళన్' అనియు 'కేళు' అనియు నాడుచుండుట కలదు. అశోకుని శాసనమునందు 'కేరళం పుత్రొ' యని కలదు. ప్లినీ యను చరిత్రకారుడు 'కెలోబొత్రస్' అనియు 'టాలేమీ' యను చరిత్రకారుడు 'కెరొబొత్రాస్' అనియు వ్రాసిన వ్రాతలు 'కేరళంపుత్రొ' అను దానితో సమానములే యని, బిషప్ కాల్డ్వెల్ నిశ్చయము. కేరళ చేర శబ్దములు ప్రాచీనములును, చరిత్రప్రసిద్ధములు ననుట నిర్వివాదము. మలయాళ మనుపదమునకు వ్యుత్పత్తిని గమనింతము. 'మల' అను పదమునకు 'కొండ' యని యర్థము. 'ఆళమ్' అనగా సముద్రమని యర్థము. పడమటి కనుమలకును అరేబియా సముద్రమునకును నడుమ నుండుటచే దీని కీ పేరు కలిగెనని కొందరి తలంపు. కొందరు 'అళం' అనగా భూమి యని యర్థమును గ్రహించి కొండ భూమి యను నర్థమును చెప్పుచున్నారు. అరవమున మలైనాడు మలై

మండలము అను విధముగా ప్రయోగము లుండుటచే రెండవ యర్థమే సమంజసమని తోచును.

కాల్డ్వెల్ మున్నగువారు మలయాళమును స్వతంత్ర భాషగా కాక, తమిళపుత్రికగా భావించిరి. కేరళపాణినీయమును రచించిన రాజరాజవర్మ తమిళమునుండి మలయాళము తొమ్మిదవ శతాబ్ద ప్రాంతమున వేరైయుండు నని అభిప్రాయపడెను. కొందరు పండితులు మాత్రము తమిళమువలెనే మలయాళము కూడ ప్రాచీన ద్రావిడభాష నుండి యుద్భవించె నని నిశ్చయించిరి. వీరి యుద్దేశమున మలయాళము తమిళమునకు సోదరభాషయే కాని, జన్యభాష కాదు.

ఇంతకును విడివడిన పిమ్మట కూడ మలయాళముపై తమిళభాష ప్రభావముచూపుచునే యుండెను. క్రీ.శ. 825 వరకు తమిళభూపతులైన పెరుమాళ్ రాజవంశీయుల రాచరికము మలయాళదేశముపై సాగినది. రాజకీయప్రభావము తొమ్మిదవ శతాబ్దికే ముగిసిపోయినను, పదునారవ శతాబ్దివరకు భాషా ప్రభావము మలయాళముపై నుండనే యున్నది.

'చేరమన్' అను కవి రచించిన 'రామచరితము' అను గ్రంథము మలయాళ సాహిత్యమున తొలికావ్యముగా ప్రసిద్ధినందినది. రచనా కాలము పదవశతాబ్దియని కొందరును, పండ్రెండవ శతాబ్ది యని కొందరును విశ్వసించుచున్నారు. ఇందలి భాష మిక్కిలి కఠినమును కృతకమునై కనిపించును. ఇందు తమిళభాషాప్రభావ మెంత యున్న దన్న మలయాళపదములు కూడ తమిళరూపము నొందినవి. ఇందలిభాష నాటి భాషా విశేషములను గుర్తించుటకు మిక్కిలి సహకరించును.

'కణ్ణశన్ పాట్టుగళ్' అనునది కావ్యసంపుటి. ఇందు 'రామ పణిక్కర్' వ్రాసిన కణ్ణశ రామాయణము పేర్కొనదగినది. 'భగవద్గీత'ను వ్రాసిన మాధవ పణిక్కర్ 'భారతమాల' యను కావ్యమును వ్రాసిన శంకర పణిక్కర్ ఒక వంశమువారే. వీరు పదునాల్గవ శతాబ్ది యుత్తరార్థమునుండి యుందురు. వీరి రచనలందు తమిళమునకు ప్రాధా

న్యము తగ్గినది; సంస్కృతశబ్దములును సమాసములును స్థానము గడించుకొన్నవి. తమిళచ్ఛందము ననుసరించి యేర్పడిన 'నిరణ వృత్తము' అనునది యొకటి క్రొత్తగా తలయెత్తినది.

మలయాళముపై సంస్కృత భాషాప్రభావ మధికముగా పడినది. తెలుగు కన్నడములలో పేరుమాత్రమునకున్న మణిప్రవాళశైలి మలయాళమున స్థిరత్వము నొందినది. విభక్త్యంతము లయిన సంస్కృత శబ్దములతో, మలయాళ శబ్దముల నేకవాక్యమున గూర్చుట మణిప్రవాళశైలి. దీనిని గూర్చి 'లీలాతిలకము' అను లక్షణగ్రంథమున విస్తరముగా కలదు. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దికే 'తోలన్' అనుకవి హాస్యరసస్ఫోరకముగా మణిప్రవాళరచనము గావించెను.

పదునాలుగవ శతాబ్ద్యారంభమునందలి 'ఉణ్ణునీలిసందేశము' మున్నగుకావ్యములు 'మేఘసందేశము' జాడలో వెలసినవి. వీనియందు తమిళభాషాప్రభావము మిక్కుటముగా గలదు.

రామచరితమునకు పూర్వమే మలయాళమున ఎన్నో పదములును, పాటలును వ్యాప్తిలో నున్నవి. భద్రకాళిపాట్టు మున్నగునవి ప్రాచీన రచనలు. ఎళుత్తచ్చన్ మలయాళ వాఙ్మయోద్ధారకుడు. 'కిళిప్పాట్టు' అను రచనావిశేషమునకు సౌందర్యమును సంతరించిన ఘనత యీతనిది. భారతము, భాగవతము, అధ్యాత్మరామాయణము మున్నగునవి యీతని రచనలలో ప్రధానములు. పదునారవ శతాబ్దమున నున్నట్లు ఊహయే కాని యీతని జీవితకాలమును నిరూపించు సాక్ష్యములు లేవు. పేరు కూడ నట్టిదే. 'సాహిత్యాచార్యుడు' అను నర్థము కల 'ఎళుత్తచ్చన్' అనునది బిరుదనామ మనిపించునుగాని అసలు పేరుగా కనుపించుట లేదు.

ఈ మలయాళభాషకు సంస్కృతమున 'లీలాతిలకము' అను లక్షణగ్రంథము 15వ శతాబ్దమున రచింపబడినది. ఇందు మలయాళ భాషాతత్త్వము విస్పష్టముగా నిరూపింపబడినది. ఇందలి భాగములకు 'శిల్పము' లని పేరు. అట్టి శిల్పములు ఎనిమిది కలవు. మొదటి మూడు

శిల్పములందును మలయాళ భాషాచరిత్రయు, వ్యాకరణమును వివరింప బడినవి. తరువాతి శిల్పములందు సాహిత్యవిషయములు క్రోడీకరింప బడినవి. దీనికి పిమ్మట 1868వ సంవత్సరమున డాక్టరు గుండెర్టు మల యాళభాషలో మలయాళవ్యాకరణమును రచించెను. ఆ తరువాతనే రాజరాజవర్మ కేరళపాణినీయమును రచించెను. కేరళకౌముది యను గ్రంథము నవీనకాలమున వెలసినదే.

మలయాళము స్వయముగా నొకస్వరూపమును సంతరించుకొని పదముల రూపములో, పాటల రూపములో నుండగా – మొదట తమిళ ప్రభావమును, పిదప సంస్కృత ప్రభావమును పడినవి. ఇప్పటికిని మల యాళప్రజలకు సంస్కృతమన్న ప్రీతి హెచ్చు. ఇతరద్రావిడభాషలలో కంటె మలయాళముననే సంస్కృతపదసంపద యెక్కువగా కలదు. మలయాళమును మాతృభాషగా మాటాడువారు ఒకకోటిమంది కలరు. మలయాళమునందు చెప్పుకొనదగినంత వైవిధ్యముగలిగి మాండలికము లని పరిగణింపదగిన భాషాభేదములు కనిపింపవు.

తెలుగు : ద్రావిడభాష లన్నింటిలోను సంఖ్యాబలమునందును, సాహిత్యసౌందర్యములందును ఉన్నతస్థానము నాక్రమించుకొన్నది తెలుగుభాష. "ప్రాచీనసంస్కృతిచేతను, పదపరికరముచేతను తమిళము నకు తరువాతిదే యైనప్పటికిని తెలుగుభాష సర్వమాధుర్యముచేత ద్రావిడభాష లన్నింటియందును మొదటిస్థానమును గడించుకొన్న"దని కాల్డ్వెలు యొక్క యభిప్రాయము.

తెలుగుభాషను మొదటిరోజులలో యూరోపియనులు 'జెంటూ' (gentoo) భాష యని పిలిచెడివారు. 'జెంటూ' అని 'హిందు'వన్న నామాన్తార్థములో ఉపయోగించుట జరిగినది. మహమ్మదీయులను మూరులు (Moors) అని 'మోరులు' అని పిలిచెడివారు. మహమ్మ దీయుల భాషకంటె భిన్నమైన భాషయను నర్థముననే తెలుగుభాషకు ఈపేరు కలిగెను. తరువాత తరువాత దీని వాడకము బొత్తిగా తగ్గి పోయెను.

తెలుగువారికి 'క్లింగులు' అను పేరుకూడ సుమత్రా, జావా, మారిషస్సు, పెగు. పెనంగు, సింగపూరు మొదలయిన ప్రదేశములందు రూఢముగా కలదు. ఒకప్పుడు తెలుగువారు మిక్కిలి సాహసముతో దూరప్రాంతములకు పోయి, స్థిరనివాసముల నేర్పరుచుకొని, అధికార మును సంపాదించుకొని యుండిరి. వారిని ఆయాదేశములవారు 'కళింగులు' అను నుద్దేశమున 'క్లింగులు' అని అనెడివారు. అనంతర కాలమున 'తమిళులు' ఆయాస్థానముల కేగి 'క్లింగులు'గానే వ్యవహ రింపబడిరి.

తెలుగువారిని ఆంధ్రులుగా ఐతరేయబ్రాహ్మణము పేర్కొన్నది. క్రీ. పూ. మూడవశతాబ్దికి చెందిన అశోకుని శాసనములందు ఆంధ్రుల ప్రసంగము కలదు. క్రీ. శ. 77వ సంవత్సరమునాటి 'ప్లినీ' యను గ్రీకు చరిత్రకారుడు ఆంధ్రజాతిని వర్ణించెను. ఏడవశతాబ్దికి చెందిన హ్యూయాన్‌స్వాంగ్' అను చీనాయాత్రికుడు ఆంధ్రభాషనుగూర్చి ప్రసం గించెను. కావున క్రీస్తుపూర్వమునుండియు ఆంధ్రజాతి తగినస్థానమును గలిగియున్నదనుట కెట్టి సందేహమును లేదు.

ఆంధ్రభాషకు తెలుగు, తెనుగు అను పేళ్ళుకూడ కలవు. తెలుగు శబ్దము త్రిలింగశబ్దభవమని కొందరును. త్రికళింగ శబ్దభవమని కొందరు ననుచున్నారు. 'కొందరు స్వచ్ఛమైన' అను నర్థముగల 'తెల్' ధాతువుపై 'గు' వర్ణముచేరి 'తెల్గు' అని అయ్యెనని యిది దేశ్యమే కాని తద్భవముకాదని యనుచున్నారు. అట్లే 'తెనుగు' అనునది 'త్రినగ' శబ్దభవమని కొందరనుచుండగా తేనెవంటిది కావున 'తేనె+అగు' అనిదై 'తెనుగు' అనురూపమునొందెనని కొందరనుచున్నారు. ఇంకను పెక్కువిధములైన వ్యుత్పత్తులు చూపబడుచున్నవి. వానిసంగతి యెట్లు న్నను, తెనుగు, తెలుగు, ఆంధ్రము - అనునవి యీనాడు పర్యాయ వాచకములుగా నుపయోగింపబడుచున్నవి.

తెనుగు భాష పదునొకండవ శతాబ్దియందు మహాభారతముతో సాహిత్యసౌష్ఠవమును సంపాదించుకొన్నది. అయినను, అంతకుమున్నే సాహిత్యమున్నట్లు చెప్పుటకు తగిన సాక్ష్యములున్నవి. పాల్కురికి సోమనాథుడు వెన్నెలపదములు, తుమ్మెదపదములు మొదలయిన వానినిగూర్చి తెల్పెను. అనగా ప్రజాసామాన్యముచే నాదరింపబడు చున్న సాహిత్యమొకటి ఆ కాలమున నుండెనని యర్థము. ఏడవశతాబ్ది నుండియు తెనుగు భాషాశాసనములు లభించుచున్నవి. నన్నయభట్టారకునకు పూర్వమే పద్యశిల్పము కలదని చెప్పుటకు శాసనములే పరమ ప్రమాణములుగా నున్నవి. క్రీ. శ. ప్రారంభమునుండియు ప్రాకృత సంస్కృత శాసనములలో తెలుగు పదములు గోచరించుచునేయున్నవి. హాలుడు సంతరించిన 'గాథాసప్తశతి' యందు తెలుగు శబ్దము లనేకముగా కనిపించుచున్నవి. వీని యన్నింటినిబట్టి క్రీస్తుశక ప్రారంభము నుండియు తెలుగుభాష కలదని చెప్పుట కేమాత్రమును సందేహింప వలసిన యవసరము లేదు.

నన్నయభట్టారకుడు ఆంధ్రకవితా భగీరథుడు. తిక్కన సోమయాజి ఆంధ్రభాషకు పరిపుష్టిని గూర్చిన మహానుభావుడు. తెలుగు పలుకుబడులలోని సొగసును, వాక్యవిన్యాసములోని హొయలును, పదముల మార్దవగాంభీర్యాది గుణములను చక్కగా ఆవిష్కరింప గలిగెను. ఈవిధముగా సంస్కృతసాహాయ్యముతో ప్రారంభమై, తెలుగుదనమును నిండించుకొని ఆంధ్రసాహిత్యము నిరంతరాయముగా వచ్చుచున్నది. ప్రారంభకాలముననే వ్యాకరణ గ్రంథములు, ఛందోలంకారాది లక్షణగ్రంథములుకూడ ఏర్పడి యుండుటచే భాషాసౌష్ఠవము అంతగా సడలుటకుకాని, యితరభాషలలో కలిగినంత మార్పు కలుగుటకుకాని తెలుగునందు అవకాశము లేకపోయిన దనియే చెప్పవచ్చును.

తెలుగుభాష సంస్కృతపదసామగ్రి నధికముగా స్వాయత్తము చేసికొన్నది. అందువల్లనే ద్రావిడభాషయే యైనను ఆర్యభాషా సంప్ర

దాయానుకూలమైన పెంపుదలను పొంది యొక సమన్వయమును సాధించుచున్నట్లు కనిపించును. నైసర్గికముగాకూడ తెలుగుదేశము ఉత్తర దక్షిణభాగములకు మధ్యస్థముగానుండి రెంటిని సమైక్యపరుచు నొక సాధనమై యొప్పుచున్నది.

క్రీ. శ. 1807వ సంవత్సరమున డబ్ల్యు. బ్రౌన్ అను నాయన A grammar of the Gentoo Language అను గ్రంథమును వ్రాసెను. 1814లో కేరీ అనునాయనయు, 1816లో కేంప్‌బెల్ అను నాయనయు తెలుగుభాషకు వ్యాకరణగ్రంథములను వ్రాసిరి. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను అనునాయన తెలుగు వ్యాకరణమును, తెలుగు నిఘంటువును రచించెను. ఆ తరువాత కూడ పెక్కురు పాశ్చాత్యులు తెలుగు భాషనుగూర్చి శాస్త్రీయ గ్రంథములను రచించిరి.

తెలుగుదేశమునకు వెలుపల తెలుగుమాండలికములు కొన్ని వ్యవహారమునందున్నవి. కోంటావు, సాలేవారీ, గోలారీ అనునవి చాందాజిల్లాయందును - బేరడీ, దాసరి యనునవి బెల్గామునందును - కామాఠీ, వడరీ యనునవి బొంబాయి పరిసరములందును గలవు.

మొత్తముమీద తెలుగుభాష మూడున్నరకోట్లమందికి మాతృభాషయైయున్నది.

కన్నడము : ఈ భాషను కన్నడము అని కాని కర్ణాటము అని కాని యందురు. తమిళములోవలె ఈభాషలో గూడ హళగన్నడ మని హొసగన్నడ మని రెండుభేదములు గలవు. ప్రాచీనభాషను హళగన్నడ మని యందురు. నవీన భాషను హొసగన్నడ మని యందురు. ఈ రెండింటికిని ప్రత్యయముల యుపయోగమునందు భేదము కలదు. 'కర్ణాట' అను సంస్కృతపదమునుండి 'కన్నడ' అను తద్భవ మేర్పడె నని పండితుల యభిప్రాయము. గుండెర్టుతోపాటుగ కాల్డ్వెలు కన్నడమును దేశ్య మనియే నిశ్చయించెను. 'కర్' అనగా నల్లని యని యర్థము; 'నాడు' అనగా దేశ మని యర్థము. కావున కర్నాడు అనగా

నల్లని దేశమని యర్థము. తెలుగున కూడ వేగినాడు, రేనాడు మున్నగు పదములలో 'నాడు' దేశవాచకముగా బహుళముగా ప్రయుక్తమై యున్నది. ఆరవశతాబ్దియందలి వరాహమిహిరుడు కర్ణాటపదమును వాడెను. ఈ 'కర్నాట' అనునదియే కన్నడులవాడు కనుబట్టి 'కన్నడ' అనియు 'కన్నర' అనియు రూపములను పొందినది. 'కన్నర' అనునదే ఆంగ్లమున "Canarese" అను రూపమున సిద్ధినొందినది.

'కరునాడు' అనగా ఎత్తయిన ప్రదేశ మని యర్థము చెప్పి దేశ్య మనియే నిర్ణయము చేసిరి. కన్నడభాషాచరిత్రను వ్రాసిన శ్రీనరిసింహాచారియరు "కన్నాడు" శబ్దమునకు "కర్ణాట" శబ్దము సంస్కృతీకరణ మని భావించిరి. రణలు సంయోగమునొంది నకార ద్విత్వము కావచ్చును గాని నకారద్విత్వము రణలుగా వేరుపడుట భాషాశాస్త్రవిరుద్ధ మని శ్రీజోగి సోమయాజి తమ యభ్యంతరమును దెల్పిరి. 'కమ్మనినాడు' అను నర్థమున నున్న 'కన్నాడు' పదముకంటె ఈ వరలో చెప్పిన 'కరునాడు' శబ్దమే కర్ణాటశబ్దోత్పత్తికి మాతృక కాగలదు. 'కరునాడు' అనునదే కర్నాడు, కన్నాడు, కన్నడ అను రూపములకు మూల మనుట భాషాశాస్త్రవిధేయమై సమంజసముగా కనిపించుచున్నది.

గ్రంథపరిచయము సంపాదించుటకు పూర్వము కన్నడ భాషలోని నాలుగు ప్రాచీనశాసనముల విషయమును గమనింతము. క్రీ. శ. ఐదవ శతాబ్దికి చెందిన 'హల్మిడి శాసనము' సంస్కృతశ్లోకముతో ప్రారంభమై, సంస్కృతపదబహుళమైన కన్నడవచనములో వ్రాయబడియున్నది. ఈశాసనమునందు 'మొత్త' మిరువది కన్నడపదములు గలవు. క్రీ. శ. 700 సంవత్సరమునకు చెందిన 'బాదామీ శాసనము' సంస్కృతమయ మైన కన్నడమున త్రిపదిచ్ఛందమున వ్రాయబడియున్నది. భాషపై సంస్కృతప్రభావ మున్నను, కేవలకర్ణాటక చ్ఛందస్సులో రచింపబడుట యిందలి విశేషము. అదే కాలమునకు చెందిన 'శ్రవణ బెళగోళ

శాసనము'లోకూడ సంస్కృతపదప్రాచుర్యమే యెక్కువ కనిపించును. పదవశతాబ్దికి చెందిన 'శ్రవణబెళగోళశాసనము'లో 'అక్కర' యుపయోగింపబడినది. శాసనములందలి దేశ్యభాష హళగన్నడము కంటె తమిళభాషకే సన్నిహితముగా నున్నదని తజ్జ్ఞుల యభిప్రాయము.

కన్నడవాఙ్మయమున లభించినవానిలో మొట్టమొదటిది 'కవిరాజమార్గ' అను లక్షణగ్రంథము. రచనాకాలము దాదాపు: క్రీ. శ.825. నృపతుంగు డను రాష్ట్రకూటచక్రవర్తియే దీనిని రచించెననికొందరును, నృపతుంగసభాసదుడైన శ్రీవిజయుడు రచించె నని కొందరును భావించుచున్నారు.

ఈగ్రంథమున మూడు ప్రకరణములు గలవు. మొదటి ప్రకరణమున దోషాదోషనిర్ణయము, రెండవ ప్రకరణమున శబ్దాలంకార నిర్ణయము, మూడవ ప్రకరణమున అర్థాలంకార నిర్ణయము జరిగినవి. లక్ష్యములను పూర్వవర్తులగు కవుల కావ్యములనుండియే కవిరాజమార్గకర్త తాను గ్రహించెను. శ్రీవిజయ, కవీశ్వర, పండిత, చంద్ర, లోకపాలాది పద్యకావ్యకర్తలను విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీతాది గద్యకవులను కూడ ప్రశంసించెను. గద్యపద్యచంపూరీతులు మూడును వాడుకలో నున్నవి.

జైనమతమునకు చెందిన యనేకకథలతో పందొమ్మండుగురు జైనసన్యాసులనుగూర్చి 'వడ్డారాధన' అను గద్యగ్రంథమును శివకోట్యాచార్యుడు మనోహరముగా రచించెను. సమంతభద్రుడు, కవిపరమేష్ఠి మున్నగు ప్రసిద్ధకవులును బృహద్వ్యాఖ్యానకర్తలగు పండితులును కొందరున్నట్లు తెలియుచున్నది. కాని వారిగ్రంథములు మృగ్యములు.

పదవ శతాబ్దమునకు చెందిన పంపుడు కన్నడసాహిత్యమున ఆదికవిస్థానము నలంకరించును. తాను వేంగిమండలమందున్న వేంగిపట్టు అను అగ్రహారమున జన్మించినట్లు తానే చెప్పికొనెను. వంశముచే

వైదికుడును, ధర్మముచే జైనుడును అగుటచేత పంపకవియందు జైన వైదికధర్మసమన్వయము కనిపించును. జైనతీర్థంకరులలో మొదటి వాడైన వృషభనాథుని చరిత్రమును 'ఆది పురాణము' అను పేరున చంపూగ్రంథముగా పదునారాశ్వాసముల పరిమితితో రచించెను. పంపడు రచించిన రెండవ గ్రంథము 'విక్రమార్జున విజయము'. జైన భారతము ననుసరింపక పంపకవి వ్యాసభారతమునే యనుసరించినను కొన్నిమార్పులను చేసెను. ఇందు నాయకుడు అర్జునుడు. ద్రౌపది ఆతని ధర్మపత్ని. యుద్ధానంతరము సుభద్రాసహితుడై అర్జునుడే పట్టాభిషిక్తు డగును. కావ్యనాయకుడైన అర్జునునకును, తన కాశ్రయ దాతయైన 'అరికేసరి' నృపాలునకును అభేదాధ్యవసాయమును సాధించును. ఆనాటి చారిత్రకపరిస్థితులు ఈ గ్రంథమున నిబద్ధములై యున్న వనుట నిస్సంశయము. ఈగ్రంథము 'పంప భారతము' అని వ్యవహార నామమున ప్రసిద్ధి నొందినది.

పొన్నడు 'జినాక్షరమాల' యను ఇరువదితొమ్మిది కందపద్యములతో జినస్తుతిని రచించెను. జైనతీర్థంకరులలో పదునారవవాడైన శాంతినాథుని జీవితమును పండ్రెండాశ్వాసములలో 'శాంతిపురాణము' అను పేర చంపువుగా రచించెను. పంపని 'ఆదిపురాణము' వంటి గ్రంథమును వ్రాయవలయు ననుస్పర్థ 'శాంతిపురాణ' రచనమునకు ప్రేరణము గావించియుండును. ఇతడు 'భువనైకరామాభ్యుదయము' అను కావ్యమును వ్రాసినట్లు తెలియుచున్నది కాని గ్రంథము లభ్యము కాలేదు. రాష్ట్రకూటచక్రవర్తియగు కృష్ణుడు పొన్నకవికి కవిచక్రవర్తి బిరుదము నిచ్చెను.

రన్నడు జైనతీర్థంకరులలో రెండవవాడైన అజితనాథునిజీవితమును గ్రహించి 'అజితపురాణము'ను వ్రాసెను. చాళుక్యయువరాజగు సత్యాశ్రయునితో భీమున కభేదాధ్యవసాయము పాటించుచు 'సాహస

భీమ విజయము' అను గ్రంథమును రచించెను. ఇందు నాయకుడు భీముడు. దీనికి 'గదాయుద్ధము' అను నామాంతరము కలదు. ఇతడు పరశురామ చరిత, చక్రేశ్వరచరిత అను మరిరెండు గ్రంథములను రచించెను. కాని అవి లభ్యము కాలేదు. ఇతడు కవిచక్రవర్తిబిరుదముతో పాటు రాజగౌరవమును పొందెను.

ఇంతవరకు చూచిన పంప పొన్న రన్నలను రత్నత్రయము అను పేర సామూహికముగా పిలుతురు.

నాగవర్మ 'చందోంబుధి' అను గ్రంథమున సంస్కృతచ్ఛందస్సులతో పాటు 'కర్ణాటక విషయజాతి' అను భాగమున దేశీయచ్ఛందస్సులను గూడ వివరించెను. ఇదే కన్నడమున మొట్టమొదటి ఛందోగ్రంథము. ఇతడుకూడ వేంగీమండలములోని వేంగిపట్టు అను అగ్రహారమే తన జన్మస్థానముగా వాకొనెను. ఇతనికి 'కవిరాజహంస' యని 'బుధాబ్జవన కలహంస' యని బిరుదములు కలవు.

రెండవ నాగవర్మ 'కర్ణాణ భాషాభూషణ' అను వ్యాకరణ గ్రంథమును సంస్కృత సూత్రపద్ధతిలో వ్రాసెను. 'కావ్యావలోకన' అను పేరున కందపద్యములలో అలంకారశాస్త్రమును రచించెను. 'వస్తుకోశ' అనుపేర పద్యమయ మగు నిఘంటువును గ్రథనముచేసెను. అందు కన్నడభాషావ్యవహారమున నున్న సంస్కృత పదములకు కన్నడమున నర్థము లిచ్చెను.

ప్రారంభయుగమున జైనమతముతో, తరువాతి కాలమున వీర శైవముతో, అనంతరకాలమున వైష్ణవముతో ముడిపడి, ప్రోత్సాహమును పొంది కన్నడసాహిత్యము వేర్వేరు పరిణామములకు లోనై, స్వతంత్ర వ్యక్తిత్వమును స్థాపించుకొన్నది.

కన్నడము స్థూలముగా బుఘైరుల భాష, కురుంబుల భాష, కురుంవారుల భాష, గోలరుల భాష యని నాలుగు విధములయిన మాండలిక భేదములను కలిగియున్నది. ఇందు బుఘైరుల భాషకు 'బడగ' యను నామాంతరము కలదు.

మొత్తముమీద కన్నడమును రెండుకోట్లమంది మాతృభాషగా మాటాడుచున్నారు.

**తుళు** : దక్షిణభారతదేశమునందలి పశ్చిమతీరమునందున్న 'తుళునాడు' అంతటిలోను తుళుభాష వ్యవహారమునను న్నది. దక్షిణ కన్నడ మండలమందలి కార్కళ, మంగుళూరు, బుంట్వాలు, పుత్తూరు తాలూకాలును, ఉడిపితాలూకాయందలి చాలభాగము, సుళ్లియ తాలూకాయును కలిసి 'తుళునాడు'గా పిలువబడును. కేరళ ప్రదేశము నందు కలిసిన 'కాసరగోడు' తాలూకాయందును తుళుభాష యధికము గానే యుపయోగమునందు కలదు. తుళుమండలమునకు ఉత్తరము నందును, తూర్పునందును, ఆగ్నేయమునందును కన్నడభాషతో సంబంధమున్నది.

తుళుభాషాభాషులను 'తుళులు' అని కాని 'తుళువలు' అనికాని అందురు. దేశమును తుళుదేశమని, తౌళవదేశ మని కూడ అనుట కలదు. శాసనములయందు కర్ణాటక, కొంకణ - మన్నగు వానితోపాటు ఇదియు స్థానమును సంపాదించుకొన్నది.

'తుళుభాష'ను మలయాళ మాండలికముగా 'ఎలిస్' అను నాయన తలచెను. తుళుజాతీయులు సంస్కృతభాషను మలయాళ లిపిలో వ్రాసికొనెడివారు. అందువలన ఆయన కీ భ్రమ కలిగియుండును. నిజమునకు తుళుభాష కన్నడమునకు సన్నిహితముగా నున్నది. అయినను మాండలిక మని యనుటకు వీలు లేనంతగా ప్రత్యేకత కలిగియున్నది.

'బ్రిగెల్' అను నాయన ఆంగ్లభాషయందు తుళుభాషా వ్యాకరణమును 1872 వ సంవత్సరమున వ్రాసి ప్రకటించెను. 'మేనర్' తుళు - ఇంగ్లీషు నిఘంటువును 1886 లో ప్రకటించెను. 1888 లో ఆయనయే ఇంగ్లీషు - తుళు నిఘంటువును ప్రకటించెను. 1920 ప్రాంతము నందు తుళుభాషోద్ధరణమునకు పూనుకొని చరిత్రసంబంధములును తత్సదృశములునైన 'పాద్దన' అనియు 'సంది' అనియు పేరు గల రచన

లను, ప్రాచీనజానపద గేయములను కన్నడలిపిలో అచ్చు వేయుట జరిగెను. అదే సమయమున దేశభక్తి ప్రచారకవ లయిన గేయములును, నాటకములును కూడ ఉద్భవించెను. 'ఉడిపి' తాలూకాకు చెందిన 'పణియాది' అను నాయన 'తుళువ్యాకరణము'ను తుళుభాషలో 1932 లో ప్రకటించెను.

మొత్తముమీాద సాహిత్యసంపద యున్నను, పదసమృద్ధి యున్నను తుళుభాష యధికమైన ప్రతిష్ఠను సంపాదింపలేదు. రాజ పోషణము లేకపోవుటయు, స్వతంత్రలిపి లేకపోవుటయు దీనికి కారణ ములు కావచ్చును.

అదంతములయిన సంస్కృతపదములు తుళుభాషలో 'ఒ'త్వము నొందును; పుంలింగశబ్దములు ఎత్వమునొందును. ఉ॥ ధర్మ > దర్మొ; అంశ > అంసొ; రామ > రామె. వర్గయుక్కులు పూర్వహల్లులుగా మారిపోవును. ఉ॥ ధర్మ > దర్మొ; శంఖ > సంకొ. పదాదినున్న సంస్కృత యకారము స్థానమున 'ఎ' వర్ణమును నిల్పుట కలదు. ఉ॥ యజమాన > ఎజమానె; యథాస్థితి > ఎతాస్తి.

మూర్ధన్యాక్షరములను పలుకవలసివచ్చినపుడు దంత్యములను పలుకుటయే తుళుభాషయందు సహజమై యున్నది. తమిళములో వలెనే అర్థమాత్రాకమైన ఉకారము అదనముగా కలదు. అట్లే 'ఎ' అను వర్ణమునకు 'ఏ' అను వర్ణమునకును మధ్యగా నుచ్చరింపబడు 'ఎ' వర్ణమొకటి అదనముగా తుళుభాషయందు కలదు. 'ఎ' వర్ణమునకును దీనికి నుచ్చారణమున భేదముండుటే కాదు, అర్థబోధయందు కూడ భేదము కలదు. ఇది ప్రథమపురుషైకవచనప్రత్యయముగా కూడ ఉపయోగించును. ఉ॥ తిన్పె (వాడు తినును); తిన్దె (వాడు తినెను). విధ్యర్థమునందు మధ్యమపురుష బహువచన ప్రత్యయముగా కూడ ఈ ధ్వనికలదు. ఉ॥ పోలె (మీారు వెళ్లుడు); కోర్లె (మీారు ఇండు).

'తుళు' అని యనగా తుళుభాషయందు 'మృదువైన' యని యర్థము.

ఈ భాషలో కులములనుబట్టి చిన్నచిన్న మాండలిక భేదములు కలుగుట సంభవించెను. అట్లే స్థానికములయిన ప్రభావములవల్ల కూడ ఉడిపితుళు, కార్గళతుళు, పుత్తూరుతుళు – మున్నగు విధమైన వైవిధ్యమును పాటించుట కనిపించును. మొత్తముమీద ఈభాషను దాదాపుగా ఎనిమిదిలక్షలమంది మాటాడుచున్నారు.

కొడగు ఆంగ్లమున 'కూర్గు' అని వాడబడు ప్రాంతమును దేశీయులు 'కొడగు' అని యందురు. తమిళమందున్న 'కుడక్కు' అను శబ్దమే యిట్లు పరిణతమై యుండును. ప్రాచీన తమిళమున దీనికి 'పశ్చిమము' అని యర్థము. తమిళప్రాంతమునకు 'కొడగు' పడమటిదిశగా నుండుటచే, దిక్కునుబట్టి దీని కీవ్యవహారము కలుగుటకు అవకాశము కలదు. ఆంగ్లమున డకారోచ్చారణమే రకారముగా మార్పుచెంది వినిపించుచున్న దనుట వాస్తవము. దిక్సూచకమైన యీ శబ్దము క్రమముగా దేశమునకును, భాషకును పేరయ్యెను.

ఈ భాషను ప్రత్యేకభాషగా కాక కన్నడభాష కొక అనాగరక మాండలికముగా నెంచుట పరిపాటిగా నున్నది. 'డాక్టరు మూగ్లింగు' అను జర్మను దేశీయుడు కొడగుభాష కన్నడభాషకంటె తమిళ మలయాళభాషలతో సన్నిహిత సంబంధమును గలిగియున్నదను నభిప్రాయమును వెలువరించెను.

కూర్గుభాషయందలి క్రియారూపములను పోల్చి చూడగా, కన్నడ మలయాళాది భాషలతో ఈ భాషకు సామ్యముకంటె వైషమ్యమే యెక్కువ యని తేలుచున్నది. తక్కిన భాషలలోవలె ప్రథమ మధ్యమోత్తమ పురుషరూపములకుగాని, ఏకవచన బహువచనములకు గాని భేద మున్నట్లు కానరాదు. 'నేను చేయుదును' అను నర్థమున 'కెయువి' అని క్రియారూపము. 'నీవు చేయుదువు' అని యన్నప్పుడును 'కెయువి' అను రూపమే నిల్చును. 'అతడు చేయును' అను నర్థమున 'కెయువ' అని అదంతమై కనిపించును. 'మేము చేయుదుము' అని

యన్నను 'వారు చేయుదురు' అని యన్నను గూడ 'కెయువ' అను రూపమే యుండును. భూతకాలరూపములయందు కన్నడమున దెమ్, దయ్, దమ్, దల్ మున్నగు విధముగా తుదినిచేరు ప్రత్యయములందు 'ద' వర్ణము వినిపించును. అట్టియెడల కొడగుభాషయందు 'జ' వర్ణము నియతముగా వినిపించుచున్నది. 'నేను చేసితిని' అను నర్థమున 'కెజ్జమ్' అనియు, 'నీవు చేసితివి' అను నర్థమున 'కెజ్జియ' అనియు, 'అతడు చేసెను' అను నర్థమున 'కెజ్జత్' అనియు రూపములు కలవు. ఇక్కడ ధాతువు 'కెయ్' అనునది. ఇది కన్నడమునందున్న 'గెయ్' ధాతువుతోడ సామ్యము స్పష్టముగా చూపుచున్నది. తమిళమున 'శ' వర్ణమును, తెలుగు మలయాళములందు 'చ' వర్ణము నుండగా కన్నడమునందును కొడగునందును కంఠ్యవర్ణముతోడి రూపములే కనిపించుచున్నవి. కన్నడమునందు 'గెయ్‌దెమ్' అని యుండగా కొడగునందు 'కెజ్జమ్' అను రూపమేర్పడినది. అనగా 'ద' వర్ణము 'జ' వర్ణముగా మారి పూర్వమందున్న 'య' వర్ణమును కూడ 'జ' వర్ణముగా మార్చి సమీకరణము నొందినది. మొత్తముమీద ఈ భాష మిక్కిలి ప్రాథమిక స్థితిలోనుండి, యితర కుటుంబభాషల ప్రభావమునకు లోనుగాక ద్రావిడభాషా లక్షణములను నిరూపించుచున్నదనుట యొప్పుకొనదగిన యంశము.

'మేజర్ కోల్' కూర్గుభాష కొక వ్యాకరణమును రచించెను. 'రివరెండ్ బి. గ్రేటర్' సంక్షేపముగా వ్యాకరణపరిచయము గావించుచు కొడగుభాషలోని కొన్నిపాటలను సంతరించి ప్రకటించెను. కొడగుభాషీయులు అత్యంతప్రాచీనకాలముననే పడమటి కనుమలయందు స్థిరనివాసమేర్పరుచుకొనిరనియు, ప్రాచీనద్రావిడ సంప్రదాయములు వారిలో నింకను మిగిలియున్నవనియు 'బర్నెలు' నిశ్చయము. ఈభాషను దాదాపుగా నలువదివేలమంది మాటాడుచున్నారు.

## అనాగరకభాషలు

ఇంతవరకు నాగరకభాషల స్వరూపసంపదను దిఙ్మాత్రముగా చూచితిమి. అనాగరకభాషల స్వరూపమును, భౌగోళిక స్థితిని కూడ కొంచెము స్పృశించుట యుచితముగా నుండును. దక్షిణభారతదేశము నందు ద్రావిడభాషలు దట్టముగా అలముకొని యున్నవి; సింహళదేశపు టుత్తరభాగమునుకూడ ఆక్రమించుకొనియున్నవి.

అనాగరక ద్రావిడభాషలు బెలూచిస్తానమునందును, పశ్చిమటి కనుమలందును, బెంగాలు దేశపరిసరములందునుకూడ నున్నవి. స్థూలముగా మద్రాసు, నీలగిరి, తిరువేంద్రముల నడిమిదేశము తమిళ భాషాప్రాంత మని యనవచ్చును. కాని తమిళులు బర్మా, సింహళము, ఇండోచైనా, మధ్యాఫ్రికా మున్నగు ప్రాంతములకు వలస వెళ్ళి తమ మాతృభాషలోనే వ్యవహారమును సాగించుచున్నారు.

కన్నడము స్థూలముగా మైసూరు బీదరు కార్వారుల నడుమ మాతృభాషగా నున్నది. దీనికి సరిహద్దులయందు ఒకవైపు ఆర్యభాష లగు మహారాష్ట్రి కొంకణభాషలును, ఒకవైపు ద్రావిడభాష లగు తెలుగు తమిళములును గలవు. తెలుగుభాషాప్రాంతమునకు సరిహద్దుల యందు ఒకవైపు తమిళము, ఒకవైపు ఓఢ్రము, మరొకవైపు మహారాష్ట్రమును గలవు. ఓఢ్ర మహారాష్ట్రములు రెండును ఆర్యభాషా కుటుంబమునకు చెందినవే. ఐనను 'గోండీ' అను అనాగరకద్రావిడభాష యొకటి తెలుగునకు మిత్రమైయున్నది. కన్నడప్రాంతము తెలుగు దేశము నానుకొనియే యున్నది. తెలుగుప్రాంతమునకు దూరముగా నున్నను తెలుగుభాషకు మిక్కిలి సన్నిహితమైన 'కుయి' భాష మహానదీలోయలో ఐదులక్షల యెనుబదివేలమందికి మాతృభాష మైయున్నది.

ఉత్తరభారతదేశమున పర్వతప్రాంతములలో ద్రావిడ భాషలు కలవు. తూర్పుకనుమలయందు 'కుయి'యున్నట్లే ఛోటానాగపూరులో

ఒరావోను భాష, బీహారు రాజమహాలు ప్రాంతములో మల్తోభాష వ్యవహారములో నున్నవి. 'ముండా' వర్గమునకు చెందిన ముండారి, ఖరియా, కేర్వా, సంతాల్ భాషలు కూడ ఆప్రాంతములందు సహ జీవనము సాగించుచున్నవి. బ్రాహుయీభాష తూర్పు బెలూచీస్తానము నందును, సింధుప్రాంతమునందును వాడుకలో నున్నది. దీనిని ద్రావిడ భాష యని చెప్పుటకే అనుమానింపదగినంతగా ఆర్యభాషల ఇరాని యనుభాషల ప్రభావము దీనిపై పడినది.

**తుదభాష** : నీలగిరి కొండలయందుండు 'తుద' యను తెగకు చెందిన 'తుదవరులు' మాటలాడు భాష కావున దీని కీ పేరు వచ్చెను. 'కర్నల్ మార్షల్' అను నాయన **'A Phrenologist among the Todas'** అనుపేరున తుదవరులను గురించి పెక్కువిశేషములను తెలియ జేయుచు, ఒక గ్రంథమును వ్రాసెను. 'డాక్టరు పోపు' తుదభాషా వ్యాకరణ విశేషములను తెలియజేయుచు వ్రాసిన యనుబంధము ఆగ్రంథమునకు చేర్పబడినది. 'గుంపు' అను నర్థముగల 'తోట' యను తమిళపదమునుండి 'తోద' యనుపదము వచ్చియుండు నని డాక్టరు పోపు యొక్క యభిప్రాయము. కాని, కాల్డ్వెలు దీనితో ఏకీభవించుట లేదు. 'తుద' యందలి 'ద' వర్ణము దంత్యము. దానికి మూర్ధన్యము లయిన ట, ళ వర్ణములతో ఏమాత్రమును సంబంధము లేదని ఆయన నిశ్చయము.

ఇటీవలికాలమున 'ఎమెనో' అను నాయన 'తుద' భాషను గురించి మిక్కిలి పరిశ్రమచేసి పదపరికరమును, వ్యాకరణవిశేషములను పరిశీలించెను.

ఆదియందున్న 'అ' వర్ణము తుదభాషయందు 'ఒ' వర్ణముగా మారుచున్నది. 'అడుగు' అను నర్థమున తెలుగులో 'అజ్జ' అనియు తుళుభాషయందు 'అజె' అనియు నుండగా, తుదయందు 'ఒజ్' అని కలదు. 'భయము' అను నర్థమున అరవమందు 'అఞ్చు' అనియు

మలయాళమందు 'అంచుక' అనియు నుండగా తుదయందు 'ఒక్కు' అని యున్నది. తమిళమునందలి 'పత్తు' తెలుగున 'పది' అని యుండగా తుదయందు 'పొత్' అని యున్నది. తమిళమునందున్న 'కవర్' తెలుగు మలయాళములందు 'కవ' యని, తుదభాషయందు 'కఫ' యని యున్నది. దీనికి 'జంట' యని 'జంటగా విడిన కొమ్మ' యనియు నర్థములు. ఇచ్చట 'వ' వర్ణము 'ఫ' వర్ణముగా మారినది. ఇట్లే తమిళము నందలి 'కవన్' కన్నడమున 'గవన' అని తుదయందు 'కఫ్' అని యుండును. దీనికి 'బాధ్యత' యని 'ప్రేమ' యని యర్థములు. 'చేపట' యను నర్థమున చేర్ (త) సేర్ (క) చేరు (తె) సోర్ (తుద) అను రూపములుండును. తమిళమునందు 'ఏర్' అను మాటకు 'నాగలి' యని యర్థము. ఇదే యర్థమున తెలుగున 'ఏరు' అనియు తుదయందు 'ఏర్' అనియు రూపములు గలవు. కన్నడమునందలి 'ఏరు' శబ్దమునకు 'దుక్కి ఎడ్ల జత' యని యర్థము. తెలుగునందలి 'చేర' తమిళమున 'చేరై' అనియు కన్నడమున 'సెరె' అనియు నుండగా తుదయందు 'చ' వర్ణము 'త' వర్ణమై 'తేఱ్' అని యగును. ఇట్లు తుదభాష తక్కిన ద్రావిడ భాషలతో పెక్కువిధముల సామ్యమును గలిగియున్నది. ఈ భాషను మాటలాడు జనులు వేయిమందికంటె ఎక్కువ లేరు.

**కోతభాష** : ఈ భాషను మాటలాడు జనులు కూడ ప్రధానముగా నీలగిరియందే నివసించుచున్నారు; కొలదిమంది అస్సాములో కూడ నున్నట్లు తెలియుచున్నది.

కన్నడములో వలెనే 'కోత' భాషయందు 'ప' వర్ణము 'హ' వర్ణముగా మారును. 'పోవు' అను ధాతువు 'హోగు' అని యగును. 'నేను వెళ్లుచున్నాను' అను నర్థమున 'ఆన్నెహోగపె' అనియు 'నీవు వెళ్లుచున్నావు' అను నర్థమున 'ని హోగపి' యనియు 'అతడు వెళ్లు చున్నాడు' అను నర్థమున 'అవనె హోగకో' యనియు నుండును. ఇవి చాలవరకు కన్నడరూపములను బోలియున్నవి. 'మేము వెళ్లుచున్నాము'

అను నర్థమున 'నామె హోగపేమె' యని యున్నది. ఇది తమిళరూప మునకు సన్నిహితముగా నున్నది.

'ఒకటి' అను నర్థమున కోతభాషయందు 'ఒర్' అనియే కలదు. విశేషణముగా కూడ దీని కుపయోగము కలదు. 'రెండు' అను నర్థమున 'ఎద్డ్' అను రూపముగలదు. అయినను 'ఇరువది' మున్నగు నర్థమున 'ఇర్‌వద్' మున్నగువిధముగా నుండును. 'నాలుగు' అనునర్థమున 'నన్గ్' అనియుండి 'నలువది' యను నర్థమున 'నల్వాత్' అనియు 'నలత్' అనియు నగును. 'సిగ్గు' అనునర్థముగల 'నాన' అను తెనుగు పదమునకు సమానముగా 'నణ్డ్' అను పదము కలదు. 'నీడ' యను నర్థమున తమిళమున 'నిఙల్' అనియుండగా కన్నడమున 'నెఙల్' అనియు కోత యందు 'నెర్ల్' అనియు రూపములు గలవు. 'బూడిద' అను నర్థమున తమిళమున 'పొఱై' అనియు కన్నడమున 'పోర్' అనియు 'కోత' యందు 'బోర్' అనియు రూపములు గలవు. 'నీవు' అను నర్థమున తమిళమున 'నీ' అనియు కన్నడమున 'నీన్' అనియు నుండగా కోతయందు 'ని' అను రూపముండును. 'వేడి' యను నర్థమున 'వే' యను శబ్దము కలదు. 'వెన్నిర్' అని యనగా కోతయందు 'వేడినీరు' అని యర్థము.

ఇట్లు చాలపదములు చిన్నచిన్న మార్పులను పొందియున్నను, తక్కిన ద్రావిడభాషలతో మిక్కిలి సామ్యమును గలిగియున్నవనుట వాస్తవము. ఈ భాష దాదాపు పదునూరు వందలమందికి వ్యవహార భాషగా నున్నది. 'ఎమెనో' అను నాయన కోతభాషావిషయమున పరిశ్రమించెను.

**గోండుభాష** : భారతదేశపు మధ్యభాగమున 'గోండ్వానా' అని పిలువబడు ప్రదేశమున, అడవులలోను కొండలలోను నివసించు జనులను గోండులని యందురు. వారు తమ్ము తమ భాషలో 'కోహి తూరులు' అని చెప్పికొందురు. 'కోయీా' అను పదమునకు బహువచన మైన 'కోయీాతోల్' అనుపదమును 'కోహితూరు' అను పదమును

సామ్యము గలిగియున్నవి. వీరిని గూర్చి 'కర్నల్‌డాల్టన్' ప్రభృతులు కొన్నిముఖ్యవిషయములను సేకరించిరి. రివరెండ్ జె. జి. డ్రైబర్గు అను నాయన గోండుభాషకు వ్యాకరణమును రచించెను. రివరెండ్ జె. డాస్టన్ అను నాయన మత్తయి సువార్తను, మార్కు సువార్తను గోండుభాషలోనికి అనువదించెను. ఆతరువాత ఆయనయే గోండుభాషకు పదసామగ్రితోపాటు, వ్యాకరణమును సంతరించి ప్రకటించెను.

'మూడు' అను నర్థమున తమిళమున 'మూణ్డ్రు' అనియుండగా గోండునందు 'మూణ్డ్' అని యుండును. 'మ్రాను' అను నర్థమున తమిళమున 'మరమ్' అని యుండగా గోండునందు 'మ్రా' అని యుండును. 'వారు' అను నర్థమున తమిళమందు 'అవర్' అని యుండగా గోండునందు 'ఓర్' అని యుండును. 'వీరు' అను నర్థమున 'ఇవర్' అని తమిళమున నుండగా 'ఏర్' అని గోండునందుండును. తెలుగు నందలి అవి, ఇవి అనువానికి సమానముగా అవై, ఇవై అని తమిళమున నుండగా గోండునందు ఆవ్వా, ఈవ్వా అనురూపములు గలవు.

విశేషణ విశేష్యసంబంధమును సూచించునపుడు గోండు ప్రత్యేకతను ప్రదర్శించుచున్నది. 'నా చేయి' యను నర్థమున తమిళమున 'ఎనదుకై' యని యుండును. గోండునందు 'నావాకై' అని యుండును. 'నా తమ్ముడు' అని అనవలసి వచ్చినపుడు అరవమున 'ఎనదు తమ్బి' అని యుండును. అనగా విశేషణమునందు మార్పేమియు రాలేదు. కాని గోండునందు కూడ విశేష్యమునుబట్టి విశేషణము మారి 'నావోర్ తమ్మర్' అని యగును. ఇక్కడ విశేషణము చివరనున్న 'ఓర్' అనునది మహదర్థకైకవచనమును సూచించును. బహువచనమున విశేషణ విశేష్యములు రెండింటిమీదను 'క' వర్ణము చేరి 'నావోర్క తమ్మర్క' అని యగును. అప్రాణివాచకములును స్త్రీవాచకములును ఒకే వర్గమునకు చెంది యొకే ప్రక్రియ ననుసరించును. 'నావాకై' అని యన్నట్లుగానే 'నావా సెలార్' అని యనవచ్చును. దీనికి 'నాచెల్లెలు'

అని అర్థము. 'నా చెల్లెండ్రు' అని యనవలసినప్పుడు 'నావోంగ్ సెలార్క్-' అనియుండును.

తెలుగునందలి 'అది' యనుదాని షష్ఠీవిభక్త్యంగము 'దాని' అని యగును. అనగా తొలినున్న 'అ' వర్ణము స్థానమును మారినదని యర్థము. తమిళమునందు ఇట్టిమార్పు లేకుండ 'అదిన్' అని యుండును. గోండునందుకూడ ఆదిమస్వరముతో కూడియే 'అదెనా' అని యుండును. తెలుగునందలి లేదు, కాదు- అనువానితో సమానముగా ఇల్లై. అల్ల - అని తమిళమందుండగా గోండునందు హావరముతోకూడి హిల్లే, హల్లే - అను రూపము లేర్పడును.

మొత్తముమీద గోండుభాష తెలుగు కన్నడ తమిళములతో కొన్నిపోలికలను, కొన్నిభేదములను కనబరుచుచు తన ప్రత్యేకతను నిల్పుకొనుచున్నది. కొంతకుకొంత దానిపై సంతాలు భాషా ప్రభావము కూడ పనిచేయుచున్నదని చెప్పవచ్చును. ఈ భాషను మొత్తముమీద పదునైదు లక్షలమంది తమనిత్యవ్యవహారమున నుపయోగించుకొనుచున్నారు.

**ఖోందుభాష:** ఒరిస్సాయందలి కొండప్రాంతమునందును, గోండ్వానా గూంసురులయందును గల యోటవికజనులు మాటాడుభాషకు ఖోందుభాష యనిపేరు. ఈభాషను మాటాడుజనులను 'ఖోందులు' అని యందురు. వారికి సన్నిహితులైన ఓఢ్రులు 'కంధులు' అనికూడ పిలుచుట కలదు. ఆంధ్రులు వారిని 'కోదులు' అని పేర్కొనుచుందురు. తమ్ముతాము చెప్పుకొనునప్పుడు ఖోందులు తాము 'కూ' జాతికి చెందినట్లుగా చెప్పుకొందురు. అందువల్లనే వారిభాషకుకూడ 'కూ' భాష యను నామాంతరము గలదు. దీనినే 'కుయి' అను పేరున వ్యవహరించుటకూడ కలదు. 'ఖోందు' అను శబ్దమునకును తమిళమునందలి 'కున్రు' అను శబ్దమునకును సామ్యము గలదని, 'కొండజాతివారు' అను నర్థముననే 'ఖోందు' అను పేరు కలిగి యుండుననియూహించిరి. గోండును ఖోందును సాన్నిహిత్యము గలిగిన తెగలు. కొందరు రెంటి

నొక్క తెగగానే భావించి, వారిభాష నొకేభాషగా భ్రమపడుటయు జరిగెను. 'లక్ష్మోజీ' అను నాయన కూభాషావ్యాకరణమును రచించెను.

'నేను' అను నర్థమున తమిళమున 'నాన్' అనియు కన్నడమున 'నాను' అనియు నిప్పటిరూపములు. 'యాన్' అని 'ఆనె' అని ప్రాచీన రూపములు. 'కూ' భాషయందు 'ఆను' అనునది దీనికి సమానార్థక మైనరూపము. 'మేము' అను నర్థమున 'యామ్' అని 'ఆమ్' అని తమిళ కన్నడములందుండగా కూయందు 'ఆము' అని కలదు. 'నీవు' అనునర్థ మున 'నీ' (త) నీను (క) ఈను (కూ) అను రూపములు గలవు. మీరు అను నర్థమున నీర్ (త) నీవు (క) ఈరు (కూ), 'వాడు' అను నర్థమున అవన్ (త) అవను (క) అవాను (కూ), 'వారు' అను నర్థమున అవర్ (త) అవరు (క) అవారు (కూ) అను రూపములు కలవు.

తెలుగునందు 'డు' ప్రత్యయమువలె 'కూ' భాషయందు 'జు' ఉపయోగపడును. బహువచనప్రత్యయము 'గా' యనునది. 'లావెంజు' అని యనగా 'యువకుడు' అని యర్థము. ఇతర విభక్తులు వచ్చినప్పుడు లావేని (యువకుని); లావేనికి (యువకునికి) మున్నగువిధముగా 'జు' ప్రత్యయము లోపించును. బహువచనమునందు లావెంగా (యువకులు); లావెంగాని (యువకులను); లావెంగానికి (యువకులకు) అను విధముగా రూపములుండును.

మొత్తముమీద ఈభాష తెలుగు కన్నడములతో ఎక్కువ సామ్యమును కలిగియున్నది. సంఖ్యావాచకములయందు గోండు భాషతోపాటు దీనిపై సైతము ఆర్యభాషల ప్రభావము కనిపించు చున్నది. ఇది నైదులక్షల ముప్పదివేలమందికి నిత్యవ్యవహారము నందున్న భాష.

**ఒరావొను భాష** : వంగదేశపు పశ్చిమభాగమునందును, దానికి సన్నిహితముగానున్న మధ్యప్రదేశమునందలి కొన్ని భాగములందును ఒరావొను భాష వాడుకయందున్నది. ఛోటా నాగపూరునందును,

ఇరుగు పొరుగు జిల్లాలయందును మాటాడబడు ఈ భాషకు 'కురుఖ్' అను పేరు గలదు. 'ఒరావోలు' అనబడు ఈ తెగప్రజలు కొంకణ ప్రాంతమునుండి శోణనదీ తీరమునకు వచ్చి, అక్కడ స్థిరనివాస మేర్ప రుచుకొనిరని కొందఱ విశ్వాసము. ఆ ప్రాంతమునం దప్పటికే 'ముండా' కుటుంబ భాషలు వ్యాపించి యున్నవి.

గ్రియర్సను కురుఖ్ అను మాటను 'గ్రద్ద' అను నర్థము గల 'కఱుగు' అను పదముతో సామ్యమును సాధించి వ్యుత్పత్తి నూహించెను. అట్లే 'ఒరావో' అనుదానికిని 'వ్యయపరుడు' అను నర్థముగల 'ఉరావ్రా' అను నార్యభాషాపదమునకును సామ్యమును సాధించి వ్యుత్పత్తి నూహించెను.

అస్మదర్థకము ఏకవచనమున 'ఏన్' బహువచనమున 'ఏమ్' అని యుండును. ఉభయార్థకము 'నామ్' అని యుండును. యుష్మదర్థకము నీన్ (ఏ) నీమ్ (బ) అనియు, ఆత్మార్థకము తాన్ (ఏ) తామ్ (బ) అనియునుండును. విభక్తులు ఏకవచన బహువచనరూపములు రెండింటి మీదను సమానముగనే చేయును. నాయొక్క అనునర్థమున 'ఎణ్ హై' మాయొక్క యను నర్థమున 'ఎమ్హై' అని యుండును. యుష్మ దర్థమునందు నిణ్ హై (ఏ) నిమ్హై (బ) ఆత్మార్థమునందు తణ్ హై (ఏ) తమ్హై (బ) అనియు రూపము లుండును.

'ఒండ్' 'ఒంటా' అనునవి ఒకటి యనునర్థమున 'ఎణ్డ్' అనునది రెండు అను నర్థమున 'మూన్ద్' అనునది మూడు అను నర్థమున, 'నాఖ్' అని నాలుగు అను నర్థమున వాడబడును. ఈ తరువాతి అంకెలు ఆర్యభాషలనుండి ప్రవేశించినవి.

స్త్రీపురుషవాచకములకు 'అర్' అనియు అమహత్తులకు 'గుఠి' అనియు బహువచనప్రత్యయము కలుగును. 'ఆలన్' అని యనగా 'పురుషుడు' అనియర్థము. బహువచనమున 'ఆలర్' అని యగును. 'ముక్కా' అని యనగా 'స్త్రీ' యని యర్థము. బహువచనమున

'ముక్కూర్' అని యగును. 'అల్లా' యని యనగా 'కుక్క' యని యర్థము. 'అల్లాగుఠి' అని యనగా 'కుక్కలు' అని యర్థము.

హాడ్గ్సన్, కర్నల్ డాల్టన్ అనువారు కురుఖ భాషా పదపట్టికలను సంగ్రహించిరి. రివరెండ్ యఫ్. బాశ్చ అనునాయన ఈభాషకు వ్యాకరణమును రచించెను. రివరెండ్ ఒ. ఫ్లెక్స రచించిన 'ఒరావొను వ్యాకరణ పరిచయము' అను గ్రంథమును, రివరెండ్ హాహ్న రచించిన 'కురుఖ్ వ్యాకరణము' అను గ్రంథమును అనేక విషయసంపన్నములై ఒరావొను భాషాస్వరూపమును గ్రహించుటకు మిక్కిలి తోడ్పడుచున్నవి. మొత్తముమీద ఈభాషను ఎనిమిది లక్షలమంది వ్యవహరించుచున్నారు.

**రాజమహాలు భాష** : బీహారునందలి రాజమహాలుకొండలందలి కొండవారి భాషకు 'రాజమహాలు' అనిపేరు. ఆ ప్రజలను 'మాలెరులు' అని పిలుచుటచేత భాషకు 'మాలెరుభాష' యనుపేరు కూడ కలిగినది. మాలెరులు తమభాషను 'మల్తో' యనియే చెప్పుకొందురు. దీనికి 'మాలెరులభాష' యని మాత్రమే యర్థము. 'మలెర్' అని యనగా 'మానవులు' అని యర్థము. గ్రియర్సను 'మలెర్' అను మాటకు 'మల' అను మాటతో సంబంధమును సూచించి 'కొండమనుష్యులు' అను నర్థమును సాధించెను. 'మాలెరులు' తమ్ముగురించి 'సౌరియా' తెగకు చెందినట్లు చెప్పుకొనుట కూడ కలదు.

'మలె' అను నేకవచనపదమునకు పైని రవర్ణముచేరి 'మలెర్' అనినై 'మనుష్యులు' అను నర్థము నిచ్చును. స్త్రీ వాచకములపైని కూడ అదేప్రత్యయము చేరును. 'మల్నిత్' అని యనగా 'స్త్రీ' యని యర్థము. 'మల్నిర్' అని యనగా 'స్త్రీలు' అని యర్థము.

అస్మదర్థమున ఏన్ (ఏ) ఏమ్ (బ) యుష్మదర్థమున నీన్ (ఏ) నీమ్ (బ) ఆత్మార్థమున తాని (ఏ) తామి (బ) అనియు రూపములుండును. 'మనము' అను నర్థమున 'నామ్' అను రూపముకూడ కలదు. ద్వితీయాది

విభక్తులు ఏకవచన బహువచనములందు సమానముగానే యుండును. అయినను విభక్తి పరమగునప్పుడు పూర్వము నకార మున్నయెడల 'జ్ఞ' వర్ణముగా నుచ్చరింపబడును. ఎజ్గెన్ (నన్ను) ఎమెన్ (మమ్ము); నిజ్గెన్ (నిన్ను) నిమెన్ (మిమ్ము); తజ్గెన్ (తన్ను) తమెన్ (తమ్ము) అనువిధముగా రూపములుండును.

అంకెలయందు ఒర్త్ (ఒకటి), ఇన్ (రెండు) అనునవి తప్ప తక్కినవన్నియు తీన్, చార్ మున్నగువిధముగా ఆర్యభాషలనుండి యిందు ప్రవేశించినవి. పరిసరభాషయైన సంతాలీ ప్రభావము కూడ దీనిపై నెక్కువగా కలదు. ద్రావిడభాషలలో 'కురుఖ్'తో దీనికి ఎక్కువ సామ్యము కలదు.

మల్తోభాషకు సాహిత్యమును లిపియు లేవు. నాలుగు సువార్తలును, క్రైస్తవ గీతములును (Psalms), అపోస్తలుల కార్యములును ఈభాషలోనికి అనువదింపబడినవి. రోమను లిపి యుపయోగింపబడినది. డాల్టన్, హోడ్గ్సన్, కాంప్‌బెల్ మున్నగువారి కృషివలన నీభాషను గురించి కొంత తెలియవచ్చినది. రివరెండ్ కోల్ రాజమహాలుభాషలోని పాటలను సేకరించి ప్రకటించెను. స్విన్టన్ రాజమహాలు మాటలను కొన్నింటిని పరిచయ మొనరించెను. రివరెండ్ ఎర్నెస్ట్ డ్రోజీ 'మల్తోభాషాపరిచయము' అను గ్రంథము క్రీ. శ. 1884లో ప్రకటించెను. మొత్తముమీద ఈభాషను అరువదివేల మందికి పైగా మాటాడు చున్నారు.

## ద్రావిడభాషల పరస్పరసంబంధము

ఒకేభాష కాలక్రమమున వేర్వేరు ప్రభావములకులోనై వేర్వేరు మాండలికములుగా మారినప్పటికిని మూలభాషతోడి సామ్యమును కలిగియే యుండుననుట సత్యము. ఆ మాండలికములే భిన్నదిశలలో పురోగమించినప్పుడు భిన్నభాషలుగా పరిణమించును. ఒక భాషను మాటాడువారికి రెండవభాష యర్థము కాదు. అయినప్పటికిని సూక్ష్మ

ముగా పరిశీలించినయెడల, కొన్ని సామాన్యలక్షణములు తప్పక గోచరించును. ఆయాలక్షణములనుబట్టియే ఏక కుటుంబత్వమును నిర్ణయించుట జరుగుచుండును. ద్రావిడభాషలలోని అట్టి యేకత్వనిరూపకము లయిన లక్షణములను గుర్తింతము.

సంస్కృతమున లేని హ్రస్వవక్రములు ద్రావిడభాషలన్నింటియందును గలవు. సంస్కృతమునందు క్వాచిత్కముగనున్న టవర్గము ద్రావిడభాషలయందు మిక్కిలి విస్తృతముగ వినిపించును. కొందర యుద్దేశమున ద్రావిడభాషలనుండియే మూర్ధన్యాక్షరములు సంస్కృతమునందు ప్రవేశించెను. కాని, యిది అత్యుక్తి యనిపించును. అత్యంత ప్రాచీనసారస్వత మగు ఋగ్వేదమునందే మూర్ధన్యముల ప్రయోగము కనిపించును. సంస్కృతమునందుకంటె ద్రావిడభాషల యందు వీని వాడుక యెక్కువ యనుట సమంసజము. శకటరేఫము ద్రావిడభాష లన్నింటియందును గలదు. దీని స్వరూప మేమాత్రమును సంస్కృతభాషకు గాని, సంస్కృతజన్యములగు భాషలకు గాని తెలియదని చెప్పవచ్చును. 'ఴ' అను అక్షరము ద్రావిడభాషలందు గలదు. విష్ణుకుండి నేంద్రవర్మ రామతీర్థ తామ్రశాసనమునందు పఴకి అనియు, రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళశాసనమునందు 'ఴందఴూర' అనియు ఴకారము వాడబడియున్నది. కాని, కాలక్రమమున తెలుగు కన్నడములందు ఈ ఴకారము శకటరేఫముగా గాని, రకార డకార ళకారములుగా గాని పరిణతి నొంది కనిపించుచున్నది. 'తాఴితోంట' 'చోఴమహారాజుల్' మున్నగు శాసన ప్రయోగములకు సమానరూపములుగా 'తాడితోట' 'చోళమహారాజులు' మున్నగునవి కనిపించును. తమిళమలయాళములలో ఈ నాటికిని ఴకారము యథాపూర్వకముగా వాడుకలో నున్నది.

వర్గయుక్కులు ద్రావిడభాష లన్నింటియందును లేవు. తమిళమున ఈ నాటికిని యీస్థితి యిట్లే యున్నది. తెలుగునందును మలయాళమునందును సంస్కృతపదముల వాడుక యెక్కువ యగుటవల్ల

తత్సమశబ్దములందు పై యక్షరములు ప్రవేశించినవి. భిన్నవర్ణములు సంయోగముచెందుట దరిదాపు లేనట్లే చెప్పవచ్చును. కష్టము, దుఃఖము మున్నగు పదములు తత్సమములు. ఒక్కొక్కప్పుడు సంస్కృత పదములు తద్భవములుగా మారునపుడు భాషాసంప్రదాయమునుబట్టి మహాప్రాణములను గోల్పోవును. భారము – బరువు; ఋషభము – ఇడబన్.

రకారముతో ప్రారంభములగు సంస్కృతపదములు ద్రావిడ భాషలలో ఉచ్చారణసౌకర్యముకొరకు 'అ' వర్ణమును ముందు చేర్చు కొనును. రథము – అరదము; రాజు – అరసన్.

హకారాదు లగు పదములు ద్రావిడభాషలకు స్వాభావికములు కావు. కావున హకారోచ్చారణమును గోల్పోవును. హడపము – అడపము; హరిదళము – అరిదళము.

ద్రావిడభాషలయందు ఒకే యక్షరమును పదాది నున్నచో పరుషముగను, పదమధ్యమున నున్నచో సరళముగను పలుకుదురు. ఈలక్షణము ఇప్పటికిని తమిళభాషయం దిట్లే యున్నది. తక్కిన భాషలలో రూపాంతరమున కనిపించుచున్నది. తెలుగు కన్నడములందు పదమునిూది పరుషము గసడదవలలో నొక్కటిగా మారుట కిదియే హేతువు. కొన్నియెడల పదమునిూది పరుషము ద్విత్వమును పొంది, అట్లే నిలిచిపోవును.

రేఫద్విత్వమును టకార రకారసంయోగముగా పఠించుట ద్రావిడ భాషాలక్షణము. తమిళమున ఈలక్షణ మిప్పటికిని గలదు. వ్రాతలో రకారద్విత్వమే యున్నను, ఉచ్చారణమున 'ట్ర' యనియే యుండును. ఈలక్షణము తెలుగు, కన్నడము మున్నగుభాషలందు సామాసిక విధానమున ఇప్పటికిని గోచరించును. కుఱు + ఉసురు = కుట్టుసురు. ఱకారద్విత్వమునకు బదులు టకారద్విత్వము వచ్చుట ప్రాచీనలక్షణము.

నకార రకారసంయోగమును 'న్డ్ర' యని ఉచ్చరించుట ద్రావిడ భాషలందు కలదు. పుత్రున్డ్రు, వచ్చువాన్డ్రు మున్నగు శాసనప్రయోగము లనుబట్టి యిట్టిస్థితి తెలుగునందు సైతము కలదని చెప్పవచ్చును. తరువాతికాలమున రేఫము పోగా డకారోచ్చారణమే స్థిరపడియుండును-పుత్రుడు.

తత్సమములును, తద్భవములును పోగా మిగిలిన దేశ్యశబ్దములు ద్రావిడభాషలయందు పరస్పరసామ్యము కలిగి యుండును. కావున వీని కన్నింటికి మూలరూప మగు భాష యొకటి యుండవలయు ననియు, అదియే ప్రాచీన ద్రావిడభాష యనియు ఊహించుట సమంజసముగా నుండును. దీనికి సంస్కృత ప్రాకృతములతో నేమాత్రమును సంబంధము లేదు.

సంస్కృతమునందలి నామవిభక్తులు కేవలము ప్రత్యయములు. ద్రావిడభాషలందలి నామవిభక్తులు పదస్వరూపముతో నుండి యుండి ప్రత్యయస్థితికి మారుచున్నవి. సంస్కృత వ్యాకరణ సంప్రదాయము ననుసరించి, వ్యాకర్తలు ద్రావిడభాషలలో సైతము ఏడు విభక్తులను పరిగణించుచున్నను, నిజమునకు ద్రావిడభాషలందు ఇంత విస్తృతమైన విభక్తి ప్రణాళిక కానరాదు. దేశ్యశబ్దములు ప్రత్యయాదుల యావశ్యకము లేకుండగనే ప్రథమావిభక్తి రూపమున నుండుట ద్రావిడభాషలలో మిక్కుటముగా కనిపించును.

ద్రావిడభాషలకు సంస్కృత ప్రాకృతములకంటె భిన్నమైన క్రియారూపప్రణాళిక కలదు. సంస్కృతతిఙంతరూపమే ప్రాకృతమున వికృతినొంది వినిపించును. 'ఆజ్ఞాపయతి' యనునది 'ఆణవేది' యనియు 'నివేదయిష్యామి' అనునది 'ణివేదఇస్సన్' అనియు ప్రాకృతమున నీవిధముగా రూపాంతరము నొందును. తెలుగు మున్నగు ద్రావిడభాష లందు క్రియాపదమునందు ప్రకృతి ప్రత్యయములును, ఇతరాగమము లును స్పష్టముగా గోచరించును. ఇవి యన్నియు స్వతంత్రమైన యొక నియమము ననుసరించి వర్తించును. పదముపై మరొక పదము చేరినట్లే,

ధాతువుపై మరొకధాతువు చేరి విశిష్టార్థ బోధకమగుట ద్రావిడభాష లలో ఎక్కువగా కనిపించును. ఈలక్షణమే వీనిని సంయోగాత్మక భాషల (Agglutinative languages) లో చేర్చుచున్నది. కొని తెచ్చు, అందిచ్చు, పరుగెత్తు మున్నగు ఎన్నియో క్రియారూపములు క్రియాధాతువుపై క్రియాధాతువు చేరగా ఏర్పడినవే.

ద్రావిడభాషలయందలి క్రియావిభక్తులు సర్వనామరూపములే. వాడు, వారు, నీవు, మీరు, నేను, మేము-వీనియందలి యవశిష్టము లగు 'డురువురునుము' అనునవియే క్రియావిభక్తులుగా తెలుగున వాడుకలో గలవు. ఇతర ద్రావిడభాషలందు కూడ ఇదే లక్షణము పాటింపబడు చున్నది. సంస్కృత ప్రాకృతములందలి క్రియావిభక్తులను సర్వనామములే యని సందేహించుటకు కూడ వీలు లేదు. సంస్కృతమున పది విధము లగు లకారములు గలవు. ద్రావిడభాషల యందు భూతభవిష్యద్వర్తమానములతోనే మొత్తము క్రియా ప్రణాళిక సాగిపోవును. ఇందలి విధానము మిక్కిలి ప్రాథమికము, సంకుచితము అని స్పష్టముగా కనిపించును.

ద్రావిడభాషలలో క్రియాపదమే నామముగా కూడ వ్యవహరించుట యెక్కువగా కనిపించును. అదుకు, బ్రదుకు, పలుకు, దుముకు మున్నగునవి నామక్రియలకు రెండింటికిని సమానముగనే యుండును. ఇట్టిది సంస్కృత ప్రాకృతములందు కనిపింపదు.

సంస్కృతమునందు స్త్రీ పున్నపుంసకలింగము లని నామములను మూడు విధములుగా విభాగింతురు. లౌకిక లింగవిభాగముకంటె పారిభాషిక లింగవిభాగమే, సంస్కృతభాషయందు అనుసరింపబడుచున్నది. కాని యీ రెండు విధములగు విభాగమును ద్రావిడభాషాకుటుంబమునకు దవ్వుగనే యున్నది. కేవలము తత్సమశబ్దములనుగూర్చి విచారించునపుడు వ్యాకరణక్రియాసౌలభ్యముకొరకు స్త్రీలింగసమము లని, పుంలింగసమము లని, నపుంసకలింగసమము లని, వాడుట కలదు. కాని దేశీయము గు విభాగము వేరుగా నున్నది. తెలుగునందలి నామములను అర్థము

ననుసరించి రెండు విధములుగా విభాగింతురు - మహత్తులు, అమహత్తులు. అరవమునందుకూడ ఇట్లే అర్థానుసారముగా ఉయర్ తిణై, అ.ఃతిణై యని రెండు విధములుగా విభాగము చేసిరి. కన్నడమునందు 'లింగము' అను పదమునే వాడినను విభాగము మాత్రము అర్థము ననుసరించియే జరిగినది.

సంస్కృతమునందు ఏకవచనము, ద్వివచనము, బహువచనము అని మూడు విధములుగా విభాగము కలదు. ప్రాకృతమునందే ద్వివచనము అంతరించిపోయినది. ద్రావిడభాషలందు ఏనాడును మూడు వచనము లున్నట్లు కనిపింపదు. మొదటినుండియు ఏకబహువచనములు రెండు మాత్రమే ద్రావిడభాషాకుటుంబమునందు కలవు. అస్మదర్థకము ద్రావిడభాషలందు విచిత్రముగా కనిపించును. ఇతరభాషాకుటుంబములం దెచ్చటను లేని ఉభయార్థబోధకము ద్రావిడభాషా కుటుంబవైశిష్ట్యమును నిరూపించును. 'నేను' ఏకవచనము, 'మేము' బహువచనము, 'మనము' ఉభయార్థబోధకము. వేదమునందే 'వయం' ఉభయార్థబోధక మని, కావున సంస్కృతమునందుకూడ ఈలక్షణము కల దని కొందరు వాదింతురు. 'వయం' అను పదమునకు మనము, మేము అను రెండర్థములను చెప్పవచ్చును. ఆంగ్లమునందలి 'We' అను పదమునకు కూడ ఈ రెండర్థములను చెప్పవచ్చును. కాని, నిర్దిష్టముగా ఉభయార్థకమును నిరూపించు శబ్దము 'ఇండోఆర్యను' కుటుంబమునందు లేదు. ద్రావిడకుటుంబమునందు నిర్దిష్టముగా కలదు. బహువచనమునందు నామమునకు 'కళ్' అని కాని 'గళ్' అని కాని చేర్పవలయును. తెలుగునందు వానికి అవశిష్టరూపమగు 'లు' చేరును. ద్వితీయాదివిభక్తులు బహువచనాంత శబ్దములపై, ఏకవచనాంతములపై వచ్చినట్లే వచ్చును. సంస్కృతమునందు ఏకవచన బహువచనములందు ప్రత్యయములలోనే భేద మున్నది. ద్రావిడభాషలలో అట్టి భేదము లేదు.

సంస్కృతమునందు సంబంధబోధక సర్వనామముల యుపయోగము విరివిగా కలదు. ప్రాకృతమునందును, నేటి యుత్తరహిందూ

స్థానభాషలందునుగూడ కలదు. ద్రావిడభాషలలో అట్టి వాక్యనిర్మాణము కన్పింపదు. అటువంటి సందర్భములందు ద్రావిడకుటుంబమున క్రియాజన్యవిశేషణమును వాడుదురు. 'వచ్చినవాడు ఫల్గునుడు' అనుచో 'ఎవడు వచ్చెనో వాడు' అని యర్థము. ఇటీవల సంస్కృతాంగ్ల హిందీ ప్రభృతిభాషల ప్రభావమువల్ల ద్రావిడకుటుంబమునం దిట్టి ప్రయోగములు ప్రవేశించుచున్నవి. కాని ఈ యత్తదర్థక బోధకసర్వనామముల యుపయోగము ద్రావిడకుటుంబమునకు స్వాభావికము కాదు.

ద్రావిడకుటుంబమునం దొకే పదము విశేషణముగను విశేష్యముగను కూడ వాడబడును॥ పులుపు కాయ; కాయ పులుపు; మాట తీపి; తీపి మాట ॥సంఖ్యావాచకములు విశేషణ విశేష్యరూపములు రెండింట వ్యవహృతము లగును. సంస్కృతమునందలి సంఖ్యలకును, ద్రావిడ కుటుంబసంఖ్యలకును సంబంధము లేదు. వెయ్యినుండి ఆపైని గల సంఖ్యలకు దేశ్యశబ్దములు లేవు; సంస్కృతమునుండి ఎరవు తెచ్చుకొన్న శబ్దములు మాత్రమే కలవు.

సంస్కృతమునందలి కృత్తద్ధితవిధానము క్లిష్టముగను, విస్తృతముగను గలదు. తెనుగుధాతువులకు తెనుగుప్రత్యయముల చేరికచే కృదంత తద్ధితాంతరూపములు స్వతంత్రముగా ఏర్పడును. ద్రావిడభాషలన్నింటియందును ఈవిషయమున సామ్యము కలదు. క్వాచిత్కముగ సంస్కృతప్రత్యయముల పోలిక కన్పించినను అది యేదో ఘుణాక్షర న్యాయమే కాని, సామ్యస్థాపకము కాజాలదు.

సంధివిధానమునందు సైతము ఆర్యభాషాకుటుంబమునకును, ద్రావిడభాషాకుటుంబమునకును వైషమ్యము గలదు. ద్రావిడభాషలందు పరరూపసంధి మాత్రమే కలదు. గుణ వృద్ధి సవర్ణదీర్ఘాదిసంధులకు ద్రావిడభాషలందు తావు లేదు. తత్సమముల విషయమున మాత్రము వానిని వాడుట జరుగును. సంధి లేనియెడల ద్రావిడభాషలన్నింటియందును యకారవకారములును, కొన్నియెడల నకారమును వచ్చుచుండును.

సుదీర్ఘ సమాసములు ద్రావిడభాషలలో లేవు. సంస్కృతాను కరణమున కొందరు చేసినను కృత్రిమములై, మరుగున పడిపోయినవి. ఇందు మాటకుప్రక్క మాటను చేర్చుటతోడనే సమాస మగును. సంస్కృతమునందువలె, సామాసికవిధు లేమియు లేవు. వాక్యములు కూడ చిన్నవిగను, సూటిగను ఉండుట ద్రావిడభాషల లక్షణము. వాక్యమునందలి పదములు కర్తృ, కర్మ, క్రియల క్రమములో నుండును. కర్మార్థక ప్రయోగము సంస్కృతముతో పోల్చి చూచినప్పుడు, ద్రావిడ భాషలందు లే దనియే చెప్పవచ్చును.

పైని పరిశీలించినట్లు ద్రావిడభాషలు పదసామగ్రినిబట్టియు, వ్యాకరణవిధానమునుబట్టియు కూడ, తమ వైశిష్ట్యమును నిరూపించు కొని ఏకకుటుంబత్వమును స్థాపించుకొనుచున్నవి. తెలుగు, మల యాళము మున్నగుభాషలను చూచినప్పుడు తత్సమపదబాహుళ్యమును బట్టి సంస్కృతజన్యత్వమును సమ్మతింపవలయు ననిపించును గాని, అంత కంటె స్థిరమును, వైశిష్ట్యబోధకము నైన వ్యాకరణాదినియమములను చూచినప్పుడు ద్రావిడభాషలు ఏకకుటుంబజన్యము లని, సంస్కృత భాషాకుటుంబమునకు చెంద వని నిశ్చితముగా చెప్పనగును.

## ఆర్య ద్రావిడ భాషా సంబంధము

ద్రావిడభాషలు ఆర్యభాషలకంటె భిన్నము లన్న విషయము నిశ్చయముగా తేలిపోయినది. పదపరికరము, వాక్యనిర్మాణము మున్నగు నంశములనుబట్టి తద్భేదములను గమనించుట సులభమే. కాని, పరస్పర సాన్నిహిత్యమువలన, ఇతర చారిత్రకహేతువులవలన ఒక కుటుంబము నకు చెందిన భాషల ప్రభావము మరొక కుటుంబమునకు చెందిన భాషల పైని పడుటయు సహజమే. అయినప్పటికిని సాదృశ్యముతోపాటు, విశిష్ట తను విభిన్నతను నిరూపించు నంశములనుగూడ గమనింపగలిగినప్పు డేభాష యేకుటుంబమునకు చెందినదో నిర్ధారించుకొనవచ్చును. ఇంత విశాలమయిన సృష్టిలో ఒక వ్యక్తిని పోలి యింకొక వ్యక్తి యుండ

వచ్చును. అంతమాత్రమున నిరువురకు బంధుత్వము నంటగట్టవలసిన యవసరము లేదు. ఇతరసాక్ష్యములుకూడ సహకరించినప్పుడే అట్టి నిర్ణయము చేయ వలనుపడును. భాషల విషయముకూడ అట్టిదే.

ద్రావిడభాషలు ఆర్యభాషలు ప్రక్క ప్రక్కగా నుండి యిరుగు పొరుగు భాషలై యెంతో కాలముగా జీవించుచున్నవి. అట్టియెడల ఏమాత్రమును ఇచ్చిపుచ్చుకొనుటలు లేకుండ నుండుట సాధ్యము కాదు. తెలుగుభాషను వ్యాకర్తలు నాలుగు విధములుగా విభాగించిరి. అందు తత్సమ తద్భవములు రెండును ఆర్యభాషాసంపర్కమువలన తెలుగులో కలిగినవే. దేశ్యములు మాత్రము సహజసిద్ధములు. తెలుగునందలి దేశ్యములతో సదృశములయిన రూపములు తమిళ మలయాళ కర్ణాటాది భాషలలో కనిపించును. కావున ఇవి ద్రావిడ కుటుంబమునకు చెందిన పదము లని నిర్ణయించుట కాక్షేపములేదు. అట్లే తత్సమములు సంస్కృత ప్రాకృతములనుండి యథాతథముగా వచ్చినవనియు, తద్భవములుమాత్రము కొన్ని మార్పులకు లోనై వచ్చినవనియు నిర్ణయించుట కాక్షేపము లేదు. ఇట్లు సంస్కృత ప్రాకృతములనుండి వచ్చిన పద సామగ్రి తెలుగు మలయాళములలో మిక్కిలి యధికముగా కలదు. కన్నడమునందు కొంతవరకు కలదు. తమిళము చాల స్వల్పముగా మాత్రమే ఆర్యభాషాపదములను గ్రహించినది. ఛందోవ్యాకరణాలంకారాది విషయములలో కూడ సంస్కృతము ద్రావిడభాషలపైని తన ప్రభావమును చూపినమాట వాస్తవము.

ద్రావిడభాషలుకూడ తమ ప్రభావమును ఆర్యభాషలపైని ప్రసరింపజేసి యుండునని భావించుట సమంజసము. దీనికి నిదర్శనముగా కొన్ని లక్షణములు గోచరించుచునే యున్నవి. ఇతరములయిన ఇండో యూరోపియను భాషలలో నేమాత్రమును కనిపింపక సంస్కృతము నందును ఉత్తరహిందూస్థానభాషలయందును మాత్రమే కొన్ని ప్రత్యేక లక్షణములు కనిపించుచున్నయెడల, వానికి పరిసరభాషలప్రభావమే

కారణమని యంగీకరింపక తప్పదు. పరిసరభాషలయందు ఆయాలక్షణ ములు పూర్వసిద్ధములై యున్నప్పుడు ఆ సిద్ధాంతమునకు మరింత బలము చేకూరును.

సంస్కృతమునందు విభక్తిప్రత్యయములను శబ్దములపై చేర్చి రామాయ, రామస్య మున్నగు విధముగా రూపములను గాధించుట పరిపాటి. ఉత్తరహిందూస్థానభాషలయందు ప్రథమావిభక్తి రూపము పైనే యితరవిభక్తులు కాని, విభక్తితుల్యములైన శబ్దములుగాని చేరుట కనిపించును. ప్రథమావిభక్తియందు 'రామ్' అని యున్న రూపము విభక్త్యంగమై యితరరూపములందు రామ్-సే, రామ్-కేలియే, రామ్-కా మున్నగువిధముగా నగును. ద్రావిడభాషలయందును ప్రథమైకవచనరూపమే విభక్త్యంగమై యుండుట అత్యధికముగా కని పించు లక్షణము. తోట, తోటలో, తోటనుండి, తోటయందు - మున్నగువిధముగా నున్నరూపములనుబట్టి ప్రథమైకవచన రూపము విభక్త్యంగమై యుండుట స్పష్టము.

సంస్కృతమునందు నామవిభక్తులు వచనమునుబట్టి మారు చుండును. ఏకవచనమున 'రామస్య' అన్న షష్ఠీరూపము ద్వివచనమున 'రామయోః' అనియు, బహువచనమున 'రామాణామ్' అనియు నుండును. అనగా ఒకే విభక్తిని సూచింపవలసినప్పుడు సయితము ఏక వచనమున నొక ప్రత్యయము, ద్వివచనమున మరొక ప్రత్యయము, బహువచనమున నింకొక ప్రత్యయము వచ్చుట జరుగుచున్నది. ఉత్తర హిందూస్థానభాషలు మూడునుండి వచనములను రెండింటికి తగ్గించు కొన్నవి. ఒకే ప్రత్యయమును ఏకవచనరూపముపైని, బహువచన రూపముపైని సమానముగానే చేర్చుట మొదలుపెట్టినవి. 'రామ్‌కో' అని యన్నప్పుడు 'రామ్' అను ప్రథమైకవచనముపై 'కో' అను ప్రత్యయము చేరినది. బహుత్వమునందు అదే ప్రత్యయము 'రామోంకో' అని బహుత్వరూపముపై చేరును. తెలుగునందు 'తోటకు' అని యన్నప్పుడు

ఏకవచనరూపముపై 'కు' ప్రత్యయము చేరినది, 'తోటలకు' అని యన్నప్పుడు అదే ప్రత్యయము బహువచనరూపముపై చేరినది.

సంస్కృతమునందు ఉభయార్థకమైన అస్మదర్థకము ప్రత్యేకముగా లేదు. 'వయమ్' అని యన్నప్పుడు 'మేము' అని శ్రోతను విడిచిపెట్టియు 'మనము' అని శ్రోతను కలుపుకొనియు కూడ అర్థము చెప్పవచ్చును. కేవలము 'మనము' అనియే చెప్పవలయునన్న సంస్కృతమునందు పదము కనిపింపదు. తజ్జన్యములయిన హిందీ మున్నగు భాషలయందు కూడ అట్టిది యుండుట కవకాశములేదు. కాని ద్రావిడ భాషల సంపర్కమువలన ఉత్తరాదిభాషలలో కొన్నింటియందు ఈ ప్రత్యేక ప్రయోగము స్థానమును సంపాదించుకొన్నది. మధ్యప్రదేశమునందు 'హమ్ గయే థే' అనియు 'అపన్ గయే థే' అనియు రెండు రకముల యుపయోగము కలదు. మొదటి వాక్యమునకు 'మేము వెళ్ళితిమి' అని యర్థము. రెండవ వాక్యమునకు 'మనము వెళ్ళితిమి' అని యర్థము. గుజరాతీ భాషయందు 'అమే గయా హతా' అని బహుత్వమునందు 'ఆపణే గయా హతా' అని ఉభయార్థకమునందు వాడుదురు. ఇట్టివాడుక ద్రావిడభాషలనుండియే ఆర్యభాషలు నేర్చుకొనియుండును.

సంస్కృతమునందలి సమాపక క్రియలవలెగాక, ఉత్తర హిందూస్థానభాషలు కృదంతరూపములపై అనుబంధములను జేర్చి సమాపక క్రియలను సాధించుట కొంచెముగా కలదు. సంస్కృతమునందు కరోతి, అకరోత్, క్రియతే మున్నగువిధముగా సమాపకక్రియలు గలవు. ఉత్తరాదిభాషలయందు 'భూ' ధాతు నిష్పన్నమయిన 'భవతి' అనురూపమునకు పరిణామములయిన హో, హై మున్నగురూపములను క్రియాపదములుగా వాడుట కలదు. కర్తే [illegible] కర్తాహై మున్నగు విధముగా రూపము లుండును. వీనికిని ద్రావిడభాషారూపములకును సంబంధము లేదు. కర్నా హువా, కర్నా పడా, కర్నా చాహియే మున్నగు విధములయిన రూపములకును ద్రావిడభాషారూపములకును సంబంధము

గలదు. 'కర్నా' అనునది 'చేయుట' యను నర్థముననున్న భావార్థక రూపము. ఇట్టి యీ రూపముపై వేరొక అనుబంధమును చేర్చి సమాపక క్రియలను సాధించుట యిందు జరిగెను. ద్రావిడభాషలయందు చేయుట జరిగెను, చేయుట యయ్యెను, చేయుట తప్పదు - మున్నగు విధముగా ప్రయోగించుట ప్రచురముగా కలదు. ఇదేకాక 'చేయన్' మున్నగు నుఙ్యంతములుకూడ భావార్థమునే తెలుపును. కావున ఉత్తరాదిభాషలయందలి యీప్రయోగమునకు ద్రావిడభాషాప్రభావమే కారణము.

వాక్యప్రయోగమునందును ద్రావిడభాషాప్రభావము ఆర్య భాషలపై కనిపించును. ద్రావిడభాషలయందు కర్త, కర్మ, క్రియ వరుసలో నుండును. కర్తకు సంబంధించిన విశేషణములు కర్తకు ముందును, కర్మకు సంబంధించిన విశేషణములు కర్మకు ముందును, క్రియకు సంబంధించిన విశేషణములు క్రియకు ముందును ప్రయుక్తము లగును. వాక్యమునం దసమాపకక్రియ లెన్నియున్నను, అవి యన్నియు పూర్వమందే ప్రయుక్తములై, చివరకు సమాపక క్రియతో వాక్యము ముగియవలయును. అనగా అనుబంధవాక్యకము (Subordinate Clause) లెన్నియున్నను, ప్రధాన వాక్యకము (Principal Clause) తుదినే రావలయు నని యర్థము. సంస్కృతమునం దిట్టి నియమము లేదు. కొందర యభిప్రాయమునుబట్టి చూడగా సంస్కృతముకూడ ద్రావిడభాషాప్రభావమునకు లోనగుటచేతనే కర్త కర్మ క్రియ వరుసలో వాక్యనిర్మాణము జరుగుచున్నది. పూర్వవచనకావ్యములందు క్రియయే ముందుగా ప్రయుక్త మగుట ప్రచురముగా కనుపట్టును. ఆంగ్లాది భాషలయందు కర్త క్రియ కర్మ వరుసలో వాక్యనిర్మాణము జరుగును. అదియే ఆర్య భాషాపద్ధతి. అయినను ద్రావిడభాషలతోడి సంపర్కము వలన సంస్కృతమునందును, ఉత్తరాది భాషలయందును వాక్యక్రమమున మార్పు కలిగెను. అట్లే అనుబంధవాక్యకములు ముందుగాను, ప్రధానవాక్యకము వెనుకగాను ప్రయుక్తమగు పరిపాటి కూడ కలిగెను.







వ్యాకరణవిషయమునందు మాత్రమే కాక పదసామగ్రియందును ఆర్యభాషాకుటుంబము ద్రావిడభాషకు ఋణపడి యున్నది. డా॥ కాల్డ్వెలు సంస్కృతమునందలి పెక్కుపదములను చూపి, ద్రావిడభాషలనుండియే యవి సంస్కృతములో ప్రవేశించి యుండునని యభిప్రాయపడెను. అవి ఆర్యభాషాపదములే యైనచో సంస్కృతములో మాత్రమే కాక, యితరార్యభాషలలోకూడ ఉండవలయును. పాశ్చాత్యములయిన ఆర్యభాషలయందు కనిపింపక, సంస్కృతమునందు మాత్రమే యున్న ఆపదములకు ద్రావిడభాషలే యాకరములై యుండునని యాయన భావము. అక్కా, అత్తా, అటవీ, అంబా, కటుక, కలా, కుటి, కూల, మీన, నీర, నానా, పట్టన - మున్నగు పెక్కు శబ్దములను ఆయన చూపెను. వీనినిగూర్చి యిదమిత్థ మని తేల్చిచెప్పుట కవకాశము చాలదు.

ఇంకొక్క విషయము. డా॥ సునీతి కుమార చటర్జీ మున్నగు వారు ద్రావిడభాషల ప్రభావమువల్లనే ఆర్యభాషలయందుపైమార్పులు కలిగెనని భావించుచుండగా డా॥ కాల్డ్వెలు మరొక మార్గమును పట్టి యుండెను. కేవలద్రావిడభాషలవలన ఆర్యభాషలలో ఈమార్పులు కలుగలేదనియు, ఈ రెండు కుటుంబములును విడిపోవుటకు పూర్వము సిథియను కుటుంబమునకు చెందికాని, సిథియనుకుటుంబ ప్రభావమునకు లొంగి కాని యుండెననియు, అందువల్లనే ఆ సామ్యము కనిపించు చున్నదనియు ఆయన యభిప్రాయము.

## సిథియను ద్రావిడభాషా సంబంధము

డా॥ కాల్డ్వెలు ద్రావిడభాషాకుటుంబమునకు ఆర్యభాషా కుటుంబముతో నున్న భేదములను గుర్తించినట్లే యితరభాషా కుటుంబములతో నున్న సామ్యములను సైతము గుర్తించుటకు యత్నించెను. అట్టి యత్నమునందు ద్రావిడభాషలకును సిథియనుభాషలకును సంబంధము కలదని నిశ్చయించెను. ఈసిథియనుభాషలను తార్తారు, ఫిన్నిషు, ఆల్టాయికు, మంగోలియను, తురేనియను మున్నగు పేళ్ళతో పిలుచుట కూడ

కలదు. ఏదో ఒక్క భాషను మాత్రమే సూచించు ఆ పేళ్ళను కాక, మొత్తము కుటుంబమున కంతటికి 'సిథియను' అని వాడుట సముచిత ముగా నుండునని కాల్డ్వెలు నిర్ణయము.

ఇంతకుముందే 'రాస్మస్ రాస్కు' ద్రావిడభాషలకు సిథియను భాషాసంబంధమును సూచించియుండెను. 'ప్రిచర్డు' అను నాయన ఈ సంబంధమువిషయమున ఒక నిర్ణయము చేయవలయు నని ఆశించెను. 'ఎడ్కిన్సు' అను నాయన 'China's Place in Philology' అను గ్రంథమునందు సిథియనుభాషల సమైక్యమును, వానికి ద్రావిడభాషలకు లతో గల సామ్యమును బలపరిచెను. ముఖ్యముగా ద్రావిడభాషలకును సిథియనుకుటుంబమునందలి మంగోలియనుభాషకును పోలికలు స్పష్ట ముగా కనిపించుచున్నవి. ఎడ్కిన్సు "భాషాకుటుంబములుగా పేర్కొన బడుచున్నవి ప్రాచీనభాషకు మాండలికములు మాత్రమే" అన్న నిర్ణయమునకు వచ్చెను. డా॥ కాల్డ్వెలు మధ్యాసియాయందు ద్రావిడు లును ఆర్యులును కలిసియుండిరనియు, తరువాత వారు విడిపోయియుందు రనియు, కొన్ని ద్రావిడభాషాలక్షణములు ఆర్యభాషలో కని పించుటకు ఆ ప్రాచీనసంపర్కమే కారణమనియు భావించెను. అదే సమయమున సిథియనుభాషలు మధ్యాసియాయందు వ్యాప్తినొంది యుండుటచే వానిలక్షణము లీభాషలకు సంక్రమించియుండునని ఆయన యభిప్రాయము. ద్రావిడభాషలను సిథియనుభాషా జన్యములుగా కాక పోయినను సామ్యముగల భాషలుగా అంగీకరింపవలయునని ఆయన యభిలాష.

కాల్డ్వెలు తన యభిప్రాయమున కుపబలకముగా బెహిస్తను ఫలకముల విషయమును ప్రస్తావించెను. పశ్చిమపు మెదియాయందలి 'బెహిస్తను' అనికాని 'బఘిస్తాను' అని కాని అనబడు ప్రదేశమునందు 'డెరయస్ హిస్తాస్పిస్' అనువాని రాజకీయజీవితమునకు సంబంధించిన కొన్ని శాసనములు లభించినవి. అవి ప్రాచీన పారశీకమునందును, బాబి

లోనియను భాషయందును, సిథియను భాషయందును రచింపబడి యుండెను. సిథియనుభాషాశాసనముల యనువాదములనుబట్టి కాల్డ్వెలు ద్రావిడభాషలతో వానికున్న సామ్యముల నీక్రిందివిధముగా చూపెను.

1. ఫలకములయందు ట, డ, ణ అను మూర్ధన్యాక్షరములు గలవు. అవి సంస్కృతములోకూడ నున్నను ద్రావిడభాషాసంపర్కము వల్లనే కలిగినవి.

2. తమిళములోవలెనే ఫలకభాషయందును ఒకేవర్ణము పదాది నున్నప్పుడు పరుషముగను, కానియప్పుడు సరళముగను పలుకబడును.

3. ఫలకభాషయందు సంబంధార్థమున న, నిన, ఇన్న అను ప్రత్యయములు చేరుచున్నవి. తెలుగునందు ని, అనియు; గోండు, బ్రాహుయీ భాషలయందు న, అ అనియు; అరవమున ఇన్ అనియు నున్న ప్రత్యయములలో ఆ పోలికలు కనిపించును.

4. ఫలకభాషయందు చతుర్థి 'ఇక్కి' అనియు 'ఇక్క' అనియు నుండును. ద్రావిడభాషలలోని కు, కి, క అనువానితో వానికి సామ్యము కలదు.

5. ఫలకభాషయందు ఉన్, ఇన్, న్ అనునవి చేరగా సర్వ నామముల ద్వితీయావిభక్తిరూపము లేర్పడును. తెలుగునందలి ను, ని అనునవియు కన్నడమునందలి అమ్, అన్ను అనునవియు సామ్యమును సూచించుచున్నవి.

6. ఫలకభాషయందు ఒకటి యను నర్థమున 'కిర్' అను శబ్ద మొక్కటే కలదు. సంఖ్యావిశేషణముగా ర, ఇర అనునవి కనిపించు చున్నవి. తమిళమునందలి 'ఒర్' కూభాషయందలి 'ర' అనువానితో సామ్యముగలదు. ఫలకములయందలి సంఖ్యావాచకములు 'ఇమ్' ప్రత్య యాంతములు కాగా తమిళమునందు 'అమ్' ప్రత్యయాంతములై యుండును.

7. ఫలకములయందలి యుష్మదర్థక సర్వనామము 'నీ' అనునది. ద్వితీయయందును విభక్త్యంగముగను 'నిన్' అని కలదు. ద్రావిడభాష లతో పోలిక స్పష్టము.

8. సంబంధార్థక విశేషణమును, సంబంధార్థక సర్వనామమును కూడ ఫలకభాషయందు కలవు. సంబంధమును సూచించు ప్రత్యయముతో ద్రావిడభాషలకు సామ్యము లేదు; కాని అట్టివిశేషణమును సాధించుటయందు సామ్యము కలదు.

9. వ్యతిరేకవిధియందు, నిషేధమునందు 'ఇన్ని' అని ఫలకభాషయందు కలదు. 'మిన్ని' యని గోండుభాషలోనున్న రూపముతో దీనికి సామ్యము గలదు.

కాల్డ్వెలు చూపిన యీ తొమ్మిదంశములను పరిశీలించుట యవసరము. మొదటిరెండును ఉచ్చారణ విషయమునకు సంబంధించినవి. ప్రాచీనశాసనలిపినిబట్టి ఉచ్చారణమును నిర్ణయించుటకు వీలుకాదు. లిపియందలి యొకవర్ణము ఒకచోట ఒక ధ్వనిని మరొకచోట మరొక ధ్వనిని గలిగియుండెనని యితరాధారము లేమియు లేకుండ నిర్ణయించుట పొసగదు. మూడు నాలుగంశముల సామ్యము నంగీకరింపవచ్చును. ఐదవయంశమునందు తెలుగుతో సామ్యము నంగీకరింపవచ్చును. కన్నడమునందలి 'అమ్' ఫలకభాషతో సామ్యమును చూపుటలేదు. 'అన్ను' అనునది నవీనకర్ణాట రూపము. కావున దీనికి క్రీస్తు పూర్వపు భాషతో పోలికను సాధింపరాదు. ఏడవయంశమున పోలిక కలదు. ఎనిమిదవయంశమునందు సంబంధార్థక విశేషణముండుట యొక్కటియే పోలిక. సాధించు ప్రత్యయము ఒక్కటికాదు. కాక యిట్టిది పారశీకము నుండి ఫలకభాషలో చేరియుండునని 'నోరిస్' అను వాని యభిప్రాయము. కావున దీనిని ద్రావిడభాషాసామ్యముగా అంగీకరింపవలసిన యవసరము లేదు. తొమ్మిదవ యంశమున ఒక్క గోండుభాషయందు తప్ప తమిళాదిప్రధాన ద్రావిడభాషలయందు పోలిక లేదు.

ఏకకుటుంబత్వమును నిర్ణయించుటకు సంఖ్యావాచకములు ప్రధాప్రధానముగా పరిగణింపదగినవి. పైవానిలో ఆరవయంశము ఒక్క సంఖ్యావాచకమునే చూపుచున్నది. దానికి ద్రావిడకుటుంబముతో సంబంధము లేనేలేదు.

కాల్డ్వెలు పైనిచూపిన యంశములేవియు ఏకకుటుంబత్వము గాని, జన్యజనకసంబంధముగాని, గరిష్ఠసాన్నిహిత్యముగాని సాధింపదగి నవి కావు. పైగా కాల్డ్వెలు పై యంశములను సిథియను భాషాశాసనములనుబట్టి కాక, వాని యనువాదములనుబట్టి వ్రాసినట్లు తానే చెప్పు కొనెను. సిథియనుభాషలకును ద్రావిడభాషలకును క్రియావిధానమునందు ఏ మాత్రమును పోలిక లేదన్న సంగతినికూడ కాల్డ్వెలు తానే చెప్పెను. వ్యాకరణాదులయందు సిథియనుభాషలకు ఆర్యభాషలతో వలెనే, ద్రావిడభాషలతోను కొన్ని పోలిక లున్నట్లు చెప్పెను.

సంస్కృతభాషతోగల భిన్నత్వమును నిరూపించుటకై డా॥ కాల్డ్వెలు ద్రావిడభాషాలక్షణముల నొకచోట క్రోడీకరించి, ఆ లక్షణములు సిథియనుభాషలోసైతము కనిపించుచున్నవని పేర్కొనెను. ఆ లక్షణములను స్థూలముగా గమనింతము.

1. ద్రావిడభాషలయందు జడవాచకములును, తిర్యగ్వాచకములును నపుంసకలింగములుగా భావింపబడును. 2. అన్యార్థక సర్వనామమునకు మాత్రమే స్త్రీపురుష విభేదము కలదు. 3. సర్వనామ ప్రత్యయములను పరమందు చేర్చుటచేత ప్రాణివాచక సూచకములగు విశేషణము లేర్పడును. 4. ప్రథమ పురుషక్రియ సర్వనామావశిష్టముల చేరికనుబట్టి ఏకవచనమునందు మూడు విధములుగా, బహువచనమునందు రెండు విధములుగా నగును. 5. కొన్ని నపుంసకార్థముగల పదములనుముందు స్త్రీపురుషసూచకములయిన విడిశబ్దములు చేర్పబడును. అప్పుడుకూడ క్రియ నపుంసకశబ్దముతోనే అన్వయించును.

6. ద్రావిడ పదములపైని విభక్త్యర్థమును తెలుపుచు, వేర్వేరు పదములుకాని పదాంశములుకాని చేరును. సంస్కృతమునందున్నట్లు ప్రత్యయము లిక్కడ లేవు. ఏకవచనరూపముల పైని చేరినట్లే, బహువచనరూపములపైనికూడ అవేపదములు చేరును.

7. సంస్కృతము పూర్వప్రత్యయములను ఉపయోగించుచోట్ల ద్రావిడభాషలు కొన్ని యనుబంధములను పరమందు చేర్చును. ఈ యనుబంధములుకూడ ప్రత్యేక భాషాభాగమునకు చెందక గుణ

మునుగాని సంబంధమునుగాని సూచించు నామవాచకములై యుండును. 8. క్రియావిశేషణములన్నియు నామవాచకములుకాని కృదంతములు కాని భావార్థకములుకాని అయియుండును. అవి క్రియలకు పూర్వమందే ప్రయుక్తములగును. 9. ద్రావిడభాషలయందలి విశేషణములకు విభక్తి యోగార్హత లేదు. విశేష్యములకు ముందుగా వాడబడినప్పుడు ఏ విభక్తినిగాని, యితరాగమమునుగాని గ్రహింపదు. అటుకాక ప్రత్యేకముగా ప్రయోగింపబడినపుడు విభక్తులను, ఆగమాదులను గ్రహించును. 10. వీలయినప్పుడెల్ల ద్రావిడభాషలు క్రియాజన్యవిశేషణములను వాడును.

11. అస్మదర్థక సర్వనామము బహువచనమున శ్రోతను కలుపుకొని యొకటి, శ్రోతను కలుపుకొనకుండ ఒకటి – రెండు విధములుగా నుండును.

12. సముచ్చయార్థకపదములకు బదులుగా ద్రావిడభాషలు వర్ణములమూలమున సముచ్చయార్థమును సాధించును.

13. భావార్థక క్రియలు, నిషేధార్థక క్రియలు ద్రావిడభాషలలో వేర్వేరుగా రూపొందును.

14. యత్తదర్థక సర్వనామములను కాక క్రియాజన్య విశేషణములను వాడుట ద్రావిడభాషలలో సంప్రదాయము. యత్తదర్థక సర్వనామములు ద్రావిడభాషలలో కనిపింపవు.

15. విశేషణము ముందుగాను, విశేష్యము వెనుకగాను వాడబడుట ద్రావిడభాషలయందలి లక్షణము. అట్లే వాక్యమున కర్త ముందు క్రియ చివర నుండును.

పైని చూపిన లక్షణములన్నియు సిథియనుభాషలలో కలవని డా॥ కాల్డ్వెలు మూకయుమ్మడిగా తెలిపెను. ఏయొక్క లక్షణము నకును లక్ష్యము చూపలేదు. కావున ఔనని కాని కాదని కాని నిర్ణయించుటకు వీలు కలుగదు.

కాల్డ్వెలు చూపిన సిథియను భాషాకుటుంబమును భాషాశాస్త్రజ్ఞు లనేకులు ఏకకుటుంబముగా నంగీకరించుట లేదు. మొట్ట

మొదట భాషాశాస్త్రజ్ఞులు ఇండోయూరోపియను కుటుంబమునందును, సెమిటిక్ కుటుంబమునందును చేరని భాషలనన్నింటిని చేర్చి తురేని యను కుటుంబ మని పేరు పెట్టిరి. కాని క్రమక్రమముగా అందుండి పెక్కు భాషలను వేరుపరుచుట యావశ్యకమయ్యెను. అట్లాంటిక్ మహాసముద్రమునుండి ఒఖోటస్కు సముద్రమువరకును, మధ్యధరా సముద్రమువరకును వ్యాపించియున్న భాషలను ఊరల్ - ఆల్టాయిక్ కుటుంబముగా పరిగణించుచున్నారు. ఇప్పటికిని ఒక కుటుంబముగా పరిగణింపదగిన లక్షణసామ్యము పై భాషలకు కనిపించుటలేదు. పర మందు ప్రత్యయములను కలుపుకొనుట సమస్వరత యను రెండు లక్షణ ములు తుర్కీమున్నగు భాషలయందు ప్రధానలక్షణములై కనిపించును. ద్రావిడభాషలు ప్రధానముగా సంయోగాత్మక భాషలు. సిథియను కుటుంబమునకు చెందినభాషలు వివిధలక్షణములను సూచించునవియై యున్నవి.

భాషాశాస్త్రజ్ఞులు పెక్కురు సిథియను వాదము నంగీకరింపలేదు. ఆవాదము పరాస్తమైనదని తెల్పి గ్రియర్సను తన ప్రమోదమును ప్రక టించెను. కాల్డ్వెలు చెప్పినట్లు ద్రావిడ భాషలకు దూరప్రాంతము లందలి యితరభాషలతో కూడ కొంత సామ్యము కనిపింపవచ్చును. దానిని కేవలము కాకతాళీయముగనే గ్రహింపవలసి యుండును. ఇతర భాషలతో ద్రావిడభాషల సంబంధము నంగీకరింపనియట్లే సిథియను భాషలతో కూడ నంగీకరింపకుండుట శ్రేయము.

## మూలద్రావిడ భాష

ఈనాడు వ్యవహారమున నున్న తమిళాది భాషలను సోదర భాషలుగా, ఒకే కుటుంబమునకు చెందిన భాషలుగా పరిగణించు చున్నాము. ఇవి సోదరభాషలైనప్పుడు వీనికి మూలమయిన భాష యొకటి యుండవలయునన్నది యెవరికైన స్ఫురింపవలసినదే. ఆ భాష యేది ? దాని స్వరూపమెట్లుండును ? అను ప్రశ్నలు కూడ కలుగవలసి

నదే. దానిని గురించి యోచించుటకు ముందు ఒక విషయమును చూతము.

ఒక కుటుంబమునందున్న యన్నదమ్ములు తమభాగములను తాము పంచుకొని వేరుపడుట వలన వేర్వేరు కుటుంబములు నెలయును. అటుకాక కుటుంబమునందలి వ్యక్తులు కారణాంతరములవల్ల వేరువేరు ప్రాంతములకు వెళ్ళి స్థిరపడవలసి వచ్చును; అప్పుడును వేర్వేరు కుటుంబములు నెలయును. ఈ రెండు పద్ధతులలో భాషలు మొదటి పద్ధతిని కాక, రెండవ పద్ధతినే యనుసరించుననుట వాస్తవము. మొదటి పద్ధతి యందు ఒక కుటుంబము విచ్ఛిత్తినొంది ఏకకాలమున వేర్వేరుకుటుంబములు తలయెత్తును. రెండవపద్ధతియందు ప్రధానకుటుంబము విచ్ఛిత్తి నొందదు. అది యున్నది యుండగా, అందలి వ్యక్తులు కొందరు ఒక కుటుంబము నేర్పరుచుకొందురు; కొంతకాలము పోయిన పిమ్మట మరి కొందరు వ్యక్తులు వేరుపడి మరొకకుటుంబము నేర్పరుచుకొందురు. ఇట్లే ఒక భాషను మాటలాడు జనులలోనుండి కొందరు వేరుపడి దూర ప్రాంతములకు పోయి, ఆహారాద్యన్వేషణపరాయణులై అక్కడ స్థిరపడి పోవుదురు. మరికొంతకాల మగుసరికి మొదటి స్థానమునందలి కొందరు మరల వేరుపడి మరొకచోట స్థిరపడుదురు. ఇట్లు జరుగగా జరుగగా వేర్వేరు ప్రభావముల తాకిడివలన వారు మాటలాడు భాషలయందును, ఆచారవ్యవహారములందును కొన్నిమార్పులు కలుగవచ్చును. పరిశీలనముచేసి చూచినప్పుడు వారిలో నున్న సాధారణలక్షణములు గోచరింప వచ్చును: తమిళాది భాషలు అట్టి సాధారణలక్షణములను కలిగి ఏక కుటుంబమునకు చెందిన సోదరభాషలని యీవరకే మనము సిద్ధాంతీకరించుకొంటిమి.

పై సిద్ధాంతము నాధారముగా చేసికొని మూలభాషనుండి మొట్టమొదట విడివడిన భాష యేది యను విషయమును నిర్ధారింప వలయును. డా॥ కాల్డ్వెలు యొక్క యభిప్రాయమునుబట్టి తమిళ భాషయే మూలద్రావిడభాషనుండి మునుముందుగా విడివడినభాష.

శ్రీ కోమర్రాజు లక్ష్మణరావు తమిళముకంటె నితరభాషలే మూలద్రావిడ భాషాలక్షణముల నెక్కువగా కనబరుచుచున్నవని యభిప్రాయపడెను. డా॥ గ్రియర్సను తమిళమే మొట్టమొదట విడివడిన ద్రావిడ భాషయని యనుటను వ్యతిరేకించెను. టటిల్, యూల్సుబ్లాక్ మున్నగు పాశ్చాత్య భాషాశాస్త్రజ్ఞులు నాగరకభాషలలో కంటె, అనాగరకభాషలయిన గోండి మున్నగు వానియందే ప్రాచీనభాషా లక్షణము లెక్కువగా నుండునని నిర్దేశించిరి. ఇట్లు భిన్నభిన్న వాదములకు లోనై మూల ద్రావిడమునుండి విడివడిన తొలుతటిభాష యేదియో నిర్ణయించుట ఒక సమస్య యయ్యెను.

ఇచ్చట రెండు విషయములను గుర్తింపవలయును. మూల ద్రావిడ భాషా స్వరూపము ఇదమిత్థమని తేలవలయును. అప్పుడుకాని దానితో సామ్యముగల రూపములను గుర్తించుట జరుగదు. గుర్తించిన పిమ్మటకూడ అది మూలద్రావిడముతో సామ్యమును గలిగియున్నదని యనుటయే యుచితమగునుగాని ప్రాచీనద్రావిడమునుండి వేరుపడిన మొదటిభాష యని నిర్ణయించుట యుచితము కాదు. నిజముగా మొదటనే వేరుపడిన భాష మూలభాషకంటె భిన్నమయిన పరిణామ మును పొందును. కావున మొదట వేరుపడిన భాషను గుర్తించుట యన్నది సాధ్యము కాదు. మూలద్రావిడభాషా లక్షణమును బహు భాషలలో కనిపించు సామ్యమునుబట్టి నిర్ధారించుట కవకాశము కలదు. ఇంతకు నిది యంతయు బ్రహ్మపదార్థ పరిశోధనము వంటిది. తెలిసిన వానినుండి తెలియనిదానికొరకుచేయు నన్వేషణమే యిది.

ఏభాషకైనను సర్వనామములు ముఖ్యమైనవి. కావున ముందుగా వానిని పరిశీలింతము.

తమిళమునందు 'యాన్' అనియు 'నాన్' అనియు నున్న రూపము 'తుళు' నందు 'యాను' అని యున్నది. కోత, గోండి, పర్జి, గదబ మున్నగు భాషలయందు 'ఆన్' అని అకారాదియై యున్నది. కన్న డమునందు అకారాది రూపమైన 'ఆన్' తోపాటుగా 'నాను' అను

రూపమున్నది. అట్లే కొండదొర భాషయందు కువిభాషయందు 'నాను' అను రూపము గలదు. తెలుగున 'ఏను' అను రూపముతోపాటు 'నేను' అను రూపముకూడ కలదు. తుదభాషయందు 'ఓన్' అను రూపము గలదు. మలయాళమందు 'ఞాన్' అను రూపము గలదు. పైనున్న రూపముల నన్నింటినిబట్టి చూడగా 'ఞాన్' అనునదే ప్రాథమికరూపము అని తోచుచున్నది. 'ఞ' వర్ణము సానునాసికమైన య వర్ణముతో సమానమైన ఉచ్చారణము కలిగియుండును. కావున అనునాసికోచ్చారణమును విడువగా 'యాన్' వంటి రూపము లేర్పడును. 'య' వర్ణము తాలవ్యము కాబట్టి కొందరు తాలవ్య స్వరమైన 'ఎ' వర్ణమును వాడుట జరిగియుండును. తెలుగుననున్న 'ఏను' అటువంటిదే. ద్వితీయాది విభక్త్యంగమునందు పెక్కుభాషలలో 'య' స్థానమున 'ఎ' యుండుట యీవిషయమునే స్థిరపరుచును. 'యాన్' మున్నగురూపములలోని 'య' వర్ణమును విడిచిపుచ్చుటచేత 'ఆన్' మున్నగురూపములు కలిగియుండును. తుదభాష పదాదినున్న 'అ' వర్ణమును 'ఒ' వర్ణముగా మార్చి పలుకును. కావుననే 'ఒన్' అను రూపము కలిగినది. 'ఞ' వర్ణమును కేవల 'న' కారముగాను, తాలవ్య స్వరముతోడి నకారముగాను పలుకుటచేత 'నాను' 'నేను' మున్నగు రూపములు కలిగినవి. కావున మలయాళమునందలి 'ఞాన్' అను రూపమే తక్కినరూపములకు మూలమనియు, కావున అదియే మూల ద్రావిడరూపమై యుండుననియు సిద్ధాంతము. (కొందరు 'ఆన్' అను తమిళరూపమే మూలద్రావిడస్థితిని తెలియజేయుచున్నదని నిర్ణయించిరి.)

యుష్మదర్థకైకవచనము తమిళ, మలయాళ, కోత, తుద, కొడగు, కువి మున్నగుభాషలయందు 'నీ' యని కలదు. తుళు, పర్జీ, మున్నగువానియందు 'ఈ' కారాదియై కలదు. తెలుగునందు నీవు, ఈవు అని రెండు రూపములు గలవు. అట్లే గోండి, కుయి మున్నగు భాషలలో ఈకారాది రూపము, నకారముతోడి రూపము కూడ కలవు. మొత్తముమీద 'నీ' యను రూపమే ప్రచురమైయుండి ద్వితీ

యాదివిభక్త్యంగముగా 'నిన్' అను పరిణతిని చెందుచున్నది. కావున 'నీ' అనునదే మూలద్రావిడమునందలి యుష్మదేకవచనరూపమని నిశ్చ యింప నగును.

తమిళ కన్నడ మలయాళములందు 'ఆళ్' అని యున్నరూపము తెలుగున 'ఏలు' అని నైనది. కావున 'ఆళ్' అనునదే మూలరూపము. తెలుగునందు ప్రోలు, మ్రోగు మున్నగువిధముగా సంయుక్తాక్షరముతో మొదలయిన పదములు కొన్నికలవు. ద్రావిడభాషలయందు సంయుక్తాక్షరములే చాలతక్కువ. ఆదియం దేమాత్రము నుండవు. కావున పుటల్ (త) పొటల్ (క) పొటల్ (మ) అనురూపములలో నొక్కటి మూలము కావచ్చును. మలయాళ కన్నడములందలి 'పొట' యనునది 'ప్రో' యగుట సులభము. తమిళ మలయాళములందు 'ముఱంగు' అని యుండగా కన్నడమున 'మొఱగు' అని యున్నది. తెలుగునందలి 'మ్రోగు' రూపమునకు కన్నడరూపము సన్నిహితముగా నున్నది.

కన్ను, మన్ను, వెన్న - మున్నగురూపములలో తెలుగున దంత్యనకారము ద్విత్వమునొందగా తమిళ కన్నడమలయాళములందు మూర్ధన్య ణకారము ద్విత్వము నొంది కనిపించును. అదియే ప్రాథమిక మైన రూపము కావచ్చును.

ఒండు, రెండు, మూడు - మున్నగు తెలుగు సంఖ్యావాచకములతో ఒణ్డు, ఇరణ్డు, మూన్ఱు మున్నగు తమిళశబ్దములకే యెక్కువ సామ్యము కనిపించును.

తెలుగునందున్న 'చేయి' యన్నది తమిళ మలయాళములందు 'చెయ్' అను రూపముతో నున్నది. కన్నడమున 'కెయ్' యను రూపముతో కలదు. దీనినిబట్టి 'చెయ్' అనునదే ప్రాచీనమేమో యని పించును గాని అది సత్యము కాదు. తెలుగున కూడ 'కై' యను రూపము కలదు. 'కైసేయు' 'కైవసము' మున్నగు శబ్దపల్లవములలోని 'కై' ప్రాచీనావస్థనే తెల్పును. 'చెయ్' యను రూపమున కిట్టిప్రయోగము లేదు. కావున కన్నడమునందలి 'కెయ్' యనునదే మూలరూప

మనియు, తమిళమలయాళములలో క > చ మార్పు గలిగెననియు గ్రహింపవలయును. తెలుగున ఆమార్పు పాక్షికముగా నయ్యెను. తమిళమలయాళములలో 'చిలుమ్' అని యుండగా కన్నడమున 'కిలువు' అనియు, తెలుగున కిలుము, చిలుము - అనియు నుండుట యీస్థితినే నిరూపించును. కావున, ఇట్టియెడల కన్నడరూపమే ప్రాథమిక మనుట సమంజసము.

ద్రావిడభాషలయందు బహువచన ప్రత్యయము 'కళ్' అనునది. తమిళకన్నడాది భాషలయందు 'కళ్' అనియే ప్రయోగింపబడును; కాకున్న 'గళ్' అని మారును. కాని తెలుగునందు 'లు' వర్ణము మాత్రమే బహువచన ప్రత్యయముగా ఉపయోగింపబడుచున్నది. కొన్ని యెడల పొల్లులకారము మాత్రమే నిల్చుచున్నది. కుయి, బ్రాహుయీ మున్నగు భాషలయందు 'క' మాత్రమే బహువచనప్రత్యయముగా నున్నది. కావున 'కళ్' అను రూపమే ద్విధాకరింపబడి 'ళ్' వర్ణముగా కొన్నియెడల, 'క' వర్ణముగా కొన్నియెడల వాడుకనొంది యున్నదని సిద్ధాంతము. (కొందరు వేరుగా నున్న 'క' వర్ణమును, 'ళ్' వర్ణమును చేరదీసి, తమిళము బహువచన ప్రత్యయముగా వాడుకొనుచున్నదని భావించిరి. అది సమర్థనీయము కాదు.)

తమిళ, మలయాళ, కన్నడములందున్న ఱకారము మూలద్రావిడ వర్ణము. తమిళమునందు దాని ప్రాచుర్యమిప్పటికిని తగ్గలేదు. ఇతర భాషలయందు నెమ్మదిగా 'ఱ' వర్ణము తొలగిపోయి డ, ల, ర - అను వర్ణముల కవకాశము కలిగినది. కావున ఱ వర్ణమును ప్రాచీన ద్రావిడ రూపముగా భావింపవచ్చును. తెలుగునందును కొన్ని శాసనములలో ఈ 'ఱ' వర్ణము కలదు. కాని దానికి సాహిత్యభాషలో స్థానము లేక పోయినది.

మొత్తముమీద మూలద్రావిడ లక్షణములు కన్నడమున, మలయాళమున, తెలుగున, ఇతర ద్రావిడభాషలందును చెదరి కనిపించు చున్నవి. అనగా, ఏ యొక్క భాషయు మూలద్రావిడ లక్షణముల నన్నిం

టిని నిరూపించుచున్నదని చెప్పుటకు వీలులేదు. తమిళమునందు ఎక్కువలక్షణములు కనిపించుచునన్న సంగతి వాస్తవము. అయినను తమిళమే మూలద్రావిడ మనికాని, మూలద్రావిడమునుండి వేరుపడిన మొదటిభాష యనికాని యనుటకు వీలులేదు. అయినను ద్రావిడభాషలన్నింటియందును తొలుతసాహిత్యస్థితి నొందినది తమిళమే. కాబట్టి అందు ప్రాచీనలక్షణము లెక్కువగా నుండుట కవకాశము కలదు. గ్రంథస్థమైన భాష తొందరగా మార్పునొందదు. అనాగరకభాషలే మూలద్రావిడమునుండి మొదట వేరుపడి యుండునని యనుకొన్నను, వానియందు ఈమధ్యకాలమున పెక్కుమార్పులు వచ్చుట కవకాశముకలదు. కావున వానినే మూలద్రావిడ లక్షణ నిర్ణయవిషయమున సర్వప్రమాణముగా భావించుట సమంజసము కాజాలదు.

ఉన్నభాషలలో పెక్కువిషయములందు తమిళమే మూలద్రావిడ లక్షణములను నిరూపింప సమర్థమైయున్నది. కావున దానినిబట్టి, యితర లక్షణములను జతచేసి మూలద్రావిడ మను ఊహాకల్పితభాషను నిర్మించుకొనవచ్చును. 'ఞాన్ వరుక్క ఇన్త ఆన్' అనునది ఊహాకల్పితమైన మూలద్రావిడ వాక్యము. ఇది వ్యవహారమున మార్పునొంది అరవ కన్నడ మలయాళాంధ్రములందు వేర్వేరు రూపములను ధరించెను.

అరవమునందు 'ఞాన్ వరుక్క ఇన్త ఆన్' అనునది క్రమముగా నాన్ వరుక్క ఇన్త ఏన్ > నాన్ వరుకిన్రేన్ > నాన్ వరేన్ అని మార్పు నొందెను.

కన్నడమునందు అదేవాక్యము నాన్ బరుత్తు ఏన్ > నాన్ బరుత్తేన్ > నాన్ బరుత్తేనె అని మార్పునొందెను.

మలయాళమునందు అదేవాక్యము ఞాన్ వరు ఇన్తఏన్ > ఞాన్ వరు ఉన్తు > ఞాన్ వరు ఉన్ను > ఞాన్ వరున్ను అని మార్పునొందెను.

తెలుగునందు ఆన్ వరుక్క ఇన్త ఆన్ > ఆన్ వర్చుకు ఇన్తఆన్ > ఆన్ వర్చుచు ఉన్తఆను > ఏనువచ్చు చున్నాను > నేనువచ్చుచున్నాను అని మార్పునొందెను.

పై దంతయు ఊహాకల్పితమే. అయినను ఇతర సాక్ష్యములనుబట్టి వేర్వేరు భాషలయందు కలుగు ధ్వనుల మార్పులను గుర్తించి యిట్టి యూహ చేయుట జరిగినది. ఈ యూహనుబట్టి మూలద్రావిడభాష యొకటి యుండియుండుననియు, వేర్వేరుగానుండు ఉచ్చారణలక్షణము లనుబట్టి వేర్వేరు పరిణామములు కలుగగా దానినుండి తమిళ కన్నడాంధ్ర మలయాళాది సోదరభాషలు రూపొందె ననియు స్పష్టముగా నిర్ణయము చేయవచ్చును.

మూలద్రావిడ స్వరూపమును నిర్ణయించుటకు యత్నించినట్లే, మూలద్రావిడ వర్ణములను నిర్ణయించుటకు కూడ భాషాశాస్త్రజ్ఞులు యత్నించిరి. వారి పరిగణనమునుబట్టి యీ క్రిందివి మూలద్రావిడ వర్ణములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | అ ఆ | | | | | |
| అచ్చులు : | ఇ ఈ | | ఉ ఊ | | | |
| | ఎ ఏ | | ఒ ఓ | | | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| హల్లులు : | క | చ | ట | త̱ | త | ప |
| | | ఞ | ణ | | న | మ |
| | | | ళ | ల | | |
| | | య | ఴ | ర | | వ |

పై వర్ణములే వేర్వేరు భాషలందు యథాతథముగను, కొంత మార్పునొందియు, క్రొత్తవర్ణములను చేర్చుకొనియు నుపయోగింప బడినట్లు గ్రహింపనగును.

# ఉత్పత్తి ప్రకరణము

తెలుగుభాషకు ఆంధ్రము, తెనుగు, తెలుగు అను మూడు పేళ్లు వాడుకలో నున్నవి. ఈ మూడింటిని సమానముగనే సమానార్థముననే వాడుచుంటిమి. ఆంధ్రశబ్దచింతామణి, ఆంధ్రనామసంగ్రహాము మున్నగు వానియందలి 'ఆంధ్ర' పదము భాషనే సూచించుచున్నది. తిక్కన నన్నయనుగూర్చి 'ఆంధ్రకవిత్వవిశారదుండు' అని ఆంధ్రపదమును భాషాపరముగా వాడియున్నాడు. నన్నయయే నారాయణభట్టునుగూర్చి చెప్పుచు 'యః సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచి కాంధ్రభాషాసు కవి రాజశేఖరః' అని వాడియున్నాడు. ఇంతవరకును ఆంధ్రశబ్దము భాషా బోధకముగా వాడబడినట్లు స్పష్టము.

## ఆంధ్రము

ఆంధ్రశబ్దము దేశమునకును జాతికినికూడ బోధకముగా వాడుక నొందియున్నది. బౌద్ధవాఙ్మయమునందు అంధకు లను నొక జాతిప్రజలను గూర్చి యున్నది. తమిళులతోపాటు వీరును మ్లేచ్ఛులుగా పరిగణింపబడిరి. గోదావరీతీరమున 'అంధకరట్ఠ' యను దేశ మున్నట్లు తెలియుచున్నది. ఇదిఆంధ్రరాష్ట్రమనియు, ఆంధ్రులును అంధకులు నొక్కరే యనియు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగా రూహించిరి. పల్లవరాజుల ప్రాకృతశాసనములలో 'అంధాపథము' అను పేరున ఆంధ్రదేశము కనిపించుచున్నది. వీనినిబట్టి అంధ, అంధక, అంధ్ర, ఆంధ్ర యను పదములు దేశవాచకములుగా వ్యవహృతము లైనట్లు కనిపించును. శాసనప్రామాణ్యమునుబట్టి 'అంధ్ర' యనునదే ప్రాచీనరూప మనియు, 'ఆంధ్ర' యనునది యర్వాచీనరూప మనియు నర్థ మగుచున్నది. శ్రీవఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు "మనుధర్మశాస్త్రమునందును, ఐతరేయ బ్రాహ్మణమునందు గ్రామబహిర్వాసులుగ నిరసింపబడినవారు అంధ్రులగు నార్యులు, ద్రావిడు లన్ననో ఆంధ్రులు" అని భిన్నత్వమును ప్రతిపాదించిరి. కాని ఆర్యులగు అంధ్రులును, దక్షిణాపథమునందలి

యాంధ్రులు నొక్కరే యనియు, పాలకజాతిగా ఔత్తరాహులు ఈ దేశమున స్థిరపడి యిచ్చటి పాలితులతో కలిసిపోయి రనియు చారిత్ర కుల విశ్వాసము.

క్రీ. పూ. నాలుగవశతాబ్దమునందు మగధరాజగు చంద్రగుప్త మౌర్యుని యాస్థానమున నుండిన గ్రీకు రాయబారి యాంధ్రులనుగూర్చి పేర్కొని యుండెను. అశోకుని శాసనములందును ఆంధ్రులను ఒక జాతిగా పరిగణించిన ప్రస్తావన మున్నది. ఆరవ శతాబ్దమునాటికి ఆంధ్ర పదము జాతిపరముగా అనేక శాసనములతో ప్రత్యక్షము కాసాగినది. కాబట్టి ఆంధ్రశబ్దము జాతివాచకముగను, పిదప దేశవాచకముగను వాడుకనొంది క్రమముగా భాషకు కూడ బోధకమైయుండును. తిక్కన 'ఆంధ్రావళి మోదముం బడయునట్లుగ' అని జాతివాచకముగా వాడి యుండెను.

## తెలుగు

అప్పకవి ఆంధ్రదేశమునకు త్రిలింగదేశము అనివాడి ఆ సంజ్ఞ కలుగుటకు కారణము నీక్రింది విధముగా తెలిపెను.

"శ్రీక్షితిధర కాళేశ
ద్రాక్షారామంబు లనఁగఁ దనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము
లీక్షింపఁ ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్" అని పలికి,
"తత్త్రిలింగనివాసంబు తనరు కతన
నాంధ్రదేశంబు తాఁ ద్రిలింగాఖ్యమయ్యె" అని యనెను.

ఇది దరిదాపు క్రీ. శ. 1650 నాటి విషయము. ఇంతకు పూర్వమే పదునైదవశతాబ్ది పూర్వభాగమునం దున్న విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో

"ధర శ్రీపర్వత కాళే
శ్వర దాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా

కర మగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్.
తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ
దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నంధ్రము కొంద"రని పలికెను.

ఈ యిరువురి వ్రాతలనుబట్టి త్రిలింగము లుండుటచేత త్రిలింగదేశమను పేరు కలిగె ననియు, అదియే తెలుగుదేశమై తరువాతికాలమున తెనుగు దేశమయ్యె ననియు నిర్ణయింపనగును. వీరికంటె పూర్వుడై, వీరి కీ యూహబలము నందిచ్చినవాడు పదునాలుగవ శతాబ్ది పూర్వార్ధమున నున్న విద్యానాథుఁడు. శైవుడగు ప్రతాపరుద్రుని సంతృప్తికొరకు తదాస్థానమున నున్న విద్యానాథుడు నాడు వాడుకలో నుండిన 'తెలుగు' శబ్దము నిట్లు చమత్కరించియుండిన నుండవచ్చును. 'త్రిలింగదేశపర మేశ్వర' అని ప్రతాపరుద్రుని సంబోధించెను. ఇంతకుపూర్వము క్రీ. శ. 1027 నాటి ఇంద్రవర్మ పుర్లీ శాసనమందు 'తిరిలింగ వాస్తవ్యాయ' అని కలదు. ఇంతకంటెను బూర్వమే క్రీ. శ. 150 నాటి టాలెమీ అను చరిత్రకారునికి 'త్రిలింగ' శబ్దము సుపరిచిత మని తారానాథుని గ్రంథమునుబట్టి బిషప్ కాల్డ్వెలు నిర్ణయించెను. తిలింగ, తిరి లింగ, తిరులింగ, తిలుంగ, తెలింగ మున్నగురూపములతో ఈశబము శాసనములందు కనిపించుచున్నది. కాబట్టి విద్యానాథునికి పూర్వమే త్రిలింగశబ్దము ప్రతిష్ఠితమై యున్నదని నిర్ణయింపనగును. 'తెలుగు'అను శబ్దమే మౌలిక మనియు దానినే సంస్కృతప్రియులు 'త్రిలింగ'గా మార్చి యుందురనియు నొక వాదము బలీయముగా గలదు. ఇట్లు తెలుగు పేళ్ళను సంస్కృతీకరించు అభ్యాసము లేకపోలేదు గాని, యిన్ని విధము లుగా నున్న యే తెలుగుశబ్దమునుండి సంస్కృతశబ్దము వచ్చినదని యనగలము!

ప్లినీ 'మొదొగలింగమ్' (Modogalingam) అను నొక మాట నుపయోగించెను. కాంప్ బెల్ తన తెలుగు వ్యాకరణ పీఠికయందు ఈ ప్రస్తావమున 'మొదొగ' అనుదానిని 'మూడు' అను సంఖ్యావాచక

మునకు సమమైనట్లు నిర్ణయించెను. అది యథార్థమైనచో 'మూడు లింగము' అను పేరు కలదనియు, త్రిలింగము దానికి సమానార్థకమనియు భావించి ప్రాచీనతను నిర్ధారింప వచ్చును.

సి. పి. బ్రౌను పై సంజ్ఞను 'మూడు-గళింగము' అని విభాగము చేసెను. 'కళింగము' నందలి 'క' వర్ణము 'గ' వర్ణముగా మారుటకభ్యంతరము లేదు. 'త్రికళింగము' అను వాడుక భారతదేశమునందు చాలకాలమునుండి కలదు. ఒక వంశపు రాజులు 'త్రికళింగ ప్రభువులు' అను బిరుదనామమును దాల్చినట్లు ఒక శాసనము కలదని జెనరల్ కనింగ్‌హాము వ్రాసెను. వరాహమిహిరుని బృహత్సంహితను అనువాదము చేయుచు, పురాణములందొకచోట 'త్రికళింగ' శబ్దము కనిపించెనని డా॥ కెర్న్ వ్రాసెను. రాగిరేకు పైనున్న యొక శాసనమందు కూడ ఈ శబ్దము కలదు. మహాభారతము కళింగులనుగూర్చి మూడు సార్లు పలికెను. ఒక్కొక్కమారు ఒక్కొక్కజాతి ప్రజలకు పొరుగుననున్నట్లు తెలిపెను. కావున ఈమూడు కళింగములచేత బోధింపబడు దేశము తెలుగుదేశమేయని నిర్ధారించు నవకాశము చాలకున్నది.

ఉత్కళింగము, మధుకళింగము, కళింగము అను మూడు కళింగములకును గలిపి త్రికళింగసంజ్ఞ గల దనియు, అదియే త్రికళింగ > తిఅలింగ > తెలింగ > తెలుంగు అని అయ్యెననియు నొక వాదము కలదు. కాని, త్రికళింగము చారిత్రకముగా తెలుగు దేశమగుటకు వీలు లేదు. అందువల్ల శబ్దసామ్యముచే చరిత్రసాక్ష్యమును తారుమారు చేయుట సమంజసము కాదు.

'తెళుగన్నడము' అనునది 'తెలుగు'గా మారెనని మరొక వాదము కలదు. చివర గల మూడక్షరములు లోపించుటకు భాషాశాస్త్ర నియమము లొప్పుకొనవు. అంతే కాక 'తేటకన్నడము' అను సర్థము గల యీ శబ్దము కన్నడముకంటె భిన్నమైన భాషను బోధించుచున్నదని యొప్పుకొనుట 'జానుతెనుగు'ను తెనుగుభాష కాక మరేదో భాష యని యనుట వంటిది. కావున ఈ వ్యుత్పత్తి సత్యము కాదు; సమంజసము కాదు,

ఇంతవరకు చూచిన వాదములనుబట్టి 'త్రిలింగ' శబ్దమే ప్రాచీన మైన దని ప్రతిష్ఠింపనగును. శైవమతప్రాబల్యమువలన అక్షరాభ్యాస క్రమములో 'ఓం నమశ్శివాయ' అనునది తెలుగు దేశమున నేర్పడి మొన్న మొన్నటివరకు ప్రచారమున నున్నది కదా? అట్లే శైవమత ప్రాబల్యము కారణముగా అంధకరట్ఠ, అంధాపథీయ, దక్షిణాపథ మొద లయిన పేళ్ళతో నున్న యీ దేశము త్రిలింగదేశమై యుండును. దీనికి వికృతులు పెక్కువిధములుగా, చాలకాలముగా నున్న విషయము దీనినే బలపరుచును.

## తెనుగు

తెనుఁగు అను పేరుకూడ చాలకాలముగా కలదు. రాజనరేంద్రుడు తన్నడిగినట్లుగా నన్నయభట్టు 'తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్' అని వ్రాసెను. ఇచ్చట నకారము ప్రాసస్థానమం దున్నది. అట్లే తిక్కన 'తెనుఁగున వినిర్మింపఁ దివురు టరయ' అని తెనుగుశబ్దము వాడియున్నాఁడు. తెలుగు అను పదము నన్నయయందు గాని తిక్కనయందుగాని ప్రాసఘటితముగా కనిపింపలేదని ఆంధ్ర భాషా వికాసకారులనిరి. నన్నయయందు 'తెలుగు' అను శబ్దము కనిపింపని మాట నిజము. కాని తిక్కన నిర్వచనోత్తరరామాయణమందు ప్రాస స్థానముననే 'తెలుఁగు' శబ్దమును వాడెను. తిక్కన శిష్యుడగు కేతన కూడ ఆంధ్రభాషాభూషణమునందు, ప్రాసస్థానమున తెనుగు తెలుగు లను సమానముగా వాడియున్నాడు. కాబట్టి ఆంధ్రము, తెనుగు, తెలుగు అనునవి నన్నయకు పూర్వమే యెన్నడో యేర్పడియుండెననక తప్పదు.

తెనుగుశబ్దమునకుగూడ అనేకవ్యుత్పత్తులు చూపబడినవి. 'త్రినగ' శబ్దమునుండి వికృతిగా 'తెనుఁగు' ఏర్పడెననుట యొకటి. ఇట్లు ఏర్పడుటకు భాషాశాస్త్రసిద్ధాంతము లంగీకరించును. ఆంధ్రభాషాచరిత్ర కారులు మూలమున లేని యనుస్వారము తజ్జన్యమందు కలుగ దను నొక యభ్యంతరము పలికిరి. కాని ఒకభాషలో సానుస్వారములైన

శబ్దములు మరొకభాషలో నిరనుస్వారముగా నుండుట వింత కాదు. మన దేశమునకు 'త్రినగ' దేశ మను పేరున్నదా ? అనునది ప్రశ్న. ఉండి నను పూర్వము చెప్పికొన్న 'త్రిలింగ' శబ్దమునకు సహకారకముగానే యుండును గాని అపకారకము కాదు. అంతే కాక, తెనుగు తెలుగు శబ్దములు పరస్పరము మారుట కవకాశము కలదు. 'నల'లు తెలుగున పరస్పరము మారుచుండును. చణక - సెనగ - సెలగ; లేఁత - నేఁత; మునుగు - ములుగు; లాఙ్గలీ - నాగలి॥ కాబట్టి తెలుగుశబ్దము తెనుగయ్యె నని కాని తెనుగుశబ్దము తెలుగయ్యె నని కాని నిశ్చయించుట దోషము కాబోదు.

'తేనె + అగు' అను శబ్దముల కూడికవలన 'తెనుగు' ఏర్పడె నని కొందర యూహామైనట్లు గ్రియర్సను వ్రాసెను. ఇది సాహిత్య సుందరమైన వ్యుత్పత్తియే కాని సత్యము కాజాలదు. ఇట్టి వ్యుత్పత్తి యన్ని భాషలకును చెప్పుట సంప్రదాయమే. 'తెన్' అనగా దక్షిణము. కాబట్టి దక్షిణమున నుండువారికి 'తెనుగు' లను పేరు వచ్చె నని మరొక వాదము కలదు. ఇట్టి పేరు సహజముగనే యుండును. కాని, తెనుగులు ఎవరికి దక్షిణముగా నుండిరో వారు కదా! ఈ మాట యనవలసినది ! తెనుగుభాషలోని యీ యర్థమును తెనుగుభాషకే యన్వయించుట అంత అర్థవంతము కాదు. మనకు ఉత్తరమున నున్నవారు మనలను 'తెనుగులు' అన్నచో ఉచితము; దానిని తరువాత మనము స్వీకరించి స్వీయము చేసికొన్నను చేసికొనవచ్చును. కాని అట్లు కాలేదు. మనకు దక్షిణమున నున్న తమిళులు ఉత్తరాదివా రను నర్థమున 'వడుగర్' అని వాడిరి. అట్లే ఉత్తరదేశము అను నర్థమున మన దేశమును 'వడుగవలి' యని పిల్చిరి. కాబట్టి 'తెనుగు' దిగ్వాచకముగా ప్రతిష్ఠిత మయ్యె ననుటయు భ్రమయే యనిపించును.

మొత్తముమీద ఆంధ్రము, తెనుగు, తెలుగు అను శబ్దములు మూడును ప్రాచీనకాలమునుండియు నున్న వనుట సిద్ధాంతము.

## తెలుగు భాషా ప్రాచీనత

ఐతరేయబ్రాహ్మణమున ఆంధ్రజాతినిగురించి మొట్టమొదటి సారిగా మనకు వినిపించును. రామాయణ భారత భాగవతగ్రంథము లందు ఆంధ్రులనుగూర్చి ప్రసంగము కలదు. క్రీ. పూ. మూడవశతాబ్దికి చెందిన అశోకునిశాసనములందు ఆంధ్రులు స్వతంత్రప్రతిపత్తి గలిగిన సామంతులుగా పేర్కొనబడిరి. కళింగమునకు పడమటిదిశగా ఆంధ్ర రాజ్య ముండె నని ఖారవేలుని హాతిగుంఫశాసనము పేర్కొన్నది. క్రీ. శ. 77వ సంవత్సరమునాటి 'ప్లిని' యను గ్రీకు చరిత్రకారుడు ఆంధ్ర జాతిని వర్ణించి, వారి గుణగణములను బలవైభవములను ప్రశంసించెను. ఈ సాక్ష్యములనుబట్టి చూచినచో క్రీస్తుపూర్వమే ఆంధ్రజాతి మహో న్నతస్థితిలో నున్నదని స్పష్టము కాగలదు. ఐనను ఆంధ్రభాష పదు నొకండవ శతాబ్దికిగాని సాహిత్యస్థితిని పొందలేదు. ఇంతకాలముగా ఆంధ్రు లుపయోగించు భాష ఆంధ్రమా? కాదా? అను ప్రశ్నకూడ కలుగును.

ఆంధ్రులు ఔత్తరాహులు. వారెందువలననో ఉత్తర దేశము నుండి నిర్వాసితులై దక్షిణమునకు రాసాగిరి. అట్లు వచ్చినవారు కృష్ణా గోదావరీనదుల మధ్యప్రదేశము నాక్రమించుకొని, అచ్చటి దేశీయులతో క్రమక్రమముగా కలిసిపోయిరి. ఆంధ్రులలో చరిత్ర కందిన మొట్ట మొదటి వంశము శాతవాహనులది. శాతవాహనుల రాజధానిగా ప్రతి ష్ఠానపురము ప్రసిద్ధి నొందినది. తొలుత పశ్చిమోత్తరదిశగా నుండిన శాతవాహనులు క్రమముగా తెలుగుదేశమునకు వచ్చియుందురు. ఆంధ్రుల పరిపాలనమూలముగా తెలుగుదేశము ఆంధ్రదేశ మను పేరు సంపాదించుకొని యుండును. ఆచార్య శ్రీ సోమయాజిగారు పరిగ ణించిన ప్రకార మాంధ్రరాజుల శాసనముల వివరము లిట్లున్నవి. శాత వాహన రాజులు వేయించిన 24 శాసనములందును 4 మాత్రమే తెనుగు దేశమున నున్నవి. ఇవి యన్నియు ప్రాకృతశాసనములు. ఇక్ష్వాకులు వేయించిన శాసనములు కూడ ప్రాకృతమునందే కలవు. పల్లవులు

కొన్ని శాసనములలో ప్రాకృతమును కొన్ని శాసనములలో సంస్కృత మును వాడిరి. శాలంకాయనులు కూడ ప్రాకృతసంస్కృత శాసనము లను వేయించిరి. విష్ణుకుండినులు మాత్రము సంస్కృతములోనే శాస నములను వ్రాయించిరి. ఈ వివరములనుబట్టి చూడగా ఆంధ్రరాజుల కాదరపాత్రమైన భాష ప్రాకృత మని తేలును. క్రమక్రమముగా సంస్కృతమునందుకూడ గౌరవము పెరిగినది. ఇట్లు ప్రాకృతసంస్కృ తములు శాసనములందు గోచరించుటచే వాని యునికినిగూర్చి ప్రశ్నయే లేదు. కాని తెలుగనునది వేరుగా నుండెనా? నిత్యవ్యవహారమున జనము మాటాడు భాష యేమి? అను ప్రశ్నలకు సమాధానము కావలయును.

భోజరాజు రచించిన సరస్వతీకంఠాభరణమునం దొక శ్లోకము గలదు. "కేஃభూవన్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః, కాలే శ్రీసాహసాంకస్య కే న సంస్కృతభాషిణః" ఈ శ్లోకమునుబట్టి ఆఢ్యరా జను నామాంతరము గల శాలివాహనుని కాలమున అందరును ప్రాకృ తము మాటాడగలిగిన వారే యని తెలుపవచ్చును. నిత్యవ్యవహారము నందలి భాష ప్రాకృతమే యైనయెడల ఇట్లు చెప్పవలసిన యవసరము కలుగదు. కావున జనసామాన్యము మాటాడు భాష వేరుగా నున్న దనియు, ఐనను రాజాభిమతమునుబట్టి ప్రాకృతమునందు కూడ అందరకు ప్రవేశము గలదనియు చెప్పుట కవి యుద్దేశ్యము కావలయును. గుణా ఢ్యుని కథనుబట్టి చూచినప్పటికిని సంస్కృత ప్రాకృతములకంటె భిన్న మైన దేశభాష యొకటి యున్నట్లు స్పష్టము కాగలదు. ప్రతిజ్ఞాను సారము గుణాఢ్యుడు సంస్కృత ప్రాకృత దేశభాషలను విడనాడి పైశాచీభాషయందు బృహత్కథ రచించెను. పైశాచికముకూడ ప్రాకృతములలో నొకభాగమే యని ప్రాకృతవ్యాకరణములు తెలుపు చున్నవి. ఇట్టియెడల గుణాఢ్యునికి ప్రతిజ్ఞాభంగదోషము పట్టదా? యను ప్రశ్న రావచ్చును. ప్రతిష్ఠానపరిసరములందలి ప్రాకృతమును, దేశ భాషను పరిహసించుటయే కాని యేదేశభాషనుగూడ వాడరాదనుట

యాతని యుద్దేశ మైయుండదు. ఏ భాషను వాడకున్న ఇంక వ్యవహార మెట్లు సాగును? తాను క్రొత్తగా భాషను సృష్టించుకొనుట సాధ్య మనుకొన్నను, అది యితరుల కెట్లు అర్థమగును? కావున గుణాఢ్యుని ప్రతిజ్ఞను తావన్మాత్రముగనే గ్రహింపవలయును. గ్రియర్సను భారత దేశమునకు నుత్తరభాగమందలి దరదదేశమున మాటాడు భాషలు పిశాచభాష లని పేర్కొనెను. బృహత్కథకు సంస్కృతాను వాద ములలో నొకటి నేపాళదేశమున, రెండు కాశ్మీరదేశమున లభించినవి. దీనినిబట్టికూడ పిశాచభాషలని పిలువబడు భాషలను అక్కడివారు మాటలాడుచుండురని తెలియుచున్నది. గిల్గితు, కాశ్మీరము, కొహి స్తాను, కాఫిరిస్తాను, చిత్రాలు అను భాగములు కలిసి దరదదేశముగా నేర్పడి, పిశాచభాషలకు స్థావర మగుచున్నవి. దీనినిబట్టి బృహత్కథకు వాడబడిన పైశాచీభాష తెనుగు కాదనియు ప్రతిజ్ఞప్రకారము విడువ బడిన దేశభాషయే తెనుగు కావచ్చుననియు నూహింప వీలగుచున్నది.

సరిగా అదే కాలమున క్రీ. శ. మొదటి శతాబ్దియందు హాల మహారాజు ప్రాకృతమున 'గాథాసప్తశతి' అను గ్రంథమును సంతరిం చెను. ఇందలి భాష మహారాష్ట్రీ ప్రాకృతమనియు, అదియే ప్రాకృత ములలో ప్రధాన మైనదనియు పలువురు పెద్దల నిర్ణయము. ఇందు సంస్కృతమున లేని యనేకపదములు కనిపించుచున్నవి. ఇవి దేశభాషల నుండి ప్రాకృతములో ప్రవేశించి యుండును. అట్లు ప్రవేశించినవానిలో పెక్కు తెనుగుపదములు కనిపించుచున్నవి. ఆ పదములు ఇతర ద్రావిడ భాషలలో సైతము నుండవచ్చును. ఐనను రూపసాన్నిహిత్యమునుబట్టి అట్టివి తెలుగునుండియే ప్రాకృతమున ప్రవేశించియుండు నని డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు సముచితముగా నిర్ణయించిరి. అత్తా, పొట్ట, కరణి, మోడి మున్నగు శబ్దములను పెక్కింటిని గాథా సప్తశతినుండి యెన్నికచేసి, తెలుగుపదములుగా సోపపత్తికముగా నిరూపించిరి. ఈ పదముల ప్రయోగమునుబట్టి యొక విషయము నిరూ పిత మగుచున్నది. ఆయా కవులు ప్రాకృతమున రచన చేసినను, నిత్య వ్యవహారప్రభావమున దేశభాషాపదములు కూడ అందు సందుచేసి

కొన్నవి. వానికి సంస్కృతప్రాకృతములతో ఏమాత్రమును సంబంధము లేదు.

ప్రాకృతసంస్కృతశాసనములలో కూడ తెలుగుపదములు గ్రామముల పేళ్ళుగా, మనుష్యుల పేళ్ళుగా తోంగి చూచుచున్నవి. శాతవాహనుల శాసనములందు వేపురక, హిరలూర. కుడూర మున్నగు పదములును, తరువాతి కాలమున దాలూర, చెన్దలూర, కణ్డుకూర, కరుపూర, నతాచకు, కడాకుదుగు, పెణుకపఱ్ఱు, తాన్తికొణ్ట మున్నగు పదములును కనిపించుచున్నవి. ఊరు, చేడు, కుదురు, పఱ్ఱు, కొండ మున్నగు పదముల నంతమందు గల గ్రామముల పేళ్ళే నాడును గలవు; సంస్కృతమునం దిట్టివి యెన్నడు గాని కనిపింపవు. కావున క్రీస్తుశకప్రారంభమునకే 'తెలుగుభాష' వ్యాప్తిని పొంది యున్నదని యొప్పుకొనక తప్పదు. అట్లే నాగమ్న, వీరమ్న మున్నగువిధమైన వ్యక్తులపేళ్లు కనిపించుచున్నవి. 'అమ్న' యనునది 'అన్న' అనుదానికి పూర్వరూపము కావచ్చును. అరవమునందును కన్నడమునందును మూర్ధన్యణకారమే యుండగా తెనుగున మాత్రమే 'అన్న' యని దంత్యనకార మున్నది. కావున ఈ'అమ్న' యనునది తెనుగుపదము నుచ్చరించుటలో కలిగిన మారుపాటుగా గ్రహించుట యుక్తియుక్తముగా నుండును.

తెనుగుసమాసములు సాధారణముగా రెండేసి చిన్న మాటలతో నేర్పడును. పైని జూచిన గ్రామముల, వ్యక్తుల పేరులట్లే యున్నవి కదా! ఏడవ శతాబ్దినాటికి మూడేసి పదములు కలిసి సమాసరూపము దాల్చినట్లు శాసనములనుబట్టి తెలియుచున్నది. దీనినిబట్టి భాష మిక్కిలి యభివృద్ధిని పొంది యుండెనని నిర్ణయింపనగును.

క్రీ. శ. 5వ శతాబ్దికి చెందిన ఒక శాసనమునందు 'ఏళూర' అను పదము కలదు. 'ఆళ్' అను పదము 'ఏలు' అని తెలుగున పరివర్తన మొందినది. అప్పటికి తెలుగు స్వస్వరూపమును స్థిరీకరించుకొనకపోయినచో 'ఆళూర' అనునట్లుగానే రూపము ద్రావిడభాషాసామాన్యముగా నుండి యుండెడిది. ప్రాచీనద్రావిడమునుండి తెలుగునకు వచ్చిన

పిమ్మటనే 'ఏ'గా ఈ రూప మేర్పడియుండునని సిద్ధాంతము. పై వివేచనమునుబట్టి తెలుగుభాష క్రీస్తుశకప్రారంభమునకే, శాలివాహనుల పరిపాలనకాలమునాటికే సుప్రతిష్ఠితమై యుండెనని తేలినది. ఎప్పుడు ప్రారంభ మయ్యెనో తేల్చి చెప్పుట కాధారములు చాలవు.

అయినను శాతవాహనులు మొదలైన యాంధ్ర రాజులు ప్రాకృత సంస్కృతములను వాడి, తెలుగుభాషను నిరాకరించుటకు గల కారణ మేమి? యను ప్రశ్న రావచ్చును. ఆంధ్రరాజులు ఔత్తరాహులనియు, వారి మాతృభాష ప్రాకృత మనియు దీనికి సమాధానము. పాలకుల భాషయందే రాజకీయవ్యవహారము సాగుట పరిపాటి కనుక శాసనములు ప్రాకృతభాషయందే వెలువడినవి. నాగరకులు ప్రాకృత భాషలనే ఆరాధించిరి. సామాన్యజనము తెలుగునందే నిత్యవ్యవహారమును గావించుకొనుచుండెడిది. గ్రామముల నామము లీ విషయమునే నిరూపించినవి. ప్రారంభములో వేరుగా నున్నను, తరువాతి కాలమున పాలకులగు ఆంధ్రులును పాలితులగు తెలుగువారును నొక్కటై అభేదమును సాధించుకొనిరి. నేడు ఆంధ్రము, తెనుగు, తెలుగు అను మూడు శబ్దములును భాషాజాతిదేశములను సమానముగనే బోధించుచున్నవి.

## సంస్కృత ప్రాకృతములు - తెలుగు

'తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును' అని కేతనయు 'జనని సంస్కృతంబు సర్వభాషలకును' అని శ్రీనాథుడును చెప్పిన మాటల యందు స్థిరమగు విశ్వాసము కలిగి సంస్కృతమునుండియే తెలుగుభాష పుట్టినదని మనవారు నిర్ణయించుకొనిరి. ఆంధ్రశబ్ద చింతామణియందు "ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే త్వేషా తయోర్వికృతిః॥ కేవలతయాను సర్వత్యు భేచ మేయం యథాతథం భాషా" అని యొక సూత్రము కలదు. దీనినిబట్టి సంస్కృతప్రాకృతములు రెండును మాతృగౌరవమును పొందుచున్నవి: కాని తెలుగుభాష సంస్కృతప్రాకృతజన్యము కాదని, భాషాశాస్త్రజ్ఞుల నిరూపణముతో ప్రతిష్ఠితమైనది.

ఆర్యులు ఉత్తరధ్రువప్రాంతములో తొలుత నివసించెడి వారనియు, క్రమముగా వారిలో కొందరు దక్షిణముగను, కొందరు పశ్చిమముగను బయలుదేరిరనియు, అటు దక్షిణముగా వచ్చినవారు కొంతకాలము ఆసియాఖండ మధ్యభాగమున నుండి, తరువాత అందు కొందరు భరతఖండమునకు వచ్చి, ఉత్తరదిశనుండి క్రమముగా దేశమంతయు క్రమ్ముకొనిరనియు శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు నిర్ణయించుచున్నారు. పడమటివైపు సాగినవారు ఐరోపా ఖండమునందు నివాస మేర్పరచుకొనిరి. మొదట వీ రందరు మాటలాడు భాష యొక్కటే యనియు మతాచారములు నొక్కటే యనియు భాషాశాస్త్రమును, పురాణగాథా సామ్యమును ప్రకటించుచున్నవి. ఐరోపాఖండమువైపు వెళ్ళినవారు 'కెంతుమ్' భాషలను, రెండవశాఖ వారు 'సతెమ్' భాషలను మాటాడుచున్నట్లు స్థూలవిభాగము చేయబడినది. పై రెండు పదములకు 'వంద' యను సంఖ్యావాచకమే యర్థము. 'వంద' యను నర్థమున వా రుపయోగించు పదమునుబట్టి యూరూ భాషల కా విభాగము జరిగినది.

అట్లు వచ్చినవారు మొదట ఉత్తరభాగము నాక్రమించుకొని యుండిరి. ఆ పిదప మరొక గుంపు వచ్చి వారిని దక్షిణదిశకును పశ్చిమదిశకును తరిమి తాను ఉత్తరభాగమునుండి మధ్యభాగమునకు చేరికొని యుండును. ఇట్లు వేర్వేరు సమయములలో వచ్చిన ఆర్యులు మాటాడు భాషలో కూడ కొంత మార్పు కనిపించును. వేదకాలమున మాటాడెడి భాష ప్రథమప్రాకృతముగా పరిగణింపబడినది. దీనికి మూలమగు భాష యొకటి యుండెడిది. అదియే ఇండోయూరోపియను భాషల కన్నింటికి మూలమని యూహింపబడుచున్నది. ప్రథమప్రాకృతమునే సంస్కరించి నెలకొల్పుటచేత ఆ భాష సంస్కృతమై స్థిరత్వమునొంది కావ్యరచనాదికమున కుపయుక్తమైనది. ఆ పిమ్మట వాడుకలో మరింత మార్పు నొందిన ప్రాకృతములును, సంస్కృతాపభ్రంశములును ద్వితీయ ప్రాకృతముగా నేర్పడినవి. క్రీ. పూ. 400 సంవత్సరములనుండి క్రీ. శ. 1000 సంవత్సరములవరకు ద్వితీయ ప్రాకృతకాలముగా నంగీకరింపబడినది.

ఈభాషలుబౌద్ధజైనగ్రంథములందును, అశ్వఘోషునిరచనములందును, గాథాసప్తశతియందును, భాసుని నాటకములందును ప్రయోగింపబడినవి. ప్రాకృతవ్యాకర్తలు ఈ భాషలకు లక్షణములనుకూడ నియమించిరి. ఆ తరువాత వెలసినవానిని తృతీయప్రాకృతము లని యందురు. ఉత్తరహిందూస్థానమున నేను వాడుకలో నుండిన కాశ్మీరీ, పంజాబీ, గుజరాతీ, మరాఠీ, బెంగాలీ మున్నగుభాషలు తృతీయప్రాకృతములు.

ఆర్యులు భారతదేశమునకు వచ్చునాటికే భారతదేశమునందు ద్రావిడులు ఉన్నతసంస్కారవంతులుగా నున్నట్లు చరిత్ర సాక్ష్య మిచ్చుచున్నది. ఈ సందర్భమున శ్రీ సునీతికుమారచటర్జీ మాటలను గుర్తించుకొనుట యవసరము.

"It is believed that the wonderful city civilizatien of Sindh and South Panjab as Well as Balochistan (3250 B. C. - 2750 B. C.) was the work of Dravidian Speakers. But we cannot be absolutely certain in this matter, so long as the inscribed seals from the city-ruins in those areas like Harappa, Mohen-jo-Daro etc. remain undeciphered ... The Dravidian speech in its advent in India is older than Aryan, and yet (leaving apart the problematical writings on the seals found in Sindh and South Panjab city-ruins the specimens of connected Dravidian writing or literature that we can read and understand are over a millennium later than the oldest Aryan Documents."

దీనినిబట్టి ఆర్యభాషలతో సంపర్కము కలుగక పూర్వమే ద్రావిడులకు తమ భాషయు, లిపియు నున్నట్లు స్పష్టముగా తేలుచున్నది. ఇట్టియెడల ద్రావిడభాషలు సంస్కృతప్రాకృతములకు జన్యభాషలని కాని, సోదరభాషలని కాని యనుట యుక్తిసంగతము కాజాలదు.

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తమ ఆంధ్రభాషాచరిత్రమందు ద్రావిడభాషలనుకూడ ప్రాకృతములలోనే అంతర్భవింపజేయు

టకు అనేకయత్నములు చేసిరి. అనేకపదములను, క్రియలను సంస్కృత ప్రాకృతములనుండి కృత్రిమముగా సాధించుటకు ప్రయత్నించిరి. క్రీ. పూ. మూడవ శతాబ్దికే తెలుగుభాష స్వతంత్రముగా వాడుకలో నుండినట్లు ఈవరలో చూచితిమి. ఒకే ప్రాంతమున నున్న భాషలు ఇచ్చి పుచ్చు కొనుటలు సాగించుటలో ఆక్షేపము లేదు. అట్లే సంస్కృతప్రాకృత ములలోని యనేకపదములు తెలుగుభాషలో తత్సమతద్భవములుగా ప్రవేశించినవి. అట్లే తెలుగులోని యనేకపదములు ప్రాకృతములలో చేరినవి. ఐనను నిత్యోపయోగ్యములైన పదములు, సర్వనామములు, సంఖ్యావాచకములు మున్నగునవి తెలుగుభాషయందు సంస్కృత ప్రాకృతములతో సంబంధము లేకుండ నెన్నియో కలవు. ఈ దేశ్యపద ములే భాషకు ప్రాణభూతములు. శివస్కంధవర్మ వేయించిన హిరహడ గళ్ళి తామ్రశాసనములోని ప్రాకృతవాక్య విన్యాసమును శ్రీ గంటి జోగి సోమయాజిగారు ఈ విషయమున ఉదాహరించిరి.

"బమ్హణాణమ్ చిలెరెక కొండుక వాటకమ్ అకరయోల్లకవి నేసి ఖట్టావాసమ్ అదూధదధిగహణామ్ అరటసంవినయికమ్ అలోణగుళ చ్ఛోభమ్ అకరవెట్టికొంజల్లమ్ అపారమ్పరబలివద్ద గహణామ్ అహరితక సాకపుఫగహణామ్ ఏవమాదికేహి అట్ఠారస జాతిపరిహారేహి" మున్నగు విధముగా శాసనము సాగినది. సంస్కృతసమాసరచనమే యథాతథ ముగా, కేవలవర్ణవిపరిణామముతో ఇందు దిగినది. అదుగ్ధదధిగ్రహణము- అలవణ గుడక్షోభము - అపారంపరబలీవర్ద గ్రహణము - అతృణకాష్ఠ గ్రహణము - అహరితకశాకపుష్పగ్రహణము' మున్నగు సంస్కృత సమాసములే యివి యని స్పష్టముగా తేలును. 'ఏవమాదికైః' 'పరి హారైః' మున్నగు తృతీయాంతములు రూపాంతరము నొందినను, వాని స్వరూపము కనిపించుచునే యున్నది. 'పాలు, పెరుగు, ఉప్పు, బెల్లము, గడ్డి, కట్టెలు, కూరలు, పువ్వులు' మున్నగుపదములే నిత్యవ్యవహార మున నున్నవి. సంస్కృత విభక్త్యంతత్వము తెలుగున అంగీకార్యము కాదు. వాక్యనిర్మాణమునందును సంస్కృత ప్రాకృతములకును తెలుగు

భాషకును భేదము కలదు. ఇతరద్రావిడభాషలతో తెనుగునకు గల సామ్యము తెనుగు ద్రావిడకుటుంబములోని దని స్పష్టముగా నిరూపించుచున్నది. సంస్కృత ప్రాకృతముల కున్న సంబంధము తెలుగుతో సంస్కృతమునకుగాని, ప్రాకృతమునకుగాని ఏనాడును లేదు.

సంస్కృతమునందలి లింగవిభాగమునకును, ద్రావిడభాషలయందలి లింగవిభాగమునకును ఎంతో యంతరము గలదు. సంస్కృతమునందలి క్రియావిభక్తులు ప్రత్యయములు. ప్రాకృతమున సిద్ధరూపములే వికృతినొంది వాడబడుచున్నవి॥ కరోతి>కరఇ॥ ద్రావిడభాషలయందు పురుషబోధక ప్రత్యయములు సర్వనామావశిష్టరూపములే. సంస్కృతమున ఉపసర్గలు చేరి ధాత్వర్థము ననేకవిధములుగా మార్చుట కలదు. ప్రాకృతమున నిట్టి సిద్ధరూపముల వికృతులు గలవు. తెలుగున గాని ద్రావిడభాషలందుగాని ఉపసర్గల యుపయోగము కానరాదు. సంస్కృతమున విశేష్యవిశేషణములకు లింగవచన విభక్తులయందు ఏకరూపత నియతము. తెలుగున అట్టి నియమము లేదు. తెలుగున గల ఉభయార్థకాస్మచ్ఛబ్దము సంస్కృతప్రాకృతములందే నాడును లేదు. సంస్కృతప్రాకృతములందు కర్మార్థక ప్రయోగము విపులముగా కలదు. అట్టి యవసర మున్నప్పుడు సైతము ద్రావిడభాషలు కర్మార్థకము నుపయోగింపవు. క్వాచిత్కముగా నుపయోగించినను క్రియాధాతువుపై 'పడు' అను మరొకధాతువు నుపయోగించును. సంస్కృతమునందువలె ద్రావిడభాషలందు కర్మార్థక ప్రత్యయముగాని ఆదివృద్ధి మున్నగుమార్పులుగాని కలుగవు. వ్యతిరేకార్థమునందు సంస్కృతము 'అ' అని 'న' అని యుపయోగించి, దానికి పైని క్రియారూపమును వేరుగా వాడును. అంతే కాని క్రియాపదమునందు వ్యతిరేకార్థద్యోతకమగున దేమియు నుండదు. ద్రావిడభాషలలో 'అ' కారమే వ్యతిరేకతాబోధక చిహ్నము. ఈపాటి సామ్యమును చూచి తెనుగుసంస్కృతము లొకే రీతి నున్న వనుకొనరాదు. సంస్కృతములోవలె కాక ద్రావిడవ్యతిరేకక్రియ వేరుగా కలదు. ధాతువుపై వ్యతిరేక ప్రత్యయము

చేరి, ఆపైని కాలార్థకపురుషప్రత్యయములు చేరుట ద్రావిడభాషల లోని విశిష్టత.

ఇట్లే సంస్కృతప్రాకృతములతోను, తెలుగునకు జన్యసంబంధముగాని సోదరసంబంధముగాని లేదని నిరూపించు బలీయములయిన ఉపపత్తులు చాల గలవు. పైపెచ్చు తెలుగుభాష ప్రాకృతభాషకు కొన్ని విషయములందు తోడ్పడినట్లు కూడ చెప్పగల యాధారము లున్నవి.

ఉద్వృత్తాచ్చుల నడుమ యకార వకారములు చొరబడుట ద్రావిడసంప్రదాయము. సంస్కృతమునందు అట్టిది లేదు. 'సః ఆగతః' అని యున్నప్పుడు 'స ఆగతః' అనియే సంస్కృతమున నగును. ప్రాకృతమున 'అమృత' శబ్దవికృతి 'అమిఅం' అని యగును. దీని ఉచ్చారణ 'అమియం' అని యుండును. నేటి ఉత్తరహిందూస్థానభాషలలో కూడ ఈ ప్రభావము కనిపించును. ప్రాకృతమునందు ఋ ౠ ఐ ఔ వర్ణములు తొలగిపోయినవి. సంయుక్తాక్షరములు ద్విత్వాక్షరములుగా మారినవి. కొన్నియెడల అదనముగా నొక స్వరము వచ్చి రెండు వర్ణములను వేరుపరుచుటకూడ కనిపించును॥ రత్న > రదన; మృగ > మురగ॥ ఇట్టి మార్పులు ప్రాకృతమునందు ద్రావిడభాషాప్రభావమువలననే కలిగిన వనక తప్పదు. ఇవి ద్రావిడభాషలకు సహజసిద్ధములు; ద్రావిడభాష లన్నింటియందును సమానలక్షణములతో కనిపించును ప్రాకృతభాష లన్నింటియందు గాని, ప్రాకృతభాషలకు తల్లియైన సంస్కృతమున గాని ఈ లక్షణములు లేకుండుట ద్రావిడభాషాప్రభావ నిరూపకము.

## తత్సమ తద్భవ దేశ్యములు

వ్యాకర్తలు తెలుగుశబ్దములను తత్సమ తద్భవ దేశ్య గ్రామ్యములుగా విభాగించిరి. గ్రామ్యమనగా లక్షణ విరుద్ధమని యభిప్రాయము. కాబట్టి గ్రంథరచనమునకు యోగ్యము కాదని నిరసించిరి. గ్రామ్యమునే నేటికాలమున 'వ్యావహారికము' అనుపేర వ్యవహరించుచున్నాము. ఆ విషయమై ఆ సందర్భము వచ్చినపుడు ముచ్చటించుకొందము. ప్రస్తుతమునకు తత్సమ తద్భవ దేశ్యములనుగూర్చి యాలోచింతము.

**తత్సమము** : 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' అని చిన్నయసూరిసూత్రము. కావున 'తత్' అను శబ్దమునకు సంస్కృత ప్రాకృతము లని యర్థము. సంస్కృతమును మొదటి ప్రకృతిగాను, ప్రాకృతమును రెండవప్రకృతిగాను ప్రథమాచార్యుడే తలపోసెను. ఆ రెంటింటికిని వికృతియైనది 'తెలుగు' అని ఆయన యభిప్రాయము. కావున సంస్కృత ప్రాకృతములతో సమానములగున శబ్దములను తత్సమములని యనవచ్చును.

కాని యిక్కడ మరొకవిషయమును గమనించుట యవసరము. తత్సమ తద్భవ దేశ్యములతో కూడియున్న భాషను 'ఆంధ్రము' అని యందురు. 'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబది యైదు' అనుచోట ప్రౌఢ వ్యాకరణకారుడు ఈభాషనే భావించినట్లు స్పష్టము. ఇది కాక 'అచ్చ తెలుగు' అని మరొకభేదము కలదు. చిన్నయసూరి "సంస్కృతసమేతరంబయిన యీ భాష యచ్ఛ యనంబడు"అని తెల్పి అచ్చతెలుగును నిర్వచించెను. దీనినిబట్టి ప్రాకృతసమములుకూడ ఆచ్ఛికమునందే చేరవలయును. కొందరు దేశ్యములను మాత్రమే అచ్చతెలుగు శబ్దములుగా పరిగణించినప్పటికి అచ్చ తెనుగుకావ్యములందు ప్రాకృతసమములును, తద్భవములును పర్యాప్తప్రభావమును సంపాదించుకొన్నవి. కావున సంస్కృతసమములను వేరుగా పరిగణించి ప్రాకృతసమములను, సంస్కృతభవములను, ప్రాకృతభవములను, దేశ్యములను చేర్చి 'అచ్చ తెలుగు'గా పరిగణించుట యుచితము.

తత్సమములందలి ప్రాకృతసమములు అచ్చతెలుగులో చేరుచున్నవి. కావున వానిని ప్రస్తుతమునకు విడిచి సంస్కృత సమముల రూపనిష్పత్తిని గూర్చి యాలోచింతము.

సంస్కృతముతో సమానమయినది తత్సమము. అనగా సంస్కృత ప్రాతిపదికను గ్రహించి, ఆంగికమైన మార్పేమియు చేయకుండ, చివర తెలుగుప్రత్యయములను చేర్చుకొనగా ఏర్పడిన రూపమును తత్సమము అని యందురు. 'ఆంగికమైన మార్పు' అని యనుటచేత ప్రాతిపదిక

నడుమ యే విధమయిన మార్పును జరుగరాదని యర్థము. తుదియందు ఒకటిరెండు వర్ణములు పోవుటకు, అదనముగా చేరుటకు అభ్యంతరము లేదు. 'రామ' యను ప్రాతిపదికపై డుజ్వర్ణకము చేరును. అప్పుడు వెనుకనున్న అత్వమునకు ఉత్వము కలిగి 'రాముఁడు' అను రూప మేర్పడును.

| సంస్కృతము | తత్సమము |
|---|---|
| రామః | రాముఁడు |
| భగవత్ | భగవానుఁడు, భగవంతుఁడు |
| స్వరాట్ | స్వరాట్టు |
| సుత్రామన్ | సుత్రాముఁడు |
| విశ్వకర్మన్ | విశ్వకర్మ, విశ్వకర్ముఁడు |
| వృద్ధః | వృద్ధు, వృద్ధుఁడు |
| నన్నయభట్టః | నన్నయభట్టు |
| యోధః | యోధ, యోధుఁడు |
| పురోధస్ | పురోధ, పురోధసుఁడు |
| వృక్షః | వృక్షము |
| కలత్రమ్ | కళత్రము |
| మిత్రమ్ | మిత్రము, మిత్రుఁడు |
| మధు | మధువు |
| వధూ | వధువు |
| విష్ణుః | విష్ణువు, విష్ణుఁడు |
| ఇంద్రజిత్ | ఇంద్రజి, ఇంద్రజిత్తు, ఇంద్రజితుఁడు |
| జగత్ | జగత్తు, జగము |
| సరస్ | సరస్సు, సరసు |
| మనస్ | మనస్సు, మనసు, మనము |
| నౌః | నావ |
| ద్యౌః | దివి |
| హృత్ | హృది |
| కద్రూః | కద్రువ |

పై రూపములనుబట్టి సంస్కృతసమముల స్వరూపమును నిర్ణయించుకొనవచ్చును. ఆంగికముగా నెచ్చటను ఏ విధమయిన మార్పును జరుగుట లేదు. ప్రాతిపదికయొక్క అంతమునందున్న 'న' 'మ'మున్నగు వర్ణములకు లోపము కలుగుటకాని, అదనముగా ఉత్వాద్విత్వములు వచ్చుట కాని, అందొక్కటి వచ్చుట కాని జరుగుచున్నది. ఇంకొక్క విషయము. సంస్కృతమునందలి అజంతప్రాతిపదికలు తెలుగునందుకూడ ప్రాతిపదికలుగా వ్యవహరించుచున్నవి. హలంతములైనపుడు సంస్కృత ప్రాతిపదికలతో సంబంధము పెట్టుకొనక, ప్రథమైకవచనరూపమును గాని, ద్వితీయైకవచనరూపమునుగాని ప్రాతిపదికముగా గ్రహించు చున్నవి. అనగా వ్యవహారమునందున్న సంస్కృతశబ్దములయొక్క చివర తెనుగుప్రత్యయములను చేర్చి తత్సమరూపములను సాధించుకొనుట జరుగుచున్నదని యర్థము.

ప్రాకృతముల విషయముకూడ అట్లే జరుగుచున్నది. తెలుగు దేశమునందును, పరిసరములందును ఉన్న ప్రాకృతమునే తెలుగువారు గ్రహించియుందురు. కాని కొందరు వ్యాకర్తలు ప్రాకృతసమములను వింగడించి, కొన్నింటి నొక ప్రాకృతమునకు, కొన్నింటిని మరొకప్రాకృతమునకు చెందినట్లు నిర్ణయించుచున్నారు. అది కృత్రిమపద్ధతి. ఏభాష కయిన మరొకభాషతో సాహచర్యము కలిగినప్పుడు మాత్రమే అందలి పదము లిందుగాని, ఇందలి పదము లందుగాని చేరుట కవకాశముండును. అట్లు కానియెడల పరస్పరవినిమయమునకు అవకాశము కలుగదు.

| ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|
| అగ్గీ | అగ్గి |
| కారో | కారము |
| గారవమ్ | గారవము |
| జమో | జముఁడు |
| రాణీ | రాణి |
| సిరీ | సిరి |

ఇక్కడకూడ తుదనున్న వర్ణమునకే కాని ఆంగికముగా మార్పు వచ్చుట లేదు. అనగా ప్రాకృతరూపముతో సమానముగా నున్నవనియే యర్థము. అయినను ఈ రూపములకు తోడి తత్సమములయిన సంస్కృత సమములతో సమసించు యోగము లేదు. అన్నివిధముల నివి యాచ్ఛికములతో సమానముగనే పరిగణింపబడును. సంస్కృతమూలముతో పోల్చిచూచినప్పుడు తెలుగురూపమున ఆంగికమైన మార్పు కనిపించును. కావుననే ఇట్టిరూపములనుకూడ తద్భవములతోపాటుగా ఆచ్ఛికము నందే అంతర్భవింపజేయుట జరుగుచున్నది. అదియే యుచితము.

**తద్భవములు** : "సంస్కృత ప్రాకృతజన్యం బయిన భాష తద్భవంబు" అని చిన్నయసూరి నిర్వచనము. సంస్కృతమునుండి కాని ప్రాకృతమునుండి కాని పుట్టిన భాషకు తద్భవమని పేరు. సంస్కృతమునుండి కాని, ప్రాకృతమునుండి కాని యొకపదమును తెచ్చుకొని, తెలుగువిభక్తులను చేర్చుట మాత్రమే కాక, ప్రకృతియందు కూడ మార్పును గలిగించి ప్రయోగించినయెడల అట్టిపదమును తద్భవమని యందురు.

ఈ మార్పును ఐదు రకములుగా శాస్త్రజ్ఞులు నిరూపించిరి. వర్ణాగమము, వర్ణాదేశము, వర్ణలోపము, వర్ణవ్యత్యయము, వర్ణసమీకరణము - అనునవి ఆ ఐదు రకములు.

వర్ణాగమము అని యనగా అదనముగా వర్ణము వచ్చుట యని యర్థము.

| తత్సమము | తద్భవము | ఆగమము |
|---|---|---|
| ద్వారము | దువారము | ఉ |
| చంద్రుఁడు | చందిరుఁడు | ఇ |
| రక్తము | రకతము | అ |
| అల్పము | అలుపము | ఉ |
| రాత్రి | రాతిరి | ఇ |
| యాత్ర | జాతర | అ |

వర్ణాదేశము అని యనగా ఒకవర్ణమును తొలగించి మరొకవర్ణము వచ్చుట యని యర్థము. ఒక వర్ణమును తొలగించి పెక్కువర్ణములు వచ్చుటయు, పెక్కువర్ణములకు బదులు ఒక్కవర్ణము వచ్చుటయుకూడ ఇక్కడ కనిపింప వచ్చును.

| తత్సమము | తద్భవము | ఆదేశము |
|---|---|---|
| నీరము | నీరు | అ>ఉ |
| రూపము | రూపు | అ>ఉ |
| శీతము | సీతు | ,, |
| యామము | జాము | ,, |
| కాకము | కాకి | అ>ఇ |
| నీవారము | నివ్వరి | అ>ఇ |
| విజ్ఞప్తి | వినతి | జ్ఞ>న |
| ఆజ్ఞప్తి | ఆనతి | ,, |
| ద్వయము | దోయి | ద్వ>దో;అ>ఇ |
| మృత్యువు | మిత్తి | మృ>మి;ఉ>ఇ |
| వైద్యుఁడు | వెజ్జు | ఐ>ఎ;ద్యు>జ్జు |
| కాచము | గాజు | క>గ; చ>జ |
| నిత్యము | నిత్తెము | త్య>త్తె |
| | నిచ్చ | త్య>చ్చ |
| సత్యము | సత్తెము | త్య>త్తె |
| సంధ్య | సంజ | ధ్య>జ |
| | సందె | ధ్య>దె |
| చిహ్నము | చిన్నె | హ్న>న్న |
| కాష్ఠము | కట్టె | ష్ఠ>ట్ట |
| విద్య | విద్దె | ద్య>ద్దె |
| ప్రజ్ఞ | పగ్గె | జ్ఞ>గ్గ |
| సాక్షి | సాకిరి | క్షి>కిరి |

| తత్సమము | తద్భవము | ఆదేశము |
|---|---|---|
| భిక్షము | బికిరము | క్ష > కిర |
| అర్ఘ్యము | అగ్గువ | అ > ఉవ |
| సత్త్వము | సత్తువ | అ > ఉవ |
| యశము | అసము | య > అ; శ > స |
| యువతి | ఉవిద | యు > ఉ; తి > ద |
| కేతకి | గేదఁగి | పరుషములు > సరళములు |
| ముఖము | మొకము | మ. ప్రాణము > అ. ప్రాణము |
| సఖి | సకి | ,, |
| ఇచ్ఛ | ఇచ్చ | ,, |
| పీఠము | పీట | ,, |
| కథ | కత | ,, |
| ఫలకము | పలక | ,, |

వర్ణలోపము అని యనగా ఉన్నవర్ణములలో ఒకటికాని అంతకెక్కువగాని వర్ణములు లోపించుట యని యర్థము.

| తత్సమము | తద్భవము | లోపము |
|---|---|---|
| స్నిగ్ధము | నిద్దము | స |
| మాణిక్యము | మానికము | య |
| తామరసము | తామర | సము |
| స్వామి | సామి | వ |
| ప్రయాణము | పయనము | ర |
| ప్రవాళము | పవడము | ర |

వర్ణవ్యత్యయ మని యనగా పదమునందు వేరువేరు స్థానములందున్న వర్ణములు క్రొత్తస్థానములందు నెలకొనుట. 'పారావతము' అను తత్సమమునందు ద్వితీయస్థానమున 'ర' వర్ణమును, తృతీయస్థానమున 'వ' వర్ణమును గలవు. తద్భవమైన 'పావురము' అను పదమునందు ద్వితీయస్థానమున 'వ' వర్ణమును తృతీయమునందు 'ర' వర్ణమును

నిల్చినవి. అనగా 'రవ'లు పరస్పరము వినిమయము నొందినవన్నమాట! ఒకేభాషలో కూడ ఇట్టిమార్పు జరుగవచ్చును. 'మరకతము' అనునది 'మరతకము' అని యగుట దీనికి నిదర్శనము. సులువు, వుసులు–మున్నగు విధముగా వ్యవహారమునందుకూడ ఇట్టిరూపములు వినిపించుచునే యుండును.

వర్ణసమీకరణము అని యనగా రెండు భిన్నములయిన వర్ణములు కలిసి సంయుక్తాక్షర మైనప్పుడు అందొకవర్ణము రెండవవర్ణమును తనలో కలిపివేసికొనుట. అనగా సంయుక్తాక్షరమునకు బదులుగా తద్భవమునందు ద్విత్వాక్షరము మాత్రమే యేర్పడు నని యర్థము.

| తత్సమము | తద్భవము | మార్పు |
|---|---|---|
| శ్రేష్ఠి | సెట్టి | ష్ఠి > ట్టి |
| పక్షి | పక్కి | క్షి > క్కి |
| శర్కర | చక్కెర | ర్క > క్క |
| అర్పణము | అప్పనము | ర్ప > ప్ప |
| శబ్దము | సద్దు | బ్ద > ద్దు |
| అన్యము | అన్నెము | న్య > న్నె |

'య' వర్ణముతో కూడియున్న అన్యాదిశబ్దములు తద్భవములందు 'ఎ' వర్ణమును కలిగియుండుట గమనార్హము. 'య' వర్ణము 'జ' వర్ణముగా పరిణామము నొందినయెడల ప్రాకృతసంపర్కముతోడనే తద్భవమేర్పడెనని నిశ్చయముగా చెప్పవచ్చును. సంధ్య – సంజ; శయ్య – సెజ్జ॥ ఇట్టిచోట్ల తద్భవరూపములు ప్రాకృతమువలననే యేర్పడెను. అట్లు కానియెడల 'య'స్థానమున ఎత్వము కలుగుట ప్రయోగసిద్ధము. సంధ్య – సందె ; విద్య – విద్దె॥ మున్నగునవి అట్టివానికి నుదాహరణములు.

'పుణ్యము' మున్నగునవి తద్భవములగునపుడు తొలుదొల్త వర్ణాగమము నొంది 'పునియము' మున్నగువిధముగా నై యుండును. కాని సంయుక్తాక్షరమును పలుకునప్పుడున్న ఊనిక చాలకపోవుటచే ద్విత్వమునొంది 'పున్నియము' అని యైయుండును. ఇచ్చటి 'య' వర్ణము

'ఎ' వర్ణముగా మారుగుణము గలదగుటచే, అట్లు మారగా 'పున్నెము' అను రూపముకూడ నేర్పడెను. ఇట్టివే వన్నియ, వన్నె; జన్నియ, జన్నె; కన్నియ, కన్నె - మున్నగువిధముగా ద్వైరూప్యము నొందిన రూపము లన్నియు కూడ.

ఇంతకును సంస్కృతమునుండియు ప్రాకృతములనుండియుకూడ తద్భవములు ఏర్పడునని చెప్పికొంటిమి. అది యథార్థమే. కాని ప్రాకృతమునకుకూడ మూలము సంస్కృతమే. కావున సంస్కృతమునుండి ప్రాకృతములోనికి వెళ్ళి తెలుగులోనికి వచ్చిన శబ్దమేదియో, ప్రాకృతములోనికి వెళ్ళకుండ సరాసరి తెలుగులోనికి వచ్చినశబ్దమేదియో నిర్ణయించుట కష్టము. ధ్వనిపరిణామము చాలవరకు తెలుగునందును ప్రాకృతమునందును ఒకే మాదిరిగానుండును. ఒక్క 'య'వర్ణము 'జ' వర్ణముగా మారినచోటమాత్రము ప్రాకృతసంపర్కమును పట్టియిచ్చును. తక్కినచోట్ల అట్టి యవకాశము కలుగదు. కావున సంస్కృతభవములను, ప్రాకృతసమ ప్రాకృతభవములను నిర్దిష్టముగా చెప్పుట సులభ సాధ్యము కాదు. ఏమయినను, ఆమూడురకముల శబ్దములను అచ్చతెలుగు లనియే భావింతు మన్న విషయము స్మర్తవ్యము.

**దేశ్యములు** : చిన్నయసూరి "త్రిలింగ దేశవ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు" అని నిర్వచించెను. దీనినిబట్టి దేశ్యపదములు తత్సమ తద్భవములవలె సంస్కృతప్రాకృతములతోగాని, మరేభాషలతోగాని ఏవిధమైన సంబంధమును లేకుండ తెలుగుదేశములోనే పుట్టి తెలుగు దేశములోనే వ్యవహారము నొంది రూఢములయిన పదములని యూహింపను. దేశ్యములకు సంస్కృతప్రాకృతములతో జన్యజనకసంబంధము కాని, సోదరసంబంధముకాని యేమాత్రమును లేదనుమాట వాస్తవము. కావుననే అవి దేశ్యములైనవి. చూడగా చూడగా దేశ్యపదములతో సామ్యముగల పదములు దక్షిణాది భాషలయిన తమిళ కర్ణాట మలయాళాదిభాషలలో సుస్పష్టముగా కనిపింపసాగినవి. కావున 'దేశ్యములు' అని యన్నప్పుడు 'ఇతరభాషలతో ఏవిధమైన సంబంధమును లేనివి' అని

యనుకొనుట సమంజసము కాదు. తమిళ కర్ణాట మలయాళాది భాష లలో నున్న దేశ్యములును, తెలుగునందలి దేశ్యములును ఒకేభాషా కుటుంబమునకు చెందినవన్న విషయము దీనినిబట్టి వ్యక్తమగుచున్నది.

| తెలుగు | తమిళము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| నేను | నాన్ | నాను | ఞాన్ |
| పల్లు | పల్ | హల్లు | పల్లు |
| తల | తలై | తలె | తల |
| మన్ను | మణ్ | మణ్ణు | మణ్ణు |
| కన్ను | కణ్ | కణ్ణు | కణ్ణు |
| తెర | తిరై | తెరె | తిర |
| కొలను | కుళమ్ | కొళను | కుళం |
| మొదలు | ముదల్ | మొదల్ | ముదలు |

పై పదములపట్టికనుబట్టి తెలుగునందలి పదములతో ఇతరపద ములకు గల సామ్యమును సులభముగా గుర్తుపట్టవచ్చును. కావున దేశ్యములు కర్ణాటాదిభాషాదేశ్యములతో సోదరసంబంధమును కలిగి యున్న వన్న సంగతిని నిరాక్షేపముగా నంగీకరింపవచ్చును.

ఇప్పుడింక, ఇంకొక విభాగము కలదు. చిన్నయసూరి అన్యదేశ్య ములనుగూర్చి ప్రస్తావింపలేదు. అయినను పూర్వవ్యాకర్తలును, అనం తర వ్యాకర్తలును అన్యదేశ్యములనుగూర్చి ప్రసంగించి యుండిరి. పైని చెప్పికొన్నదానినిబట్టి సంస్కృత ప్రాకృతములనుండి అనేకపద ములు తెలుగులో ప్రవేశించెనని తేలినది. ఆ తమిళాదిపదములతో సామ్యముగల యనేకపదములు తెలుగునందున్న వనియు తేలినది. ఇటుకాక, ఇతర కారణముల ప్రాబల్యమువలన పారశీకము, అరబ్బీ, ఆంగ్లము, పోర్చుగీసు మున్నగు భాషాపదములు తెలుగులో ప్రవేశిం చుట జరిగినది. పైని చెప్పిన తత్సమ తద్భవ దేశ్యములలో ఇముడ కుండ వేరుగా వచ్చి చేరినటువంటివానిని అన్యదేశ్యము లని యందురు.

రోజు, కలము, పసందు, సుమారు, అసలు – మొదలైనమాటలు తెలుగులో విడదీయరానంతగా కలిసిపోయినవి. కాని యివియన్నియు అన్యదేశ్యములే. ఇట్లే కచ్చేరి, దస్తావేజు, దస్తూరి, అమీనా, గుమస్తా మొదలైనవికూడ అన్యదేశ్యములే. అరబ్బీ పారశీకాది భాషలనుండి వచ్చిన వీనిని ఉర్దూ సంబంధిభాషలుగా పరిగణింతము.

పైవి మార్పులేకుండ వచ్చినరూపములే. అటుకాక 'తరాజు' అను రూపమునకు బదులు 'త్రాసు' అని 'దవాత్' అనుటకు బదులు 'దవితి' అని మార్పునొందిన రూపములుకూడ కొన్ని కలవు.

రోడ్డు, స్టేషను, టికెట్టు మున్నగువిధముగా మార్పుచెందకుండ వచ్చినరూపములు గలవు. ఆంగ్లము, ఫ్రెంచి, డచ్చి మున్నగుభాషలలో నుండి వచ్చినపదములను ఆంగ్లభాషాసంబంధులుగనే పరిగణింతము.

కలకటేరు, పేనా, బేడా, అలమారా, బీరువా మొదలయినవి మార్పు పొందినరూపములు.

ఇట్టి అన్యదేశ్యములనుగూడ కొందరు దేశ్యములలోనే అంతర్భవించునట్లు తలచిరి. అట్లు చేసినయెడల కొన్నిచిక్కులు తటస్థించును. ఖావు, ఖవర, ఖింగణా మొదలయినవి అన్యదేశ్యములు. అచ్చతెనుగు కావ్యములలో వీనికి తావు లభించినది. కాని తెనుగునందున్న ముప్పది మూడు వర్ణములయందును 'ఖ' వర్ణము లేదు. కావున 'దేశ్యము' అని యనవలయునన్నచో తదతిరిక్తమైన వర్ణము లేకుండ నుండవలయును, ఉన్నవర్ణమును మార్చుట వీలుకాదు కాబట్టి దేశ్యముతోపాటు పరిగణింపకుండ నుండుట యుచితము. నిషా, షాదుషా మొదలయిన పదముల కడ సైతము ఇట్టి చిక్కు కలదు. కావున మరొక మార్గము ననుసరింపవలయును.

అన్యదేశ్యములనుకూడ తత్సమ తద్భవములుగా విభాగించుకొనుట యుచితము. ఆమాటలే యిష్టము కానిచో ఉర్దూ సమము, ఉర్దూభవము; హిందీసమము, హిందీభవము; ఆంగ్లసమము, ఆంగ్లభవము – మున్నగువిధముగా వాడుకొనవచ్చును. సమశబ్దములను వాడు

కొనునప్పుడు అవసరమునుబట్టి మూలభాషావర్ణములను గ్రహింపక తప్పదు. భవశబ్దములను వాడునప్పుడు తెలుగునందలి వర్ణములతోనే సరిపుచ్చుకొనవచ్చును.

మొత్తముమీద సంస్కృతసమముకాక, తక్కిన యన్ని శబ్దములును ఆచ్ఛికముగా ఉపయోగింప నర్హమైనవే. 'సాదము' మొదలయిన తమిళపదములు తరువాతికాలమున తెలుగులో ప్రవేశించినవి. 'హొన్ను' మొదలయినవి కన్నడమునుండి యనంతరకాలమున ప్రవేశించినవి. ఇట్లు అనంతరకాలమున చేరి భాషలో లీనవ కాక ప్రత్యేకవర్గముగా నిలుచు మాటలను ఆదేయపదములు (Loan words) అనియందురు. అన్యదేశ్యము లన్నియు నట్టివే.

ఈ తత్సమ తద్భవ దేశ్యములు అన్యదేశ్యములతోపాటుగా, మనచరిత్రను సంస్కృతిని ఇతరేతరసంబంధములనుగూడ తెలియజేయుటకు సమర్థములై యున్నవి.

## ద్రావిడభాషలందు తెలుగుస్థానము

సంఖ్యాబల మెక్కువగుచున్నకొలది విశ్లేషణమున కావశ్యకత మెక్కువగుచుండును. అప్పుడుకాని సూక్ష్మతరభేదములను గమనించుట కవకాశము కలుగదు. ఇరువదిరెండు ద్రావిడభాషలున్నట్లు సిద్ధాంతప్రకరణమునందు మనము పరిగణించుకొని యుంటిమి. అవియే కాక, ఇటీవల కొన్ని భాషలపేర్లు క్రొత్తగా తెలియవచ్చినవి. వానిలో పెంగొ, కొండ యనుపేర్లనుగూడ కలుపుకొనవలయును. ఇవికాక, యింకను కొన్ని పేర్లు వినవచ్చుచున్నవి కాని ఆయాభాషలందు వాని ప్రత్యేకతను గుర్తింపగలిగినంతటి కృషి యింకను జరుగలేదు. అవి మాండలికస్థితిలో నున్నవో, భాషాస్థితి నందుకొన్నవో చెప్పుటకూడ ఇప్పటి పరిస్థితులనుబట్టి కష్టమే. పైని పరిగణించిన భాషలలో కొన్ని భాషలు మరికొన్ని భాషలతో అధికసాదృశ్యమును చూపుచున్నట్లు కనిపించును. ఇట్లుండుటకు భౌగోళికమైన కారణమొకటి స్పష్టముగా కానవచ్చును. దీనినిమించి ఆయాభాషలయందు కలిగిన వర్ణ శబ్ద

వ్యాకరణాది పరిణామములనుగూడ ముఖ్యకారణముగా పరిగణింప వచ్చును. ఈ కారణములనుబట్టి సన్నిహితములైన భాషలను ఒక వర్గమునకు చెందినట్లుగా నిశ్చయింపవచ్చును.

సర్ జార్జి గ్రియర్సన్ ద్రావిడభాషల నన్నింటిని ఐదు వర్గములుగా విభాగించెను. 1. ఆంధ్రవర్గము 2. దక్షిణవర్గము 3. మధ్యమవర్గము 4. వాయవ్యవర్గము 5. అర్ధద్రావిడవర్గము. కాని యీ వర్గీకరణమునుబట్టి ఆయావర్గములందలి విశేషములను నిరూపించు ప్రయత్నము లేమియు జరుగలేదు. శ్రీ L. V. రామస్వామిఅయ్యరు రచించిన 'The evolution of Malayalam Morphology' అన్న తమ గ్రంథము నందు తమిళ మలయాళముల నొకవర్గముగా పరిగణించిరి. శ్రీ ఎమెనో 'Toda, A Dravidian Language' అన్న తమ గ్రంథమునందు తోద కోతల నొకవర్గముగా భావించుట జరిగినది. శ్రీ ఏమెనో 'Kolami, A Dravidian Language' అన్న తమ గ్రంథమునందు కోలామి, నాయికీ, పర్జీ, ఒల్లారి, గదబ - అను భాషల నొకవర్గముగా పరిగణించిరి. ఇదే విషయమును శ్రీ బరో, శ్రీ సుధిభూషణ భట్టాచార్య అను వారలు తాము రచించిన 'The Parji Language' అను గ్రంథము నందు సూచించిరి. ఇట్లే కుయి కువి భాషలకు సంబంధము గలదు; కురుఖ్ మల్తో భాషలకు సంబంధము గలదు. వీనినన్నింటిని దృష్టియందుం దుంచుకొని డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు 'Telugu Verbal Bases' అన్న తమ పరిశోధన గ్రంథమునందు నాలుగవయధ్యాయము నంతటిని ద్రావిడభాషలందు తెలుగుస్థానమును నిర్ణయించుటకు వినియోగించిరి. ఇది అత్యంతసమగ్రముగను, సమర్థముగను శాస్త్రీయమైన మార్గములో సవిమర్శముగా నిర్ణయింపబడినది.

భాషాకుటుంబములను నిర్ణయించుటలో అవలంబించిన విధాన మునే భాషాకుటుంబమునందలి వివిధవర్గములను నిర్ణయించుట కవలం బింపవచ్చును. కావున ముందు స్థూలముగా వివిధవర్గములకు చెందిన భాషలను పరిగణింతము. ప్రస్తుతాంశము తెలుగుభాష కావున దాని

నేవర్గమునందును చేర్పకుండనుండి విమర్శనానంతరము దానికి దక్కవలసిన స్థానమును దావికి సమర్పించుట మంచిది. భాగోళికముగా దక్షిణ వర్గము, మధ్యమ వర్గము, ఉత్తరవర్గము - అని మూడు విభాగములు చేయవచ్చును.

మూలద్రావిడము

| దక్షిణవర్గము | మధ్యమవర్గము | ఉత్తరవర్గము |
|---|---|---|
| తమిళము | కుయి | |
| మలయాళము | కువి | |
| కన్నడము | కోలామీ | |
| | కొండ | |
| | నాయికీ | |
| | పర్జి | |
| తోద | కోయ | |
| కోత | ఒల్లారి | |
| బడగ | గోండి | కురుఖ్ |
| కొడగు | పెంగో | మల్తో |
| తుళు | గదబ | బ్రాహుయీ |

పై పట్టికయందు పేర్కొనబడిన భాషలతో తెలుగునకుగల సామ్యమునుబట్టి స్థానమును నిర్ణయించుట సముచితముగా నుండును.

**సర్వనామములు : అస్మదర్థకము - ఏకవచనము**

| | పదము | తటము |
|---|---|---|
| తమిళము | యాన్/నాన్ | ఎన్ |
| మలయాళము | ఞాన్ | ఎన్ |
| కోత | అ'న్ | ఎన్-/ఎ |
| తోద | ఒ'న్ | ఎన్ |

| | పదము | తటము |
|---|---|---|
| కన్నడము | ఆన్ / నాన్ | ఎన్ / నన్ |
| కొడగు | నని / న' | ఎన్ / నన్ / న' |
| తుళు | యాను / యేను | ఎన / ఎన్ |
| తెలుగు | ఏను / నేను | నన్ / నా |
| కోలామి | అ'న్ | అన్ |
| నాయికీ | ఆన్ | అన్ |
| పర్జి | ఆన్ | అన్ |
| గదబ | ఆన్ | అన్ |
| గోండి | అనా / నన్నా / ననా | నా |
| కొండ | నాన్ | నా |
| కుయి | ఆను | నా |
| కువి | నాను | నా |
| కురుఖ్ | ఏన్ | ఎఙ్గ్ |
| మల్తో | ఏన్ | ఎన్గ్ |
| బ్రాహుయీ | ఈ | కన్ |

పై పట్టికనుబట్టి తెలుగునందున్న 'ఏను' అన్న రూపముతో కురుఖ్, మల్తో భాషారూపములు పోలికను గలిగియున్నవి. 'నేను' అన్న రూపముతో కొండ, కువి భాషలయందలి రూపములకు పోలిక గలదు. విభక్త్యంగమైన 'నా' అన్న రూపముతో గోండి, కొండ, కువి, కుయి భాషారూపములకు పోలిక గలదు. కావున అస్మదర్థకైకవచనము పద రూపమున నుత్తరద్రావిడ వర్గముతోను, తట (విభక్త్యంగ) రూపమున మధ్యమద్రావిడ వర్గముతోను సామ్యమును గలిగియున్నది.

**అస్మదర్థక బహువచనము**

| | పదము | తటము |
|---|---|---|
| తమిళము | యామ్ | ఎమ్ |
| | నాఙ్గళ్ / నామ్ | ఎఙ్గళ్ / నమ్మ |
| మలయాళము | ఞాన్నళ్ / నామ్ | ఞాన్నళ్ / ఎన్నళ్ / నమ్మ |

| | పదము | తటము |
|---|---|---|
| కోత | అ'మ్ | ఎమ్ (బ) అమ్ (ఉ) |
| తోద | ఎమ్ | ఎమ్ (బ) |
| | ఒమ్ | ఒమ్ (ఉ) |
| కన్నడము | ఆమ్ | ఎమ్ (బ) |
| | నావు | నమ్ (ఉ) |
| కొడగు | ఎఙ్గ/నఙ్గ | ఎఙ్గ/నఙ్గ |
| తుళు | ఎన్కుళు | ఎన్కుళె (బ) |
| తెలుగు | ఏము/నేము/మేము | మా/మమ్(బ) |
| | మనము | మన (ఉ) |
| కోలామి | అ'మ్ | అమ్ |
| నాయికీ | ఆమ్ | అమ్ |
| గదబ | ఆమ్ | అమ్ |
| గోండి | అమ్మాట్/మమ్మాట్ | మా |
| కుయి | ఆము (బ) అజు (ఉ) | మా |
| కువి | మాము (బ) మారో/మాఁరో (ఉ) | మా |
| కురుఖ్ | ఏమ్ | ఎమ్ (బ) |
| మల్తో | ఏమ్ | ఎమ్ |

తెలుగులో నున్న 'ఏము' రూపముతో కురుఖ్, మల్తో భాషల యందలి రూపములు సామ్యమును గలిగియున్నవి. 'మేము' అన్నరూపముతో పూర్తిసామ్యముగల రూపములు కానరావు. కాని గోండి, కువి భాషలలోని రూపములుగూడ మవర్ణముతో ప్రారంభమగుటచేత కొంతసామ్యము నంగీకరింపవచ్చును. ఇంక తెలుగునందలి తటరూపమైన 'మా'తో గోండి, కుయి, కువి భాషలలోని రూపములు సామ్యమును గలిగియున్నవి. దీనినిబట్టి అస్మదర్థక బహువచనము పదరూపమున నుత్తర

ద్రావిడ వర్గముతోను, తట రూపమున మధ్యమద్రావిడ వర్గముతోను సామ్యమును గలిగియున్నదని నిర్ణయము చేయవచ్చును.

**యుష్మదర్థకైకవచనము.**

| | పదము | తటము |
|---|---|---|
| తమిళము | నీ | నిన్/ఉన్ |
| మలయాళము | నీ | నిన్ |
| కోత | నీ | నిన్/ని/ది |
| తొాద | నీ' | నీన్ |
| కన్నడము | నిమ్/నీను | నిన్ |
| కొాడగు | ని'ని/ని | నిన్/ని |
| తుళు | ఈ | నిన్ |
| తెలుగు | ఈవు/నీవు | నిన్/నీ |
| కోలామి | నివ్ | ఇన్ |
| నాయికీ | నీవ్ | — |
| పర్జి | ఈన్ | ఇన్ |
| గదబ | ఈన్ | ఇన్ |
| గోండీ | ఇమ్మా | నీ |
| కొాండ | నీన్ | నీ |
| కుయి | ఈను | నీ |
| కువి | నీను | నీ |
| కురుఖ్ | నీన్ | నీఙ్గ్ |
| మల్తో | నీన్ | నిఙ్గ్ |
| బ్రాహుయీ | నీ | నే |

పై పట్టికనుబట్టి తెలుగునందలి 'నీవు' తో తమిళ, మలయాళ, కోత, తొాద భాషలకును కోలామీ, నాయికీ భాషలకును పోలికలు గలవు. దీనినిబట్టి యుష్మదర్థకైకవచనము పదరూపమున దక్షిణ మధ్యమ

వర్గములతో సామ్యము గల్గియున్నదని నిర్ణయము చేయవచ్చును. తెలుగునందలి ద్వితీయాది విభక్త్యంగమైన 'నిన్' అన్నది దక్షిణవర్గ ముతో పోలికను గలిగియుండగా 'నీ' యన్నది గోండి, కొండ, కుయి, కువి అను మధ్యమ వర్గముతో పోలికను గలిగియున్నది.

**యుష్మదర్థక బహువచనము.**

తెలుగునందలి 'ఈరు' అన్నపదమునకు తుళు, కుయి భాషల లోని 'ఈరు' అన్నపదముతో సామ్యము కలదు. 'మీరు' అన్నపదము తో సామ్యముగల పదములు లేవనియే చెప్పవలయును. గోండియందలి మీమత్, కువి యందలి మీమ్బు అన్నపదములకు మకారముతో మొదలగుటనుబట్టి సామ్యము కొంతయున్నదనవచ్చును. తటరూపమున తెలుగునందలి 'మీ' తో గోండి, కుయి, కువి భాషలలోని 'మీ' అన్న రూపమునకు సామ్యము గలదు. దీనినిబట్టి పదరూపమునను, తటరూపము ననుగూడ దీనికి మధ్యమవర్గముతోనే సంబంధమున్నదని నిర్ణయము చేయవచ్చును.

**ఆత్మార్థకము.**

తెలుగునందు 'తాను' అన్నది ఏకవచనపదము. దరిదాపుగా ఇది అన్నిభాషలయందును 'తాన్' అన్నరూపముతో నున్నది. తెలుగు నందలి తటము 'తన' అన్నది. ఇతరభాషలయందు దరిదాపుగా 'తన్' అన్నరూపముతో నున్నది. బహువచనపదము తెలుగునందు 'తమరు/ తారు/ తాము' అని మూడు రూపములలో నున్నది. పెక్కుభాషలలో 'తామ్' అన్నరూపము 'తాము' అన్నరూపమునకు సదృశముగా కని పించుచున్నది. కుయి భాషయందు మాత్రమే 'తారు' అన్నరూపము కేవల పురుషబోధకముగా నగపడుచున్నది. దీనికి తట రూపమునందును 'తాఅన్' అనువిధముగా రేఫమునకు చోటున్నది. తక్కినభాషలలోని తటరూపము తెలుగునందలి 'తమ్/తమ' అనువానితో తుల్యముగా 'తమ్' అని యున్నది.

**తదర్థకము.**

తెలుగునందలి 'వాఁడు' అనుపదముతో కొండభాష యందలి 'వాన్డు' అనుపదము తుల్యముగా నున్నది. నాయికీ భాషయందలి 'అవన్డ్' ఒల్లారి గదబ భాషలయందలి 'ఓండ్' కుయి భాషయందలి 'ఆన్జు' సామ్యమును కలిగియున్నవి. దీనినిబట్టి తెలుగుశబ్దమునకు మధ్యమ ద్రావిడవర్గముతో సామ్యమును స్థాపింపవచ్చును.

ఇంక సర్వనామముల విషయము నిప్పటికి ముగించి సంఖ్యావాచకములనుబట్టి తెలుగుస్థానమును గమనింతము.

**ఒకటి** : తమిళము మొదలయిన దక్షిణద్రావిడభాష లన్నింటి యందును 'ఒరు' అన్నది సంఖ్యావాచకమై యున్నది. ఇది మనుష్య బోధకమైనప్పుడు తమిళ మలయాళములందు 'ఒరుత్తన్, ఒరువన్' అనియు తుళుభాషయందు 'ఒరి' యని కొండభాషయందు 'ఒరెన్ ఒర్రెన్' అనియు నుండును. వీని యన్నింటియందును మూలరూపము 'ఒర్' అన్నది స్పష్టముగానే తెలియుచున్నది. కన్నడమునందు 'ఒర్బ, ఒబ్బ, ఒబ్బను' అనియు కొడగుభాషయందు 'ఒబ్బే' అనియు నుండును. ఇక్కడకూడ 'ఒర్' అన్నదియే మూలరూపము. ర కారము తరువాతి బ వర్ణముతో సంయోగము నొందుటచేత బకారద్విత్వముగా మారినది. తెలుగునందలి 'ఒక్కఁడు, ఒకండు' అను రూపములతో తుల్యములయిన రూపములు పైని చెప్పికొన్న భాషలలో కానరావు. కోలామీ 'ఒక్కొన్' అని, నాయికీ 'ఒక్కొ(న్)' అని, పర్జీ 'ఒకుర్‌ద' అని, ఒల్లారి 'ఉకుర్' అని, గదబ 'ఉక్కుర్' అని కవర్ణ మధ్యములైన రూపములను ప్రదర్శించుచున్నవి. కాబట్టి తెలుగురూపములతో మధ్య ద్రావిడవర్గమునకు పోలిక గలదని నిర్ణయింపవచ్చును.

**రెండు** : తమిళము మొదలయిన భాషలన్నింటియందును 'ఇర్' అన్నది మనుష్యవాచక మూలరూపముగా వ్యవహరించుచున్నది. తెలుగునందు 'ఇరుగురు, ఇరువురు, ఇర్వురు' అనుచోట్ల 'ఇర్' అన్నదే మూలరూపము. 'ఇద్దఱు' అన్నచోట చివరి రవర్ణము మరియొకవిధమగు పరిణతిని పొందినది. కోలామీ, నాయికీ భాషలందు 'ఇద్దర్' అను

రూపమే కలదు. కావున తెలుగుభాష యొకవిధముగా దక్షిణద్రావిడ వర్గములోను, మరొకవిధముగా మధ్యమద్రావిడవర్గములోను చేరు చున్నది.

**మూడు** : మనుష్యబోధక సంఖ్యేయవిశేషణ మైనప్పుడు తమిళ మలయాళ కన్నడములందు 'మూవర్' అని యుండును. కొడగునందు 'మూరే' అనియు తుళునందు 'మూవెరు, మువ్వెరు' అనియు రూపము లుండును. తెలుగునందలి 'మూవురు, మువ్వురు' అను రూపములు పై వానితో సామ్యమును కలిగియున్న వనుట నిశ్చయము 'మూగురు, ముగ్గురు' అనురూపములు వకారము గకారముగా పరిణతిని చెందగా ఏర్పడినరూపము లని నిశ్చయింపవచ్చును. కోలామీ, నాయికీ భాష లందలి 'ముగ్గుర్' అనురూపము వీనితో సాదృశ్యము కలిగియున్నది. ఇచ్చటకూడ తెలుగు ద్రావిడవర్గముతోను, మధ్యమవర్గమునందలి కోలామీ నాయికీ భాషలతోను పొత్తు కనబరుచుచున్నది.

**నాలుగు** : మనుష్యబోధకమైనప్పుడు తమిళ కన్నడములందు 'నాల్వర్' అనియు, మలయాళమునందు 'నాలార్, నాల్వర్, నాలువర్' అనియు, తుళుభాషయందు 'నాల్వెరు' అనియు రూపములు గలవు. తెలుగునందు దీనికి సదృశమైన 'నలువురు, నల్వురు' అనురూపము లతో పాటుగా 'నలుగురు, నల్గురు' అను రూపములు గలవు. ఇచ్చట కూడ వకారము గకారముగా పరిణతి చెందుట యన్నది మాత్రమే విశిష్టత. ఈ విశిష్టత కోలామీ నాయికీ భాషలయందు కూడ 'నల్గుర్' అను రూపమునందు వినవచ్చుచున్నది.

**ఐదు** : తమిళమునందు సంఖ్యావాచకము ఐన్దు, అఞ్జు అని రెండు విధములుగా నున్నది. కన్నడమునందు 'అయ్దు' అను రూపము కలదు. తెలుగునందును, కోలామీయందునుగూడ అనునాసిక రహితముగానే 'అయిదు, అయ్దు' అను రూపములే కలవు. వీనియందలి మూలరూపము 'అయ్' అన్నదిమాత్రమే. కావుననే మనుష్యబోధక మైనపుడు తమిళ మలయాళములందు 'ఐవర్' అనియు, కన్నడమునందు

'అయ్యార్, అయ్యారు' అనియు, తుళునందు 'అమ్మోరు, అమ్యోరు' అనియు రూపముల నొందుట జరిగెను. తెలుగునందు ప్రత్యయముతో పాటుగా నున్న 'అయిదు' శబ్దమును వాడుటచేత 'అయిదుగురు' అను రూపము కలిగినది. 'అయ్' అను మూలరూపము 'ఏ'గా పరిణతి నొందుటచేత ఏర్పడిన 'ఏగురు, ఏవురు' అన్న రూపములు కూడ తెలుగునందున్నవి. మొత్తముమీద తెలుగుభాష యీ విషయమున స్వాతంత్రమై యున్నది.

ఇట్లు సంఖ్యావాచకములనుబట్టి చూచినప్పటికిని తెలుగుభాష దక్షిణ ద్రావిడ వర్గముతోను, మధ్యమ ద్రావిడ వర్గముతోను చేతులు కలుపుట స్పష్టముగా కనిపించుచున్నది. ముఖ్యముగా కోలామీ నాయికీ భాషలు తెలుగునకు సన్నిహితములై యుండుట కానవచ్చును.

వ్యాకరణాంశములనుబట్టి తెలుగునకును, తక్కిన భాషలకును గల సంబంధమును గమనింతము.

**లింగవిభాగము** : మధ్యమ ద్రావిడ వర్గమునకు చెందినభాషలు పురుషవాచకములు, అపురుషవాచకములు – అని రెండువిధములయిన భేదము నంగీకరించును. మరల నీరెండు వాచకములును ఏకవచన బహువచన భేదముచే రెండువిధములుగా నుండును. తదర్థకరూపము లీ క్రింది విధముగా నుండును.

| | పు. ఏ. | పు. బ. | అపు. ఏ. | అపు. బ. |
|---|---|---|---|---|
| నాయికీ | అవన్డ్ | అ్రవ్ | అద్ | అదవ్ |
| పర్జీ | ఓద్ | ఓర్ | అద్ | అవ్ |
| ఒల్లారి | ఓండ్ | ఓర్ | అద్ | అవ్ |
| కొండ | వాన్రు/అకన్ | వార్/అకర్ | వాద్/అకత్ | వాక్/అకెజ్ |
| కుయి | ఆన్జు | ఆరు | ఆరి | ఆవి |
| కువి | ఆసి | ఆరి | ఆది | ఆతి |

దక్షిణ ద్రావిడ వర్గమునకు చెందిన భాషలందు ఏకవచనమున పురుషబోధకములు, స్త్రీబోధకములు, అమనుష్య బోధకములు– అని

మూడు భేదములున్నవి ; బహువచనమున మనుష్యబోధకములు, అమనుష్యబోధకములు_ అని రెండు భేదములున్నవి. తోద భాషయందు లింగవిభేదము పాటింపబడదు. కావున, అదికాక మిగిలిన దక్షిణద్రావిడ భాషలన్నింటియందును పై విభాగము పాటింపబడుచున్నది.

| | ఏకవచనము | | | బహువచనము | |
|---|---|---|---|---|---|
| | పు. బో. | స్త్రీ. బో. | అమ. బో. | మ. బో. | అమ.బో. |
| తమిళ | అవన్ | అవళ్ | అదు | అవర్ | అవై |
| మల | అవన్ | అవళ్ | అదు | అవర్ | అవ |
| కన్నడ | అవ/ఆత | అవళ్/ఆకె | అదు | అవర్/అవర్గళ్ | అవు |
| తుళు | ఆయె | ఆళు | అవు | ఆరు/ఆకుళు | అవు |
| కొడగు | అవెన్ | అవ | అది | అవు/అవెఙ్గ | అది |

పై పట్టికనుబట్టి తుళు కొడగు భాషలయందు గల భిన్నపరిణతిని గమనింపవచ్చును. అమనుష్యబోధకము రెండు వచనములందును మార్పు లేకుండ ఒకే విధముగా నున్నది. ఉత్తరద్రావిడవర్గమునకు చెందిన కురుఖ్, మల్తో భాషలలో కూడ అమనుష్యబోధకము వచన భేదమును పాటింపకుండుట కలదు.

తెలుగుభాషయందు ఏకవచనమున పురుషవాచకములు, అపురుష వాచకములు - అని రెండు భేదములు; బహువచనమున మనుష్యవాచకములు, అమనుష్యవాచకములు - అని రెండు భేదములు గలవు.

| ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|
| పు. బో. | అపు. బో. | మ. బో. | అమ. బో. |
| వాఁడు | అది | వారు | అవి |
| వీఁడు | ఇది | వీరు | ఇవి |

ప్రత్యేకముగా ఆమె, ఈమె అనువిధముగా చెప్పినప్పుడు ఏకవచనమునందు స్త్రీవాచకము వేరుగా నుండును. కాని, దీనికి బహువచనమున వేరుగా రూపము కానరాదు. పై పట్టికనుబట్టి యైనచో స్త్రీవాచకము ఏకవచనమున అపురుషవాచకమునందును, బహువచనమున

మనుష్య వాచకమునందును అంతర్భవించునని నిశ్చయము చేయ వచ్చును. పురుషవాచకైకవచనమునకు బహుత్వమునందు మనుష్య వాచకరూపము వ్యవహరించును.

ఈ భేదము క్రియాపదములయందును కనిపించును. ఈ క్రింది వాక్యములనుబట్టి దీనిని గుర్తింపనగును.

చిలుక పలుకుచున్నది (అమనుష్య వాచకము - ఏకవచనము)

ఆమె వచ్చుచున్నది (స్త్రీ వాచకము - ఏకవచనము)

చిలుకలు పలుకుచున్నవి (అమనుష్యవాచకము - బహువచనము)

వారు వచ్చుచున్నారు (మనుష్యవాచకము - బహువచనము)

అమనుష్య వాచకముల విషయమున తుళు కొడగుభాషలు వచనవిభాగము నంగీకరింపవని చెప్పికొంటిమి. ఉత్తరద్రావిడ భాషలయిన కురుఖ్ మల్తోలయందు నీ లక్షణము గలదు. తెలుగున నిట్టి లక్షణము కర్తృపదమునందు కనిపింపదు కాని కొన్ని యెడల క్రియాపదములందు కనిపించుచున్నదనుట వాస్తవము.

చిలుక పలుకును — చిలుకలు పలుకును

చెట్టు కాసెను — చెట్లు కాసెను

పైవివేచనమునుబట్టి చూచినప్పుడు తెలుగు దక్షిణద్రావిడ భాషలతోనే ఎక్కువ సామ్యమును కలిగియున్నదని నిశ్చయింపవలసి వచ్చును. తెలుగుకాక మిగిలిన మధ్యమద్రావిడభాషలన్నియు నొకే విధమగు పరిణామమును గలిగియున్నవి.

**బహువచన ప్రత్యయము** : దక్షిణ ద్రావిడభాషలందు అమనుష్య బహువచన ప్రత్యయము 'కళ్' అన్నది యున్నప్పటికి దీని వాడకము నిత్యము కాదు. కొన్ని యెడల క్రియను బహువచనమునందు వాడుటచేత కర్తయేకవచనమునందున్నను బహుత్వస్ఫూర్తిని కలిగించును.

| | | |
|---|---|---|
| తమిళము | ఇరణ్డు | మరమ్ |
| కన్నడము | ఎరడు | మర |
| తుళు | రడ్డు | మరో |

తమిళమునందు 'మాడు వందాన్' అని యనగా 'ఆవు వచ్చెను' అని యర్థము. బహువచనమునందు 'మాడుగళ్ వందన' అని యుండ వలయును. కాని 'మాడు వందన' అని క్రియను మాత్రమే బహు వచనమునందు వాడుట యలవాటు.

మధ్యమద్రావిడవర్గమునందు అమనుష్యవాచకములకు సైతము బహువచన ప్రత్యయమును నిత్యముగా వాడుదురు.

| | |
|---|---|
| కోలామీ | ఇన్డిజ్ మాకుల్ |
| పర్జి | ఇర్డు మెర్కుల్ |
| ఒల్లారి | ఇన్డి మర్కిల్ |
| గదబ | ఇన్డి మర్కీల్ |
| కొండ | రన్డి మరక్ |
| కుయి | రిన్డె మహ్క |
| కువి | రిన్డి మార్క |

పై పట్టికయందు బహువచనప్రత్యయ మున్నిరూపములందును స్పష్టముగా కాననగును. కోలామీ పర్జి భాషలయందు 'కుల్' అన్నది బహువచనప్రత్యయము. ఒల్లారి గదబ భాషలయందు కిల్, కీల్- అన్నవి బహువచనప్రత్యయములు. కొండభాషయందు 'అక్' అన్నదియు, కుయి కువిభాషలందు 'క' అన్నదియు బహువచన ప్రత్యయ ములు. తెలుగునందు పైరూపములకు సమానముగా 'రెండు మ్రాకులు' అని యుండును. ఇచ్చట నిజమునకు 'కులు' అన్నరూపమునే బహువచన ప్రత్యయముగా గ్రహింపవలయును. దక్షిణవర్గమునందు వాడినట్లు 'రెండు మ్రాను' అన్నవిధముగా ఏకవచనాంతముగా వాడుట యెన్నడును జరుగదు. మధ్యమ ద్రావిడవర్గములో వలెనే బహువచనప్రత్యయము బహుత్వమునందు నిత్యముగానగును. తెలుగునందున్న ఏనుగులు, కొలకులు, రేగులు, వలకులు- మున్నగు పదములందలిది 'కులు' అన్న రూపమే. ద్రావిడభాషలలో దక్షిణవర్గమునందు అమనుష్య బహువచన ప్రత్యయముగా 'కళ్' ఉపయోగపడును. ఇదియే 'గళ్' అని

పరిణతి చెందును. ఈ ప్రత్యయమే 'మ్రాకులు' మున్నగు పదములందు కులు/గులు అన్నవిధముగా పరిణతిని చెందినట్లు గమనించితిమి. కొన్ని యెడల చిలుకలు, ఎలుకలు, నక్కలు మున్నగుపదములందున్నట్లుగా 'కలు' అన్నరూపమే బహుత్వమును చూపును. తమిళమునందు ఈ క్రిందివిధముగా రూపనిష్పత్తి యున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| కిళి | కళ్ | కిళిగళ్ | = | చిలుకలు |
| ఎలి | కళ్ | ఎలిగళ్ | = | ఎలుకలు |
| నరి | కళ్ | నక్కళ్ | = | నక్కలు |

పైనున్న పదములందుండి 'లు' వర్ణమును మాత్రమే ప్రత్యయముగా గ్రహించి, అనుచితవిభాగము చేయుటవలన ఏకవచనమునందు చిలుక, ఎలుక, నక్క—మున్నగురూపము లేర్పడుట తటస్థించినది. పై వివేచనమునుబట్టి తెలుగునందు కలు, కులు,లు – అన్నవి బహువచనప్రత్యయములుగా నేర్పడినట్లు స్పష్టము. చివరి ఉత్వము స్వర సామరస్యము కొరకు ఏర్పడినదే యగుటవలన లోపము గానచ్చును. పర్జిభాషయందు ఏనుల్ (ఏనుగులు) చుక్కాల్ (చుక్కలు) మున్నగు శబ్దములందు 'ల్' అన్నది బహువచనప్రత్యయము; కిల్కుల్ (చిలుకలు) ఎల్కుల్ (ఎలుకలు) మున్నగుశబ్దములందు 'కుల్' అన్నది బహువచనప్రత్యయము. కావున ఈ రెండుప్రత్యయముల విషయమున తెలుగుభాష మధ్యమ ద్రావిడవర్గమునకు చెందిన పర్జిభాషతో సామ్యమును గలిగియున్నదనుట నిశ్చయము.

**బంధుత్వ బోధక స్త్రీవాచకములు :** తెలుగునందు కోడలు, మఱఁదలు, చెల్లెలు మొదలయిన శబ్దములు 'అలు' అను రూపమును గలిగియున్నవి. ఈ 'అలు' అన్నది 'ఇల్లాలు' అన్న శబ్దమునందున్న 'ఆలు' అన్న శబ్దమునకు పరిణతరూపమే. తమిళమునందు 'ఇల్లవళ్, ఇల్లాళ్' అన్న రూపములు 'గృహిణి' అన్న అర్థమునే తెల్పును. ఇటుకాక బంధుత్వమును బోధించుచోట్ల తమిళాదిభాషలలో ఈ శబ్దమునకు ప్రయోగము లేదు. అవళ్, ఇవళ్ మున్నగువిధముగా సర్వ

నామరూపములందును, సమాపకక్రియారూపములందును వాడుకలో నున్నది. మధ్యమ ద్రావిడభాషలందు 'ఆళ్' శబ్దముయొక్క పరిణత రూపమును చేర్చుకొన్న పదములు బంధుత్వబోధకములై స్త్రీవాచకము లగును. ఈ విషయమునందు మధ్యమ ద్రావిడవర్గమునకును తెలుగు భాషకును సాదృశ్యము గలదు.

| | | | |
|---|---|---|---|
| తెలుగు | కోడలు | చెల్లెలు | మఱఁదలు |
| కోలామీ | కొరల్ | | మర్ందల్ |
| నాయికీ | కొరళ్ | | |
| పర్జి | కొడ్డొల్ | చాలల్ | |
| గదబ | కోథల్ | సేలల్/చెల్లాల్ | |
| గోండి | కోర్యాడ్ | సేలాడ్ | మరండాడ్ |

'కోడలు' మున్నగురూపములకు మూలధాతువు 'కొఱ్'అనునది. ఇది 'చిన్న' అన్న అర్థమున వాడుకనొంది వ్యాప్తిని పొందినది. కోలామీభాషయందు చిన్నవానిభార్య యనగా తమ్మునిభార్య యన్న యర్థము నొందినది. గదబ, గోండి, నాయికీ భాషలందు తెలుగునందున్నట్లే 'కోడలు' అన్న అర్థము గలదు. నాయికియందు 'పెండ్లికూతురు' అని, గదబయందు 'తమ్ముని భార్య'యని యదనముగా నర్థములు గలవు. పర్జియందు 'పెండ్లికూతురు' అన్నయర్థముమాత్రమే కలదు.

'చెల్లెలు' మున్నగురూపములకు మూలరూపము 'చేలాళ్' అని కావచ్చును. ఇది అన్నియెడల నొకే యర్థమును గలిగియున్నది.

'మఱఁదలు' మున్నగురూపములకు మూలరూపము 'మఱందాళ్' అని కావచ్చును.

'కొడుకు' అని యన్నప్పుడు 'కొఱ్' అన్నదే మూలరూపము. ఈ రూపమునుండియే 'కోడలు' అన్న స్త్రీవాచకముకూడ కలిగినది. తెలుగునందున్న 'మఱఁది' కోలామీయందున్న 'మరంద్' ఒకే యర్థ

మును బోధించును. దీనికి స్త్రీబోధకముగా 'ఆల్' అను రూపము చేరగా మఱందలు, మర్ందల్-అన్న పదము లేర్పడినవి.

ఈ రూపముల విషయమున తెలుగుభాషకు దక్షిణ ద్రావిడ వర్గముతో ఎంతమాత్రమును సామ్యము లేదు.

**క్త్వార్థక వ్యతిరేకక్త్వార్థకములు:** ద్రావిడభాషలయందు క్త్వార్థక ప్రత్యయము 'ఇ' యనునది. ఇది మధ్యను ద్రావిడవర్గమునందలి కొన్ని భాషలలో చ/స వర్ణమును తొలియందు కలిగియున్నట్లు కనిపించు చున్నది. ప్రాచీనద్రావిడమునందలి 'చ' వర్ణము మధ్యమ ద్రావిడవర్గ మునందు మాత్రమే నిల్చియుండి దక్షిణోత్తరవర్గములయందు నశించె నని నిర్ణయము చేయుట సాహస మనిపించుకొనును. తెలంగాణా మాండలికమునందు అది, ఇది - మున్నగుమాటలు గది, గిది అన్నట్లుగా మారును. ఇక్కడ గవర్ణము అదనముగా ఆదియందు చేరుచున్నట్లే, అక్కడ చవర్ణము చేరుచున్నదనుట సమంజసము. దానిని నూతన పరి ణతిగా గ్రహింపవలసి యుండును. తెలుగులో విని, కొని, పలికి, చిలికి మున్నగుచోట్ల క్త్వార్థక ప్రత్యయము ఇవర్ణమే యనుట నిస్సంశయము. కాని సానుబంధములయిన వచ్చు, తెచ్చు మొదలయిన ధాతువుల చివర 'ఇ' చేరగా వచ్చి, తెచ్చి మొదలయిన విధముగా నగును. మూలరూపములు వర్, తెర్ అనునవియే యగుటవలన, వీనికిపైని 'చి' యను ప్రత్యయమే చేరిన దని యనుట కవకాశము కలుగుచున్నది. వర్+చి>వచ్చి; తెర్+చి>తెచ్చి॥ అట్లే 'చేయు' మొదలయిన ధాతు వులు క్త్వార్థకములయినప్పుడు 'చేసి' మున్నగు విధముగా నుండును. ఇక్కడ క్త్వార్థకప్రత్యయము 'సి' యనునదే యని కొందర నిశ్చయము. ఈ క్రింది రూపములనుబట్టి తెనుగుభాష ఆయాభాషలతో సామ్య మును గలిగియున్నదని యనవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| పర్జి | నిల్ | చి | నిల్‌చి = | నిలిచి |
| ఒల్లారి | తిన్ | చి | తిన్ జి = | తిని |
| గోండి | కీ | సీ | కీసీ = | చేసి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కోయ | ఈ | సి | ఈసి | = | ఇచ్చి |
| కొండ | వా | చి | వాజి | = | వచ్చి |

వ్యతిరేకక్త్వార్థకము చేయక, వినక, రాక మున్నగువిధముగా తెలుగుభాషలో నుండును. ఇచ్చట 'క' యనునదే ప్రత్యయమని వ్యాకర్తలు తెల్పినప్పటికిని, వెనుక అవశ్యముగా అవర్ణ మున్నదని అంగీకరింపవలయును. కావున 'అక' యను రూపమే వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయము. తమిళమునందు 'శెయ్యాగుల్, శెయ్యామే' అను వ్యతిరేకక్త్వార్థకములందు 'అక' కనిపింపదు. కన్నడమున 'మాడదె' అని యున్నప్పుడు సైతము 'అక'కు తావులేదు. మధ్యగు ద్రావిడవర్గము నకు చెందిన పర్జి, గోండి భాషలందు 'అక'కు సదృశములయిన రూపములు కనిపించుచున్నవి.

| పర్జి | | | గోండి | | |
|---|---|---|---|---|---|
| తిన్ | అక | తినక | తిన్ | వాక్ | తిన్వాక్=తినక |
| చియ్ | అక | చియక | సియ్ | వాక్ | సియ్వాక్=చేయక |
| వర్ | అక | వరక | వాయ్ | వాక్ | వాయ్వాక్=రాక |
| మూట్ | అక | మూటక | సూఢ్ | వాక్ | సూఢ్వాక్=మూడక |

పై పట్టికనుబట్టి పర్జియందు 'అక' యనియు, గోండియందు 'వాక్' అనియు వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయమున్నట్లు నిశ్చయింపనగును. ఇది తెనుగునందలి 'అక'తో పోలిక గలిగియున్నది.

**అకర్మక సకర్మకములు:** అకర్మక ప్రాతిపదికలను సకర్మకములుగాను, సకర్మక ప్రాతిపదికలను ప్రేరణార్థకములుగాను మార్చుటకు ద్రావిడభాషలందు సాధారణముగా రెండు మార్గము లవలంబింపబడు చుండును. అకర్మకమునందు అనునాసికముతో కూడిన స్పర్శమున్నయెడల, సకర్మకమునందు స్పర్శద్విత్వమేర్పడును; అనునాసికమున్నప్పటికిని లేనప్పటికినికూడ నాదస్పర్శముగా మారును; కొన్నియెడల ఇది ద్విత్వముకూడ నగును. ఇది యొక మార్గము.

| | అకర్మకము | | సకర్మకము | |
|---|---|---|---|---|
| తమిళము | అడఙ్కు | (అడగియుండు) | అడక్కు | (అణచు) |
| మలయాళము | అడఙ్ఙుక | ( ,, ) | అడక్కుక | ( ,, ) |
| కన్నడము | అడగు/అడంగు | ( ,, ) | అడకు | ( ,, ) |

అకర్మధాతువునకు చివర త చ ప వర్ణములలో నొక దానిని చేర్చుటచేత సకర్మకములుగాని ప్రేరణార్థకములుగాని యేర్పరుచుట మరొక మార్గము. ఈ ప్రత్యయములు పరమైనపుడు కొన్నియెడల ధాతువునకు ఇగాగమము కలుగును. మధ్యమ ద్రావిడభాషలందును, ఉత్తర ద్రావిడ భాషలందును అధికముగా ఈ మార్గ మవలంబింపబడును. అయినను తమిళాది దక్షిణభాషలందు నీరీతి కొలదిగా కనిపించును. తెలుగుభాష పూర్తిగా ద్వితీయమార్గమునే యనుసరించును.

| | అకర్మకము | | సకర్మకము | |
|---|---|---|---|---|
| తమిళము | తుఱు | (నిండు) | తుఱుట్ట్ | (నింపు) |
| మలయాళము | ,, | | ,, | |
| తోద | ఓడ్ | (విసురుగాకదలు) | ఓట్ట్ | (విసురుగా కదచించు) |
| తుళు | తిర్గ్ | (తిరుగు) | తిర్ద్ | (త్రిప్పు) |
| కన్నడము | తిరిగు | ( ,, ) | తిరిపు | ( ,, ) |
| కుయి | పుహ్ | (తడియు) | పుహ్ప | (తడుపు) |
| కొండ | డాఙ్ | (దాగు) | డాప్ | (దాచు) |
| పర్జి | తుఙ్ | (నిద్రించు) | తుఙిప్ | (నిద్రింపజేయు) |
| కోలామి | ఉద్ | (కూర్చుండు) | ఉదిప్ | (కూర్చుండజేయు) |

పై పట్టికనుబట్టి తెలుగురూపముల నూహించుకొనవచ్చును. తెలుగురూపములు పైని చెప్పిన రెండు మార్గములలో రెండవదానినే యనుసరించుచున్నట్లు స్పష్టముగా గమనింపనగును.

**విధ్యర్థకములు :** దక్షిణ ద్రావిడభాషలందంతటను ఏకవచనము నందు కేవలధాతువే విధ్యర్థకముగా వ్యవహరించును. బహువచనము

నందు ఈర్, మిన్ – మున్నగు బహువచనప్రత్యయము పరమగుట కనిపించును. సాధారణముగా క్రియాప్రత్యయములనుబట్టి మకారమే బహుత్వమును స్ఫురింపజేయునని చెప్పనగును.

| | త | మ | క | తు | కో |
|---|---|---|---|---|---|
| వి. ఏ. | శెయ్, శెయ్యాయ్ | చెయ్ | గెయ్, గెయ్యు | మల్‌పుల | కెయి |
| వి. బ. | శెయ్‌విన్, శెయ్యార్, శెయ్‌మినీర్. | చెయ్‌విన్ | గెయ్యిమ్ | మల్‌పులె | కెయిరి |

పై రూపములకు భిన్నముగా తెలుగురూపములు కానవగును. ఏకవచనమునందు పై విధముగా కేవలధాతువు నుపయోగించుట యున్నప్పటికిని ము వర్ణకమును చేర్చి పలుకుట సైతము కలదు. బహువచనమునందు 'డు' వర్ణకము చేరును. నిజమునకీ 'డు' వర్ణకము 'టత' వర్ణములకు పరిణామముగా గ్రహింపవలసియుండును. దీనికి వెనుకనున్న బిందువుకూడ ఈ నిర్ణయమును బలపరుచును. సరిగా ఇదే లక్షణము కుయి, గోండి, కొండ, కోయభాషలలో కనిపించును.

| | వి. ఏ | వి. బ |
|---|---|---|
| తెలుగు | చేయుము | చేయుండు (చేయ్, న్, ట్) |
| గోండి | కీమ్ | కీమ్‌ట్ (కీమ్, ట్) |
| కొండ | కిఅ | కిదు (కి, దు) |
| తెలుగు | తినుము | తినుండు (తిన్, ట్) |
| కుయి | తినుము | తిన్‌జు (తిన్, ద్) |
| తెలుగు | ఇమ్ము | ఇండు (ఇమ్, ట్) |
| కోయ | ఈము | ఈముటు (ఈము, టు) |
| గోండి | సీమ్ | సీమ్‌ట్ (సీమ్, ట్) |
| తెలుగు | చనుము | చనుండు (చన్, ట్) |
| కుయి | సలుము | సజు (సల్, దు) |

| | వి. ఏ | వి. బ | |
|---|---|---|---|
| కొండ | సోన | సొన్తు | (సొన్, తు) |
| తెలుగు | రమ్ము | రండు | (రమ్, టు) |
| కొండ | రా | రదు | (ర, దు) |

పై పట్టికనుబట్టి విధ్యర్థకరూపములు తెలుగుభాషను మధ్యమ ద్రావిడవర్గమునందు చేర్చుచున్నవని నిశ్చితముగా చెప్పవచ్చును.

**స్వరప్లుతి** యొకటి తెలుగుభాషను దక్షిణద్రావిడవర్గము నుండి వేరుపరుచుచు కుయి, కువి, కొండ, గోండి మొదలయిన మధ్యమ ద్రావిడవర్గముతో చేర్చుచున్నది. తెలుగునందలి ప్రాత, క్రొత్త అను శబ్దములకు పఴమ్, కొఴుమ్ అనునవి మూలములు. వీనియందలి ఴ వర్ణము రవర్ణముగా పరిణతమై వెనుకటిహల్లుపై చేరుచున్నది. ఇట్లే 'ఉరల్' అనునది 'రోలు' అనియు, 'ఉరప్పు' అన్నది 'రొప్పు' అనియు, 'ఇరణ్డు' అన్నది 'రెండు' అనియు మారుటకు స్వరప్లుతియే కారణము. ఈ క్రిందిపట్టికనుబట్టి అట్టిమార్పు నంగీకరించు నితరభాషలను గుర్తింప వచ్చును.

| | | | |
|---|---|---|---|
| తమిళము | ఉగిర్ | పొఴుదు | మరమ్ |
| మలయాళము | ఉగిర్ | పొఴుదు | మరమ్ |
| కన్నడము | ఉగుర్ | పొత్తు | మర |
| తుళు | ఉగురు | పొర్తు | మర |
| కొడగు | — | — | మర |
| తెలుగు | గోరు | ప్రొద్దు | ప్రమాను ప్రమాకు |
| కోలామి | గొర్ | పొద్ | మాక్ |
| నాయికీ | — | పొద్ | మాక్ |
| పర్జి | గేరి | — | — |
| కొండ | గోరు | — | — |
| కుయి | గోర | — | ప్రహాపు |
| కువి | గోరు | — | ప్రహాను |

పై పట్టికనుబట్టి తెలుగుతోపాటుగా కోలామీ మున్నగు భాషలలో కూడ స్వరప్లుతి కలదని యర్థమగుచున్నది. తమిళము నందలి 'ఇళై' మలయాళమందు 'ఇళ' యనియు కన్నడమందు 'ఎళె' యనియు నుండగా తెలుగున 'లే' యని యగును. 'లేఁత' యను రూపముకూడ దీనినుండి యేర్పడినది. నాయికీభాషయందు 'లేఁత' యనురూపము కలదు. తెలుగునందలి 'లేఁగ'తో సమానార్థకములై కోలామియందు 'లెజ్గ' యనియు నాయికియందు 'లేజ్గ' యనియు రూపములు గలవు. దీనికి 'దూడ' యని యర్థము. ఇట్లే 'ఇరత్తి' యని తమిళమున, 'ఎర' యని కన్నడమున నున్నరూపములకు సమానార్థకములై తెలుగున 'రేఁగు' కోలామియందు 'రేజ్గ' పర్జియందు 'రేజ్గ' కొండయందు 'రేన్గ' యను రూపములు గలవు. ఈ లక్షణము వీని కన్నింటికి సాదృశ్యమును సాధించుచున్న దనుటలో సందేహము లేదు.

సర్వనామముల తటరూపములందుసైతము స్వరప్లుతి తన విలక్షణతను ప్రదర్శించుచున్నది. పర్జీ, కోలామి, నాయికీ మున్నగు భాషలందు 'అన్' అని యున్నరూపము తెలుగు, కుయి, గోండి, కొండ భాషలయందు 'నా' యని మారి కనిపించును. ఇట్లే యుష్మ దర్థకైకవచనతటము పర్జీ మున్నగుభాషలందు 'ఇన్' అని యుండగా కుయి, గోండి, కొండ, తెలుగు భాషలందు 'నీ' యని మారి కనిపించును. అనగా, స్వరప్లుతి కారణముగా 'నా, నీ' మున్నగురూపము లేర్పడిన వని యర్థము. తెలుగులోని వాని, దాని, వీని, దీని - అను తటరూపములు అవన్, అద్, ఇవన్, ఇద్ - అను మూలరూపము లందు స్వరప్లుతి గలిగి, అంతమందు 'ఇ' వర్ణము చేరగా నేర్పడిన రూపములే యని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఉత్పాదక ప్రత్యయములు : తెలుగునందు కొన్ని ధాతువులు సానుబంధములుగా నుపయోగింపబడును; అట్లే కొన్ని మూలద్రావిడ ప్రాతిపదికలపైని ప్రత్యయములు చేరగా తెలుగు ప్రాతిపదికము లేర్పడును. తెలుగునందున్న 'నిండు' ధాతువునకు సమానార్థకములై

తమిళమలయాళములందు 'నిత్తై' యనియు, కన్నడమునందు 'నెతె' యనియు రూపములు కలవు. కోలామీ 'నిన్డ్' నాయికి 'నిన్డ్' గోండి 'నిన్దానా' కొండ 'నిన్జ్' కుయి 'నెన్జ్' కురుఖ్ 'నీన్‌ద్నా' మల్తో 'నింద్రగే' అనురూపములందు మూలధాతువుపై అనుబంధము చేరుట కనిపించును.

తెలుగునందలి 'పండు' ధాతువు తమిళమున 'పఴు' మలయాళమున 'పఴుక్క' కన్నడమున 'పణ్' అని యుండగా కోలామి 'పణ్డ్' నాయికి 'పండ్' గోండి 'పండానా' కొండ 'పండ్' కువి 'పండు' మున్నగువిధముగా నుండును.

తెలుగునందలి 'ౘాచు' గోండి 'తరాష్' కొండ 'సరస్' కుయి 'స్రాసు' కువి 'రాచూ' అను రూపములలో కనిపించును. తమిళమునందు 'అరవు, అరవమ్, అర, అరా' అనియు, మలయాళమునందు 'అరవు, అరవమ్' అనియు రూపములు గలవు. ఇచ్చట మధ్యమ ద్రావిడ వర్గమునందలి రూపములే మూలరూపమునకు సన్నిహితము లనిపించును.

పైని చెప్పికొనిన యంశముల నన్నింటిని బట్టి చూడగా తెలుగుభాష పెక్కు విషయములలో మధ్యమ ద్రావిడవర్గముతో సాదృశ్యము గల్గి యున్నదనవచ్చును. దక్షిణోత్తరవర్గములతో ఎచ్చటనో కాని ఎక్కువ సామ్యము కానరాదు. మధ్యమ ద్రావిడవర్గమునందుకూడ కుయి, కువి, కొండ, గోండి, పెంగో భాషలతో తెలుగుభాషకు సన్నిహితసంబంధము కలదు. కావున మధ్యమ ద్రావిడవర్గము అను పేరుతో మూకయుమ్మడిగా చెప్పుకొనుటకంటె గ్రియర్సను పాటించినట్లు 'ఆంధ్ర వర్గము' అనుదానిని పాటించుట బాగుగా నుండును. అందు కుయి, కువి మున్నగు వానిని చేర్చి పరిగణింపవచ్చును. అప్పుడు తెలుగుభాష చూపుచున్న ప్రత్యేకపరిణతిని గుర్తించుటకు, తెలుగునకు పరిసరభాషల పైనిగల ప్రభావమును గుర్తించుటకు, మరింత వీలు కలుగును.

# ధ్వని ప్రకరణము

భాష యని యనుటతోడనే ఉచ్చారణ మనునది ప్రధానాంశమై కనుపట్టును. భాషను పలుకునప్పుడు విశ్లేషింపగా ఏర్పడిన అత్యంత స్వల్పభాగమునకు 'ధ్వని' యనిపేరు. అనగా ఈ ధ్వనుల సమూహమునే భాషయని పేర్కొనవచ్చును. ఇట్టి ధ్వనిని వ్యాకర్తలు 'వర్ణము' అని యనిరి. వర్ణములు వేరువేరు భాషలకు వేర్వేరు విధముగా వేరువేరు సంఖ్యలో నుండును.

## వర్ణ సమామ్నాయము

**అరవమునందు** వర్ణము అని యనుటకు 'ఎళుత్తు' అని యందురు. 'అచ్చు' అని యనుటకు 'ఉయిర్' అని యందురు. "అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ" అను నీ పండ్రెండు వర్ణములును అచ్చులు. ఇవి మాత్రమేకాక అరవమునందు ః ఆయ్దమను వర్ణమును, అర్ధమాత్రాకము లగు 'ఇ ఉ'లును కూడ కలవు.

'హల్లు' అని యనుటకు 'మెయ్' అని యందురు. "క ఙ చ ఞ ట ణ త న ప మ య ర ఱ ల ళ వ" అను నీపదునారక్షరములు హల్లులు. ఇవియే కాక 'ఌ' యను నొక యక్షరమును, మూర్ధన్య 'న' కారమును గూడ అరవమునందు కలవు.

**కన్నడమునందు** పైని చెప్పిన పండ్రెండచ్చులును గలవు. అరవమున లేని పూర్ణానుస్వారముకూడ ఇందు కలదు. పైహల్లులతో పాటుగా కన్నడమునందు 'గ జ డ ద బ స హ' యనునవి కూడ కలవు. అరవమునందలి ఆయ్దము కాని, మూర్ధన్యనకారముకాని కన్నడమునందు లేవు.

**తుళుభాషయందు** పైనిచెప్పిన పండ్రెండచ్చులతో పాటుగా అకారమునకు ఒకారమునకు మధ్యస్థమైన ఉచ్చారణగల యొక వర్ణము, అకారమునకు ఎకారమునకు మధ్యస్థమైన ఉచ్చారణ గల మరొక వర్ణము కూడ కలవు. పూర్ణానుస్వారము కూడ కలదు. "క గ జ చ

జ ఞ ట డ ణ త ద న ప బ మ య ర ల వ శ ష స హ ళ" అని యిరువది నాలుగు హల్లులు కలవు.

తెలుగుభాషయందు "అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ఃo" అను పదునాలుగచ్చులు గలవు. "క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ఱ ల వ స హ ళ" అని యిరువది మూడు హల్లులు కలవు. కుట్రయలిగరమ్, కుట్రియలుగరమ్- అని పిలువబడు అర్ధమాత్రాకములయిన 'ఇ ఉ'లు ఉచ్చారణమునందు వినిపించును గాని వ్యాకర్త లెవ్వరును వానిని ప్రత్యేకముగా గుర్తించి ప్రమాణీకరింపలేదు.

వ్యాకర్తలు వర్ణసమామ్నాయమందు చేర్చి పరిగణింపకపోయిన ను 'ఴ' కారము తెలుగున నున్నదనియే శాసనములు నిరూపించుచున్నవి. శకటరేఫమును వాగనుశాసనులు బిందుయుతమైన రవర్ణముగా పేర్కొనిరి. అలఘువులయిన 'య ర ల వ' లకు తెలుగున ప్రత్యేకమైన లిపిలేదు. కాని ఆచరణమునందు ఱ ళ అనువానిని అలఘు రల వర్ణములకు వాడుట అత్యంతప్రాచీనకాలమునుండియు కనిపించుచున్నది.

సంస్కృతప్రభావమూలకముగా పడిన పిమ్మట కర్ణాటాంధ్ర మలయాళములలో సంస్కృతపదము లనేకముగా చేరినవి. వానితోపాటు ఆ ధ్వనులుకూడ వచ్చి చేరినవి. అరవమునందు ఈ మార్పు చాల తక్కువగా కనిపించును. అయినను 'గ్రంథలిపి'యందు ఈ ధ్వనులకు కూడ లేఖనవిధానము గలదు.

ధ్వనుల వర్గీకరణము

ఏభాషయందైనను ధ్వనులను కొన్నివర్గములుగా విభాగించుకొనుట యవసరము. ఆయాధ్వనులనుగురించి ముచ్చటించుకొనవలసి వచ్చినప్పుడు సాముహికముగా ఆయావర్గ నామములనుబట్టి వ్యవహరింపవచ్చును. ఈ వర్గీకరణము మూడు పద్ధతుల ననుసరించి మూడు విధములుగా జరుగును. 1. అజ్ఝల్విభాగము 2. శ్వాసనాదవిభాగము.

3. స్పర్శాదివిభాగము. ఇందు ఒక్కొక్క విభాగమునుగురించి వివరముగా తెలిసికొందము.

**1** అజ్ఝల్విభాగము : తెలుగునందలి వర్ణములను స్థూలముగా అచ్చులనియు హల్లులనియు రెండురకములుగా విభాగింతురు. చిన్నయ సూరి వర్ణసమామ్నాయమును తెల్పుచు "ఇందకారాదు లచ్చులు కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగు నది." అని వ్రాసెను. "అ" నుండి విసర్గమువరకు గల వర్ణములు హల్లులు. నిజమునకు అచ్చులు, హల్లులు – అన్నవి తక్కిన సంజ్ఞల వంటివే యైనచో "అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది" అని హెచ్చరింపవలసిన యవసరము లేదు. ఇది సంస్కృతానుకరణము వలన వచ్చిన సంకేతములు. కావున అజ్ఝల్విభాగము సాంకేతికముగా ఏర్పడినదే కాని అర్థవంతము కాదు.

సంస్కృతమునందు పదునాలుగు మహేశ్వరసూత్రములు గలవు. అవి సంస్కృతవర్ణసమామ్నాయమును నిరూపించును. అందు మొదటి నాలుగుసూత్రములను ప్రత్యాహారప్రక్రియ ననుసరింప యేర్పడిన సంకేతము 'అచ్' అనునది. అ ఇ ఉ ణ్ – ఋ ఌ క్ – ఏ ఓ ఙ్ – ఐ ఔ చ్॥ ఇందు ప్రతిసూత్రమునను చివరనున్న పొల్లక్షరములను ఇత్సంజ్ఞ లని యందురు. మొదటి యక్షరమునుండి పొల్లక్షరమువరకు గల వర్ణముల నన్నింటిని పలుకుటకు బదులుగా మొదటివర్ణమును చివరిపొల్లును గలిపి పలికిన చాలును; మొత్తము వర్ణములన్నియు గ్రహింపబడును. 'అణ్' అని యన్న మొదల 'అ ఆ ఇ ఈ ఉ ఊ' అను ఆరువర్ణములను తెల్పినట్లే. 'ఇక్' అని యంటి మనుకొందము. అప్పుడు 'ఇ' నుండి 'క్' సంజ్ఞ యున్నంతవరకు గల వర్ణములను గ్రహింపవలయును. అనగా "ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ" అను ఎనిమిది వర్ణములును 'ఇక్' అను సంకేతమువలన గ్రహింపబడును. అట్లే 'అ' నుండి 'చ్' వరకు గల వర్ణములను 'అచ్' అన్నది సంకేతము. దీనివలన అ ఆ ఇ ఈ ఉ ఊ

ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ః॥ అనువర్ణము లన్నింటిని గ్రహింప వలయును. నిజమునకు పై సూత్రముల యందు హ్రస్వము లగు ఎ ఒ వర్ణ ములకు తావు లేదు. అట్లే చివరనున్న అర్ధానుస్వార పూర్ణానుస్వార విసర్గములకు తావు లేదు. అయినను కొంచెము సవరుబాటుతో వానిని కూడ స్వీకరింపవలయు నన్న యభిప్రాయముతోనే 'అచ్చు' అను సంకే తమును వాడుట జరిగెను.

మహేశ్వరసూత్రములందు ఐదవసూత్రమున ఆద్యక్షరమైన 'హ' తో పదునాల్గవసూత్రమునందలి చివరి పొల్లక్షరమైన 'ల్' కలి యగా 'హల్' అని ఏర్పడినది. హయవరట్ - లణ్ - ఞ మ ఙ ణ నమ్ - ఝ భ ఞ్ - ఘ ఢ ధ ష్ - జబగడదశ్ - ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ - కపయ్ - శషసర్ - హల్॥ అనునవి మిగిలిన పదిసూత్ర ములు. ఇందు మొదటివర్ణము 'హ' చివరిపొల్లువర్ణము 'ల్' ఈ రెంటును కలుపగా 'హ య వ ర ల' మున్నగువర్ణము లన్నియు గ్రహింపబడును. అచ్చటి క్రమము భిన్నముగా నున్నది. అయినను 'క' నుండి 'ళ' వరకుగల వర్ణములన్నియు 'హల్' అను సంకేతముచేత సూచింపబడుచున్నవి. క్రమము మారినప్పటికిని, చ జ లను గ్రహిం పకపోయినప్పటికి 'హల్' అను సంకేతమునే గ్రహించి, సర్దుబాటు చేసి కొనుట యిందు కాననగును ఈ సర్దుబాటును సూచించుటకే ఈ పేళ్లు సాంకేతికములని తెలియజేయుటకే సూరి "ఈలాగుననే మీఁద నెఱుఁగునది" అను హెచ్చరికను చేయవలసివచ్చినది. మొత్తము మీఁద ఈవిభాగము సాంకేతికముగా జరిగినదే కాని అర్థవంతము కాదు.

అచ్చులకు స్వరములు, ప్రాణములు అని మరిరెండు పేళ్లు గలవు. స్వరములు అని యనగా స్వయముగా ఉచ్చరింపబడునవి యని యర్థము. 'అ ఆ' మున్నగువానిని ఉచ్చరింపవలసి వచ్చినప్పుడు ఇతర వర్ణముల సాహాయ్య మేమాత్రమును గ్రహింపవలసిన యావశ్యకము లేదు. ప్రాణములు అనునది కూడ ఇట్టిదే. తమిళమందున్న 'ఉయిర్' అనునది దీనితో సమానార్థకమే.

హల్లులకు వ్యంజనములు, ప్రాణులు అని మరిరెండు పేళ్లు గలవు. ఉచ్చారణ సమయమున ఇతరసాహాయ్యము నపేక్షించుటచేత వీనికి వ్యంజనములు అనుపేరు తగియున్నది. 'క్, ఖ్' మున్నగువానిని అట్లే పలుకవలయుననిన చాల శ్రమ కలుగును. కావుననే అచ్చులను చేర్చి 'క, ఖ' మున్నగువిధముగా పలుకుదుము. వర్ణసమామ్నాయము నందుకూడ కేవలము హల్లువర్ణములనే చేర్చుకొనవలసియున్నను, ఉచ్చారణసౌకర్యముకొరకై 'అ' వర్ణమును చేర్చి పలుకుట సంప్రదాయమైనది. హల్లులు శరీరము వంటివనియు, అచ్చులు ప్రాణము వంటివనియు, ప్రాణము చేరుటచేత శరీరము ప్రాణి యనిపించుకొనుననియు భావించి హల్లులను 'ప్రాణులు' అని పిలుచుట జరిగినది. తమిళులు హల్లులను ప్రాణులుగా కాక, కేవల శరీరములుగానే భావించిరి. అందువల్లనే శరీరము అను అర్థముగల 'మెయ్' అను శబ్దమును హల్లునకు పర్యాయవాచకముగా వాడుదురు.

ఈ హల్లులలో మరల 'కచటతప గజడదబ' అనువానిని 'అల్పప్రాణము'లనియు 'ఖఛఠథఫ ఘఝఢధభ' అనువానిని 'మహాప్రాణము'లనియు పేర్కొందురు.

అచ్చులయందు 'అ ఇ ఉ ఋ ౡ ఎ ఒ' అనువానిని హ్రస్వములని యందురు. 'ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ' అనువానిని దీర్ఘములని యందురు. పై వానిలో 'ఐ ఔ' అనునవి రెండును సంయుక్తాచ్చులు (diphthongs) అనబడును. 'అయిదు- ఐదు; అవుడు- ఔడు' మున్నగు రూపములనుబట్టి 'ఐ' అనుదానియందు 'అఇ' అను వర్ణములు కలవనియు 'ఔ' అనుదానియందు 'అఉ' అను వర్ణములు కలవనియు స్పష్టముగా తెలియుచున్నది. తక్కినవర్ణము లన్నియు సమాచ్చులు (simple vowels) అని అనబడును.

**2. శ్వాస నాద విభాగము** : మనము చేతితో గడ్డము క్రిందుగా గొంతుకను మృదువుగా తడిమిచూచుకొనగా ఒక కాయవలె తగులును. దానిని ఆంగ్లమునందు సామాన్య వ్యవహారమున 'Adam's apple'

అనియందురు. శాస్త్రపరిభాషలో దానిని Larynx అని యందురు. తెలుగునందు పైకి కనిపించుభాగమును 'గొంతుముడి' యనికాని 'గళ గ్రంథి' యనికాని యనవచ్చును. నిజమునకు అచ్చటనే 'స్వర పేటిక' కలదు. ఆంగ్లమున దానిని Glottis అని యందురు. స్వర పేటికయందు రెండు నాదతంత్రులు (vocal chords) కలవు. శ్వాసనాళము (wind pipe) లోనుండి వాయువు నాదతంత్రుల నడుముగా వెలువడి నోటినుండి కాని ముక్కునుండి కాని బయటపడును. అప్పుడు ధ్వనులు ఉత్పన్నము లగును.

నాదతంత్రులు పరస్పరము దూరముగా నుండగా, వాని నడుమ నుండి యే యవరోధమును లేకుండ సులభముగా వాయువు వెలువడి నప్పుడు ఉచ్చరితములగు ధ్వనులను 'శ్వాసములు' అనికాని 'అఘోషములు' అనికాని పిలుతురు. ఆంగ్లమునందు వీనిని unvoiced sounds అనికాని surds అనికాని పిలుతురు. హల్లులలో క ఖ, చ చ̄ ఛ, ట ఠ, త థ, ప ఫ, శ ష స - అను వర్ణములు శ్వాసములు.

నాదతంత్రులు పరస్పరము సన్నిహితముగా నుండగా వాని మధ్యలోనుండి యొరసికొనుచు వాయువు వెలువడినపుడు ఉచ్చరితము లగు ధ్వనులను 'నాదములు' అనికాని 'ఘోషములు' అనికాని పిలుతురు. ఆంగ్లమునందు వీనిని voiced sounds అనికాని sonants అనికాని యందురు. అచ్చు లన్నియు నాదములే. అవికాక హల్లుల యందు గ ఘ జ జ జ̄ ఝ ఞ, డ ఢ ణ, ద ధ న, బ భ మ, య ర ల ళ వ హ - అను వర్ణములు నాదములయందే చేరును.

కొందరు శ్వాసవర్ణములను కఠోర హల్లులు (hard consonants అనియు, నాదవర్ణములను కోమలహల్లులు (soft consonants) అనియు పిలుచుట కలదు. 'క' వర్ణము మున్నగువానిని ఉచ్చరించు నపుడు నాదతంత్రులయందు అవరోధము లేకుండుటచేత శ్వాసనాళము నుండి వాయువు వేగవంతమై వెలువడును. అట్టియెడల దానిని వారించుటకు నాలుక (కరణము) తో గట్టిప్రయత్నము చేయవలయును.

ఈ ప్రయత్నాపేక్షనుబట్టి కకారాదిశ్వాసములకు కఠోరహల్లులు అను నామముకూడ ఉచితముగనే యున్నవి. వాగనుశాసనులు 'క చ ట త ప' లకు పరుషములని నామకరణము చేసిరి. ఆ 'క చ ట త ప'లు వాని వాని వర్గయుక్కులతో కలిసి కఠోరహల్లులుగా పరిగణింపబడు చున్నవి. 'గ జ డ ద బ' లకు సరళము లనుసంజ్ఞ వాగనుశాసను లుంచిరి. అవియు, వాని వర్గయుక్కులును, అనునాసికాక్షరములును కలియగా నేర్పడునవి కోమల హల్లులు. వీనిని పలుకునప్పుడు నాదతంత్రులు సన్నిహితముగా నుండి లోనుండి ప్రసరించు వాయువునకు అవరోధమును కలిగించును. కావున వాయువుయొక్క వేగము కొంత మందగించి యుండును. కాబట్టి నాలుక (కరణము) తో సులభప్రయత్నము చేసినంతనే గకారాది వర్ణములు ఉత్పన్నము లగును.

శ్వాసనాద భేదమును శ్రవణమాత్రముచేత గుర్తింప గలుగుటకు మంచి అభ్యాసము కావలయును. అయినను వానిని గుర్తించుటకు సాధారణముగా రెండు మార్గములు గలవు. వర్ణములను పలుకునప్పుడు గొంతుముడిపై మృదువుగా వ్రేలు నుంచి చూచి తెలిసికొనవచ్చును. నాదవర్ణములను పలుకునప్పుడు స్వరపేటికయందలి నాదతంత్రుల ప్రకంపనములను (vibrations) గుర్తింపవచ్చును. శ్వాసములను పలుకునప్పుడు ప్రకంపనములు కలుగవు కావున అట్టి యనుభూతి యుండదు. ఇది యొక మార్గము. రెండవమార్గము మరొకటి. ధ్వనులను ఉచ్చరించు నపుడు రెండు చెవులయందును వ్రేళ్ళను దూర్చుకొని యుండవలయును. నాదవర్ణముల నుచ్చరించునపుడు గింగురుమని ఒకరొదవలె వినిపించును. శ్వాసవర్ణములను పలుకునపు డట్టిరొద కలుగదు.

ఈ విభాగము నాదతంత్రుల యవస్థనుబట్టి కావింపబడినది.

స్పర్శాది విభాగము : నాలుకయందలి యొక భాగము నోటియందలి యొకభాగమును స్పృశించుటవలన నుచ్చరింపబడు వర్ణములను స్పర్శములు (mutes) అని యందురు. ఈవర్ణములను పలుకునప్పుడు శ్వాసనాళమునుండి వెలువడు వాయువు నిరుద్ధమై ఒకసారి

విడువబడును. ఆ లక్షణమునుబట్టి స్పర్శములకు స్ఫోటములు (Plosives) అను పేరుకూడ కలిగెను. కఖగఘ - టఠడఢ - తథదధ - పఫబభ॥ అను పదునారువర్ణములను స్పర్శము లనికాని స్ఫోటము లనికాని యందురు. వీనిని పలుకునపుడు వాయుమార్గమును పూర్తిగా మూసి వేసి తెరచుట జరుగుచున్నది. కావున వీనిని సంవృత హల్లులు (shut consonants అని stops అనికూడ పిలుతురు.

కొన్ని వర్ణములను పలుకునప్పుడు శ్వాసనాళమునుండి వెలువడు వాయువు ఏదోయొక స్థానమున మిక్కిలి యవరోధము నందును. అప్పుడు వాయు వా యవరోధమును దాటి వెలువడుటకు చేయుప్రయత్నమువలన పాముబుసవంటి యొక ధ్వని వినవచ్చును. అట్టిధ్వనితో కూడిన వర్ణము లగుటవలన శ ష స హ - అను నాలుగువర్ణములకు ఊష్మములు (Spirants) అను పేరు కలిగినది. ఈ ధ్వనులను పలుకునప్పుడు నాలుకకును (దంతమూలము గాని, తాలువుగాని, మూర్ధము గాని) స్థానమునకును నడుమ కొంచెముగా వ్యవధానముండును; అనగా పూర్తిగా మూసికొనిపోదని యర్థము. వాయు వా వ్యవధానములో నుండి సంఘర్షణము నొందుచు వెలువడును. కావుననే సంఘర్షణము వలన జనించినవర్ణము లనుభావముతో వీనిని ఘర్షములు (fricatives) అనికూడ అందురు. పైని చెప్పికొనిన స్ఫోటములలోవలె ఊష్మనాలను ఉచ్చరించునప్పుడు వాయువు ఎచ్చటను పూర్తిగా రుద్ధమగుటలేదు. అనగా అవ్యాహతముల్తై వెలువడు చున్నవన్నమాట! కావుననే వీనిని అవ్యాహతములు (continuants) అనికూడ పిలుతురు. వీనికి వివృత హల్లులు (open consonants అను మరొకపేరు కూడ కలదు.

వర్ణముల నుచ్చరించు సమయమున మృదుతాలువు (కొండ నాలుక) వంగి శ్వాసనాళమునుండి వెలువడు వాయువును కొంచెముగా కాని, పూర్తిగా కాని నోటిలోనికి రాకుండ నిరోధించును. అట్టిమెడల ఆ వాయువు నాసికావివరము (nasal cavity) వెంబడి వెలువడును. అట్టి సమయమున ఉచ్చరింపబడు వర్ణములైన 'ఙ ఞ ణ న మ' అను వానికి అనునాసికములు (nasals) అని పేరు.

కొన్ని వర్ణముల నుచ్చరించు సమయమున నాలుక దంతమూలమునుగాని మూర్ధమునుగాని స్పృశించును. అట్టియెడల మధ్యభాగము రుద్ధమై యుండుటచేత నాలుకయొక్క యిరుపార్శ్వములనుండి వాయువు బయలువెడలును. ల, ళ అను రెండు వర్ణములను పలుకునప్పుడు పైని చెప్పిన రీతిగా పార్శ్వములనుండి వాయువు వెలువడును గావున వీనికి పార్శ్వికములు laterals అని పేరు కలిగెను. కొందరు వీనిని స్పష్ట భాషలో 'side consonants' అనికూడ పిలుతురు.

తెలుగునందలి 'ర'వర్ణము లుంఠితవర్ణము. దీనిని పలుకవలసి వచ్చినప్పుడు నాలుకకొనను పైకెత్తి వెనుకభాగముతో మూర్ధమును స్పృశింపవలయును. ఇట్లు వెనుకభాగముచేత స్పృశించుటచేతనే దీనికీపేరు కలిగెను. ఆంగ్లమున దీనిని rolled consonant అని యందురు. తెలుగునందలి శకటరేఫము సాధురేఫముకంటె భిన్నమైన ఉచ్చారణ కలది. శకటరేఫమును పలుకునప్పుడు జిహ్వాగ్రము నొకప్రక్కగా వంచి మూర్ధమును స్పృశింపవలయును. అప్పుడు ఒక్కమారు కాక అవ్యవహితముగా పెక్కుమారులు స్పృశించుట జరుగును. Calling Bell పనిచేయునట్టి విధానమును గుర్తు తెచ్చుకొనిన యెడల శకటరేఫము యొక్క ఉచ్చారణవిధానమును గుర్తుపట్టవచ్చును. ఇట్లు పెక్కుమారులు స్పృశించుటచేత ఉత్పన్నమగుచున్నది కావున అవర్ణమును కంపితము (trill) అని యందురు.

తెలుగునందున్న య ర ల వ అను వర్ణములను అర్ధాచ్చులు (semi-vowels) అని యందురు. యవర్ణమును పలుకునప్పుడు జిహ్వాగ్రమును అంగిటికి దగ్గరగా తీసికొనివెళ్ళుట జరుగును; కాని స్పృశించుట జరుగదు. వ వర్ణమును పలుకునప్పుడు క్రిందిపెదవిని పైదంతములకు క్రిందుగా తీసికొని వెళ్ళుట జరుగును; ఇచ్చటను స్పృశించుట జరుగుట లేదు. అచ్చులకువలె వీనిని పలుకునప్పుడుకూడ కరణస్థానములకు కలయిక లేనందువల్లనే వీనిని 'అర్ధాచ్చులు' అని పరిగణించుట జరిగి యుండును. వీనికి 'అంతస్థములు' అను పేరుకూడ కలదు.

అనునాసికములను, పార్శ్వికములను, లుంఠిత కంపితములను, అర్ధాచ్చులను కలిపి సామూహికముగా ద్రవవర్ణములు (liquids) అని వ్యవహరించుట కూడ కలదు. ఊష్మములతో పాటుగా ద్రవవర్ణములను కూడ చేర్చి అవ్యాహతములు (continuants) అని యందురు.

హల్లులయందు దాదాపుగా అన్నింటిని చూచితిమి. చ చ ఛ జ జ ఝ అను వర్ణములు మాత్రము మిగిలియున్నవి. వీనిని ఉచ్చరించు నపుడు జిహ్వాగ్రము అంగిటిని తాకును. అప్పుడు వాయువు నిరుద్ధమై, ఒక్కసారిగా బహిర్గతమగును. ఇంతవరకు స్పర్శలక్షణము కలదు. అదేసమయమున ఊష్మములను పలుకునప్పటివలె రాపిడివంటి ధ్వని కూడ వినవచ్చును. కావుననే ఈ వర్ణములను ఉభయధర్మములను బట్టి 'స్పర్శోష్మములు' (affricates) అని యందురు.

ఇంతవరకు పలికెడువిధానము (manner) ను బట్టి యీ వర్గీకరణము జరిగినది. అనగా ప్రయత్నము నాధారముగా చేసికొని హల్లులను పై విధముగా విభాగించితిమని యర్థము.

ఒకవర్ణమును పలుకవలయునన్న ముఖయంత్రమునందు పెక్కు మార్పులు కలుగును. నాలుకయందలి యొకభాగము నోటియందలి యొకభాగమును ఒకవిధముగా స్పృశించుటవలన నొక్కొకవర్ణము పుట్టును. జిహ్వాభాగమును కరణమనియు నోటియందలిభాగమును స్థానమనియు, స్పృశించు విధానమును ప్రయత్నమనియు నందురు. కరణ స్థాన ప్రయత్నముల భేదమునుబట్టియే ధ్వనులయందు భేదము కలుగు చున్నది. పైని ప్రయత్న భేదమునుబట్టి ధ్వనుల నెన్నివిధములుగా విభాగింపవచ్చునో చూచితిమి. ఇప్పుడింక స్థాన కరణముల విషయము చూతము.

నోటియందు ప్రసిద్ధముగా నున్న స్థానములను గుర్తు చేసికొందము. ముందరిపండ్లయొక్క వెనుకభాగమును నాలుకకొన తాకుటవలన దంత్యములు పుట్టును. కావున 'దంతములు' ఒకస్థానము. దంతములకు కొంచెము పైగానున్న భాగమును 'అంగిలి' అని యందురు. అదియే తాలువు. దానికి కొంచెముపైగా ఉన్న భాగమును, అనగా నాలుకనుకప్పి

యున్న పై భాగమునందలి మధ్యభాగమును మూర్ధము అని యందురు. నాలుకకు ఆదియందు కంఠము కలదు. కావున దానిని కంఠస్థానముగను, జిహ్వామూలముగను గుర్తింపవచ్చును. నాలుకనుగూడ కంఠదేశము నందలి భాగమును జిహ్వామూలము, మూర్ధమునకు దిగువభాగమును జిహ్వామధ్యము, ముందరిపండ్లకు సన్నిహితభాగమును జిహ్వాగ్రము అని మూడు విభాగములు చేయవచ్చును.

కంఠ్యములు : కంఠమునుండి యుత్పన్న మగునవి యని యర్థము. నాలుక నంతటిని వెనుకకు లాగి ముద్దగాచేసి (భయపడినపిల్లి శరీరము నంతను వెనుకకు కుంచించినట్లు) కంఠబిలమును మూసి విడువవలయును. అప్పుడు కంఠ్యములు ఉద్భవించును. నిజమునకు కంఠబిలమును మూయుట యనగా, నాలుకయొక్క యొత్తిడివలన మృదుతాలువును కంఠమునకు అడ్డుగా నిలుపుట జరుగుచున్నది. మృదుతాలువును ఆంగ్లమున soft palate అనియు velum అనియు నందురు. కావున కంఠ్యములను gutterals అనుటతోపాటు soft palatals అనియు velars అనియుకూడ పిలుతురు.

అ ఆ క ఖ గ ఘ ఙ హ - అను వర్ణములను కఖలకు ముందు పలుకబడు విసర్గమును కంఠ్యములుగా పరిగణింతురు.

తాలవ్యములు : నాలుకకొన అంగిటిని తాకుటవలన కలుగు వర్ణములను తాలవ్యములని యందురు. అచ్చులను పలుకునప్పుడు కరణస్థానముల సాన్నిహిత్యమే కాని స్పర్శ యుండదు. ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ - అను వర్ణములను తాలవ్యములు (palatals) అని యందురు.

మూర్ధన్యములు : జిహ్వాగ్రమును కొంచెము పైకెత్తి వెనుకకు మడచి, మూర్ధమును స్పృశించుటవల్ల మూర్ధన్య వర్ణము లుత్పన్నము లగును. ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ఱ ష - అనునవి మూర్ధన్యములు. వీనిని ఆంగ్లమున cerebrals అనియు retroflexes అనియు పిలుతురు.

**దంత్యములు :** జిహ్వాగ్రము ముందరిపండ్ల యొక్క వెనుక భాగ మును స్పృశించుటవల్ల దంత్యములు ఉద్భవించును. ౘ ౙ చ జ త థ ద ధ న ల స – అనునవి దంత్యములు. ఆంగ్లమున dentals అని యందురు.

**ఓష్ఠ్యములు :** పెదవుల సాహాయ్యమువలన పలుకబడువానిని ఓష్ఠ్యములు అని యందురు. ఉ ఊ ఒ ఓ ఔ ప ఫ బ భ మ – అను వర్ణములును, ప ఫ లకు పూర్వమందు పలుకబడు విసర్గమును ఓష్ఠ్యము లుగా పరిగణింతురు. ఆంగ్లమున వీనిని labials అని యందురు.

కఖలకు ముందు పలుకబడు విసర్గమును జిహ్వామూలీయమనియు, పఫలకు ముందు పలుకబడు విసర్గమును ఉపధ్మానీయమనియు నందురు.

'వ' వర్ణమును దంతోష్ఠ్యమని యందురు. పై పండ్ల క్రింద భాగ మున క్రింది పెదవినుంచి, ఆ వ్యవధానము నెంబడిని వాయువును విడుచుట వలన 'వ' ధ్వని పుట్టును. కావున దంతములయొక్కయు, ఓష్ఠముల యొక్కయు సాహాయ్యమువలన నుద్భవించునదగుటచే దీనికి దంతో ష్ఠ్యము అనుపేరు తగియున్నది. ఆంగ్లమున దీనిని denti - labial అని యందురు. ఎ, ఏ, ఐ – అను మూడువర్ణములును కంఠముల యొక్కయు, తాలువులయొక్కయు సాహాయ్యమున నుచ్చరింపబడుట చేత కంఠతాలవ్యము లనియందురు. ఒ ఓ ఔ – అను వర్ణములను కంఠోష్ఠ్యము లనియందురు. వీనికి కంఠమును, ఓష్ఠములును సాధనము లగును.

ఉచ్చారణస్థానమునుబట్టియు, పెదవులస్థానమునుబట్టియు అచ్చు లను మరల వింగడించుట జరుగును. స్వరవర్ణములను పలుకునపుడు జిహ్వాభాగము పైకి లేచును; కొన్నియెడల నిమ్నముగా నుండిపోవును; కొన్నియెడల కొంతవరకు మాత్రమే లేచును.

(i) అ ఆ అను వర్ణములను పలుకునపుడు నాలుక బల్లపరుపుగా నుండిపోవును. కావున ఆ వర్ణములను నిమ్నస్వరములు (low vowels) అని యందురు. ఇ ఈ అను వర్ణములను పలుకునపుడు నాలుక ముందరి

భాగము పైకిలేచును. అట్లే ఎ ఏ అను వర్ణములను పలుకునప్పుడును జిహ్వాగ్రము పైకి లేచును. కావున వీనిని ఉన్నతస్వరములు (high vowels) అని యందురు. ఉ ఊ ఒ ఓ లను పలుకునప్పుడు జిహ్వామూలము పైకి లేచును. కావున ఇవియు ఉన్నత స్వరములే.

(ii) ఉచ్చారణ స్థానమునుబట్టి స్వరములను మూడువిధములుగా అగ్రిమస్వరములు. మధ్యమస్వరములు, పశ్చిమస్వరములు అని విభాగింపనగును. ఇ ఈ ఎ ఏ - అను వర్ణములు అంగిటికి సమీపముగా, అనగా నోటియందు ముందరిభాగమున జన్మించును. కావున వీనిని అగ్రిమస్వరములు front vowels అని పిలుతురు.'అ' వర్ణము నోటికి మధ్యభాగమున నుద్భవించును. కావున దీనిని మధ్యమస్వరము central vowel అని పిలుతురు. ఉ ఊ ఒ ఓఅను వర్ణములు జిహ్వామూలమునకు సమీపముగా నుద్భవించును.అనగా నోటియందు వెనుక భాగమున జనించుటచే వీనిని పశ్చిమస్వరములు(back vowels) అని పిలుతురు.

(iii) ఉచ్చరించునప్పుడు పెదవులనుంచిన యాకారమునుబట్టి వర్తులములు rounded , అవర్తులములు unrounded అని అచ్చులు రెండు విధములుగా విభాగింపబడును. ఉ ఊ ఒ ఓ అను వర్ణముల నుచ్చరించునప్పుడు క్రింది పెదవియు, పై పెదవియు వంగి ఒక వృత్తము నేర్పరుచును. కావున పై యచ్చులను 'వర్తులములు' అని పిలుతురు. మిగిలిన యచ్చులన్నియు 'అవర్తులములు' అని యనిపించుకొనును.

(iv) నోరు తెరచుకొని యున్నరీతినిబట్టి నాలుగు విధములుగా అచ్చులను విభాగింతురు. అ ఆ అను వర్ణములను పలుకునప్పుడు నోరు పూర్తిగా తెరవవలయును. కావున వానిని వివృతములు (open vowels అని యందురు. ఇ ఈ ఉ ఊ అనువానిని సంవృతములు (close vowels అని యందురు. ఎ, ఒ అనువానిని ఈషత్ సంవృతములనియు, ఏ ఓ అనువానిని ఈషద్వివృతములనియు నందురు.

ఇట్లు హల్లులను, అచ్చులను ప్రయత్న భేదములనుబట్టి స్థానకరణ భేదములనుబట్టి భాషాశాస్త్రజ్ఞులు అనేకవిధములుగా విభాగించిరి. ఈ విధమగు విభాగమువలన ఉచ్చారణదక్షత ఎక్కుగా ఏర్పడుటకు అవకాశము కలదు. భాషాశాస్త్రమునందు ఉచ్చారణమునకు ఉన్నతస్థానముండుటచేత, ఆవిషయమున శ్రద్ధవహించి భాషాశాస్త్రజ్ఞులు పెక్కువిధములుగా ధ్వనుల స్వరూపమును నిరూపించుటకు ప్రయత్నముచేసిరి.

## ధ్వనుల వివరణ

తెలుగునందును, పరిసరద్రావిడభాషలందును గల ధ్వనుల నన్నింటి నొకచోట చేర్చి వాని స్వరూపమును విశదముగా గమనించుట యవసరము.

అ వివృత నిమ్న మధ్యమ స్వరము (open low central vowel) అవర్తులము unrounded ; కంఠ్యము; హ్రస్వము.

ఆ వివృత నిమ్న పశ్చిమ స్వరము (open low back vowel); అవర్తులము; కంఠ్యము; దీర్ఘము.

$ఆ_{I}$ అర్ధవివృతము; ఉన్నతము; అగ్రిమము. half open high front vowel): అవర్తులము; తాలవ్యము; దీర్ఘము. తెలుగు వాడుకలో 'తాటాకు' మున్నగుచోట్ల నున్నది.

ఇ సంవృతము; ఉన్నతము; అగ్రిమము. (close high front vowel); అవర్తులము; తాలవ్యము; హ్రస్వము. (unrounded short palatal).

ఈ సంవృతము; ఉన్నతము; అగ్రిమము. (close high front vowel); అవర్తులము; తాలవ్యము; దీర్ఘము. (unrounded long palatal).

ఉ సంవృతము; ఉన్నతము; పశ్చిమము. (close high back vowel); వర్తులము; ఓష్ఠ్యము; హ్రస్వము. (rounded short labial).

ఊ సంవృతము; ఉన్నతము; పశ్చిమము close high back vowel ; వర్తులము; ఓష్ఠ్యము; దీర్ఘము; (rounded long labial).

ఋ సంవృతము; ఉన్నతము; అగ్రిమము (close high front vowel); అవర్తులము; మూర్ధన్యము; హ్రస్వము (unrounded short retroflex).

ౠ సంవృతము; ఉన్నతము; అగ్రిమము (close high front vowel); అవర్తులము; మూర్ధన్యము; దీర్ఘము (unrounded long retroflex).

ఌ ౡ సంవృతము; ఉన్నతము; అగ్రిమము (close high front vowels) అవర్తులము; దంత్యము (unrounded dentals).

ఎ ఈషత్ సంవృతము; మిశ్రము; అగ్రిమము. (half - close mid front vowel); అవర్తులము; తాలవ్యము; హ్రస్వము (unrounded short palatal)

ఎ, తుళుభాషలో ఈవర్ణము కలదు. ఇది 'ఎ' వర్ణమునకు 'ఏ' వర్ణమునకు నడుమగా పలుకబడును.

ఏ ఈషద్ వివృతము; మిశ్రము; అగ్రిమము. (half open mid front vowel); అవర్తులము; తాలవ్యము; దీర్ఘము; (unrounded long palatal)

ఏ, తెలుగు వాడుకయందు 'అ' కారమునకు 'ఏ' కారమునకు మధ్యగా 'వచ్చాడు, పోయాడు' మున్నగుచోట్ల ఈ ఉచ్చారణ వినిపించును.

ఐ సంయుక్తాక్షరము (diphthong). అ ఇ - అను వర్ణముల కలయికచే నేర్పడినది.

ఒ ఈషత్ సంవృతము; ఉన్నతము; పశ్చిమము. (half-close high back vowel); వర్తులము; ఓష్ఠ్యము; హ్రస్వము (rounded short labial)

ఒ$_1$ తుళుభాషలో ఈ వర్ణము కలదు. 'అ' వర్ణమునకును 'ఒ' వర్ణమునకును నడుమగా దీనిని పలుకుదురు.

ఓ ఈషద్వివృతము; ఉన్నతము; పశ్చిమము. (half-open high back vowel); వర్తులము; ఓష్ఠ్యము; దీర్ఘము. (rounded long labial).

ఔ సంయుక్తాక్షరము (diphthong); అ ఉ అను వర్ణముల కలయికచే నేర్పడినది.

క శ్వాసము; హనుమూలీయము (కంఠ్యము); అల్పప్రాణము; స్పర్శము. (unvoiced unaspirated velar plosive).

ఖ శ్వాసము; హనుమూలీయము (కంఠ్యము); మహాప్రాణము; స్పర్శము. (unvoiced aspirated velar plosive).

గ నాదము; హనుమూలీయము; అల్పప్రాణము; స్పర్శము. (voiced unaspirated velar plosive).

ఘ నాదము; హనుమూలీయము: మహాప్రాణము; స్పర్శము. (voiced aspirated velar plosive).

ఙ నాదము; హనుమూలీయము; అల్పప్రాణము; అనునాసికము; ద్రవవర్ణము; అవ్యాహతము. (voiced unaspirated velar nasal liquid continuant).

చ శ్వాసము; తాలవ్యము; అల్పప్రాణము; స్పర్శోష్మము. (unvoiced unaspirated palatal affricate).

ౘ శ్వాసము; దంత్యము; అల్పప్రాణము; స్పర్శోష్మము. (unvoiced unaspirated dental affricate).

ఛ శ్వాసము; తాలవ్యము; మహాప్రాణము; స్పర్శోష్మము. (unvoiced aspirated palatal affricate).

జ నాదము; తాలవ్యము; అల్పప్రాణము; స్పర్శోష్మము. (voiced unaspirated palatal affricate).

ౙ నాదము; దంత్యము; అల్పప్రాణము; స్పర్శోష్మము. (voiced unaspirated dental affricate)

ఝ నాదము; తాలవ్యము; మహాప్రాణము; స్పర్శోష్మము (voiced aspirated palatal affricate)

ఞ నాదము; తాలవ్యము; అల్పప్రాణము; అనునాసికము; ద్రవము; అవ్యాహతము. (voiced unaspirated palatal nasal liquid continuant).

ట శ్వాసము; మూర్ధన్యము; అల్పప్రాణము; స్పర్శము. (unvoiced unaspirated retroflex plosive).

ఠ శ్వాసము; మూర్ధన్యము; మహాప్రాణము; స్పర్శము. (unvoiced aspirated retroflex plosive).

డ నాదము; మూర్ధన్యము; అల్పప్రాణము; స్పర్శము. (voiced unaspirated retroflex plosive).

ఢ నాదము; మూర్ధన్యము; మహాప్రాణము; స్పర్శము. (voiced aspirated retroflex plosive)

ణ నాదము; మూర్ధన్యము; అల్పప్రాణము; అనునాసికము; ద్రవము; అవ్యాహతము. (voiced unaspirated retroflex nasal liquid continuant).

త శ్వాసము; దంత్యము; అల్పప్రాణము; స్పర్శము. (unvoiced unaspirated dental plosive).

థ శ్వాసము; దంత్యము; మహాప్రాణము; స్పర్శము. (unvoiced aspirated dental plosive).

ద నాదము; దంత్యము; అల్పప్రాణము; స్పర్శము. (voiced unaspirated dental plosive).

ధ నాదము; దంత్యము; మహాప్రాణము; స్పర్శము. (voiced aspirated dental plosive).

న నాదము; దంతమూలీయము; అల్పప్రాణము; అనునాసికము; ద్రవము; అవ్యాహతము. (voiced unaspirated alveolar nasal liquid continuant).

ణ నాదము; మూర్ధన్యము; అల్పప్రాణము; అనునాసికము; ద్రవము అవ్యాహతము (voiced unaspirated retroflex nasal liquid continuant). తమిళమున మాత్రమే కలదు.

ప శ్వాసము; ఓష్ఠ్యము; అల్పప్రాణము; స్పర్శము. unvoiced unaspirated labial plosive).

ఫ శ్వాసము; ఓష్ఠ్యము; మహాప్రాణము; స్పర్శము. (unvoiced aspirated labial plosive).

బ నాదము, ఓష్ఠ్యము, అల్పప్రాణము, స్పర్శము. voiced unaspirated labial plosive)

భ నాదము, ఓష్ఠ్యము, మహాప్రాణము, స్పర్శము. (voiced aspirated labial plosive).

మ నాదము; ఓష్ఠ్యము; అల్పప్రాణము; స్పర్శము. ద్రవము; అవ్యాహతము. (voiced unaspirated labialnasal liquid continuant).

య నాదము; తాలవ్యము; అంతస్థము (అర్ధాచ్చు); ద్రవము; అవ్యాహతము. voiced palatal liquid continuant semi-vowel .

ర నాదము; మూర్ధన్యము; లుంఠితము; ద్రవము; అవ్యాహతము (voiced retroffex rolled liquid continuant).

ఱ నాదము; దంతమూలీయము; కంపితము; ద్రవము; అవ్యాహతము. (voiced alveolar trill liquid continuant).

ఴ నాదము; మూర్ధన్యము; ఊష్మము; ద్రవము; అవ్యాహతము. (voiced retroffex spirant liquid continuant).

ల నాదము; దంతమూలీయము, పార్శ్వికము; ద్రవము; అవ్యాహతము. (voiced alveolar lateral liquid continuant).

వ నాదము; దంతోష్ఠ్యము; అంతస్థము; ద్రవము; అవ్యాహతము. (voiced denti-labial semi-vowel liquid continuant .

శ — శ్వాసము; తాలవ్యము; మహాప్రాణము; ఊష్మము; అవ్యాహతము. unvoiced aspirated palatal spirant continuant).

ష — శ్వాసము; మూర్ధన్యము; మహాప్రాణము; ఊష్మము; అవ్యాహతము. unvoiced aspirated retroflex spirant continuant).

స — శ్వాసము; దంత్యము; మహాప్రాణము; ఊష్మము; అవ్యాహతము. unvoiced aspirated dental spirant continuant)

హ — నాదము, కంఠ్యము, మహాప్రాణము, ఊష్మము, అవ్యాహతము. voiced aspirated gutteral spirant continuant.

ళ — నాదము, మూర్ధన్యము, పార్శ్వికము, ద్రవము, అవ్యాహతము. (voiced retroflex lateral liquid continuant).

## ధ్వని నియమములు - అపవాదములు

ఒకభాషలోని వర్ణములు భిన్నకాలములలో మార్పునొందుటకాని, ఒకే కుటుంబమునకు చెందిన భిన్నభాషలలోని వర్ణములు సమకాలమున మార్పు నొందుటకాని జరుగుచుండును. ఆ విషయమును ఇంతకుముందే కొంతకు కొంత చూచితిమి. ఇట్టిమార్పు యథేచ్ఛముగా జరుగుచుండునా? ఏదేని నియమము ననుసరించి జరుగుచుండునా? ఒక నియమము ననుసరించియే జరుగుచుండు నని సమాధానము.

గణితమునందు, రసాయనాదిశాస్త్రములందు నున్న నియమము వంటి నియమము ధ్వనిపరిణామము విషయమున వీలగునా? యనునది మరొక ప్రశ్న. గణితమునందు ఎప్పుడైనను మూడు మూళ్లు తొమ్మిదియే యగును. మరొకటి యగుటకు వీలులేదు. ఉదజని రెండుపాళ్లు ఆమ్లజని యొకపాలు కలియగా రాసాయనికపరిణామమువల్ల నీరేర్పడును. దీని విషయమున మార్పున కవకాశము లేదు. ధ్వని నియమములు

(Phonetic Laws) కూడ నిట్లు నిశ్చితములై యుండుననియే కొందర తలంపు. ధ్వని నియమములకుకూడ అపవాదములు (exceptions) కల వనియు, ప్రకృతినియమముల వలె నిశ్చితములు కావనియు కొందర యభిప్రాయము. ధ్వని నియమముల విషయమున మూడంశములను గుర్తించు కొనుట యవసరము.

1. ధ్వని నియమములు ఏదోయొక కాలమునకు, ఏదోయొక భాషా కుటుంబమునకు మాత్రమే సంబంధించి యుండును. 2. ఒకజాతి కాని వర్గముకాని ఒక ప్రత్యేకపరిస్థితిలో ఒక ప్రత్యేక నియమము ననుసరించి ధ్వని పరిణామమునకు కారణమగును. కావున ఆ నియమము ఆ ప్రత్యేక పరిస్థితికి ప్రవృత్తి యున్నంతకాలము నిశ్చితమై యుండును. 3. పూర్వమున్న భాష యనంతరకాలమునందు పొందిన మార్పును సూచించుటయే ధ్వని నియమముల ప్రయోజనము. అంతే కాని భవిష్యత్కాలమున ఎట్టి పరిణామము రాగలదో ధ్వని నియమములనుబట్టి యూహించుట కవకాశము లేదు.

టి. జి. టకర్ అను నాయన "A phonetic law of a language is a statement of the regular practice of that language at a particular time in regard to the treatment of a particalar sound or group of sounds in a particular setting" అని వ్రాసెను. కావున ఒక భాషను వేర్వేరు కాలములలో పరిశీలించి, ఒకకాలములోని వేర్వేరుభాషలను పరిశీలించి, అక్కడ గోచరించు మార్పులను గుర్తించి క్రోడీకరించుటయే ధ్వని నియమ మని నిర్ధారణ చేయవచ్చును.

జర్మనీ దేశస్థుడైన జేకబ్ గ్రిమ్ (Jacob Grimm) అను నాయన సంస్కృతము, లాటిను, గ్రీకు, ఇంగ్లీషు, జర్మను మున్నగు భాషలలోని రూపములను తులనాత్మక పరిశీలనముచేపి ధ్వని నియమములను క్రోడీకరించెను. ఆ నియమములకు గ్రిమ్ నియమము (Grimm's law) అని పేరు. ఇట్టిప్రయత్న మింతకు పూర్వము డెన్మార్కు దేశస్థుడైన

రాస్మస్ రాస్కు (Rasmus Rask) చేసియుండెను. అయినను గ్రిమ్ నియమము శాస్త్రీయమై, సమంజసమై ప్రతిష్ఠను పొందినది.

గ్రిమ్ నియమమును జర్మనుభాషా ధ్వని నియమమని యన వచ్చును. జర్మను భాషయందు ధ్వనిపరిణామము రెండుమారులు కలిగెను. మొదటిపరిణామము క్రీస్తు పూర్వమే ఎన్నో శతాబ్దుల క్రితము కలిగెను. రెండవపరిణామము క్రీ. శ. ఏడవశతాబ్దియందు, అనగా జర్మనులు ఆంగ్లోసాగ్జనులనుండి వేరుపడిన పిమ్మట కలిగెను.

**మొదటి ధ్వని పరిణామము** : ఇండో యూరోపియను మూల భాషయందలి స్పర్శములు జర్మను భాషయందు ఈ దిగువరీతిగా మార్పు నొందెను.

| | ఇం. యూ. భాష | జర్మానిక్ భాష |
|---|---|---|
| 1. | క - త - ప | ఖ (హ) - థ - ఫ |
| 2. | గ - ద - బ | క - త - ప |
| 3. | (హ)ఘ - ధ - భ | గ - (డ)ద - బ |

పై నియమములకు వరుసగా లక్ష్యములను చూతము.

| | సంస్కృతము/గ్రీకు | జర్మానిక్ భాష | ధ్వని |
|---|---|---|---|
| 1. | కః | హు | క>హ |
| | తను | థిన్ | త>థ |
| | పితా | ఫాదర్ | ప>ఫ |
| 2. | గో | కౌ | గ>క |
| | దశన్ | టెన్ | ద>ట |
| | లేబియమ్ | లిప్ | బ>ప |
| 3. | హోస్టిస్ | గెస్ట్ | హ>గ |
| | విధవా | విడో | ధ>డ |
| | భర్ | బేర్ | భ>బ |

**రెండవ ధ్వని పరిణామము** : మొదటి పరిణామమువలన ఇండో యూరోపియను మూలభాషనుండి జర్మానిక్ భాష వేరుపడి భిన్నప్రవృ

త్తిని సూచించినది. రెండవ పరిణామమునందు జర్మనుభాషయే 'నిమ్న జర్మను' అనియు 'ఉచ్చ జర్మను' అనియు రెండురూపములను దాల్చినది. అందలి ధ్వని పరిణామ నియమము క్రిందివిధముగా నుండును.

| | నిమ్న జర్మను(ఆంగ్లము) | ఉచ్చ జర్మను |
|---|---|---|
| 1. | ఖ (హ) - థ - ఫ | గ - ద(డ) - బ |
| 2. | గ - ద (డ) - బ | క - త - ప |
| 3. | క - త - ప | ఖ(హ) - థ(జ) - ఫ |

పై నియమములకు వరుసగా లక్ష్యములను చూతము.

| | ఆంగ్లము | జర్మను | ధ్వని |
|---|---|---|---|
| 1. | బ్రదర్ (Brother) | బ్రుడర్ (Bruder) | థ > డ |
| | థీఫ్ (Thief) | డీబ్ (Dieb) | ఫ > బ |
| 2. | గార్డన్ (Garden) | కార్టొ (Karto) | గ > క |
| | డాటర్ (Daughter) | టొక్టర్ (Tochter) | డ > ట |
| | బోల్డ్ (Bold) | పాల్డ్ | బ > ప |
| 3. | యోక్ (Yoke) | యూఖ్ (Joch) | క > ఖ |
| | టు (Two) | జ్వి (Zwie) | ట > జ |
| | డీప్ (Deep) | టైఫ్ (Tief) | ప > ఫ |

పైని చూపిన రెండు ధ్వనిపరిణామములనుబట్టి ఈ క్రిందివిధముగా ఒకపట్టికను నిర్మింపవచ్చును. అది మూలభాషకును, జెర్మానికు భాషకును, జర్మనుభాషకును గల ధ్వని భేదములను నిరూపింపగలదు.

| | ఇం. యూ | ఆంగ్లము | జర్మను |
|---|---|---|---|
| 1. | క - త - ప | ఖ(హ)- థ - ఫ | గ - ద - బ |
| 2. | గ - ద - బ | క - త - ప | ఖ - థ - ఫ |
| 3. | ఘ - ధ - భ | గ - ద - బ | క - త - ప |

గ్రిమ్ నియమమునందు మూడు విధములయిన దోషములు ప్రవేశించినవి. 1. భిన్న భిన్నకాలములకు చెందిన ధ్వని పరిణామముల నొక్కమాదిరిగనే పరిగణించుట జరిగెను. 2. ఈ ధ్వని పరిణామము

కేవలము జర్మనుభాషకు మాత్రమే నియతమై యున్నది. కాని యితరములైన ఇండోయూరోపియనుభాషలను స్పృశించుటలేదు.
3. రెండవ ధ్వని పరిణామమునొందిన ఉచ్చజర్మనుభాషనైనను ఈ ధ్వని నియమము పూర్తిగా కలియగలుపుకొనుట లేదు.

పైదోషములనుబట్టి గ్రిమ్‌నియమమును మొదటి ధ్వని పరిణామమువరకు పాక్షికముగా మాత్రమే అంగీకరించుట జరుగుచున్నది. గ్రిమ్ నియమమునకు కొన్ని అపవాదములుకూడ సూచింపబడుచున్నవి. మొదటి అపవాదము: ఇండోయూరోపియను మూలభాషయందు స్క, స్త, స్ప అని యున్నప్పుడు క త ప ల కు జర్మానికు భాషలలో ఏమార్పును వచ్చుట లేదు. గ్రిమ్ నియమము ప్రకారము ఖ(హ)- థ - ఫ అని మారుట యవసరము. సం. అస్తి. లా. ఎస్త్ జర్మానిక్ ఇస్త్ అనియుండి జర్మనుభాషలో 'ఇస్త్' అనియే స్థిరపడెను. రెండవ అపవాదము: ఇండోయూరోపియను మూలభాష యందలి క్త, ప్త అను వానియందలి 'త' వర్ణము మార్పు నొందుట లేదు. సం. అష్టన్ లా. అక్టోన్ జర్మానిక్. అక్తన్ అనియుండి జర్మనుభాషయందు అఖ్త్ అని స్థిరపడెను. గ్రిమ్ నియమము ప్రకారము త > థ పరిణామము కలుగవలయును. ఇక్కడ కలుగలేదు. మరొక అపవాదము: ఇండోయూరోపియనుమూలభాషలోని ద బ వర్ణములు గ్రిమ్ నియమము ననుసరించి త ప వర్ణములుగా మారవలయును. సంస్కృతమునందలి 'దుహితృ' శబ్దము ఆంగ్లమునందు డాటర్ (daughter) అని యగుచున్నది. సంస్కృత 'బోధ్' ధాతువు జెర్మానికు భాషలో బిన్ద binda) అనియే యగుచున్నది. వీని నన్నింటి నపవాదములనియే నిర్ణయింపవలయు నని యనిపించును.

కాని హెర్మన్ గ్రాస్మన్ అను భాషాశాస్త్రవేత్త యిక్కడి రహస్యమును బయలుపరిచి, చిక్కు విడదీసెను. సంస్కృతమునందును, తత్సంబంధమైన గ్రీకు మున్నగు భాషలందును మహాప్రాణములు రెండు వ్యవధానములేకుండ ఒక దాని వెంబడి నొకటి వచ్చినపుడు మొదటిది

అల్పప్రాణముగా మారును. 'ధా' ధాతువు పునరుక్తి నొందినపుడు 'ధధామి' అని యగును. ప్రస్తుతనియమమునుబట్టి ప్రథమ ధ్వని అల్ప ప్రాణము కాగా 'దధామి' అని యగును. ఇట్లే 'భాష్' ధాతువునుండి 'బభాష' అని యగును. ఇట్లే 'దుహితృ' శబ్దమునందు పూర్వభాగము 'ధుఘ్' అని యుండవలయును. 'కామధుక్' అని యన్నప్పుడు మహా ప్రాణమే యున్నది. అదేమరల 'దుగ్ధ' అని యన్నప్పుడు అల్పప్రాణ ముగా మారిపోవుచున్నది. అట్లే 'దుహితృ' అని పూర్వరూపమై యుండి రెండవరూపముకూడ మహాప్రాణ మగుటవల్ల మొదటిది అల్ప ప్రాణముగా 'దు' అని మార్పునొందినది. సంస్కృతమునందలి 'ధ' జెర్మానిక్ భాషయందు 'ద' గా కాని 'డ'గా కాని మారుట గ్రిమ్ నియమమునకు అనుకూలమే. అట్లే 'బోధ్' అని సంస్కృతములోనున్న ధాతువు ఇండోయూరోపియను మూలభాషయందు 'భేన్ధ్' అని యుండును. అనగా 'భ' వర్ణమునకు 'బ' వర్ణము వచ్చుచున్నదని యర్థము. కాబట్టి యీ మార్పుకూడ నియమము ననుసరించియే జరిగ నని చెప్పవలయును.

గ్రాస్మన్ పైవిధముగా ఒక విరోధమును పరిహరించి, తాను మరొకసూత్రమును చేసెను. గ్రీకు క త ప ల స్థానములో జర్మను భాషలో గ ద బలు వచ్చినయెడల పూర్వధ్వనులు మహాప్రాణముల స్థానములయందు ఆదేశములై యుండునని యాయన సూత్రము. కాని యువకః (సం) యంగ్ (ఆం); శతమ్ (సం) హన్డ్ (గోథిక్); లిమ్పామి (సం) బై లై బా (గోథిక్) మున్నగుప్రయోగములనుబట్టి అల్పప్రాణ ములే యైనప్పటికి మూలభాషయందలి శ్వాసములు జెర్మానిక్ భాష లలో నాదములుగా మారుట కననగును. ఇది గ్రాస్మన్ నియమము నకు అపవాదము.

కార్ల్ వెర్నర్ అను భాషాశాస్త్రవేత్త యిక్కడి విరోధమును పరిహరించి, నియమమును నిలబెట్టెను. ఇండోయూరోపియను మూల భాషయందలి 'క త ప' ధ్వనులు జెర్మానిక్ భాషలందు 'హ థ ఫ'

అని మారుట గ్రిమ్‌నియమము ననుసరించి జరుగును. ఇక్కడ మరొక చిన్నవిషయము కలదు. పై 'క త ప' లకు పూర్వమందు ఉదాత్త స్వర మున్నప్పుడు మాత్రమే అట్లు జరుగును. అట్లు కానియెడల 'గ ద (డ) బ' లుగా మారును. పైని అపవాదములుగా ఇచ్చిన యుదాహరణములందు 'క త ప' లకు పూర్వమందు ఉదాత్త స్వరములు లేకపోవుటవలననే 'హ థ ఫ' ధ్వనులు వచ్చుట కవకాశము లేకపోయినది. 'భ్రాతృ' అను శబ్దమునందు 'త' ధ్వనికిపూర్వము ఉదాత్తస్వరము కలదు. కావున నిచ్చట 'త' యనునది థ (th) గా మారి brother అని యగును. ఇట్లే 'మాతృ' అన్నప్పుడు mother అని యగును. 'పితృ' అని యన్నప్పుడు father అని యగును. ఇచ్చట 'త' వర్ణమునకు ముందు ఉదాత్తధ్వని లేకపోయినప్పటికిని 'd' వర్ణముగా మారక 'th' వర్ణముగా మారుట అపవాదమే. ఈ అపవాదమునకు కారణము సామ్యము (analogy). Brother, Mother మున్నగుశబ్దముల సామ్యమువలననే Father అను రూపమున కూడ 'th' అనుధ్వనియే నిల్చుట జరిగెను.

మొత్తముమీద ధ్వని నియమములు నియమబద్ధముగానే ప్రవర్తించునని యంగీకరింపవలయును. ఎచ్చటనైనను అపవాదము ఉన్నట్లు తోచుటకు కారణము సూత్రకర్తయొక్క అనవధానతయే యనిపించును. గ్రిమ్ సూత్రమును గ్రాస్మన్ సవరించుటకు, గ్రాస్మన్ సూత్రమును వెర్నర్ సవరించుటకును కారణము నియమకర్తలోపమే కాని నియమలోపము కాదు. అట్లే నియమములను భాషలకు అన్వయించునపుడు, ఆ నియమము ఏకాలమునకు ఏభాషకు ఉద్దేశింపబడినదో కూడ అర్థము చేసికొని అన్వయింపవలయును. ఒక్కొక్కప్పుడు 'సామ్యము' మున్నగు బాహిరకారణములవలన నియమములకు అపవాదమున్నట్లు గోచరింపవచ్చును. అట్లే ఆదేయ పదముల(loan words)ను పరిణత రూపములతో సమానముగా చూచినప్పుడును నియమమునకు అపవాదమున్నట్లు అనిపించును.

గ్రిమ్ 'క త ప' మున్నగు వర్ణములనుగూర్చి చెప్పినపుడు సంయుక్త వర్ణముల నాతడుద్దేశించి యుండలేదు. అట్టియెడల అతడు చెప్పని వర్ణముల నాతడు చెప్పినట్లూహించుకొని 'స్క-స్త స్ప' మున్నగు చోట్ల గ్రిమ్ నియమము తప్పుచున్న దనుకొనుట మన అనవధానతకు లక్ష్యము కాగలదు. కావున ధ్వనినియమములు దేశకాలబద్ధములై పరిమిత పరిస్థితులలో నిశ్చితముగా ప్రవర్తించునని నిర్ణయింప వచ్చును. అట్టి ప్రవృత్తికి భిన్నమైన ప్రవృత్తి కనిపించినయెడల అచ్చట సామ్యము పనిచేసి యుండవలయును; అట్లు కానియెడల అది యితర భాషనుండి అనంతరకాలమున ఆదేయపదము (loan word) గా వచ్చి చేరినదయిన కావలయును. ఆదేయములపట్ల ఈ నియమములు వ్యవహరింపక పోవచ్చును. అది సమంజసమే.

ద్రావిడభాషలు - ధ్వని నియమములు

ద్రావిడభాషాకుటుంబమునకు చెందిన తెలుగు, తమిళము, మలయాళము, కన్నడము, తుళు మున్నగుభాషలలో ఒకేధ్వని పొందు వేర్వేరు పరిణామములను గుర్తించుట యవసరము. వానినిబట్టి ద్రావిడ భాషా ధ్వనినియమములను క్రోడీకరింపవచ్చును. అంతేకాక మూల రూపమును గుర్తించి, వేర్వేరు భాషలలో అదనముగా చేరు ప్రత్యయాదులను పోల్చుకొనుటకు కూడ అవకాశము కలుగును. స్థూలముగా చూచునప్పుడు భిన్నరూపములవలె గోచరించువానిలో ధ్వని నియమముల సాహాయ్యమున ఏకత్వమును గుర్తింప వీలగును.

1. తమిళమందు ఐదంతమై యున్న పదము తెలుగునందు మలయాళమునందు అదంతము, కన్నడమున ఎదంతమునై యుండును.

| | | | |
|---|---|---|---|
| అర (తె) | అర (మ) | అరై (త) | అరె (క) |
| ఎడ | ఇడ | ఇడై | ఎడె |

2. తమిళ మలయాళములందు పదాది నున్న 'ఇ, ఉ' వర్ణములు తెలుగు కన్నడములందు 'ఎ, ఒ' లుగా మారును.

| | | | |
|---|---|---|---|
| తెర (తె) | తిర (మ) | తిరై (త) | తెరె (క) |
| మొదలు | ముదలు | ముదల్ | మొదల్ |

3. తమిళమునందలి క (γ) వర్ణము తెలుగున పాక్షికముగా వ వర్ణముగా మారును.

పగల్ (త)    పగలు/పవలు (తె)

4. మూలభాషయందలి తాలవ్యస్వరముతోడి క వర్ణము తెలుగున చ వర్ణము కాగా తమిళమునందు 'శ' వర్ణమగును.

చిన్న (తె)    శిన్న (త)    కిన్న (క)

చెవి    శెవి    కివి

చేయ్    శెయ్    కెయ్

5. పదమధ్య 'స' వర్ణము తమిళమునందు కొన్ని యెడల 'య' వర్ణముగా మారును.

పేరు (తె)    హెసర్ (క)    పెయర్/పేర్ (త)

పయిరు/పసరు    హసరు    పయిమి (త)

6. మూలద్రావిడ 'ణ' వర్ణము తెనుగునందు 'న' వర్ణముగా పరిణతి నొందును.

కణ్ (త)    కన్ను (తె)

విణ్    విన్ను

మణ్    మన్ను

7. సంస్కృత సమములందలి 'త,ద' లు మలయాళభాషయందు 'ల' వర్ణముగా వినిపించును.

పద్మమ్ (సం)    పల్మన్ (మ)

తాత్పర్యమ్ (సం)    తాల్పర్యమ్ (మ)

8. తాలవ్యాచ్చులమీది ద్విత్వ త వర్ణము మలయాళమునందును, పాక్షికముగా తమిళమునందును ద్విత్వ చవర్ణముగా మారును.

శిరిత్త (త)    చిరిచ్చ (మ)

ఉణర్త్తి/ఉణర్చ్చి (త)    ఉణర్చ్చ (మ)

9. పదాది మూలద్రావిడ 'ప' వర్ణము కన్నడమునందు 'హ' వర్ణముగా మారును.

| | | |
|---|---|---|
| పది (తె) | హత్తు (క) | పత్తు (త) |
| పల్లు | హల్లు | పల్ |
| పెంటి | హెణ్డు | పెణ్ |

10. తమిళమునందలి 'మ' వర్ణము కొడగుభాష యందు 'వ' వర్ణముగా మారును; ప్రాచీన కన్నడమునందలి పదాంత 'మ' వర్ణము వ్యావహారికమునందు 'వ' వర్ణముగా వినిపించును.

| | |
|---|---|
| మామన్ (త) | మావు (కొ) |
| మామి | మావి |
| నామ్ (ప్రా. క) | నావు (వ్యా. క) |
| నీమ్ | నీవు |

11. సంస్కృత 'య' వర్ణము తమిళమున 'న' వర్ణముగా మారును.

| | |
|---|---|
| యుగ (సం) | నుగమ్ (త) |
| యమ (సం) | యమన్/నమన్ (త) |

12. మూలద్రావిడమునందలి ఴ వర్ణము తెలుగున డ ల ర వర్ణములుగా పరిణతి నొందును. కొన్నియెడల ర వర్ణము ల వర్ణముగా మారును.

| | | |
|---|---|---|
| నీడ (తె) | నెఴలు (క) | నిఴల్ (త) |
| కూళ | కూఴ్ | కూళై |
| మూర | మొఴ | మొఴమ్ |
| తెలియు | | తెరి |

13. మూలద్రావిడ 'ల' వర్ణము కుయిభాషయందు 'డ' వర్ణముగా మారును.

| | | |
|---|---|---|
| పాలు (తె) | పాల్ (త) | పాడు (కు) |
| ఇల్లు (తె) | ఇల్ (త) | ఇడు (కు) |

14. మూలద్రావిడ 'వ' వర్ణము కన్నడమునందు 'బ' వర్ణముగా మారును.

| | |
|---|---|
| వేసఁగి (తె) | బేసిగె (క) |
| వెలుఁగు | బెళంగు |
| వచ్చు | బరు |

15. సంస్కృత శ ష స లు తమిళమునందు డ వర్ణముగా కాని ద వర్ణముగా కాని మారును.

| | | | |
|---|---|---|---|
| శ్రీ | (సం) | తిరు | (త) |
| ఋషభ | | ఇడబమ్ | |
| మనస్ | | మనదు | |
| మాసమ్ | | మాదమ్ | |

పై విధములుగా ద్రావిడ ధ్వని సూత్రములను నిరూపించుకొనవచ్చును.

కాని, పైని చెప్పిన సూత్రములకు అపవాదములుగా కొన్ని రూపములు కనిపించుచున్నవి. వానికి కారణములను పరిశీలింతము. తాలవ్యాచ్చుతోడి కకారము తమిళమున 'శ'కారము కావలసియుండగా కిళి, కెడు, కిటవన్ మున్నగుచోట్ల శ వర్ణముగా మార్పు నొందలేదు. ఇది అపవాదమనియే యనిపించును. కాని యిక్కడ నింకొక నియమమున్నదన్న సంగతిని గుర్తించినయెడల ఆ భ్రాంతి తొలగిపోవును. ఇచ్చట 'క' వర్ణమునకు పిమ్మట వచ్చినవి మూర్ధన్యధ్వనులు. అందువలన మూర్ధన్య ధ్వనులు పరమగునపుడు 'క' తమిళమునందు శ వర్ణముగా మారదన్న యంశమును చేర్చుకొనవలయును.

| | | |
|---|---|---|
| చిలుక (తె) | కిళి (త) | గిళి (క) |
| చెడు | కెడు | కెడు |
| కెడవు | కిటవన్ | కెటవన్ |

తెలుగున పైని చూపిన 'కెడవు' అను రూపమును, కెడయు, కినియు, కిలుము మున్నగు రూపములును అనంతర కాలమునందు కన్నడమునుండి ఆదేయ పదములుగా తెలుగులో ప్రవేశించి యుండును. కావుననే తాలవ్యీకరణము (క > చ) కనిపించుట లేదు. అరవమునందు

'చెట్టు' అను నర్థమున 'శెడి'యను రూపము గలదు. కన్నడమున 'గిడ' యని కలదు. పై నియమము నుల్లంఘించి మూర్ధన్యము పరమైనప్పుడు కూడ తమిళమునందు 'క' వర్ణము 'శ' వర్ణ మయ్యెను. కాని యిది తెలుగునుండి తమిళమునందు చేరిన ఆదేయపదము. పూర్వకావ్యము లందు దీనికి ప్రయోగము లేదు.

తెలుగునందును కొన్నియపవాదము లున్నట్లు గోచరించును. క్రిందు, క్రేవ, క్రేపు-మున్నగుచోట్ల తాలవ్యీకరణము జరుగలేదు. దీనిని బట్టి పై నియమము సంయుక్తవర్ణములకు వర్తింపదని నిర్ధారింప వచ్చును. కావున, ఇదియు అపవాదము కాదు.

మూల ద్రావిడమునందలి పవర్ణము కన్నడమునందు 'హ' వర్ణ ముగా మారునన్నది నియమము.

కాని అట్లు మారని రూపములుకూడ కలవు.

| | | |
|---|---|---|
| పీనుఁగు (తె) | పిణమ్ (త) | పెణం (క) |
| పొగడు | పుగళ్ | పొగళ్ |
| పొదరు | పుదర్ | పొదళ్ |
| పొగ | పుగై | పొగె |

పై రూపములవంటివి పెక్కులు కలవు. ఇవన్నియు అపవాద ములు కావా? కావనియే సమాధానము. కన్నడమునందు 'ప' వర్ణము 'హ' వర్ణముగా మారుట తొలుతనుండియు నున్న నియమము కాదు. 'హ' వర్ణము ద్రావిడమూల భాషయందున్నదని యను టకు తగిన యాధారములు లేవు. కావున కన్నడము నడిమికాలమున ఈ లక్షణము నవలంబించినది. కావున ప్రాచీనకాలమునందు స్థిరపడిన రూపములందు 'ప' వర్ణము నిల్చియే యున్నది. తరువాతి కాలమున ఏర్పడిన రూపములందు ప వర్ణము హ వర్ణముగా పరిణతి నొందినది.

ఈ నియమము కన్నడమునకు మాత్రమే పరిమితమై యుండ వలసియుండగా, తెనుగునందుకూడ ఇట్టి రూపములు కొలదిగా కని పించుచున్నవి. హొన్ను, హొయలు మున్నగు నామములు హెచ్చు,

హాస్తు మున్నగు క్రియాధాతువులు కన్నడమునుండి యనంతర కాలమున తెలుగులోనికి ఎరువు మాటలు Loan words గా వచ్చియుండును. 'పొన్ను' అని 'పెచ్చు' అని పకారాదిగా నున్న రూపములు ప్రాచీనములై యుండును. ఇంతను హకారాదులయిన పదములు తెలుగునకు స్వాభావికములు కావు. అందువలననే ఎచ్చు, అడపము మున్నగు విధముగా హకార విరహిత రూపములు మరల ఏర్పడవలసి వచ్చినది.

ఇంకొక్క విషయము. ద్రావిడభాషలయందు పదాది సంయుక్త వర్ణము లుండవు. కాని తెలుగునందు క్రొత్త, ప్రాత, ప్రోలు, ప్రేలు, మ్రోయు, వ్రాయు- మున్నగు రూపములు గలవు. వీనియందు మొదటి యక్షరము సంయుక్తము. కాని యిది తొలుతటినుండియు నున్న లక్షణమని చెప్పుటకు వీలులేదు. అయినను సాహిత్యప్రారంభమునుండియు నున్నదని చెప్పవచ్చును.

కొలుం, పలుం మున్నగురూపములపై 'త' వర్ణము చేరి కొల్త, పల్త మున్నగు విధముగా నేర్పడియుండును. ఆ పిమ్మట ల వర్ణము రవర్ణముగా మారి పూర్వధ్వనితో సంయోగముచెందగా 'క్రొత్త' అనియు 'ప్రాత' అనియు రూపములేర్పడి యుండును. ఇట్లే తమిళ కన్నడములందు 'పొలిల్' అనురూపముతో అజ్వ్యాపర్యయము కలిగి ప్+ఒ+ల్=ప్రోలు' అని యయ్యెను. తమిళమున 'పేచు' అనియు కన్నడమున 'పేళ్' అనియు నున్న రూపము తెలుగున 'పేల్లు' అనినై 'ప్రేలు' అని మారెను. వీని నన్నింటినిబట్టి చూడగా మొదటి యక్షరములోని స్వరము తనవాని ల కారముమీదికి మార్పునొందగా తొలుత రవర్ణ సంయుక్తములైన వర్ణము లేర్పడెనని తేలుచున్నది.

కాని యిట్లు సంయుక్త ధ్వనిని పలుకుట తెలుగునకు సహజము కాదు. కావుననే పాత, కొత్త మొదలయిన రూపములు ఏర్పడు చున్నవి. ముబ్బు, మ్రుగ్గు, ప్రప్పు మున్నగు శబ్దములలో మొదటి వర్ణముపై రేఫ మున్నదన్న సంగతిని గుర్తించుటకుకూడ వీలులేనంతగా నురిగిపోయినది. ఇట్లు అన్ని రూపములయందును క్రావడియే లోపించు

చుండగా వ్రాయు, వ్రాత మున్నగుచోట్ల 'వ' వర్ణము లోపించు చున్నది. 'వ'కారము దుర్బల వ్యంజనము (weak consonant) అగుటయే దీనికి కారణము. అయినను వ్రేలు, వ్రీలు, వ్రేలాడు – మున్నగు చోట్ల ఊనిక యుండుటవలన 'వ' కారమునకు లోపము కలుగక రేఫము నకే లోపము కలుగుచున్నదనుట గమనార్హము.

మొత్తముమీద ధ్వని నియమములు ద్రావిడభాషల యందు గూడ నియతములై యున్నవనియు, ఏమేనియు అపవాదములవంటివి కనిపించినచో, వానికి వేరుకారణములు తప్పక యుండితీరుననియు సిద్ధాంతము.

## ధ్వనుల మార్పులు

మాటలను ఉచ్చరించునపుడు కొన్నింటిని తేల్చి పలుకుటయు, కొన్నింటి నొత్తి పలుకుటయు, కొన్నింటిని మధ్యస్థముగా పలుకుటయు అనుభవసిద్ధమగు విషయమే. ఈ విధముగా ఆరోహణావరోహణాది క్రమములో పలుకుటను 'స్వరము' అని యందురు. ఉచ్చారణసమయమున కంఠమునందలి నాదతంత్రులు ప్రకంపించునట్టి వేగమును బట్టి యీ స్వరము కలుగును; దీనినే ఆంగ్లమున 'Pitch accent' అని యందురు. ఉచ్చారణసమయమున నాదతంత్రులు సాగిన దూరమును బట్టి 'ఊనిక' కలుగును. ఏదేని మాటను ఒత్తిచెప్పవలసి వచ్చినప్పుడు, గట్టిగా బలముగా చెప్పుట స్వాభావికము. ఈ ఊనికనే ఆంగ్లమున 'Stress accent' అని యందురు. ఊనిక, స్వరము అను నీరెంటిను కారణముగా ఉచ్చారణమున పెక్కు మార్పులు కలుగవచ్చును. అవి క్రమముగా భాషలో స్థిరపడవచ్చును. భాషాస్వభావమునుబట్టియు కొన్ని కొన్ని యక్షరములు సంయోగము చెందుటయు, విడివడుటయు, తొలగుటయు, అదనముగా కలుగుటయు జరుగవచ్చును. ఒక భాషలోని ఒకయక్షరము మరొకభాషలో మరొకయక్షరముగా మారుట కూడ కనిపించును. ఇట్లు పరస్పరము వినిమయము నొందుట ఏకకుటుంబ జనితములైన భాషలలో స్పష్టముగా గోచరించును.

**స్వరప్లుతి :** సాధారణముగా ద్రావిడభాషలందు మాటకు మొదటి యక్షరముపైనే యూనికయుండును. అట్టియెడల ఆమాట యందు మార్పు కలుగదు. వేర్వేరు కారణములచేత ఊనిక తరువాతి యక్షరములమీదికి మారినపుడు మొదటియక్షరము జారిపోవును. వ్యతిరేకార్థమునందు మూలద్రావిడరూపము 'అకాదు' అని యుండును. ఇది తెలుగునందు 'కాదు' అని మిగిలినది. అనగా తొలివర్ణము జారిపోయినది. కొన్నియెడల, అది తరువాతి వర్ణములమీద చేరును. తన స్థానమునుండి ముందరిస్థానమునకు దుముకును. 'ఉరల్' అను రూపమునందలి 'ఉ' వర్ణము 'ర' వర్ణముపై చేరగా 'రోలు' అని యగును. పుఱిల్ > ప్రోలు; ఇరణ్డు > రెండు; ఇరప్పు > రేపు॥ మున్నగునవి యుదాహరణములు. ఇది ఒకభాషలోనుండి మరొకభాష లోనికి మారునపుడు మాత్రమే కాక ఒకేభాషలో కూడ జరుగవచ్చును. వరలు > వ్రాలు; మొరయు > మ్రోయు; తర్చు > త్రచ్చు॥ మున్నగు నవి యుదాహరణములు.

**వర్ణవ్యత్యయము :** ఒకపదమునందలి యక్షరములు ఒక క్రమ ములో నుండియుండును. వక్తయొక్క ఉచ్చారణత్వరవలన గాని, అశ్రద్ధవలన గాని, అజ్ఞానమువలన గాని ఆ క్రమము మారుచుండును. రెండు రూపములును మొదట వ్యవహారములో వ్యాప్తిని పొందిన యెడల అవి భాషలో స్థిరత్వమును సంపాదించుకొనును. 'నవ్వులాట' అను పదము 'నవ్వటాల' అనియైనది. 'తడువుకొను' అనునది 'తవుడు కొను, అనియు 'సదుముకొను' అనునది 'సదురుకొను' అనియు మారినవి. 'బాలసారె' యన్నది 'బారసాల' అని యైనది. సంస్కృతరూపములందు నిట్టిమార్పుగలదు॥ మరతకము - మరకతము; నారికేళము - నాళి కేరము॥ వీని యన్నింటియందును ఒకస్థానమున నుండవలసిన యక్షరము మరొకస్థానమునకు చేరి, అచటి యక్షరమును తన స్థానమునకు నెట్టుట కనిపించును. ఉచ్చారణసౌలభ్యకాంక్షతో అచ్చులుకూడ కొంచెముగా మారును. దీనిని metathesis అని యందురు.

**అనుచితవిభాగము** : ఒకవాక్యములోని మాటలను వ్యాకర్తలు తమ సాధనములతో విశ్లేషించునప్పుడు కొన్ని యెడల ఈ పొరపాటు జరుగవచ్చును. అట్లే వక్త అస్పష్టగ్రహణమువలన కూడ ఈ పొరపాటు జరుగుచుండును. ఈ పొరపాటయినను, పరిపాటి నైపోవుటచేత భాష యందు ప్రతిష్ఠను సంపాదించుకొన్నది. ప్రాచీన ద్రావిడమున 'ఎలిక్' మున్నగురూపములలో చివరి కకారమును మాత్రమే బహువచనప్రత్యయముగా స్వీకరించి, తప్పుగా విభాగముచేయుట (Wrong splitting) వలన 'ఎలి(లు)క' మున్నగువిధముగా ఏకవచనరూపము లేర్పడినవి. ఇట్టి రూపములు పెక్కులు గలవు. తెలుగున ఇప్పటికిని నకారముతోడి రూపమును స్వరాదిరూపమును నొకేయర్థమున కనిపించునవి గలవు. నీలుగు - ఈలుగు; నెగయు - ఎగయు; నేని-ఏని మున్నగుపదములలో ఈ యనుచితవిభాగము పనిచేసిన దనుట సత్యము. ఇట్లే పొందు, పూను, పొలయు మున్నగుపదములుకూడ వ్యంజనమును గోల్పోయి ఒందు, ఊను, ఒలయు మున్నగువిధముగా నుండుట కలదు. ఇం దేది ప్రాచీనమో, ఏది నవీనమో గుర్తించుటకు మరింత పరిశోధన మవసరము. వెనుకటిపదములోని తుదివర్ణముతోపాటుగా తరువాతి పదమును వేరుపరుచుట గాని, తరువాతి పదములోని మొదటి హల్లును వెనుకటి మాటకు విడిచిపెట్టుటగాని, రెంటిలో ఏదేని జరుగుట కవకాశము గలదు.

**స్వరాకర్షణము** : ముందర గాని వెనుక గాని యున్న యచ్చుల యాకర్షణవలన ఒకయచ్చు మార్పు చెందవచ్చును. 'లతకు, రాముని' మున్నగుపదములందున్న 'కు' వర్ణకము ఇకారాంతపదములపై 'కి' వర్ణముగా మారుట స్వరాకర్షణము (vowel attraction) వలననే, చేతికి, రామునికి మున్నగువానియందు ఈ మార్పు గోచరము కాగలదు. ఇట్లే 'ను'వర్ణకము 'ని'వర్ణముగా మారును. యుష్మదస్మద్విశేషణములకు పరమైన 'వును'లును ఇట్టి మార్పునకు లోనగును. క్రియావిభక్తులుకూడ ఈమార్పును పొందును. క్త్వార్థక ప్రత్యయ మగు ఇవర్ణము గాని, ఎదాదులుగాని ఇంచుగాగమముగానిపరమందున్నప్పుడు

ధాతుగతమైన ఉకారమునకు ఇకారము కలుగుచున్నది. కలిగి, కలిగెను, కలిగెమున్ - కలుగుచున్నది॥ ఇది పరమందున్న స్వరముయొక్క ఆకర్షణవలన జరుగుచున్నది. ఇట్లే ఇదంతములకు బహువచనమందు ఉత్వము కలుగుచున్నది. విద్యార్థి - విద్యార్థులు॥ ఈ ప్రభావము ఉపోత్తమమువరకు వ్యాపించి, అచటి ఇత్వమునకును సాధారణముగా ఉత్వము కలుగుచున్నది॥ ములికి - ములుకులు॥

**గుణవిధి :** సంస్కృతమునందు 'ఏ, ఓ, అర్' అను వానిని 'గుణము' లని యందురు. అకారమునకు 'ఇ ఉ ఋ' వర్ణములు పరమందున్నపుడు ఏకాదేశముగా గుణములు వచ్చును. తెలుగునందు ఇ, ఉ వర్ణములు తమంత తామే ఎ, ఒ వర్ణములుగా మారుట కొన్నియెడల చూపట్టును. దీనికి సంస్కృత ప్రభావ మేమాత్రమును కారణము కాదు. ఇ ఈ ఎ ఏలు తాలవ్యములు. కావున ఉచ్చారణమున నొక సామ్యము కలదు. అట్లే ఉఊ ఒ ఓ లు ఓష్ఠ్యములు. వీనికి గల భేదము చాల యల్పము. ఆ భేదమును గమనింపక అశ్రద్ధగా నుపయోగించినప్పుడీ తడబాటు కలుగును. అయినను ఇది కొంతవరకు వ్యాకర్తల ఒడబాటును సంపాదించుకొన గలిగినది.॥ ముఖము-మొగము; మృగము-మెకము; పుగ్గ-పొగ; నిలమ్-నేల॥ ఇవిగాక మల్లి-మల్లె; చెల్లి-చెల్లె మున్నగు రెండేసి రూపములు కనిపించును.

**సంప్రసారణ విధి :** సంస్కృతమునందు ఇ ఉ ఋ ౡ వర్ణములకు బదులుగా వచ్చిన 'య వ ర ల' వర్ణములను యణ్ణులని యందురు. యణాదేశ కార్య మిది. దీనికి విలోమమగునది సంప్రసారణము. య వ ర ల వర్ణములకు బదులుగా ఇ ఉ ఋ ౡ వచ్చుట యిచ్చటి కార్యము. శ్రీ సోమయాజిగారు దీనిని ప్రత్యేకముగా పరిగణించిరి. కాని తెలుగున ఇట్టిమార్పు లేదనుకొనుట శ్రేయము. ఉన్నదని యనిపించు పట్టులందు సంప్రసారణవిధి కాక, వేరొకకారణమును స్పష్టముగా నిరూపించుటకు వీలున్నది. 'ఒ' యను వర్ణమును 'వ' యను వర్ణమును పరస్పరము మారుట కొలదిగా కలదు. 'ఒద్ద' యను సమీపార్థకపదమును 'వద్ద'

యని వాడుటయు కలదు. 'ఒదరు' అను నిందార్థకము 'వదరు' అను రూపమునను గలదు. వాడుకయందు ఒగరు–వగరు; ఒనరు – వనరు; ఒయ్యారము–వయ్యారము; ఒరవడి – వరవడి మున్నగు పదములు ద్వైరూప్యమును గలిగి యున్నవి. ఐనను 'వ'కార యుక్తమైనదే పూర్వ రూపమనియు, స్వరాదిపదము అనంతర కాలికమనియు నిర్ణయించినపుడు కాని సంప్రసారణ మనుపేరు సమంజస మనిపించుకొనదు. "ఒ,వ"లు రెండును ఓష్ఠ్యములు. వకారోచ్చారణమున దంతముల సహకారము కూడ కలదు. ఏకస్థానజనితములగు ఈ వర్ణములు పరస్పరము మారుటకు చాల యవకాశములు గలవు. ఈ మార్పును గమనించియే చిన్నయసూరి వు వూ వొ వో లు తెలుగు మాటలకు మొదట లేవని పలుకవలసి వచ్చినది.

**సమీకరణము :** భిన్నములయిన రెండు వర్ణములు గాని, ఏక స్థానజనితము లయిన రెండు వర్ణములుగాని సంయోగము చెంది ద్విత్వ ముగా మారుచుండును. సంస్కృతమునందు భిన్నవర్ణ సంయోగము మిక్కిలి ప్రచురముగా గలదు. కాని, తెలుగు మున్నగు భాషలయందు ద్విత్వాక్షరములే కాని, భిన్నవర్ణ సంయుక్తాక్షరములు ఎక్కువగా లేవు. శ్రేష్ఠి – సెట్టి; శక్తి – సత్తి; అర్పణము – అప్పనము. కొన్ని యెడల 'స్వరలోపము' (synecope) కలిగిన రూపములు కనిపించును॥ కొలది – కొల్ది; చలిది – చల్ది; కలదు – కల్దు॥ ఇట్టిచోట్లనున్న భిన్నాక్షర సంయోగమును పరిహరించి తెలుగుమనస్సు ద్విత్వమునే స్వీకరించుచున్నది॥ కొద్ది; చద్ది; కద్దు॥ సంస్కృతమునందు ఏకస్థానజనితములే ఈ మార్పును పొందుచుండగా తెలుగున అట్టి నియమము ఏమాత్రము లేకుండ ఈ మార్పు కలుగుచున్నది. సమీకరణమును ఆంగ్లమున (assimilation) అని యందురు.

**పృథక్కరణము :** ఒకేవర్ణము వెంట వెంట నుచ్చరింపబడిన యెడల తడబాటు కలుగుట సహజము. కావున, ఆ తడబాటును తొలగించుకొనుటకుగాను అందొక వర్ణమును సాజాత్యముగల మరొక




వర్ణముగా మార్చి పల్కుదురు. 'బాలుడు' అను శబ్దము బహువచమున 'బాలులు' అని కావలసియుండగా బహువచన లకారమునకు రేఫమును విధించుట దీనినే బలపరుచుచున్నది. ఇట్లే చకారాంతము లయిన ధాతువులపై ఇంచుగాగమము కలిగినపుడు 'చ' కారమునకు 'ప' కారము కల్గుటయు ఈ విధానమునుబట్టియే. ॥పిలుచు - ఇంచు > పిలిపించు; తెచ్చు - ఇంచు > తెప్పించు॥ ఇంచులోని చకారముతో తడబాటు కలుగకుండుటకై ధాతుగతచకారము ఈ మార్పు పొందుచున్నది. ఈ మార్పును ఆంగ్లమున dissimilation అని యందురు.

**స్వరవిశ్లేషము** : భిన్నవర్ణములు సంయోగమునొందినపుడు తెలుగుభాష ద్విత్వమును గ్రహించునని 'సమీకరణము' అను విషయమున గుర్తించితిమి. అట్లు వీలుకాని యెడల ఒకయచ్చు ఆగమముగా వచ్చి సంయుక్తాక్షరమును విశ్లేషించును. 'చంద్ర' శబ్దమున దకార రకార సంయోగమును వేరుచేయుచు 'ఇ' వర్ణము వచ్చి 'చందిరుడు' అను రూపమును కల్పించును. ఇట్లే అలుపము, దువారము, తండిరి, సందరిము మున్నగుపదములలో ఒకయచ్చు క్రొత్తగా చేరి సంయోగాక్షరమును వేరుపరిచినట్లు గుర్తింపగలము. ఈ మార్పును ఆంగ్లమున anaptyxis అని యందురు.

**స్వరాగమము** : ద్రావిడభాషలలో సంయుక్తాక్షరములతో ప్రారంభము లగు పదములు లేవు. ఇతరభాషలలోనుండి యవి వచ్చినపుడు వానికి ముందు ఒకఅచ్చును చేర్చి పలుకుదురు. ముఖ్యముగా సకారసంయుక్తములైన వర్ణములు కలిగినప్పుడు ఇట్టి యాగమము కలుగుచున్నది. ఆంగ్లవిద్యావంతులు ఆంగ్లములో వలె పలికినను, దేశీయులు మాత్రము ఇస్కూలు, ఇస్టేటు మున్నగువిధముగా పలుకుట కలదు. ఉత్తరహిందూస్థానమున ఆంగ్లవిద్యావంతులు సైతము దేశ భాషాప్రభావమున ఇట్టిచోట్ల ఇకారమును జేర్చియే పలుకుదురు. 'రథము' అను శబ్దము తద్భవముగా 'అరదము' అని యైనది. అరవమున రకారాదిపదములకు ముందు అకారము చేరును॥ అరశన్॥ దీనిని ఆంగ్లమున prothesis అని యందురు.

**వర్ణాగమము** : కొన్ని మాటలకు నడుమ, కొన్ని యక్షరములు అదనముగా చేరుచుంతును. కొన్ని యెడల వాని కర్థ ముండును. పెక్కు చోట్ల వానికి ప్రత్యేకప్రయోజన మేమియు నుండదు.॥ చిచ్చుకన్ను - చిచ్చఱకన్ను; చింపిజుట్టు - చింపిరిజుట్టు; దొంగాటము - దొంగాటకము॥ ఇట్లే అనేకములగు ధ్వనులు మాటలకు నడుమ చేరుట తెలుగు భాషలో కనిపించును. సమత నపేక్షించియో, సామ్యము ప్రభావమువలననో యిట్టి ప్రయోగములను చేయుట పరిపాటి యైనది. వ్యాకర్తలు కూడ వీనికి సమ్మతి చూపుట కనిపించుచున్నది.

**వర్ణచ్యుతి** : సంయుక్తాక్షరములలో ఒక యక్షరము మాత్రము నిలిచి రెండవది జారిపోవుటయు తటస్థించును. ఊనికయే దీనికి కారణము. క్రొత్త, ప్రాత యను శబ్దములలోని ్రకారములు నెమ్మదిగా రాలిపోవుచున్నవి. 'క్షారము' మున్నగు వానికి తద్భవముగా 'కారము' మున్నగురూపము లేర్పడినవి. స్థానము తానముగను, అనంటి అంటిగను మారినవి. ఇట్లే తద్భవములం దనేకవర్ణములు జారిపోయిన సంగతిని గమనింతుము.

**హల్లోపము** : ఒకమాటలోని చివరియక్షరము రెండవమాటకు మొదట అదే యక్షర మున్నయెడల లోపించుచున్నట్లు కనిపించును. 'పెద్దతనము' అను మాటలో దకార ద్విత్వముపెంట తకారము వచ్చినది. పూర్వ మున్న 'ద' లోపింపగా తత్స్థానమున తకారము వచ్చి 'పెత్తనము' అని యగును. వంకాయ, రేంకాయ మున్నగుచోట్ల గకారము ఈ నియమము ననుసరించియే లోపించినది. ప్రాదుట్లు మున్నగు చోట్ల గకారము ఈ నియమము ననుసరించియే లోపించినది. ప్రాదుట్లు మున్నగుచోట్ల తకార మిట్లే లోపము నొందినది. ఈమార్పును ఇంగ్లీషునందు haplology అని యందురు.

**పరిహారదీర్ఘత** :- కొన్ని మాటలలో ఊనిక తక్కువగు నక్షరములు కొన్నియెడల లోపించిపోవునని యెరుగుదుము. అట్లు వర్ణలోపమువలన ఉచ్చారణకాలమున ఏర్పడినటువంటి నష్టమును

పూరించుటకుగాను దానికి పూర్వమున నున్న యచ్చు దీర్ఘత్వము నొందును॥ సగము - సాము; మొగము - మోము; దుముకు - దూకు; సొలయు - సోలు; వరలు - వ్రాలు; ఉరలు - రోలు॥ ఇట్టిపదములు పెక్కులు ద్రావిడభాషలందు పరిహారదీర్ఘత నొంది కనిపించును. దీనిని ఆంగ్లమున compensatory lengthening అని యందురు.

**ద్విరుక్తి** : ఇది యిప్పుడు చూచిన పరిహారదీర్ఘతకు పూర్తిగా విలోమమైనది. దీర్ఘమును హ్రస్వీకరించునపుడు పైనున్న యక్షరము ద్విత్వమై ఉచ్చారణకాలమును సరిపెట్టును. 'ఆచోటు' మున్నగుశబ్దములు 'అచ్చోటు' మున్నగువిధముగా మారును. 'మూడు' శబ్దముతోడి సమాసములందు కూడ ఇట్టిమార్పు కలుగును॥ ముల్లోకములు॥ ఈ మార్పును ఆంగ్లమున doubling అని యందురు.

**నాదత** : శ్వాసములు నాదములుగా మారుట యను విషయము ద్రుతకార్యమునందును, గసడదవాదేశమునందును గనిపించును. తెలుగున నిర్నిమిత్తముగా కూడ ఈ మార్పు కనిపించును. ఉచ్చారణ సౌకర్యమే యన్నికారణములను మించిన కారణమై యిట్టియెడల ప్రవర్తించును. 'బ్రతుకు, మెతుకు' అనునవి 'బ్రదుకు, మెదుకు' అని నాదాక్షరమధ్యముగా గలవు. 'కడచు' అనునది 'గడచు' అని వాడుక కెక్కినది. 'గడప' అను నాదముతోడి రూపము 'కడప'ను త్రొక్కివేసినది. మృగము తెలుగులో మెకము, మెగము అని రెండురూపములు దాల్చినది. అట్లే ముఖము మొకముతోపాటు మొగముకూడ నైనది. ఇట్లు శ్వాసాక్షరములకు బదులు నాదాక్షరములను వాడుట వాడుకలో బాగుగా గలదు॥ త్రోవ - దోవ; తూడు - దూడు; తిద్దు - దిద్దు॥

**అనునాసికీకరణము** : ఒకభాషలో అనుస్వారముండి మరొక భాషలో ననుస్వారము లేకుండ నున్న పదము లనేకముగా కలవు. వర్గములోని నాలుగక్షరములును, తత్పూర్వము బిందు వున్నయెడల ననునాసికాక్షరముతో సమానమగు నుచ్చారణమును కలిగియుండును. ప్రథమావిభక్తి ప్రత్యయములగు "బువు" వర్ణములు 'ము' వర్ణముగా

పరిణతములయ్యెనని యీవరలో చూచితిమి. అడగు, వడకు, మునుగు మున్నగు శబ్దములలో 'డ' వర్ణమునకు ణత్వము కలిగి అణగు, వణకు, మునుగు మున్నగురూపము లేర్పడుచున్నవి. తోడుంబాలు, నానుంబాలు బియ్యము, తిరుగంబోంత, పొగడుంబోతు మున్నగుపదములు వ్యవహారములో తోడుమాలు, నానుమారుబియ్యము, తిరుగమోంత, పొగడు మోతు మున్నగువిధముగా అనునాసికాక్షరములను పొంది వినిపించుచున్నవి. ఈ మార్పును ఆంగ్లమునందు nasalisation అని యందురు.

**తాలవ్యీకరణము :** కంఠ్యములు తాలవ్యములుగా మారుట పెక్కు భాషలలో కలదు. ద్రావిడభాషలలో పెక్కుధాతువులు ఒక భాషనుండి మరొకభాషలోనికి మారునప్పుడు ఈ మార్పునకు లోనై కనిపించును. ప్రాచీనద్రావిడభాషయందలి కకారము తెలుగుభాషలో పెక్కుచోట్ల చకార మగును॥ కిళి – చిలుక॥ కిడ – చెడు॥ ఇట్టిమార్పును ఆంగ్లమునందు palatalisation అని యందురు.

**సామ్యము :** భాష చాలవరకు అనుకరణమువలన ప్రచారము నొందును. పెద్దలు మాటాడుచుండగా పిన్నలు, అన్యభాషీయులు నేర్చుకొనుచుందురు. ఇట్లు నేర్చుకొనుటలో పోలికనుబట్టి క్రొత్తదానిని సృష్టించుటయు జరుగుచుండును. తెనుగులో 'పంండ్లు' అను పదము కలదు. 'దంతములు' అను నర్థము గల యీ పదమునుబట్టి 'నేత్రములు' అను నర్థము గల 'కండ్లు' అనుశబ్దము సృష్టింపబడినది. 'కల్లు' అను శబ్దము బహువచనమున 'కండ్లు' అని యగును. దానికి 'ఱాలు' అని యర్థము. 'నేత్రము' అను నర్థముగల ఏకవచనము 'కన్ను'. దీని సామ్యమున 'పండ్లు' శబ్దమునకు 'పన్ను' ఏకవచనముగాసాధింపబడినది. కాని యిది 'పల్లు' అని యుండవలయును. ఇట్లుసామ్యము (analogy) వలన అనేకరూపములు భాషలో ప్రవేశించుచున్నవి. కొన్నింటికి స్థిరత్వము సైతము చేకూరుచున్నది.

ఈ విధముగా పెక్కుమార్పులు ధ్వనుల యుచ్చారణలో కలుగుచున్నవి. పెక్కుచోట్ల అశ్రద్ధయు, అశక్తతయు కారణములు

కావచ్చును. కొన్నిచోటులం దైనను భాషా స్వభావమునుబట్టి యీ మార్పులు జరుగుచున్నవని యొప్పుకొనక తప్పదు. అట్టివి చిరంజీవములై ప్రామాణికభాషా గ్రంథములందు సైతము ప్రతిష్ఠను గడించు కొనుచున్నవి.

## లిపి పరిణామము

వాగ్వ్యవహారమునకు భాష యని పేరు. ఈ వ్యవహారము సమకాలికులకు సన్నిహితులకు సరిపడును. కాని దూరస్థులకు మన భావములను తెలియజేయవలయునన్న వాగ్వ్యవహారము సమర్థము కాదు. అందువల్లనే ప్రాచీనమానవుడు తన పరిశోధనాశక్తి కనుగుణముగా కొన్ని మార్గములను కనిపెట్టెను. తొలుదొల్త తనభావమే వస్తువును గూర్చి ప్రసరించినదో ఆ వస్తువునే సంకేతముగా వాడుకొనెను. కాని అది కష్టసాధ్య మగు వ్యవహారము; కొన్నియెడల అసాధ్యముకూడ. అందువలన ఆవస్తువుల బొమ్మలను రాతిమీదనో, కొయ్యమీదనో చెక్కి పంపెడివాడు. ఈ విధమగు బొమ్మలే శిల్పుల నైపుణ్యముచే, పరిణామముగా లిపిరూపమును ధరించినవి. ఇట్టి లిపులను ఐదువిధములుగా లిపి విశేషజ్ఞులు విభాగించి యున్నారు.

(1) హైరోగ్లిఫిక్ లిపి : ఈజిప్టునందు వాడుక నొందియుండుట చేత దీనికి 'ఈజిప్టియను లిపి' యను పేరుకూడ కలదు. బొమ్మలరూపములో నున్న యీ లిపి వయస్సు ఐదువేల సంవత్సరములకు మించి యుండును.

(2) క్యూనిఫారం లిపి : బాణములు మొనతేలినట్లుండు గుర్తులతో వ్రాయబడుటచేత దీనికి 'బాణలిపి' యను నర్థముగల యీ పేరు గల్గినది. ఈగుర్తులనే అరబ్బులు మేకు లని యనుకొనుటచేత 'కీలలిపి' యను నర్థమున 'మిస్మారి' అను పేరుపెట్టిరి. ఈ లిపి పారశీకమునందు ప్రసిద్ధిని పొందినది. వీరికి పూర్వము బాబిలోనియనులు సుమేరియనుల నుండి యీ లిపిని గ్రహించిరి.

(3) క్రీటులిపి : ఇది యిప్పటికి నాలుగువేల సంవత్సరముల పూర్వమునాటిదని యూహింపబడినది. క్రీటు ద్వీపమునందు వాడుక నొందియుండుటవలన దీని కీ పేరు కల్గియున్నది.

(4) సెమిటిక్ లిపి : ఈజిప్షియన్ లిపిలోని బొమ్మలరీతినే గ్రహించి, వారికి శత్రువులైన 'సెమ్' జాతీయులు ఈ లిపిని కనిపెట్టిరి. వీరు ప్రాచీనచిత్రలిపినుండి యిరువదిసంజ్ఞలను తీసికొని, వ్రాతకు సులభముగా నుండునట్లు అక్షరలిపిగా మార్చుకొనిరి. ఇది యిప్పటికి మూడు వేల సంవత్సరములు వయస్సు గలిగియున్నదని అభిజ్ఞుల నిర్ణయము.

(5) ఫోనీషియను లిపి : సిరియాదేశపు సముద్రతీర భాగమే ఫోనీషియా. ఇచ్చటి ప్రజలు సముద్రములపై నిత్యము ప్రయాణము చేయుచు వర్తకవ్యాపారములతో జీవించెడివారు. వీరి నాగరకజీవిత సంరంభములో బొమ్మలు చెక్కుకొనుచు కూర్చుండుట కవకాశము చాలదు. అందువలన సెమిటిక్ లిపి మరింత సౌలభ్యము నార్జించుకొని రేఖామాత్రముగా రూపుదాల్చినది. ఫోనీషియానుండి గ్రీకు, రోము మున్నగు దేశములలో వ్యాపించి ప్రాచీన నవీన గ్రీకులిపులకును, నేటి యాంగ్ల లిపికిని మాతృకయైనది. ఇంతవరకు కుడినుండి యెడమకే వ్రాత సాగినను, ఈ తరువాత ఎడమనుండి కుడికి వ్రాయు అలవాటేర్పడినది. ఇవన్నియు లేఖనమహాయాత్రలో సౌలభ్యము నపేక్షించి వేసికొన్న స్థావరములు.

ఇంతవరకు పాశ్చాత్యులదృష్టితో లిపివిభాగమును సమీక్షించుట జరిగినది. వారి దృష్టిలో భారతదేశపు లిపులుకూడ పాశ్చాత్యదేశములోనే పుట్టినవి. 'లిపి' యను మాటకూడ పాశ్చాత్యులదే. 'అక్షర' మను మాటకూడ పాశ్చాత్యులదే.

సెమిటిక్ జాతీయులలో 'అక్కాడియనులు' అను ఒక తెగవారు కలరు. వారివలననే అక్షరలేఖనము వ్యాప్తిపొందినదనియు: 'అక్కాడ్' అను పదమునకు సంస్కృతీకరణమే అక్షరమనియు వాదించువారు గలరు. మనవారి దృష్టిలో 'అక్షరము' అనగా నాశనము లేనిదని

యర్థము. వేదమునందుకూడ నున్న 'అ క్ష ర' పదమును, తరువాత నెన్నటికో కనులు తెరచిన వారినుండి గ్రహించి రనుట హాస్యాస్పదము. కేవలయాదృచ్ఛిక సామ్యమును ఇంతగా సాగదీయుట యుచితము కాదు.

పారశీకపద మగు 'డిపి' నుండి 'లిపి' యుద్భవించినదని కొందర నమ్మకము. కాని పాణిని అష్టాధ్యాయిలో లిపి, లిభి, లేపము, లేపనము, లింపనము మున్నగురూపము లుండుటవలన పై వాదము వ్యర్థ మనక తప్పదు. 'లింపతి' అనగా 'పూయుచున్నది' అన్నది యర్థము. వర్ణము లను పూతపూయుట యాధారముగా చేసికొని 'లిపి' యను పదము స్వతంత్రముగనే యేర్పడినది. అట్లే క్రీటుద్వీపవాసుల లేఖనసాధన మైన 'అలెఫ్' నుండి 'లిపి' యేర్పడె ననువాదముకూడ కలదు. క్రీస్తుపూర్వమే ఐదువేల సంవత్సరములనాటి వేదములనుబట్టి భారతీయులకు 'లిపి' యున్న దని స్పష్టముగా చెప్పుటకు సాక్ష్యములు గలవు. కావున ఆ లిపికి రెండుమూడు వేలయేండ్లు మాత్రమే వయస్సు గల సెమిటిక్ లిపినిగాని, ఫోనీషియాలిపినిగాని మాతృకగా భావించుట యుక్తియుక్తము కాదు.

"This Brahmi alphabet was believed to have been created out of the Semitic (Phoenician) system of writing by Indian merchants, several hundred years before Christ. One recent view, however, is that it was derived, probably in the 10th century B. C., from the pre-Aryan script as used at Mohen-jo-Daro and Harappa and other ancient pre-Aryan cities in Panjab, Sindh and other areas and was adapted for the needs of the Aryan Language (Vedic Sanskrit.)"

—సునీతికుమార చటర్జీ.

దీనినిబట్టి ఆర్యులకు పూర్వమే భారతదేశమున లిపి యున్న దనియు, అది వేదముకంటె ప్రాచీనతరమనియు విశ్వసింపవలసి వచ్చు చున్నది. ఆ లిపియే బ్రాహ్మీలిపిగా పరిణమించి, భారతీయభాషల కన్నింటికి లిపులను సమకూర్చి పెట్టినది. తెలుగులిపి కూడ బ్రాహ్మీలిపి

నుండియే యుద్భవించిన దని వేరుగా చెప్పికొనవలసిన యవసరము లేదు.

తెలుగుదేశమును అనేకవంశముల రాజులు పరిపాలించిరి. వారు వేయించిన శాసనములు ప్రాకృతసంస్కృతాంధ్రములలో నున్నవి. వాని కన్నింటికి నుపయోగించినది బ్రాహ్మీలిపియే. అయినను, పెక్కు మార్పులతో ఆ లిపి కనిపించుచుండుటవలన లిపిపరిశీలకులు స్పష్టతకొరకై, రాజవంశముల పేర్లనుబట్టి శాతవాహనలిపి, ఇక్ష్వాకులిపి, పల్లవలిపి, వేంగీలిపి, చాళుక్యలిపి, కాకతీయలిపి మున్నగువిధముగా నామకరణము గావించిరి.

ఉత్తరాదిదైన మౌర్యలిపికిని, దక్షిణమునందలి శాతవాహన లిపికిని భేద మంతగా లేదు. ఇక్ష్వాకులకాలములోనికి వచ్చుసరికి అక్షరములు అందములను సముపార్జించుకొనసాగినవి. తరువాత పల్లవుల పరిపాలనము కొంతకాలము సాగినది. ఆ తరువాత వచ్చిన బృహత్ఫలాయనుల కాలములో శిలాశాసనములు తగ్గుముఖము పట్టి తామ్రశాసనములు వాడుకలోనికి రాసాగినవి. శాలంకాయనవంశీయుల పరిపాలన లిపి పరిణామములో విశిష్టతను సాధించుకొన్నది. ఇక్ష్వాకుల కాలమున అక్షరముల క్రిందిభాగము పెద్దదై, యెడమవైపు మరలుచుండుట మొదలుపెట్టగా, శాలంకాయనులకాలములో అక్షరముల తలలపై అడ్డగీతలు ఏర్పడసాగినవి. అవియే తెలుగునందలి తలకట్లకు మూలరూపములు. విష్ణుకుండినుల కాలమున అక్షరముల తలలపై గీతలు సార్వత్రికములైనవి. 'ఱ' అను నక్షరమునకు లిపి యీ కాలములో గలదు. విష్ణుకుండినులకు ఉత్తరముననున్న వాకాటరాజుల శాసనములందు అక్షరముల తలపై గీతలు పలకలు తేరి యేర్పడసాగినవి. అవియే దేవనాగరియందలి అడ్డగీతకు మూలరూపములు.

ఆ తరువాత చాళుక్యులకాలములో తెలుగుభాష నలుమొగాలుగా వికసించినది. తెలుగు శాసనభాష యైనది. వేంగీచాళుక్యులు తెలుగుదేశపాలకులుగా నున్న కాలముననే పశ్చిమచాళుక్యులు కళింగ

దేశపాలకులుగా నుండిరి. ఇంతవరకు ఒకే విధముగా నున్న లిపి బాదామీచాళుక్యుల పాలనలో కొంచెము కుడివైపు ప్రమొగ్గి కన్నడ లిపికి మూలమైనది. వేంగీచాళుక్యలిపి నిలువుగా నిలిచి, చదరముగా నుండి తెలుగులిపిగా రూపు దిద్దుకొనసాగినది. నన్నయభట్టారకుడు భారతమును వేంగీచాళుక్యలిపిలోనే వ్రాసెను. కాని నన్నయనాటికే యాలిపి రూపాంతరము ధరించినది. తలకట్లు దిద్దినట్లుగా ఏర్పడి కుదురు కొన్నవి; అడ్డగీతలుగా ఉండెడివి రెండు రేకులై అందము లొల్కబోయ సాగినవి. నన్నపార్యునినుండి ప్రారంభమైన మార్పులు దాదాపు రెండు వందల యేండ్ల పాటు సాగి తెలుగును, కన్నడమును భిన్నలిపులుగా ప్రతిష్ఠించినవి. తెలుగున అక్షరములు గుండ్రము లగుచుండగా, కన్నడమున అక్షరములు కోణము లొందసాగినవి.

పదుమూడవ శతాబ్ది ముగియుసరికి తెనుగులిపి స్పష్టరూపమును సంతరించుకొన్నది. కావుననే లిపిపరిణామవిషయమున నింతవరకు సంధికాలముగా పరిగణింపబడినది. శ్రీనాథుని కాలమునకు దరిదాపుగా ఈనాటి అక్షరవైఖరి తెలుగులో ఏర్పడిన దనవచ్చును. విజయనగర రాజులు సంస్కృత కన్నడ తమిళ భాషాశాసనములకు సైతము తెలుగులిపినే వాడుక చేసిరి.

తెలుగునందు 'చ జ' యను రెండు దంత్యములును. 'ఱ ళ'అను అలఘుపులును, అర్ధానుస్వారమును అద్భుతమైన చరిత్ర కలిగియున్నవి.

ఆంధ్రశబ్ద చింతామణియందు 'చజయుగ' అని 'చజ' లను రెండు విధములుగా తెలిపెను. చిన్నయసూరి తెలుగున గల దంత్య తాలవ్య చజలను స్పష్టముగా తెలిపెను. వర్ణసమామ్నాయములో కూడ చెప్పుటవలన లేఖనవిధానమును వేరుగ చెప్పవలసిన యవసరము లేకపోయినది. అప్పకవి "దంత్యచజగుడు రలలకుం దనరు బొట్లు" అని లేఖన విధానమును వివరించెను. అప్పకవి యుద్దేశమున దంత్య చజ లను 'జ చ' అనునట్లుగా కాని 'చ జ' అనునట్లుగా కాని వ్రాయవల యును. కాని, యిట్టివ్రాత శాసనములం దెచ్చటను లేదు. అట్టి యావ

శ్యకము కలుగలేదేమో! చిన్నయసూరి 'చ జ' లను నెత్తిపై తెలుగు రెండంకె వేసి చూపెను. ఇట్లు వ్రాయవలయు నని యీవరకు చెప్పిన వారు గాని, శాసనములందు వ్రాసినవారు కాని లేరు. హిందీభాష యందు క,గ,జ మున్నగు నక్షరములను కొంచెము తేల్చి పలుకునప్పుడు వానిక్రింద చుక్కయిడు పద్ధతి గలదు. అటువంటిది అప్పకవి కేమైన స్ఫురించ నేమో! రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు తమ వ్యాకరణ గ్రంథము నందు చ, జ లను తాలవ్యములుగా చూపిరి. నెత్తిపై నున్నది తెలుగు ఒకటి. మొట్టమొదటివి తాలవ్యములని, రెండవవి దంత్యము లని గుర్తు పెట్టుకొనుటకు చేసిన పని యిది. బ్రౌనుదొరగారు తెలుగుగ్రంథముల నచ్చువేయించు సమయమున ఉచ్చారణస్పష్టత నుద్దేశించి చేసిన సంస్కరణమిది. వారిదగ్గర పండితులుగా వ్యవహరించిన గురుమూర్తిశాస్త్రిగారు కూడ ఆ మార్గమునే అనుసరించిరి. చిన్నయసూరి తాలవ్యముపై ఒకటి గుర్తును వేయుట మాని వేసి, దంత్యముపై రెండు గుర్తును మాత్రము వేసెను. అదియే ముద్రణ విధాన మున అనుసరింపబడినది. ఇతర ద్రావిడభాషలయందు దంత్యచజలు లేవు.

అప్పకవి 'రల' లకు కూడ బిందువును విధించెను. ఇదియు కృత్రిమ విధానమే. అప్పకవీయమునందే ఆ లేఖన విధానము లేదు. ఇంతేకాక 'యరలవ' లు నాలుగును ఈ ద్వైవిధ్యమును పొందును. ఈ విషయమును ఆంధ్రశబ్దచింతామణిలో "లఘవోఽ లఘవశ్చేతి ద్వేధా స్తత్స్థానవద న్తి శాస్త్రారః। అన్యేఽన్యవ్యాకరణస్పష్టా। ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః" అని రచించెను. కాని 'యవ' లకు లఘ్వలఘుభేదముచే లిపిలో భిన్నత్వములేదు. 'రల' లకు అప్పకవి చెప్పెను. కాని వానిని వేరు వర్ణములుగా పరిగణించుట జరుగలేదు. చిన్నయసూరియు ద్వైవిధ్యమును చెప్పెను. లక్ష్యములందు శకటరేఫ మును చూపెను. కాని వర్ణసమామ్నాయమందు చేర్పలేదు. అట్లే బహువచనమున 'రలడ'ల కాదేశముగా వచ్చి నళకారమునే అలఘు లకారముగా నిర్వచించి, కేవల ళకారము వర్ణాంతర మని నిర్ధారించెను. అప్పకవి ళ కారమునుగూడ అలఘులకార మనియే వాడెను; ఇంతకును

'ఱ, ళ' అనువానికి భిన్నలిపి అతిప్రాచీనశాసనములనుండియు కనిపించు చున్నది. ఒక్కొక్కప్పుడు 'ర, ఱ' లు పరస్పరము వినిమయము నొందుటకనిపించినను, ఉచ్చారణాలో ఆనాటికిస్పష్టమగు భేదముండియే తీరును. కావుననే ఆ భేదమును గాపాడుకొనవలయు నను ప్రయత్నము వ్యాకరణములందు మిక్కిలి కనిపించును. 'లళ'ల విషయముకూడ అట్టిదే.

అర్ధానుస్వారవిషయము చూతము. "సిద్ధ స్సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః" అని ఆంధ్రశబ్దచింతామణి తెల్పినది. ఈనాడు ముద్రితగ్రంథములందు పూర్ణార్ధానుస్వారములు రెండును స్పష్టరూపముతో గోచరించును. కాని మూడువందల యేండ్లకు పూర్వము దీనికి రూపములేదన్న సత్యము విన్నచో ఆశ్చర్యము కలుగక మానదు. శాసనభాషలో బిందువునకు తరువాతియక్షరములు ద్విరుక్తములగుట కనుగొందుము॥ సంధివిగ్రహి; పోయంగ్గలవాండు; పూంటకు; తొణ్ట; కూంతు సరియ పోల్పం గాంత లెందు॥ మున్నగు నుదాహరణములను గమనింపగా మనకు కొన్నివిషయములు తేలును. బిందువు స్థానమున పూర్ణబిందువునుగాని, వర్గపంచమాక్షరమునుగాని వాడుట కలదు. ఉచ్చారణమునకూడ పూర్ణానుస్వారమే వలయుచో, తరువాతి వర్ణమును ద్విరుక్తము గావింపవలయును. అట్లు ఒత్తిపలుకుట వలన ముందరిబిందువు ఉచ్చారణగౌరవమును పొందును. ఉచ్చారణమున శ్లథమైన యనుస్వారమునకు పిమ్మటివర్ణము ద్విరుక్తము కాదు. "కూంతు" అనునప్పుడు ఇచ్చటి పూర్ణబిందువు అర్ధానుస్వారసదృశమే. దీనికి ఉచ్చారణము లేదు. బహుశః ఆ మీదివర్ణమును అనునాసికోచ్చారణముతో పలికెడివారేమో! ఒత్తిపలికినప్పుడు పూర్ణబిందువును, తేల్చి పల్కునప్పు డర్ధబిందువును నిల్పుట తరువాతికాలమున సంప్రదాయమైనది. ఉత్తరాదివారి సాహిత్యముతో పరిచయము కలిగిన పిమ్మటనే యీ అర్ధానుస్వార మేర్పడి యుండెనేమో! హింద్

యందు "మైహూఁ" మున్నగుచోట్ల అర్ధచంద్రాకారపు బిందువును వాడుట కలదు. ఉచ్చారణలోని అనునాసిక్యమునుబట్టి తెలుగునందు అర్ధచంద్రాకారమే అరసున్నగా రూపొంది యుండును. ఉచ్చారణమున తేల్చి పలుకుట ప్రాచీనకాలమునుండి యున్నను, లిపిమాత్ర మటి వలనే యేర్పడిన దనక తప్పదు. ఇతర ద్రావిడభాషలయందు అర్ధానుస్వారము లేదు.

ధ్వనికిని లిపికిని గల సంబంధమునుగూడ కొంచెముగాచూతము. భారతీయభాష లన్నింటియందును లిపి ధ్వన్యనుసారిణియై యున్నది. తెలుగునకూడ నట్లే. ఉన్న లిపిని ఉచ్చరింపకుండుట, లేని లిపిని ఉచ్చరించుట, ఒకే లిపిని భిన్నధ్వనులుగా ఉచ్చరించుట, భిన్నలిపులను ఒకే ధ్వనిగా ఉచ్చరించుట యనునవి లిపిగతలోపములుగానే పరిగణింపబడును. ఉదాహరణకు ఆంగ్లమును దీసికొందము. Doubt అనునప్పుడు 'b' ఉచ్చారణము లోపించినది. Knife అనునప్పుడు 'k' ఉచ్చారణము లేదు. Enough అనునప్పుడు 'gh' అను రెండువర్ణములకు 'f' ఉచ్చారణము కలదు. Ghost అనునప్పుడు మరల ఉచ్చారణము మారినది. 'e, i' మున్నగునవి వేర్వేరుచోట్ల ఒకే ధ్వనిని గలిగి యుండును అట్లే 'a u, o' మున్నగునవి సమానధ్వనికి సైతము గుర్తులగును. But అనునపుడు 'అ'కారోచ్చారణము గల 'u' వర్ణము put అనునప్పుడు 'ఉ'కారోచ్చారణము నొందును. pleasure లోని చివరి నాలుగక్షరములను ఒక మాటగ పలికిన sure అని భిన్నమైన యుచ్చారణము నొందును. ఉచ్చారణదృష్టినిబట్టి చూచినప్పుడిది యంతయులిపిగతమైన యసమర్థతగనే లెక్కింపదగును. ఇట్టియసమర్థత తెలుగుభాష కేమాత్రమును లేదు. అయినను కొన్ని వ్యత్యస్తములు మాత్రము కనిపించుచున్నవి. వానిని గమనింతము.

నేటి వాడుకయందు మాటచివరి ఉత్వమును తేల్చిపల్కుట వినిపించును. 'వెళ్ళెను' మున్నగుచోట్ల నిట్టిది కలదు. అట్లే భగవంతుడు, వృక్షము మున్నగువాని ప్రత్యయముల స్థానములకూడ తేల్చి పలుకుట

కలదు. మకారాంతములు 'వృక్షం' మున్నగువిధముగా పూర్ణ బిందువు లతో వినిపించుట యీ విషయమునే సమర్థించును; దీనిని వక్తయొక్క-అసావధానతగానే పరిగణించుట యుచితము. అరవమున ఇట్టిచోట్ల 'క్షత్రియలుగరమ్' 'క్షత్రియల్ మగరమ్' అను నర్ధమాత్రాక పాద మాత్రాకము లయిన ధ్వనులను గుర్తించిరి.

అచ్చులవాడుకలో యకార వకారములు స్వరాదిపదములకు ముందుచేరి వినిపించుచున్నవి. ఇ ఈ ఎ ఏ లకు ముందు యకారము, ఉ ఊ ఒ ఓ లకు ముందు వకారము వినిపించుమాట నిజమే. దీనికి కారణము అవి యేకస్థానజనితము లగుటయే; కావున అసావధానముగా పలికినప్పుడు జన్మబలమువలన ఆ పొరపాటు కలుగును. ఇది వక్త యొక్క- అసమర్థతను సూచించునేకాని లిపియందు దోషమును స్థాపింప లేదు. అట్లే ఋ ౠ వర్ణములు 'రు రి' 'లు లి' మున్నగు విధముగా వినిపించుచున్నవి. దీనిని లిపిగతదోషముగా పరిగణించుటకు పూర్వ మీ వర్ణములు తెలుగునకు విజాతీయము లని గుర్తించుట యవసరము. సంస్కృతభవమైన ప్రాకృతమునందే యిట్టిమార్పు కలుగగా తెలుగున నిట్లు కలుగుటలో ఆశ్చర్యము లేదు. ఋ ౠ వర్ణముల పరిణామమునే యిది సూచించును. నన్నయ కాలమునుండియు ఉచ్చారణసామ్యమును స్థాపించు నుదాహరణములు పెక్కు-లు గలవు. ఇట్లే 'ప్రజ్ఞ' మున్నగు పదములందలి 'జ్ఞ' యను ధ్వనిని 'గ్న' యని పలుకువారు గలరు. కాని యిది సరియగు నుచ్చారణము కాదు. అయినను అశ్రద్ధయు అసమర్థతయు కారణముగా నిట్టి యుచ్చారణము బలిసినది. 'పగ్గె' మున్నగు తద్భవము లేర్పడినవి. కాని దీనికి సరియగు నుచ్చారణము లేకపోలేదు. కావున నిదియు లిపియందు దోషమును జూప జాలదు.

ఇంక శకటరేఫము, అర్ధానుస్వారము లిపియం దున్నవి కాని యవి ఉచ్చారణమున నించుమించుగా నశించిపోయినవి.

విష్ణువు, కృష్ణుడు మున్నగుచోట్ల షకార ణకారముల నడుమ టకారోచ్చారణముకూడ కలదు దానికి లిపిచిహ్నము లేదు. అట్లే 'వక్షము' మున్నగుచోట్ల నున్న 'క్ష' కారము కకార షకార సంయోగముకంటె భిన్నమగు నుచ్చారణ గలది. చిహ్నము, బ్రహ్మము- మున్నగు పదములందు 'హ'కారములు ముందు వ్రాసినను ఉచ్చారణమున 'చిన్హము, బ్రహ్మము' మున్నగువిధముగా వెనుకయే పలుకుదురు. ఇట్లు పలుకుటకు అనుకూలముగా సంస్కృతవ్యాకర్తల శాసనము కూడ కలదు.

ఇక ఆంగ్లాదిభాషలనుండి వచ్చిన 'కాఫీ' మున్నగువానికి సరి యగు లిపిచిహ్నము తెలుగున లేదు. Boy అను పదమును తెలుగక్షరములలో వ్రాయజాలము. అట్లే Pleasure అను పదము నుచ్చరించు చున్నను వ్రాయుటకు తెలుగులిపి చాలదు. అన్యభాషాపదములను వ్రాయుటకు తెలుగులిపి చాలక పోవచ్చును; అది లోపము కాజాలదు. వాడుకలో ఈనాడు 'వచ్చాడు, పోయాడు' మున్నగువిధముగా నున్న ఉచ్చారణమునకు తగిన లిపిచిహ్నము లేదు. వచ్చి + ఆడు మున్నగు చోట్ల సంధి కలుగగా పూర్వ తాలవ్యోచ్చారణము నిలిచియే యుండు నని చిన్నయసూరి సూత్రాంధ్రవ్యాకరణమున "కంచంత-కాచాడు-వచ్చాక్విత్యాదీనా మక్కజాదిత్వాత్సాధుత్వ మవగంతవ్యమ్" అని యనెను. ఇదే భావమును "పదాదిస్వరయోగంబునం దొంటియట్లుండె నగు" నని శబ్దలక్షణసంగ్రహమునందు తెలిపెను. కావున తాల వ్యోచ్చారణమే యుండ నగునన్నమాట! అట్లే 'వచ్చాడు' మున్నగు చోట్ల తాలవ్యోచ్చారణమే యుండిన వాడుకకు సన్నిహితముగా నుండును. ఇంతవరకు చేసిన వివేచనమునుబట్టి తెలుగులిపి దోషరహిత మును, ధ్వన్యనుసారియు నని నిర్ణయించుటకు ఎట్టి యభ్యంతరమును కలుగ దని స్పష్టము.

# సంధి ప్రకరణము

సంధి యనగా కూడిక యని యర్థము. ఒక పదమునకు మరొక పదమును సన్నిహితముగా చేర్చి పలుకునపుడు భాషా సంప్రదాయమును బట్టి కొన్నిమార్పులు జరుగును. ఒక యక్షరమును పలుకునప్పుడు ముఖయంత్రము ఒక విధమగుప్రయత్నమును గావించును; మరొక యక్షరమును పలుకుటకు ముఖయంత్రము తద్భిన్నమగు ప్రయత్నము గావింపవలసి వచ్చును. ఉచ్చారణత్వర యొక్కటి యీ ప్రయత్నము నకు సహకరించును. కావున 'కూడిక' యనునది యవశ్యలక్షణము. కాని, యిది అన్ని భాషలందు నొకేవిధముగా నుండదు. సౌలభ్యాపేక్ష యనునది సర్వమానవసహజమైనను సంప్రదాయము సజాతీయభాషల యందుమాత్రము సామ్యమును సాధించిపెట్టును.

సంస్కృతమున నుండు సంధివిధానము వేరు. అందలి గుణ వృద్ధి యణాదేశ సవర్ణదీర్ఘ సంధులు తెలుగుభాషా సంప్రదాయమునకు భిన్నములు. పూర్వపదమందలి తుదివర్ణమును, పరపదమందలి తొలివర్ణ మును సన్నికర్షపొందినప్పుడు రెండింటికి బదులుగా పరపదాదివర్ణము నిలుచుట సంధి. దీనినే పరరూపసంధి యని యందురు. ఆంధ్ర భాషా భూషణకర్తయగు కేతన—

"మొదలిపదము తుదివర్ణము
వదలక పైపదము మొదలివర్ణముతోడం
గదియంగ సంధులునాఁ దగు
విదితపుఁ దత్సంధు లెల్ల వివరింతుఁ దగన్"

అని సంధిలక్షణమును దెల్పెను. కదియుట అనగా సన్నికర్షపొందుట యని మాత్రమే యర్థము. అప్పకవి సంధిలక్షణము నింతకంటె విశద ముగా తెలిపెను—

"ఎచట సంధి గలుగు నచటఁ బూర్వపదాంత
హల్లుతోడఁ గూడినట్టి స్వరము

లోపముగ నొనర్చి యా పొల్లుతో మీఁది
యక్షరంబు గూర్ప నయ్యె సంధి"

పూర్వపదముచివర హల్లుతో కూడియున్న స్వరమును లోపింపజేసి, మిగిలినపొల్లుహల్లుతో తరువాతిపదములోని మొదటి యక్షరమును గూర్పవలయును. తెలుగుభాషయందు పదాంతమున స్వరములే సాధారణముగా నుండును. బహువచనమున 'లు, రు' లకు నవశిష్టములగు 'ల్, ర్' వర్ణములును, ద్రుతమును దక్క పొల్లులు తెలుగుశబ్దమునకు చివర నిలువవు. అందువలననే 'స్వరము' అని అప్పకవి స్పష్టముగా చెప్పెను. కాని 'మీఁది యక్షరము' హల్లనికాని అచ్చనికాని స్పష్టము చేయలేదు. చిన్నయసూరి బాలవ్యాకరణమున – 'పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశం బగుట సంధినాఁబడు'నని నిర్వచించెను. పూర్వపూర్వులకంటె సూరి సంధిని సంకుచింపజేసినమాట సత్యము. అందువలననే అతడు భాషాసంప్రదాయమునకు మరింత సన్నిహితుడైనాడు. చారిత్రకముగ సమీక్షించునపుడుకూడ పరరూపసంధి యొక్కటియే యీ భాషాసంప్రదాయమునకు సరిపడు సంధి యని తెలియగలదు. అందువలననే ఆతడు రుగాగమము, టుగాగమము మున్నగువానిని సంధికార్యములుగా పరిగణింపలేదు. కాని, వానియందును సంహిత లేకపోలేదు. అందువలన వానికి సంధిపరిచ్ఛేదమునందే తావు కల్పించెను.

తమిళమున పూర్వపదాంత్యాక్షరమునకును పరపదాద్యక్షరమునకును సంధి యగును. ఇచ్చట పూర్వపదముచివర అచ్చుకాని హల్లుకాని యుండవచ్చును. అట్లే పరపదము మొదట అజ్ఝల్లులలో నేదేని యుండవచ్చును. తమిళమున హలంతత్వము బహుళముగా నుండుట దీనికి హేతువు కావచ్చును.

కన్నడమున కూడ ఇంచుమించుగా నిదియే లక్షణము. రెండుగాని అంతకంటె నెక్కువగాని వర్ణములు కూడినచో సంధి యనిపించుకొనును. ముందరిపదములోని చివరియచ్చు లోపింపగా మిగిలినహల్లు తరువాతిపదములోని మొదటిస్వరముతో కూడుకొనును. ఇది

అజంతభాష కాకపోయినను, పదాంతమునందు క్రమముగా హల్లుల సంఖ్య తగ్గుచున్నది.

తెలుగునందు పదములు సాధారణముగా ఉదంతములు, ఇదంతములు, అదంతములు—అవి మూడు విధములుగా నుండును. ఏకారాంతములును, ఓకారాంతములును ఆశ్చర్యాద్యర్థములందు గలవు గాని సంఖ్యలో చాలతక్కువ.

'దశరథ - అపత్యము' అనియన్నప్పుడు పూర్వాపరములందు అకార మున్నది. కావున రెండుచోట్ల నున్న అకారమునకు బదులుగా అకారదీర్ఘ మేకాదేశ మగును. ఇది సవర్ణదీర్ఘమను సంస్కృతసంధి. 'దశరథాపత్య' మను రూపము సిద్ధించును. తెనుగుననైనచో 'అమ్మ-ఆదరము' అనునెడల 'అమ్మ యాదరము' అని యగును. అంతేకాని, సంస్కృతమునందువలె సవర్ణదీర్ఘము కాదు.

| | | | |
|---|---|---|---|
| ముని — ఇంద్రుడు | > | మునీంద్రుఁడు | [సంస్కృతసంధి] |
| చేసి — ఇచ్చెను | > | చేసి యిచ్చెను | [తెలుగుసంధి] |
| గురు — ఉపదేశము | > | గురూపదేశము | [సంస్కృతసంధి] |
| వారు — ఉండిరి | > | వారుండిరి | [తెలుగుసంధి] |
| నమో— అస్తు | > | నమోఽస్తు | [సంస్కృతసంధి] |
| ఏమో— అనెను | > | ఏమోయనెను | [తెలుగుసంధి] |
| ముని — ఆశ్రమము | > | మున్యాశ్రమము | [సంస్కృతసంధి] |
| ముని — అనుమతి | > | ముని యనుమతి | [తెలుగుసంధి] |
| గురు — ఆజ్ఞ | > | గుర్వాజ్ఞ | [సంస్కృతసంధి] |
| గురు — ఆనతి | > | గురునానతి | [తెలుగుసంధి] |

ఇట్లే పూర్వాపరస్థానములందలి వర్ణములందు సామ్యమున్నప్పుడు కూడ సంస్కృతసంధివిధాన మొకవిధముగను, తెనుఁగు సంధి విధానము మరొకవిధముగను సాగినవి. దీనినిబట్టి సంధి నియమముల విషయమున ద్రావిడభాషలకును, సంస్కృత భాషకును ఏమాత్రమును

సంబంధములే దని స్పష్టమైనది. నిజమునకు, పై యుదాహరణములలో 'వారుండిరి' అనునది మాత్రమే సంధిగ్గమైన తావు. దానినే 'పరరూప సంధి' యని యందురు. ఇది తెనుగున నిత్యసంధి. తెలుగుసంధు లనిగ్రహించిన వన్నియు సంధిరానిరూపములే. ప్రకృతిభావముకు తొలగించుటకు గాను రెండచ్చులనడుమ యకారముగాని, ప్రయోజనాపేక్షతో నకారముగాని వచ్చి చేరుటవలన మిగిలిన పై రూపము లేర్పడినవి. వానినింకను స్పష్టముగా సక్రమముగా నిట్లు పరిశీలింతము.

## ఉత్వసంధి

తెలుగునందు ఉత్వమున కగు సంధి యొక్కటియే నిత్యమయినను దానికిని గొంత సడలింపు లేకపోలేదు. ప్రాచీనములగు ద్రావిడ శబ్దములు చాలవరకు హలంతములు. ఇప్పటికిని హలంతశబ్దము లధికముగా కలవు; మలయాళ కన్నడములందును హలంతములు కలవు. తెలుగుమాత్రము అజంతభాషగా పరిణామము నొందినది; అనగా మూలశబ్దముల చివరిహల్లులపై అచ్చులు చేరిన వన్నమాట! తెలుగున 'ఉ' కార మెక్కువ పదములపై చేరినది. ఇది కేవల ముచ్చారణ సౌకర్యముకొరకు చేరిన దగుటవలన పై పదములతో సన్నికర్ష పొందినపుడు జారిపోయినను శబ్దస్వరూపము నష్టముకాదు; అర్థగ్రహణమును క్లిష్టముకాదు. అందువలననే సాధారణముగా ద్రావిడభాష లన్నింటియందును ఉత్వమునకు సంధి నిత్యముగా నగును. అరవమున 'కుట్రియలుగర' మనియు, 'ముట్రియలుగర' మనియు ఈ ఉత్వము రెండు విధములు. తెలుగున పదాంతమున నుండు ఉత్వము అర్ధమాత్రాకమగు ఉచ్చారణ గలది.

రాముఁడు – అతఁడు > రాముఁడతఁడు
వృక్షము – ఇదిగో > వృక్ష మిదిగో
విష్ణువు – ఉండెను > విష్ణు వుండెను
అలరులు – అలరెను > అలరు లలరెను

ప్రథమావిభక్తి ప్రత్యయములగు డు ము వు లు ఉదంతములు. వీని చరిత్రమును పరిశీలించినపుడు వీని చివరి ఉత్వము సహజము కాదనియు,

సౌకర్యమునిమిత్తము వచ్చినదనియు స్పష్టము కాగలదు. కావుననే ఉత్వమునకు లోపము కలిగి పరాచ్చు నిలుచుట జరిగినది.

తమిళమున గూడ నిట్టియెడల సంధి నిత్యము.

నాడు – అదు > నాడదు

మూన్రు – ఎట్టుత్తు > మూన్రెట్టుత్తు

మలయాళమున గూడ నిట్టియెడల సంధి నిత్యము.

అదు – ఇల్ల > అదిల్ల

వరిగు – ఇల్ల > వరిగిల్ల

అట్లే కన్నడమునందు సంధి యగును.

లేసు – ఎల్లం > లేసెల్లం

తెలుగునందు ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్న ఉకారంబునకు సంధి వైకల్పికమని చిన్నయసూరి సూత్రించెను.

ఉకారాంతము లయిన ప్రథమేతరవిభక్తి ప్రత్యయములు నాలుగు. అవి 'ను, కొఱకు, కు, అందు' అనునవి; శత్రర్థకము 'చు'. ఈ అయిదింటికి మాత్రము సంధి వైకల్పికము; అనగా, వీని కడపట నున్న ఉకారము వైకల్పికముగా లోపించునని యర్థము. ఇవన్నియు ద్రుత ప్రకృతికములే. 'ను' అనునది ఉత్వ విశిష్టముగా నున్నను దీని ప్రాచీనరూపము పొల్లునకారము మాత్రమే అయియుండును. ఇకారము మీాద ఈ 'ను' సమస్వరత (vowel harmony) ను పాటించి 'ని'గా మారుచున్నది. హలవసానములు పరములగునప్పుడు పొల్లు నకార మాత్రము కూడ అగుచున్నది. గోవును; రామునిని; దీనిన్ – అనునవి యుదాహరణములు.

కన్నడమున 'దీనిని' అను నర్థమున 'ఇదమ్' అని ప్రాచీన రూపముండగా 'ఇదన్ను' అను నవీనరూప మేర్పడినది. ప్రాచీన భాషయందు హలంతరూపమే యుండి హొసగన్నడమున అజంతముగా పరిణతి నొందినది. దీనినిబట్టి నకారము ప్రధానాంశమనియు, స్వరము దాని ననుసరించి వచ్చినదనియు ననిపించును. అందువలననే స్వరము ఆంగిక

మను నభిప్రాయముగల కొందరు సంధి చేయక కాపాడిరి; కొందరు ఆగ మముగా తలచి సంధిచేసిరి. కావుననే 'నన్నతఁడు; నన్ను నతఁడు' అను విధముగా రెండేసిరూపము లేర్పడుట తటస్థించినది.

షష్ఠీప్రత్యయమగు 'కు' సైతమిట్టిదే. ఇది న్యాయ్యముగా సంప్రదానార్థమునందు వచ్చు చతుర్థీ విభక్తి ప్రత్యయము. దీనిని శ్రీకోరాడ రామకృష్ణయ్య 'అగు' అను క్రియాధాతువున కవశిష్టరూప ముగా తలచుచున్నారు. ఇదికూడ ఇకారము మీాద 'కి'గా మారును. తమిళమున ఎనక్కు, నినక్కు-మున్నగు విధముగా అకారపూర్వకముగా నుండును. కన్నడమునకూడ ఎనగె, నినగె - మున్నగువిధముగా నట్లే యున్నది. తెలుగున 'కు' వర్ణకము వచ్చునపుడు ఉకారఋకారములకు నగాగమము విధింపబడినది. ఈ చివరిఉత్వమును హ్రస్వోకారముగా భావించుటచేతనే దీనికి వైకల్పికముగానైనను సంధిగావించుట సంభ వించి యుండును.

'కొఱకు' అనునది ప్రత్యయ మనిపించుకొనుచున్నను పదస్థితిని పూర్తిగా దాటినది కాదు. పని యను నర్థముగల 'కొఱ' యను శబ్దము 'కు' అను ప్రత్యయము నెనసి 'కొఱకు' అని యైనది. ఇప్పటికిని 'కొఱమట్టు' అని యన్నప్పుడు 'కొఱమాలినవాఁడు' అని యన్నప్పుడు ఈ 'కొఱ'యే కొరవ లేకుండ పని యను నర్థమున సాక్షాత్కరించును. కావున 'కొఱకు' అనుదాని యందున్న 'కు' ప్రత్యయము షష్ఠీవిభక్తి ప్రత్యయముతో ధర్మసామ్యము కల్గియే యుండును.

'అందు' అనునది సప్తమీవిభక్తి ప్రత్యయము. ఇదియు పూర్తిగా పదస్థితిని దాటలేదు. 'అందు' అని మాత్రమే కాక 'ఇందు, ఎందు' అని యింకొక రెండు శబ్దములుకూడ కలవు. వ్యాకర్తలు వీనిని ప్రత్యయ ప్రతిరూపము లని పిలుతురు. అల్, ఇల్, ఉల్ అను శబ్దములు సప్తమ్యర్థ మున గలవు. కన్నడమునను, తమిళమునను చిన్నమార్పులతో పదాంత మున చేరి సప్తమీప్రత్యయములుగా వ్యవహరించుచున్నవి. తెలుగున లకారము నకారముగా మారి అన్, ఇన్, ఉన్ అనియైనది. ఈ 'అన్'

అనున దేబొపవిభక్తికరూపముల తృతీయాసప్తములందు గోరన్, ఊరన్, నీటన్, ఏటన్, చేతన్, గోతన్ - అను రూపముల నేర్పరుచుచున్నది. పైని అమహదర్థకమం దగు 'అదు' శబ్దములోని అవశిష్టమగు 'దు' చేరుటవలన 'అన్దు' 'ఇన్దు' మున్నగువిధముగా రూపము లేర్పడి సప్తమ్యర్థమున శబ్దాంతమున చేరుచున్నవి. ఇవియే 'అల్ - అ' మున్నగు విధముగా చివర అత్వమునుపొంది, నిర్దేశకము లగుచున్నవి; ఇచ్చట లకారము ద్విత్వమును పొందుచున్నది. 'అల్ల' దూర దేశమును 'ఇల్ల' సామీప్యమును 'ఉల్ల' దూరమును దగ్గరయు గాని ప్రదేశమును సూచించును. 'ఉల్' అనునది స్వరప్లుతిని పొంది 'లో' అనియై తెలుగున ప్రత్యయత్వమును సాధించుకొన్నది.

దీనినిబట్టి ఇక్కడ ఉత్వము లేకున్నను నష్టము లేదు. కావున 'అందుండెను' మున్నగువిధముగా సంధి యగును. కాని 'అన్' అన్నది ద్రుతాంతము కావున 'అందు' కూడ ద్రుతాంతమని కొందరు సంధి మానియుందురు. కావుననే రెండు విధములగు రూపములను వ్యాకర్తలు అంగీకరించిరి.

'చున్' అనునది శత్రర్థకము. తమిళ కన్నడములందు ఈ అర్థమును బోధించుచు 'తుమ్' అని నిల్చును. 'గెయితు' అనుదాని కంత మందు 'ఉమ్' అను సముచ్చయార్థకము చేరగా 'గెయితుమ్' అనున దేర్పడినది. దీనికి 'చేయుచు' అన్నది తెలుగు సమాంతరరూపము. 'చేయుదును' మున్నగు తద్ధర్మార్థకములలోని దకారము పూర్వతకారమునకు పరిణామరూపమే కావచ్చును. వ్యావహారికమున 'చేస్తూ' అని తకార యుక్తముగానే తెలుగున ప్రయోగములు గలవు. గ్రాంథికమున మాత్రము తత్స్థానమున చకారము నిల్చినది. డా॥ కాల్డ్వెలు చెప్పినట్లు చకారముమీది ద్రుతము సముచ్చయార్థక మగు 'ఉన్' శబ్దమే కావచ్చును. అందువలననే లోప మొందియు, లోప మొందకయు రెండు రూపము లేర్పడుచున్నవి.

ఇట్లే తమిళమున మఱు - ఉణ్ణు > మఱువుణ్ణు అనియు, కన్నడమున పటు - ఈతం > పటువీతం మున్నగు విధముగను సంధిలేని రూపములు గలవు. నామాంశమునకు నష్టము కలుగునప్పుడు సంధి కలుగదనియు, కానియెడల సంధి కావచ్చుననియు ఈ భాషలనుబట్టి గ్రహింపనగును.

## ఇత్వ సంధి

తెలుగునందలి యిత్వమును రెండు విధములుగా విభాగింపవచ్చును. ఒకటి క్రియాపదాంతమునందలిది: రెండు క్రియేతరపదాంతమునందలిది.

ఏమి, మఱి, కి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి - అనునవి యేమ్యాదులు. వీని యిత్వమునకు సంధి వైకల్పికము.

ఏమి ప్రశ్నార్థకము. తమిళ మలయాళములందు 'ఏన్' అని నకారాంతముగా నున్నది. అమహదర్థక ప్రశ్నవాచకమైనపుడు - 'అదు' అను సర్వనామమును పొంది "ఎన్నగు" అని యైనది. 'ఏన్' అన్నది తెలుగున మకారాంతత్వము నొంది, ఉచ్చారణ సౌలభ్యముకొరకు ఇత్వమును పొంది 'ఏమి' యైనది. చివరియిత్వముకూడ అవయవికమే యనుభ్రమవలన, సంధి చేసినచో నామాంశము నష్టమగునన్న భయము వలన కొందరు సంధి చేయకుండిరి. కేవలము రెండక్షరముల శబ్దమగుటవలన ఇట్టి జాగరూకత యెంతయో అవసరము. కాని 'ఏది' అనునది తెలుగున అమహదర్థకప్రశ్నవాచకము. ఇందు 'మి' యను నక్షరము లోపించుటయే కాక 'అది' యొక్క అవశిష్టరూప మగు 'ది' మాత్రమే అంతమున చేరుచున్నది. హలవసానంబులు పరమైనపుడు కూడ 'ఏ' యని మాత్రమే భాషలో నచ్చటచ్చట కన్పించుచున్నది. వీని నన్నింటినిబట్టి 'ఏ' యనునది ప్రధానాంశమనియు. ప్రాచీన నకార పరిణామరూపమే మకారమనియు, ఇత్వము ఉచ్చారణ సౌకర్యము కొరకు చేరినదనియు నిర్దిష్టముగా చెప్పనగును.

'మఱి' యనునది 'మఱు' యొక్క మారురూపము. ఇతర భాషలలో నిప్పటికి నిట్లేయున్నది. తెలుగునకూడ 'మాఱుమాట' మున్నగు విధముగా వాడబడుచున్నది. 'మాఱు' అనునది సమాసవిధులచే 'మఱు' అని మారునని వ్యాకర్తల నిశ్చయము. అదియే తెలుగునం దింకను మారి 'మఱి' యను రూపము దాల్చెను. కావుననే యిందలి యిత్వము నిత్యము కాక, ఒకప్పు డుత్వమువలె సంధినంగీకరించును; ఒకప్పుడు ప్రకృతిభావము నొంది సంధి నాపు వర్ణములను పొందును

ఇట్లే 'అది, అవి' మున్నగున వన్నియు ప్రాచీన భాషలో ఉకారాంతము లై యుండును; లేదా హలంతము లై యుండి, తమిళమున ఉదంతత్వము నెనసియుండును. కావుననే యిచటి యిత్వముకూడ ఉత్వమువలెనే లోపించి, మీదివర్ణమును పొందుచున్నది. తెలుగున రెండక్షరముల పదమే యగుటవలన, తరువాతికాలమున నామాంశము నష్టము కాకుండుటకుగాను సంధిచేయుట మాని యుందురు.

'కు' అను షష్ఠీవిభక్తి ప్రత్యయమే ఇకారమువిూద వచ్చిన యెడల 'కి' గా మారును. ఇది ద్రుతప్రకృతికము. కావున చివరిద్రుతము తరువాతిపదమునందలి తొలియచ్చు నెనసిన సంధికాని రూపమేర్పడును. అట్లుకాక ఇందలి యిత్వము తరువాతి అచ్చుతో కలిసిన సంధి యగును.

ఏమ్యైదు లన్నింటియందును శ్రుతికి ప్రాధాన్యము హెచ్చు. చెవికి బాగుగా వినిపించునెడల, అర్థావబోధమున క్లేశము లేకున్న యెడల వీనికి సంధి చేయవచ్చును. ఇట్టివికాక మిగిలిన యికారాంతములకు సంధి రాదు.

క్రియాపదముల చివరియిత్వమును గమనింతము. నేను, మేము, నీవు, మీరు, వాడు, వారు - అను సర్వనామముల కడపటి యక్షరములే క్రియాపదములకు చివర చేరు పురుషప్రత్యయము లగుచున్నవి. వచ్చుచున్నాను,-ము,-వు,-రు,-డు,-దు,-రు॥ అనియీవిధముగా అగును. ఇవే ప్రత్యయములు ఇకారమువిూద వచ్చినయెడల ఇత్వము నొందును. వచ్చితిని,-మి,-వి,-రి॥ అనువిధముగా రూపములేర్పడును. తమిళ కన్నడములందు కూడ శెయ్‌దేన్, గెయిదెమ్ అనునట్లుగా యామ్, ఆమ్

మున్నగు సర్వనామముల అవశిష్టరూపములే క్రియాపదముల కడపట కనిపించుచున్నవి.

మధ్యమపురుషయందు ఇకారాంతములు 'వచ్చితివి, వచ్చితిరి' అనునవి. వీనికి సంధి నిత్యము. 'వచ్చితి విప్పుడు, వచ్చితి రిప్పుడు' అని యుండవలయును. ఇందు తివర్ణము పురుషను, ఇత్వము భూతకాలమును సూచించును. ఈరెండింటికిని నష్టము లేకుండ సంధి గావచ్చును; కనుక మధ్యమపురుష క్రియలకు సంధి నిత్యము. 'వచ్చితివి' అనుదానిలో చివరి వకారమునకు లోపముగూడ కావచ్చును. ఇట్టియెడల 'వచ్చి తనియె' అనునట్లు రూపము లేర్పడును. ఇచ్చట తివర్ణములోని ఇత్వమునకు నష్టము కలిగినమాట నిజమేకాని మఱొక రూపముతో పొరపడు నవకాశము లేదు కావున ఇట్టిరూపములకును తావు లభించినది. యుష్మదర్థమున తెలుగున మాత్రమే 'ఈవు, నీవు' అనుచోట 'వు' కలదు. తమిళాదులందు 'ఈ,నీ' యనియే కాని 'వు' కన్పింపదు. అందువలననే తెలుగునను 'వ' కారమునకు లోపము వైకల్పికముగా విధింపబడియుండును.

'వచ్చితిని, వచ్చితిమి' అను నుత్తమపురుషరూపములు కూడ నిట్టివే. వ్యాకర్తలు ద్రుతప్రకృతికములకు (ఇఁకాదులకుఁ దక్క) సంధి లేదని నిషేధించిరి. కావున వచ్చితిని - అనియె>వచ్చితి ననియె అని యగును. ఇచ్చట సంధి కాలేదని యనిపింపదు. మధ్యమపురుషైకవచనమున నెట్లయ్యెనో, యిచ్చటను నట్లే యయ్యెను. వ్యాకర్తల దృష్టిలో 'ని' ద్రుతము. సంధి యగుట యనగా నడుమనున్న ద్రుతము జారిపోయి, 'వచ్చితనియె' అను రూప మేర్పడుట. అట్టిరూపము మాత్ర మేర్పడరాదు. ఇట్లే అయ్యెనేని మధ్యమపురుషైకవచనక్రియకు, ఉత్తమ పురుషైకవచనక్రియకును భేదము నశించి పోవును. 'ని' అనునది ద్రుతమనుటవలన ఇట్లు 'చెప్పితి ననియె' అనునప్పుడు సంధికాలే దనియే సరిపెట్టుకొనుట వ్యాకరణసంప్రదాయము. భాషాచరిత్రనుబట్టి యైన దీనిని నిత్యసంధి యనవచ్చును.

'చెప్పితిమి' బహువచనక్రియ. ఇందలి మకారము ఉత్తమపురుష బహుత్వమును సూచించును. ఇత్వము లోపించినను అర్థగ్రహణమున క్లేశము కలుగదు కావున దీనికి సంధి వికల్పముగా కావచ్చును. తమిళ మున మకారము హలంతముగానే యుండును.

'చెప్పిరి' అనునది ప్రథమపురుషబహువచనక్రియ. భూతకాల మును సూచించు ఇత్వ మున్నది. 'చెప్పిరనిరి' అనునట్లుగా సంధి చేసి నచో ఇత్వ మొక్కచోటనే యుండి భూతకాలికత్వమును నిరూపించు టకు సమర్థము కాదేమో యని యనిపించి కొందరు విసంధిగ వ్రాసి యుందురు. చివరి 'రి' తెలుగు 'వారు' లోని 'రు' వర్ణ మగుటచేత, తమిళాదులందలి 'అవర్' అను రూపములోనిది పొల్లురకార మగుట చేతను, ఇకారమును శ్లథముగావించి కొందరు సంధి చేసియుందురు.

'చెప్పెడిన్' అనునది యిదంత తద్ధర్మార్థకము. ఇది ద్రుతప్రకృ తిక మగుటవలన సంధి కారాదని వ్యాకర్తల నియమము. మూల ద్రావిడమునందలి 'ఎడుమ్' అనునదియే తెలుగునందు 'ఎడున్, ఎడిన్' అని రెండువిధములుగా పరిణామము నొందినది. దీనికి పూర్వరూప మగు 'మ' కారము ఆశీరాద్యర్థమం దచ్చు పరమగు నపుడు'అయ్యెడు మనిరి' అన్నట్లుగా ఇప్పటికిని మిగిలియే యున్నది. కావున చివరి నకార మకారము లాంగికము లగుటవలన వానికి నష్టముగావించి సంధిచేయుట జరుగలేదు.

క్త్వార్థకమైన యిత్వమునకు కూడ సంధి నిషిద్ధము. 'వచ్చి - ఇచ్చెను' మున్నగుచోట్ల మొదటిది పూర్వకాలిక క్రియ, రెండవది అనంతరకాలిక సమాపకక్రియ. మొదటి కార్యమునకును, అనంతరకార్య మునకును వ్యవధాన ముండును. దానిని సూచించుట క్త్వార్థకము ధర్మము. కావుననే క్త్వార్థకేకారమునకు సంధి చేయకుండుట యోగ్యము. పూర్వక్రియలోని ఇకారము భ్రష్టమైనయెడల భూతకాలమును సూచించు చిహ్న మచ్చట కనిపింపక అర్థగ్రహణమునకుకూడ అవరో ధము కలుగును. కాని ఉచ్చారణత్వర సర్వసిద్ధాంతములకంటె బలవత్త రము. అందువలన ఇకారమునకు సవర్ణము పరమైనప్పుడు సంధి చేసిన

రూపములు కొన్ని కనిపించుచున్నవి. ఎఱిఁగించి - ఇప్పుడు > ఎఱిఁగిం చిప్పుడు. ఇట్టియెడల ఇత్వమెట్లును ఉన్నదిగనుక సరుదుకొనిపోవచ్చును. 'ఎఱింగెఱింగి' మున్నగునెడల ఆమ్రేడితమునుబట్టి పూర్వరూపమును గుర్తింపనగును గావున ఇట్టివికూడ కొందరు కవుల కిష్టములైనవి. ఏమయినను, క్త్వార్థకసంధి తెలుగుభాషకు అనుగుణము కాదనియే తేలును.

మగనాలు, పురుటాలు మున్నగునవి యిత్వసంధి వచ్చిన రూపములుగా అనిపించును కాని 'మగన్ - ఆళ్' అనునవియే ప్రాథమిక దశలో మగనాలుగా నయ్యెననుకొనుట అబాధము. దీని విషయమును 'పేదరాలు' మున్నగు రుగాగమ సందర్భమున స్పష్టముగా తెలిసికొన నగును.

పురుడు - ఆలు > పురుటాలు అని యేర్పడియుండును; కాక ఇదంతరూపముపై నేర్పడినచో 'పురిటి' అని ఇన్మధ్య రూపమే యుండ వలయును. కాని అట్టిరూపములు అశ్రుత గోచరములు. పైగా ఆకారముమీఁది యూనికవలన 'పురుడు' లోని నడిమిడుకారము అకారముగా కూడ మారి 'పురటాలు' అన్నట్లు వినిపించుచున్నది.

తీపి, తీపు; తెలివి, తెలివు; అలవి, అలవు - అనునట్లు రెండేసి రూపములు కూడ కొన్ని శబ్దముల కేర్పడి యున్నవి.

పచ్చి - ఆకు > పచ్చాకు॥ ఇట్టియెడల అర్థగ్రహణమున కొంత క్లేశము కలదు. పచ్చిదైన ఆకునో, పచ్చని యాకునో వక్త యుద్దే శించినది గ్రహించుట కష్టము. కావున, ఇట్టియెడల పూర్వశబ్దమునందలి తాలవ్యోచ్చారణమునే గ్రహింపవలయునని చిన్నయసూరి సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణమునందు సంకేతించెను. దీనికి తగు లిపి తెలుగు వర్ణములలో లేదు. కావున ఇటీవల కొందరు దానిని సూచించుటకు గాను ఒక చుక్కనో, గీతనో ఆ అక్షరములపై నిలుపసాగిరి. అది యికారమునకు అకారమునకు మధ్యస్థమయిన ఉచ్చారణము కలిగి యుండును.

అత్వసంధి

అత్వసంధిని వ్యాకర్తలు బహుళకార్యముగా పేర్కొనిరి. స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములయందలి అత్వమునకు సంధి లేదని నిషేధించిరి. ఇచ్చటకూడ గ్రహణమున క్లిష్టత లేకుండుట, శ్రుతి సౌలభ్యము అను రెండు లక్షణములే పనిచేసె ననుట నిర్వివాదము. 'అమ్మ - ఇచ్చెను' అని యన్నప్పుడు సంధి యగుచో 'అమ్మిచ్చెను' అను అనిష్టమగు రూపమునుగూడ శ్రోత గ్రహించుట కవకాశము గలదు. కావున ఇట్టి తడబాటును పరిహరించి మాటాడుట వక్తకు అవశ్యకర్తవ్యము. అంతేకాక 'అమ్మ'లోని కడపటి అకారము శబ్ద గతము. సంధి వశమున అది లోపించినయెడల నామాంశమునకే నష్టము వాటిల్లును. అట్లే 'గంగనుకాసె' మున్నగుచోట్లకూడ 'గంగను' అను నది ద్వితీయాంతముగా ననిపించును. 'చెలువుఁడ - ఇందము' అను చోట కూడ సంధి కారాదు. సంబోధనమునందు సంబోధ్యవాచకము కడపటి ఉత్వమునకు అత్వము వచ్చినది. కావున అత్వము సప్రయోజనము. ఇప్పుడు సంధివశమున ఆ అత్వమునకు లోపము వాటిల్లినయెడల సంబోధనమునందలి శబ్దమునకును, ప్రాతిపదికార్థమునందలి శబ్దమునకును భేదము నశించి అర్థగ్రహణమున తడబాటున కవకాశము కలుగును. కావుననే సంబోధనాంతమునందలి అత్వమునకును సంధిచేయరాదని వ్యాకర్తలనిర్ణయము.

'మేన - అల్లుఁడు' మున్నగుచోట్ల సంధివైకల్పికముగా జరుగును. 'మేన్' అనగా శరీరము. శరీరసంబంధమైన అల్లుడు అని చెప్పవలసి వచ్చినపుడు తొలిపదముపై అత్వము చేరినది. మేన్- అ-అల్లుడు. ఇచ్చటి 'అ' సంబంధమును తెలియజేయును. తెలుగున అవర్ణమిట్లు పెక్కుచోట్ల చేయుచున్న విషయ మింకను చూడగలము. మేన - అల్లుడు. ఇచ్చటి అకారము సప్రయోజనము గనుక భారతాదులయందు దీనికి లోపము గలుగలేదు. 'మేనయల్లుఁడు' అను రూపము సిద్ధించినది. అనంతరకాలమున ఉచ్చారణత్వరవలనగాని, పూర్వపదము 'మేను' అను

ఉదంతరూపమే అను భ్రమవలనగాని 'మేనల్లుఁడు' అను రూపముకూడ వాడుకలోనికి వచ్చియుండును. తెలుగున విశేషణవిశేష్యముల నొకదాని ప్రక్క నొకదానిని జేర్చి సమాసముగా వాడుట అధికముగాకలదు. తేటమాట; మనసుతీపి - మున్నగునవి యిట్టివే. ఇటువంటివాని సామ్యమున 'మేన' యందలి కడపటి 'అ' కారమును పరిహరించి సంధి గావించినను గావించి యుండవచ్చును. కావుననే రెండు రూపములు నేటికి నున్నవి.

'చేయక - ఉండెను' మున్నగుచోట్ల కూడ రెండురూపములు గలవు. '-క' అని వినిపించుచున్నను, దాని వెనుక నొక అర్థము కూడ కలదు. 'చేయ్ - అక' ఈ అర్థముతో కూడిన కకారము వ్యతిరేకార్థమును స్ఫురింపజేయును. తరువాత అకారము ప్రధానకార్యమునకును పూర్వకార్యమునకును వ్యవధానమును గల్పించుటకు వచ్చియుండును. కానికొన్నియెడల, ఉండు మున్నగుధాతువులు పరమగునపుడు పూర్వక్రియ కేవల సహకారక్రియగా మాత్రమే వ్యవహరించుచున్నది. పూర్వక్రియ ఒకకార్యమును తరువాతిక్రియ మఱొకకార్యమును తెలియజేయుట లేదు. ఇట్టిచోట్ల వ్యవధానమును గల్పించుటకు వచ్చిన 'అ' నర్థమునకు లోపము కలిగినను నష్టము గలుగదు. కావున 'చేయకుండెను' అనునట్టి సంధికలిగిన రూపమును 'చేయకయుండెను' అనునట్టి సంధిగాని రూపమును గలిగినవి. 'పుట్టినయిల్లు' మొదలయినచోట్ల కూడ అర్థగ్రహణమున ఇబ్బంది కలుగదు కనుకనే అర్థమునకు లోపము కలుగుచున్నది.

వెలయాలు మొదలగుచోట్ల సంధి లేదు. 'వెల - ఆలు' వెలయాలు అనియే యుండవలయును; వెలాలు అను రూపము కలుగరాదు. ఇచ్చటి యీ సంధిరాహిత్యమునకు కారణము కేవలము తెలుగుభాషా లక్షణము కాదు. తమిళమున 'తలై' అనియు, కన్నడమున 'తలె' అనియు తల శబ్దమునకు రూపములు గలవు. కావున ప్రాచీనద్రావిడ భాషయందు 'తలై' యను రూప ముండియుండును. చివరి ఐకారము

అయ్, ఎయ్ అనువానికి నడుమగా పలుకబడి యుండును. అందువల్లనే తెలుగున అదంతశబ్దము కన్నడమున ఎదంతశబ్దము నేర్పడినవి. ఇంత కును 'విళై-ఆళ్' అను ప్రాచీనరూపముల కలయికవల్లనే "విలయాళ్" అయి తెలుగున 'వెలయాలు' అయియుండును. వ్యాకర్తలు 'వెల' అను శబ్దమేర్పడిన పిమ్మట దానిని పూర్వశబ్దముగా గ్రహించి 'ఆలు' అన్నది ఉత్తరశబ్దముగా గ్రహించి యకారము ఆగమమని నిర్ణయించిరి. కాని పై ప్రక్రియనుబట్టి చూచినయెడల యకారము నామాంశమే కాని ఆగమము కాదని స్పష్టముగా తేలును. కావుననే దానికి లోపము ను కలిగింపరాదు. దీనిని గుర్తించియే ప్రక్రియాసౌలభ్యము నపేక్షించి యెట్లు చెప్పినను, సంధికి మాత్రము వ్యాకర్త లంగీకరింపలేదు.

శ్రీ గంటి జోగిసోమయాజిగారు "తలయారి శబ్దము అట్లు కాకుండుటచే తలారి అయినది" అని వ్రాసిరి. ఇందలిది నిజముగా తెలుగు 'తల' కాదు. కిట్టెల్ ప్రకారము 'స్థలవారః' అను సంస్కృత రూపము ప్రాకృతమున 'తలారో' అని ఐనది. అదే తెలుగున తలారి, తలవరి, తలవారి అను రూపములను దాల్చినది. ఈ రూపములే బహు ప్రచారము నందినవికూడ. తరువాతి కాలమున 'తలయారి' అను రూప మేర్పడినది. వెలయాలు మున్నగువాని సామ్యమున 'తలయారి' అను రూప మేర్పడి యుండునేమో! ప్రాథమిక రూపము 'తలారి' యనునది. కావున శ్రీ సోమయాజిగారు చెప్పినటు 'తలయారి' యనునది 'తలారి' అని కాలేదు.

అథర్వణాచార్యులు "క్వచిత్సంస్కృతీయోఽపిదృశ్యతే" అని వ్రాసెను. దాని నెందువల్లనో సూరి సందర్భమునుండి విడదీసి అట్టి ప్రయోగములు లేవని నిరాకరించెను. తత్సమముల చివరి అత్వమునకు సంధి కావలయునని అథర్వణుని యుద్దేశము కాదు. అయ్య, అమ్మ మున్నగు పూజ్యతా వాచకములు వచ్చినపుడు తత్సమములకును సంధి యగు నను అథర్వణుని భావమును గ్రహించియే ప్రౌఢవ్యాకర్త ఆర్యాంబాద్యర్థకములు పరమగునపుడు సంధి యగునని సూత్రించెను. రామయ్య,

సీతమ్మ మున్నగునవి ఉదాహరణములు. సంజ్ఞావాచకములందే యీ సంధి యగును. కావున భావగ్రహణమున క్లిష్టత మున్నగున వేర్పడు ననుట కవకాశము లేదు. సంజ్ఞలకు అర్థముతో నంతగా నవసరము లేదు. కేవలము వ్యవహారమే వాని ప్రయోజనము.

నామాంశమునకు నష్టము రానంతవరకు కన్నడమున అత్వసంధి యగును. ఎన్న - అరసం>ఎన్నరసం.

కన్నడమున ప్రకృతిభావము కూడ విపులముగా నున్నది. ఆ - అరసం> ఆ అరసం; పొస - అనె>పొసఅనె. ఇట్లు కానియెడల సంధి నాపుటకుగాను 'య,వ'లు ఆగమములుగా నగును.

## ఆమ్రేడిత సంధి

తెలుగున ఆమ్రేడితసంధి అత్యంతసహజము. ద్విరుక్త మగుట సాధారణముగా భృశార్థమున జరుగును. అందువలన పలుకునప్పు డొక వేగముతో కూడికొనియుండుట స్వాభావికము. అందువల్లనే తెలుగున మరెచ్చటను దీర్ఘముమీద సంధి జరుగకపోయినను, ఆమ్రేడితము పర మగునప్పుడు జరుగును. 'ఓహో - ఓహో > ఓహోహో' అని యగును. 'ఏమీ-ఏమీ > ఏమేమీ' అని యగును. ఇట్లే 'ఏఁగి-ఏఁగి మున్నగు చోట్ల సంధివైపునకే మనసు మ్రొగ్గును. కొందఱు 'ఎత్తెఁగెత్తెఁగి' మున్నగువిధముగా సంధి చేసిరి. కాని క్త్వార్థక రూపమునకు సంధి యొనర్చినచో క్రియా నిర్వహణమున పూర్వాపరముల నడిమి వ్యవధానము నశించిపోవును గాన అట్లు చేయకుండుటయె భావ్యము. ఒక్క-క్త్వార్థకమైన యిత్వమును మినహాయించి, తక్కిన హ్రస్వదీర్ఘములయిన యన్ని యచ్చుల మీదను ఆమ్రేడితసంధి జరుగును.

## పదమధ్యసంధి

ఇంతవరకు చూచినప్రకారము తెలుగునందు పూర్వపదమునందలి కడపటి యచ్చునకును, పరపదమందలి మొదటి యచ్చునకును సంధి జరిగినది. అపదము పరమగునపుడు అన్ని యచ్చులకును సంధి నిత్యముగా

జరుగును. ప్రకృతిప్రత్యయముల కలయికవలన పద మేర్పడును. కేవల ప్రత్యయముగాని, ఆగమముగాని యైనచో 'ఉపపద' మని యందురు.

నామములపైని ధాతువులపైని 'ఇంచు' ఆగమమై క్రియాధాతువుల నేర్పరుచును. నిర్జి - ఇంచు > నిర్జించు॥ ఇట్టి చోటులందు నిత్యముగా సంధి జరిగితీరవలసినదే.

పరిమాణార్థమునందు 'ఎడు' అనునది యగును. పుట్టి - ఎడు > పుట్టెడు. అన్ని అచ్చులపైని నిత్యముగా సంధి జరుగును.

నిజమునకు 'ఇంచు, ఎడు' అనునవి ఒకప్పుడు పదములే. ఇంచునకు రూపాంతరము ఇచ్చు. ఈ రెండును 'ఈ' ధాతువునుండి నిష్పన్నమయినవి॥ అందించు, అందిచ్చు, అందిమ్ము॥ ఆడు, చేయు, పడు - మున్నగుధాతువులు ధాతువులపై చేరినట్లు 'ఇచ్చు' అనునది కూడ చేరినది. కన్నడమునకూడ ఈధాతువు 'ఇసు' అనురూపముతో తెలుగులోవలెనే ధాతువులపైని చేయుచున్నది. 'ఎడు' అను శబ్దమునకు తమిళమునందును, మలయాళమునందును 'ఎత్తు' అని యర్థము. 'ఎడుత్తు' అనునది తెలుగున 'ఎత్తు'గా పరిణతి నొందియుండును. ఒకయెత్తు, రెండెత్తులు అని ఒక పరిమాణమున కర్థముగా వాడుట నేటికిని గలదు. అదే క్రమక్రమముగా కొలతకు గాని, తూకమునకు గాని యుపయోగించు సాధనముతో కలిపివాడుట జరిగినది. రూఢి యేర్పడిన పిమ్మట పదత్వము ను గోల్పోయి, ప్రత్యయముగా మారిపోయియుండును.

వీసె - ఎడు అనునప్పుడు ప్రథమాక్షరములైన 'వీ'మీదను 'ఎ' మీదను ఊనిక నిలుచును. కావుననే నిత్యముగా సంధి జరుగుచున్నది. సంధి జరిగినను ఆ ఊనికకు నష్టము వాటిల్లదు కాని కొన్నియెడల నామాంశమునకు నష్టము కలుగును. అట్టియెడల మాత్రము ఊనికను బట్టి, అర్థగ్రహణ సౌకర్యమునుబట్టియు సంధి జరుగుట గాని, మానుట గాని యగును. రాముని - అందు. ఇచ్చటి 'ని' విశేషార్థమున వచ్చినది. కావున దానికి లోపము కలుగరాదు. కాని 'రామునాజ్ఞ' మున్నగు ప్రయోగముల సామ్యమువలన 'రామునందు' అనికూడ ఏర్పడెను॥

హరి – అందు॥ ఇట్టియెడల మాత్రము నామాంశమునకు నష్టము కలిగింపక 'హరియందు' అనియే యగుచున్నది. 'అందు' అనునది ప్రత్యయత్వమును పొందినను ఇప్పటికిని స్వతంత్రపదముగా నుపయుక్త మగుచున్నది. 'అవ' యనునది మరొక ఆగమము. దీనికి పూర్వరూపముగా 'అగు' అను రూపము భారతమున కనిపించుచున్నది. అపదాద్యంబైన గకారమునకు వకారము కావచ్చును కనుక 'అవు' అను రూపముతో అనంతుడు వాడెను. "మూఁడవు పర్వము" మున్నగువిధముగా కాగా, విశేషణవిశేష్యములకు సంబంధమును దెలుపు 'అ' కార మొకటి సందు చేసికొని దూరియుండును. 'మూడవపర్వము' అని యగును. వ్యాకర్తలు మూడు, పర్వము అను శబ్దములను వేరుపరిచి నడుమనున్న 'అవ'ను ఆగమముగా చేర్కొనిరి. ఈ 'అవ' సంఖ్యావాచకములకు పూరణార్థమునం దగునపుడు కొన్నియెడల నిత్యముగను, కొన్నియెడ లవైకల్పికముగను సంధి జరుగును. రెండునుండి ఏడువర కున్న యంకెలు ఉదంతపదములు. కావున సంధి నిత్యము. ఎనిమిది, తొమ్మిది, పది యను పదములు ఇదంతములు. ఇచ్చట మాత్రము సంధి వైకల్పికము. ఒకటి అనునంకె ఇదంతమే యైనను సంధి నిత్యము. తమిళకన్నడములందు ఒన్ఱు, ఒందు అని ఉదంతరూపములే కలవు. తెలుగునకూడ ఒకఁడు, ఒండు అని ఉదంతరూపములును గలవు. 'ఒకఁడు' అను శబ్దము మీదనే ఆవగాగమమై 'ఒకడవ' యన్నట్లు నిత్యసంధి గలరూప మేర్పడియుండును. తరువాత మహదమహద్భేదము స్పష్టముగా లేక 'ఒకఁడు' అనుదానిని మహదర్థమునందును, 'ఒకటి' యను దానిని అమహదర్థమునందును వాడుచు వచ్చియుందురు. ఇప్పటికిని 'ఒకడు' అని అమహదర్థకముగా వాడుచుండుట గలదు. తొలుతటి 'ఒకడవ' యనునదియే అమహదర్థమును చెప్పవలసి వచ్చినప్పుడు 'ఒకటవ' యని మారియుండును. కావుననే ఇట సంధి నిత్యముగా జరుగుచున్నది.

# ఆగమాదేశ ప్రకరణము

వ్యాకరణమునందు ఆగమములనియు, ఆదేశములనియు కొన్ని యెడల కనబడును. ఆగమ మనగా వర్ణాధిక్యము. ఉన్న యక్షరము లన్నియు నుండగా, అదనముగా ఒక అక్షరముగాని, అక్షరసముదాయము గాని వచ్చి చేరుట ఆగమము. ఆదేశ మనగా ఉన్న యక్షరములలో నుండి ఒక యక్షరమునుగాని, అక్షరసముదాయమునుగాని తొలగించి తత్ స్థానమున మరొక యక్షరముగాని, అక్షరసముదాయముగాని వచ్చి చేరుట. వ్యాకర్తల దృష్టిలో ఇది సమంజసము. ప్రక్రియాసౌకర్యము, రూపనిష్పాదనసౌలభ్యము వారి కపేక్షితము. చారిత్రక దృష్టితో చూచి నప్పుడు ఇది అసంగతముగను, అసమంజసముగను అనిపించును. ఒక అక్షరమునకు మరొక యక్షరము పరముకాగా, దీనికిగాని దానికిగాని సంబంధింపని క్రొత్తయక్షరము ఆగమముగా గాని, ఆదేశముగా గాని వచ్చుటకు అవకాశము కనిపింపదు. అక్షరము లన్నియు ముఖయంత్రము నందుద్భవించును. నాలుకయందలి యొకభాగము (కరణము) నోటి లోపలి యొకభాగము (స్థానము)ను స్పృశింపగా (ప్రయత్నము) వేర్వే రక్షరము లుద్భవించును. కరణము, స్థానము, ప్రయత్నము - ఈ మూడింటి సహకారమున వర్ణసమామ్నాయము కలుగుచున్న దన్న మాట. కావున ఒక యక్షరమును పలికినవెంటనే మరొక యక్షరమును పలుకవలయు నన్న కరణస్థానప్రయత్నములందు భేదము కలుగవలయును. అదే యక్షరమును మరల పలుకవలయునన్నను, కరణమును యథాస్థానమునకు తీసికొని వచ్చి మరల తదనుకూలమైన ప్రయత్నమును చేయ వలయును.

## ఆగమములు

**ఆగమయవలు** : హరి - అతడు. మొదటిపదము చివరివర్ణమగు 'ఇ' తాలవ్యము. అనగా నాలుకకొన అంగిటిని తాకుటవలన ఈ వర్ణ ముత్పన్న మగుచున్నది. వెంటనే 'అ' వర్ణమును పలుకుట కష్టము. నాలుకను బల్లపరుపుగా అన్చిఉంచి, నాలుకయొక్క మొదటిభాగము

నుండి యుచ్చరింపవలయును. 'అ' వర్ణము జిహ్వామూలీయము. కావున మొదటి స్థానమునుండి తరువాతి స్థానమునకు కరణముయొక్క ప్రయత్నము మారునప్పుడు నడుమ నొకధ్వని జనించును. ఇట్టి దానిని ఆంగ్లమున glide అని యందురు. 'హరి' అను శబ్దము నందలి చివరి వర్ణము తాలవ్య మగుటవలన తాలవ్యమగు యకారమే glide గా అవతరించినది. పూర్వాక్షరప్రభావము కాని, ఉత్తరాక్షరప్రభావము కాని యిట్టిచోట పనిచేయవచ్చును. నా - ఇల్లు > నాయిల్లు. ఇచ్చట పరస్వరముయొక్క ప్రభావమే పనిచేసినది.

కాని, తెలుగున సంధి లేనియెడల స్వరముపై నున్న స్వరమునకు యకారమే నిత్యముగా విధింపబడినది. మా - ఊరు > మాయూరు॥ పూర్వవర్ణ మగు అకారము జిహ్వామూలీయము; పరవర్ణమగు ఊకారము ఓష్ఠ్యము. ఇక్కడ తాలవ్య మగు యకారమునకు ప్రసక్తిలేదు. ఐనను రెండచ్చుల నడుమ సంధి లేనప్పుడెల్ల యకారమునే విధించి సమత్వమును సాధింపవలయు ననియేమో, శాస్త్రకారులు ప్రయత్నించిరి. కాని వాడుక యందు ఆ విధానము సాగుటలేదు. శిష్టులు కూడ 'మావూరు' అనియే యుచ్చరించుచున్నారు. తరువాతి వర్ణ మగు ఓష్ఠ్యము ప్రభావమువలన దంతౌష్ఠ్య మగు 'వ' సహకారాక్షరము (glide) గా వచ్చినది. ఇది యీనాడుఆధునికుల యశ్రద్ధవలన కాక, ఆదికాలమునుండియు నున్నదే. అందువలననే వ్యాకర్త "యకారమును, వువూవొవోలును దెలుఁగు మాటలకు మొదట లేవు" అని హెచ్చరింపవలసి వచ్చినది.

తమిళమున సహకారాక్షరములుగా యకార వకారములు రెండు నంగీకరింపబడినవి. నన్నూల్ అను గ్రంథమునందు 'ఇఈఐ' వర్ణములకు పరమందు యకారమును, తక్కిన యచ్చులకు పిమ్మట వకారము నగు నని యున్నది. ఈ-ఇడై > ఈయిడై; కరి-అన్ > కరియన్; అల్ల - ఎన్టాన్ > అల్లవెన్టాన్; పలా-ఇన్ > పలావిన్.

కాని యీ విధానమునకు వ్యత్యయమును గలదు. యకారము రావలసిన తావున వకారమును, వకారము రావలసిన తావున యకారమును వచ్చుటగూడ జరిగినది.

మలయాళమున కేవలములయిన అత్వమునకు ఇత్వమునకు వకార మగును; దానికి ద్విత్వము వైకల్పికము. సంధి కానిచోట ఉత్వమునకు పరమందు 'వ' కారమును, తక్కినచోట్ల 'య' కారమును నగును.

కన్నడమునందు ప్రకృతిభావము విపులముగా గలదు. అట్లు ప్రకృతిభావము కలుగక, సంధియును కలుగకున్న స్థలములలో యకారము వచ్చును.

ఆ-ఎడె > ఆయెడె; సతి-ఇవళ్ > సతియివళ్. అకారమునకు ఓష్ఠ్యము పరమైన 'వ' యగును. ఆ-ఉదకం > ఆవుదకం. ఉఊఋఔలకు స్వరము పరమైన 'వ' కారములు కలుగును. కుడు-ఉదు > కుడువుదు; పూ-ఇల్లద > పూవిల్లద; పితృ-ఇవం > పితృవివం; గో-ఇందం > గోవిందం.

తెలుగున 'వ' కారము సంధి నాపుటకు వచ్చుట లేదని యనిపించినను, అది యథార్థము కాదు. గ్రంథస్థభాషలో పదాంతమునయందు యకారమువలె వకారము కనిపించని మాట నిజమే కాని పదమధ్యమున వకారము వచ్చు తావులు లేకపోలేదు.

ఇయంధేనుః-అనె > ఇయంధేనువనె. ఇచ్చట విసర్గలోపించిన పిమ్మట ఉత్వమును అత్వమును సన్నికర్ష పొందును. 'ధేను' లోని ఉత్వము నామాంశము కావున దానికి నష్టము కలుగరాదు; అనగా సంధి జరుగరాదు. కావున సంధి నాపుటకుగాను ఓష్ఠ్యముపై దంతౌష్ఠ్యమగు వకారము వచ్చుచున్నది. అప్పుడు 'ధేనువనె' అను రూపము కల్గుచున్నది. ఇది కేవలము అనుకరణమునందు మాత్రమే యగు కార్యముకాదు. ప్రాతిపదికార్థమునందగు 'ధేనువు'నకును అనుకరణమునందగు ధేనువునకును నిజమునకు భేదము లేదు.

'వధు' అను నామముపై ప్రథమావిభక్తి ప్రత్యయము 'ఉ' మాత్రమే కలుగగా సంధి నాపుటకు 'వ' కారము వచ్చినది. వధు - న్ - ఉ > వధువు. ఇట్లే ఉకారాంతములకును, గోశబ్దమునకును పరమగునది 'ఉ' మాత్రమే. వకారము ఆగమముగా నగును. తెలుగున

గల ముల్లు, పల్లు, వాక్కు, స్వరాట్టు మున్నగు శబ్దములలో చిట్టచివర నున్నది 'ఉ' మాత్రమే. అదియే తెలుగున ప్రథమావిభక్తి ప్రత్యయము. దానికి ముందున్న వకారము ఆగమమాత్రము; అనగా సంధి నాపుటకుగా వచ్చిన సహకారాక్షరము.

అట్లే ఇంచుగాగమమునకు ముందు కొన్నిచోట్ల వకారము సంధి నాపుటకు వచ్చినట్లు కనిపించును. కావించు, రావించు, మేళవించు మున్నగుచోట్ల ధాతువునందు వకారము వినిపింపదు. కా - ఇంచు > కావించు. కావున దీనిని సహకారాక్షరముగా అంగీకరింపక తప్పదు. కన్నడమున కూడ 'మేళవిసు' మున్నగువిధముగా వకార యుక్తములైన రూపము లున్నవి.

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు పదమధ్యమున కొన్నిచోట్ల 'గు, చు' మున్నగువర్ణములు లోపించుననియు, తత్ స్థానమున సంధి నాపుటకుగాను 'వ' కారము నిల్చుననియు తెలిపిరి. ఇట్టిది ప్రాకృతమున కలదు. అమృతం > అమిఅం; చతుర్థి > చఉద్ధి; చవుతి; చతుష్క > చఉక > చవుక. ప్రాకృతసమములందీకార్యము తెలుగునను కనిపించును. కాని చిగురు, తొగులు మున్నగుచోటులందలి అపదాద్య గ కారమునకు వకారము వచ్చుట యిట్టిది కాదేమో యనిపించును. శ్రీవజ్ఝలవారి దృష్టిలో చిగురు > చిఉరు > చివురు అని అయ్యెను. అట్లే 'గెలుచు' అన్నంతక్రియ యైనప్పుడు చకారము లోపించి సంధి నాపుటకు తత్స్థానమున వకారము రాగా 'గెలువన్' అని అయ్యెను. కాని దీని నిట్లే సిద్ధాంతము గావించుటకు ఇంకను గొంత ప్రయోగపరిశీలనము అవసరము. గకారము వకారమైనచో హల్లు లోపించి, వ్యవధానసంరక్షకముగా వకారము వచ్చినదనుట సులభమే. కాని వకారమునకు గకారము వచ్చు తావులుకూడ భాషలో లేకపోలేదు. ప్రవాళము > పవడము > పగడము॥ క్రియారూపములందు వకారమైనట్లుగనే, కొన్నిచోట్ల పకారమగును. తలచు-అన్ > తలపన్॥ ఇచ్చటి ప కారమును సంధి నాపుటకువచ్చిన దనుట పొసగదు కదా! ఇట్టిచోట్ల

నున్న పకారమును ఆగమము లేదా సహకారాక్షరముగా కాక ఆదేశ ముగా నెంచుటయే సమంజస మనిపించును. స్థానాదికసంబంధ మేమియు లేకపోయినను 'గవ' లు వ్యత్యయము నొందుట తెలుగుభాషకు లక్షణ మని తలచుట సమంజసము.

ఈవిధముగా చూడగా 'యవ'లు రెండును సంధి నాపుటకుగాను రెండచ్చులకు నడుమ వచ్చునని తేలినది. తెలుగున వచ్చు 'న' కార మును కూడ డా॥ కాల్డ్వెల్ సంధి నాపుటకు వచ్చు సహకారాక్షరము గానే నిర్ణయించెను. కాని ప్రయోగములను పరిశీలింపగా కొన్నిచోట్ల న కారము నామాంశముగను, కొన్ని చోట్ల అర్థవంతమగు ఆగమము గను స్పష్టమగును. కేవలముచ్చారణ సౌకర్యమునకును, సంధినాపుట కును వచ్చెననుట సమంజసము కాదు.

ఆగమ నకారము "ద్రుతాఖ్యో నః" యని ఆంధ్రశబ్ద చింతా మణి. దాని ననుసరించియే చిన్నయసూరి "నకారంబు ద్రుతంబు" అని సూత్రించెను. దీనిని సవరింపబూనియో, వివరింపబూనియో "నకారం బసాధారణంబు ద్రుతంబు" అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త "ప్రత్యయాగ మాన్యతరాత్మకమై యుత్వవిశిష్టమైన నకారంబు ద్రుతసంజ్ఞకం బని యర్థ" మని విశదీకరించెను. సూరికూడ ప్రకృతిభావమును విధించు నపుడు ఉత్వవిశిష్ట మైన నకారమునే తెలిపెను. కావున సూరి మతమున కూడ 'ను' యే ద్రుతము. అయినచో 'నకారము' అనిచెప్పుట యేల? అను ప్రశ్న యుదయింపవచ్చును. దానికి కారణము గలదు. ఇకారము మీది 'ను' 'ని'గా మారిపోవును. అట్లే హలవసానములు పరమగునపుడు ద్రుతమునకుగాని, ద్రుతస్వరమునకుగాని లోపము కలుగవచ్చును. కాబట్టి 'ను' అను ఒక రూపమునుండి రూపాంతరములుగా ఏర్పడు 'న్,ని' అను రెండును ద్రుతములే. అటుగాక ఉత్వవిశిష్టమైన 'ను' అనునదియే ద్రుత మనుచో అవ్యాప్తికలిగి 'న్,ని' అను రెండును ద్రుతసంజ్ఞాకములు కాక పోవలసివచ్చును. కావున చింతామణి మార్గము, తదనుసారి సూరి మార్గము ప్రశస్తములై యున్నవి.

ద్రుతమును జిట్టచివర గల శబ్దములు ద్రుతప్రకృతికములు. ద్రుత ప్రకృతికములకు పరమం దచ్చున్నచో, ద్రుతము తరువాతి అచ్చుతో సన్నికర్ష పొందును. "ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు" అని సూత్రము. అనగా ద్రుతము లోపము నొందదని యర్థము. "ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునది" అని బహుజనపల్లి వారు వివరించిరి. కాని, యిది సర్వథా సత్యము కాదు. అవసానమునందు కాని, సరళస్థిరములు పరములగునపుడు కాని లోపింపవచ్చును. పరుషాదులు పరములగునపుడు పూర్ణార్థబిందువులుగ పరివర్తనము నొందుటో, మీదిహల్లుతో సంశ్లేషము నొందుటో జరుగును. 'ఉన్నాను' మున్నగుచోట్ల ద్రుతమునకు లోపము లేదన్న సంగతి గమనార్హము. కావున ఇక్కడ మఱగిపోవుట అను ప్రసంగము లేనేలేదు. కొలను, చేను మున్నగు శబ్దములలోని అంతిమనకారమునకును ద్రుతనకారమునకును భేదము గలదు. శబ్దగత నకారము ద్రుతనకారమువలె మార్పాటులకు లోనుకాదు. నేను, తాను, కన్ను శబ్దములలోని ఆంగిక నకారమును వ్యాకర్తలు ప్రక్రియాసౌలభ్యమునుగోరి ద్రుతముగనే పరిగణించిరి. ఇంతవరకు ద్రుతాంతములు. మిగిలిన వానిని కళలు అని యందురు. కళలకు పరమందు అచ్చులు వచ్చినయెడల సంధియగుటయో, పూర్వము చెప్పికొన్నట్లు యడాగమము కలుగుటయో జరుగును.

వజ్ఝలవారు కేవలము పొల్లునకారమే ద్రుత మని నన్నయ మతముగా నిర్ధారించిరి. పొల్లునకారమే యైనను, ని,ను,న్ – అను మూడు విధములగు నకారమైనను ప్రయోజనము మాత్రమొక్కటియే. నేను – అరసితిని > నేనరసితిని. ప్రాచీనరూపము 'నేన్' అనియే యుండి, తరువాత ఉదంతత్వమును పొందెను. అందువలన ఉత్వమునకు లోపము కలిగినను నష్టములేదు. నకారము ద్రుతము. అది తరువాతి యచ్చుతో సన్నికర్ష పొందును. కావున ఇచ్చట నున్న నకారము నామాంశమే కాని సంధి నాపుటకు వచ్చిన యాగమము కాదని నిశ్చితముగా చెప్ప వచ్చును. తెలుగున పెక్కుపదములకు చివర నిట్టి 'న'కారము గలదు. దానిని వ్యవధానసంరక్షకముగా నెంచుట తగదు.

షష్ఠీతత్పురుషమునం దుకార ఋకారములకు అచ్చుపరమగునపుడు నుగాగమ మగును. ఇదికూడ ప్రకృతిభావ నివారణకే వచ్చునని కొందర యుద్దేశము. రాజు - ఆనతి > రాజునానతి. కాని ఇక్కడి 'ను' అట్టిది కాదు. రాముని (యొక్క) - ఆనతి > రామునానతి అనియైనప్పటివలెనే విశేషణ విశేష్యములకు నడిమిసంబంధమును 'ని' యన్నది స్థిరీకరించు చున్నదనుట నిశ్చయము ఇట్లే. 'అనునతఁడు' మున్నగుచోట్ల తద్ధర్మార్థకములకు అచ్చు పరమగునప్పుడైన నకారము కేవలాగమము కాదు. 'అనును' అని తెలుగున తద్ధర్మార్థకము. దీనినే క్రియావిశేషణముగా, విశేష్యమునకు పూర్వమందు వాడుదురు. వ్యాకర్తలు ఇక్కడి 'ను' వర్ణమును ఆగమముగా పేర్కొన్నను పైయుదాహరణమునుబట్టి ఆంగికమని గ్రహించుట కష్టము కాదు అట్లే. చిగురుఁగైదువు, తెల్లఁదనము మున్నగుచోటులందలి ద్రుతముకూడ విశేషణ విశేష్యసంబంధమునే నిరూపించును. తమిళమున నిట్టియెడల సాధారణముగా మీఁదిహల్లునకు ద్విత్వము కలుగుచుండును.

సముచ్చయార్థకమగు 'ను'వర్ణముకూడ ద్రుతమే. ఉదంతరూపములపై కేవలము 'ను' మాత్రమే వచ్చి, తక్కిన వానిపై 'ఉను' అని వచ్చును. రాముఁడును లక్ష్మణుఁడును; సిరియును హరియును.

సముచ్చయార్థకము 'ఉను' అనునదియే, ఉదంతములపై వచ్చినప్పుడు పూర్వమున్న ఉత్వముతో ఉత్వము సంధినొంది 'ను' మాత్రమే కన్పించుచున్నది. కావున 'ను' అనునదియే సముచ్చయార్థకమను భ్రమ కలుగుచున్నది. దీనిని సముచ్చయార్థకమని పిలుచుకొంటిమి కాన, కేవలము ప్రకృతిభావనివారణమునకు కాక, స్వప్రయోజనముగనే ఇది తెలుగున నున్నదనుట సమంజసము. తమిళకన్నడములందుకూడ 'ఉమ్' అని మకారాంతముగా సముచ్చయార్థకము కలదు. అదియే తెలుగున నకారాంతముగా పరిణామము నొందియుండును. ఈనాఁడు వాడుకయందు 'రాముడున్ను కృష్ణుడున్ను' అన్నట్లుగా ద్విత్వయుక్తముగా కూడనున్నది. నకారోచ్చారణమును భద్రముగా కాపాడవలయు నను

ప్రయత్నమే దీనికి కారణము కావచ్చును. కన్ను, పల్లు మున్నగుశబ్దముల జడ్డకు వైకల్పికముగా లోపము రావచ్చును; చివరి ఉత్వముకూడ లోపింపవచ్చును. కను, కన్; పలు, పల్ అను రూపములు సిద్ధించును. ఊనిక తొలియక్షరముమీదనే కలదు; వీనికి పరమం దచ్చున్నచో నలలకు లోపము చేయరాదని వ్యాకర్తల నిషేధ మున్నది. కన్/కను-అదత్తె; పల్/పలు-ఒత్తె॥ అన్నట్లుండరాదు. ఈ విధముగా సంధిచేయుట తటస్థించునెడల మొదటిపదముపై అసలు ఊనిక యుండనేయుండక, రెండవపదము మొదటియచ్చుపై నిలుచును. అప్పుడు వర్ణపదభ్రంశమున కవకాశము కలదు. కావున తొలిపదము తొలియక్షరముపై కూడ ఊనికను నిలుపుట చాల యవసరము. ద్విత్వమునకు లోపము చేయనియెడల ఊనిక నిల్చును. కన్నదత్తె; పల్లొత్తె॥

ఇట్లే సముచ్చయార్థకమందలి ద్రుతమునుకూడ నిలుపుటకుగాను ఉత్వమును ద్విత్వమునుగూడ వాడుకలో వచ్చి యుండును. వాడుకలోనే యనుట యేల? స్థిరత్వమును సంపాదించుకొనక పోయినను గ్రాంథికభాషయందుకూడ ఈ లక్షణము లేకపోలేదు. అన్-ఇష్టసఖః> అన్నిష్టసఖః; సర్వమున్ - అతని>సర్వమున్నతని॥

ఆంగికమైన నకారముకూడ అచ్చు పరమగునపుడు కొన్నియెడల నకారమును పొందుచున్నది. పెన్-ఉరము>పెన్నురము॥ ఇదికూడ నామాంశమునకు నష్టము కలుగకుండ, ఊనికను నిల్పుటకు వచ్చిన నకారమే.

ప్రాతాదికార్యములయందుకూడ నుగాగమము కలుగును. ఇది వ్యాకర్తల విధానము. కాని చారిత్రకదృష్టితో చూచినప్పుడు 'ను' వర్ణము ఆంగికమే కాని ఆగమముకాదని తెలియును. 'ప్రాత - కెంపు' అను రెండుశబ్దములు 'ప్రాగెంపు'గా మారెనని వ్యాకరణము తెల్పును. కాని తమిళమున నున్న 'పటజ్జెంబు' మున్నగురూపములనుబట్టి 'ప్రాత' యను శబ్దమునకు 'పటిన్' అను నొకరూప ముండెనని యూహింప నగును. 'మరన్' అను శబ్దము 'మ్రాను' అని తెలుగున నైనట్లు,

'పటం' 'ప్రాన్' అని అయియుండును. ప్రాన్-కెంపు>ప్రాఁగెంపు అని యగును. ప్రాన్-త అనునది తరువాతి కాలమున అర్థవిశేషమున నేర్పడి, క్రమక్రమముగా విశేషమును కోల్పోయి యుండును. ఇట్లు చాలశబ్దము లందు నామాంశముగా నిల్చినను కొన్నిచోట్ల కేవలసామ్యము (analogy )ను పురస్కరించుకొని 'నకారము' కలిగియుండును. పూఁదోఁట; సంగోరు॥ ఇంతేకాక మూలమున బిందువులేని యనేకశబ్దములు తెలుగున బిందుమంతములై కనిపించుచున్నవి. ఇంక విశేషణ విశేష్యముల సంబంధమును నెలకొల్పుటకుకూడ నకారము కలుగవచ్చునని యిది వరకే చూచితిమి.

శతృతుమానంతర్య చేదాద్యర్థకములును ద్రుతప్రకృతికములు. వీనియందు ఒక్క- శత్రర్థమందలి నకారమునకు తప్ప దేనికిని సంధి చేయరాదు. శత్రర్థకవిషయ మిత్వసంధివిషయమున పరిశీలించితిమి.

కావున, ఇంతవరకు చూచినదానినిబట్టి నకారము 'యవ'లవలె ప్రకృతిభావనివారణముకొరకు మాత్రమే కాక, ప్రత్యేక ప్రయోజనము కొరకు సైతము వచ్చునని స్పష్టము కాగలదు. కొన్నిచోట్ల ప్రకృతిభావనివారణమునకును రావచ్చును. దీనినిబట్టియే కొందరు నకారమును కూడ వ్యవధానసంరక్షకముగానే పరిగణించిరి. కొన్నిచోట్ల నకారమును జేర్చుట అలవాటుపడిన పిమ్మట, అజ్ఞాతముగా కొన్నిచోట్ల నుపయోగించుట జరుగును. కొన్నిచోట్ల ద్రుతముపై ద్రుతమును జేర్చుటయు జరిగినది. దివంబునుంబోలె; అడియునుంగాక॥

మొత్తముమీద ఈ ద్రుతనకారము నామాంశముగను, ప్రత్యేకార్థబోధకముగను, విశేషణవిశేష్యసంబంధనిర్ధారకముగను; కొన్నిచోట్ల మాత్రము వ్యవధానసంరక్షకముగను తెలుగుభాషయందు కనిపించుచున్నది.

**ఆగమ రకారము** : "కర్మధారయంబునఁ బేదాది శబ్దముల కాలుశబ్దము పరమగునపుడు రుగాగమం బగును" అని సూత్రము॥ పేద-రు - ఆలు > పేదరాలు.

ఇచ్చట వచ్చిన రకారము తెలుగున సాధారణముగా బహువచనమున వచ్చు రకారము వంటిదే. వారు; అందఱు; అల్లుడు; నృపాలురు॥ 'పేద - వారు' అనునదియే 'పేదరు' అయి, తరువాత ఆలుశబ్దముతో సమసించియుండును. పేదలకు చెందిన స్త్రీ యని యర్థము. ఇటుకాక పేదవానియొక్క భార్యయను నర్థమున 'పేదయాలు' అనియే యగును. 'పేదరు' అనునది, సమూహార్థకముగా, బహువ్యక్తులను బోధించును. 'కోమరు' అనగా అందము. దానికి 'ఆలు' చేరగా 'కోమరాలు' అయి అందముగల స్త్రీని బోధించును. ఇట్టివానినిజూచి అనుచిత విభాగముమూలమున గొడ్డు, జవ, బాలెంత మున్నగు శబ్దములకు చివర రకారప్రసక్తి లేకపోయినను '-రాలు' అని చేర్చుట సాగించియుండిరి. అంతేకాదు. శ్రీమంతుఁడు; ధీమంతుఁడు మున్నగు శబ్దములలో పురుష వ్యక్తిని బోధించునది చివరనున్న 'డు' వర్ణము. కావున దానిని తొలగించి తమదృష్టిలో స్త్రీబోధకమైన '- రాలు' తగిలించి శ్రీమంతురాలు, ధీమంతురాలు అనికూడ మహతీవాచకరూపములను వాడుట మొదలుపెట్టిరి. వ్యాకర్తలు కడపటిశబ్దము 'ఆలు' అని తెలిసికొని, నడుమనున్న రకారమును ఆగమముగా పరిగణించిరి. తత్సమములందు అత్వమునకు ఉత్వముకూడ వచ్చునని విధించిరి. కాని యీ ఉత్వము పుంలింగమహద్వాచకములకే కలిగి, అనుచితవిభాగమువలన ఏర్పడిన 'రాలు' శబ్దమును చేర్చునప్పుడుకూడ అట్లే నిలిచిపోవుచున్నది.

పొదరిల్లు మున్నగుచోట్ల పూర్వపదము 'పొద' యని యనిపించును. కాని భాషలో 'పొదరు' అను శబ్దముకూడ సమానార్థకముగా కలదు. తమిళభాషలో కూడ 'పుదర్' అను శబ్దము కలదు. ప్రాచీన రూపమగు 'పొదరు' పూర్వపదముగా 'పొదరిల్లు' ఏర్పడియుండును. 'పొద'యే పూర్వపదమను భ్రాంతితో కొందఱు రకారమును ఆగమముగా పరిగణించిరి. 'పొదరుటిల్లు' అను టుగాగమరూపముకూడ దీనినే నిర్ధారించుచున్నది.

గంగిరెద్దు. చిచ్చు(చ్చ)ఱకన్ను మున్నగుచోట్ల సైతము రకారము కనిపించుచున్నది. తేజరిల్లు, ప్రజ్వరిల్లు మున్నగు క్రియాపదములలో కూడ రకారము సందుచేసికొన్నది. నిలువరించు; నెప్పరించు; చప్పరించు; నిబ్బరించు మున్నగు తెలుగు క్రియలందలి రకారముసామ్యమున పై వానియందును రకారము కలిగెనేమో!

ఆగమటుకారము : కర్మధారయమున నుదంతముల కచ్చు పరమగునప్పుడు టుగాగమం బగునని సూత్రము; అట్లే పేర్వాదిశబ్దములకు వికల్పముగా నగు. కఱకు - అమ్ము > కఱకుటమ్ము; సరసపు - అలుక > సరసపుటలుక॥ పేరు - ఉరము > పేరురము/ పేరుటురము; పొదరు - ఇల్లు > పొదరిల్లు/ పొదరుటిల్లు.

వీని యన్నింటియందును పూర్వపదమునందలి చివరి ఉత్వమును నిలుపుటకొరకు టుగాగమము వచ్చినట్లు కనిపించును. పేర్వాదులలోని చివరి ఉకారమునకు లోపముచేసి తెలుగునకూడ వాడుట యున్నది. కావున అట్లు లోపమువచ్చియు, లోపము రాక టుగాగమము కల్గియు రెండు రూపము లేర్పడుచున్నవి. ఈ 'టు' అనునది 'అదు' అను అమహత్తచ్ఛబ్దరూపాంతరమే. ద్రావిడభాషలందు విశేషముల కడపల తచ్ఛబ్దము నిల్చుట సంప్రదాయము. నీ, నా, తనలకు దుగాగమము వచ్చును. నీదు కరుణ; నాదు చెలిమి; తనదు మహిమ. ఇట్టియెడల 'అదు'యొక్క అవశిష్టమగు 'దు' ఆగమముగా నగుచున్నదనుట నిర్వివాదము. ఇక్కడకూడ 'పేర్ - అదు - ఉరము' అని యుండగా 'అదు' లోని నాదాక్షరము శ్వాసాక్షరముగ 'టు' గా మారినది. పత్తనము> పట్టణము అనువిధముగా తకారము టకార మగును. పేర్ - అదు - ఉరము > పే(ర)టురము॥ అని యైయుండును.

తొలుసంటి పలుకులు; పిన్నటి వయసు - మున్నగు కర్మధారయము లందలి 'టి' వర్ణముకూడ ఇచ్చటి టుగాగమమునకు రూపాంతరమే కావలయును.

కొందరు కఱకుటమ్ము మున్నగుచోట్ల ఔపవిభక్తిక టివర్ణమే వచ్చుచున్నదని యందురు. ఔపవిభక్తికములు నామములకు ద్వితీయా ద్యేకవచనము పరమగునప్పు డగును. కర్మధారయమునందు పూర్వ పదము ప్రథమావిభక్త్యంతముగ నుండును. కనుక 'అదు' యొక్క అవ శిష్టరూపమే రూపాంతరము నొంది ఆగమముగా నిల్చుననుట సమంజస మనిపించును. మిద్దెటిల్లు, దుక్కిటెద్దు మున్నగుచోట్ల అనుదంతములపై కూడ టుగాగమము కలుగుచున్నది.

ఇగాగమము : సమాసమునందు చేత, తోడ, వలనల కిత్వం బగును. అత్వమువలెనే ఇత్వముకూడ కొన్నిచోట్ల పూర్వపరశబ్దములకు సంబంధమును సాధించును. నాచేత - ప్రోపు > నాచేతి ప్రోపు. అనగా నాచేతియొక్క ప్రోపు అనియే అర్థము. దొంగవలని భయము అని యనగా దొంగవలనున కలుగు భయము అనియే యర్థము. కావున ఇక్కడి ఇత్వము సప్రయోజన మనియే చెప్పవలయును.

అంద్వాదులకు అలి యనునది ఆగమముగా నగును. అందు అనుశబ్దముపై అల్ అను సప్తమ్యర్థకము నిల్చును. దానిపై తద్వ్యాతి శబ్దముతో సంబంధమును సాధించుచు ఇత్వము నిలిచినది. అందు-అల్-ఇ > అందలి॥ డుమంతమునకు ద్వితీయాద్యేకవచనము పరమగునప్పుడగు 'నిగాగమము' కూడ ఇకారమాత్రమే. అవన్-ఇ > వాని; రామన్-ఇ > రామ(ము)ని; మగన్-ఇ > మగని॥ కావున తెలుగునందు సంబంధ బోధకముగా ఏకవచనమున 'ఇ' కారమును, బహువచనమున 'అ' కార మును వచ్చుచున్నవనుట యథార్థము.

ఇట్లే ఔపవిభక్తములయందలి ఇత్వముకూడ దీనినే నిరూపించును. 'ఊరివాడు' అనునప్పుడు ఉన్న యిత్వము వంటిదే 'ఊరియందు' అన్నప్పుడున్న యిత్వము కూడ. అరవమున సప్తమ్యర్థమున 'ఇల్' అని కలదు. 'ఆఱ్' అనగా ఏఱు అని యర్థము. 'ఏటియందు' అను నర్థ మున 'ఆఱ్-ఇల్ > ఆట్రిల్' అని యగును. ఇట్టిచోట్ల నున్న 'టి'వర్ణమే తెలుగున నౌపవిభక్తిక మైనది. 'మర త్తిల్' అనగా 'చెట్టునందు' అని

యర్థము. అనుచితవిభాగమువలన 'టి'వలెనే 'తి' కూడ ఔపవిభక్తిక మైనది. 'ఇల్'యొక్క అవశిష్టమే 'ఇ' వర్ణ మనియు, అదియే సంబంధార్థమున ఏకవచనమున తెలుగున నగుచున్నదనియు, ఔపవిభక్తికములకు కూడ అదియే మూలమనియు సిద్ధాంతము.

## ఆదేశములు

పుంప్వాదేశము : 'అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకం బగు' నని తత్సమనామములకు మువర్ణకము విధించుట కలదు. తెలుగుశబ్దములుకూడ కొన్ని ముకర్ణకాంతములు గలవు. వీని ప్రాచీన రూపములను శాసనములందు చూడగా 'రాజ్యమ్బు' సాసనవు కయ్యమ్బు, క్రమబు' మున్నగువిధముగా కనిపించుచున్నవి. తెలుగున 'పాము' అని యుండగా సమానార్థమున అరవమున 'పామ్బు' అనియు, కన్నడమున 'హావు' అనియు రూపములు గలవు. తెలుగున నున్న 'ము' అరవమునందలి 'మ్బు', కన్నడమునందలి 'వు' వర్ణములతో సమాన మైనది. శాసనములనుబట్టికూడ అవి పర్యాయము లనియే తేలుచున్నది. 'ముభక్తియతి' యందు పుపుబుభులను ముప్రత్యయమునకు మిత్రాక్షరములుగా చెప్పుటలోని సామంజస్యము కూడ నిదియే. కావున వృక్షము, వృక్షమ్ము, వృక్షంబు, వృక్షంపు, వృక్షపు – మున్నగు విధముగా ప్రథమావిభక్తియందు పెక్కురూపము లుండవచ్చును. 'మాయు' అను క్రియాధాతువు విశేష్య మగుటకు 'పు'అను కృత్ప్రత్యయమును బొంది 'మాపు' అని యగుచున్నది. ఇట్లు కృత్ప్రత్యయముగా నున్నదికూడ ప్రథమావిభక్తి ముకర్ణమునకు రూపాంతరమే. పువర్ణమే ప్రాచీన మనియు. ముకర్ణము సంస్కృత నపుంసకశబ్దముల సామ్యమున అర్వాచీనకాలమున నేర్పడె ననియుకూడ భాషాశాస్త్రిల యభిప్రాయము.

కర్మధారయములందు ముకర్ణకమునకు 'పుంపు' లగు నన్నప్పుడు వ్యాకరణపద్ధతి ననుసరించి పూర్వశబ్దము తుదనున్న ముకర్ణకము లోపించి, తత్ స్థానమున 'పు' వర్ణముగాని, పూర్ణబిందుపూర్వక 'పు'

వర్ణముగాని ఆదేశముగా నగును. చారిత్రకదృష్టితో చూచినప్పుడు ఒకటి పోవుట మఱొకటి వచ్చుట యన్నదేమియు లేదని తెలియును. 'దురుసుమాట' మున్నగుసమాసములం దేవిధముగా రెండుమాట లొకదానిప్రక్క నొకటి చేరెనో, అట్లే 'సరసపువచనము' అన్నప్పుడుకూడ ఏ మార్పును లేకుండ రెండుమాట లొకదాని ప్రక్క నొకటి చేరెను. 'సరసపు' అనునది కేవలము ప్రథమా విభక్త్యంతము. ప్రాచీనశబ్దముల సామ్యమున, అనంతరకాలమున కూడ నీశబ్దమునందు 'పు' వర్ణకమే నిలుచుచున్నది. అట్లని 'కయ్యముపస' 'మొగమందము' మున్నగు మువర్ణకాంతరూపములతోడి కర్మధారయములు లేకపోలేదు; అనగా, అర్వాచీనకాలమున 'పు' వర్ణవిధి వైకల్పిక మయ్యెను. మువర్ణకాంతత్వమే ప్రచురమగుట దీనికి కారణము.

ద్విరుక్తటకారము : ద్రావిడభాష లన్నింటియందును సాధారణముగా పదాంతములయిన ఱ, డ లకు అచ్చు పరమైనచో ద్విత్వమగును. ఱకారము టవర్ణ తవర్ణములకు నడుమగా నుచ్చరింపబడును. దీనికి ద్విత్వము కలిగినప్పుడు అలఘురకారోచ్చారణమును కలిగియుండును. తెలుగున ఈ ఱకారద్విత్వము టకారద్విత్వముగా పరిణామము నొందినది; కన్నడమున కొన్నిచోట్ల తకారద్విత్వముగా కూడ పరిణమించినది. కఱు – ఉయిర్ > కట్టుయిర్; చిఱు – ఎలి > చిట్టెలి॥ మున్నగువిధముగా అరవమున రూపనిష్పత్తి యగును. నడు–ఇరుళ్ > నట్టిరుళ్; కిఱు–అడి > కిత్తడి॥ అన్నట్లు రెండు విధములుగా కన్నడమున నగును. హల్లు పరమగునప్పు డీమార్పు కలుగదు.

తెలుగునకూడ కఱు. కడు మొదలగు ఱకారడకారాంతముల కచ్చు పరమగునప్పుడు ద్విరుక్తటకార మగుచున్నది. కఱు – ఉసురు > కట్టుసురు; చిఱు – ఎలుక > చిట్టెలుక॥ హల్లు పరమగునపుడు 'కడు బెడద' మున్నగు విధముగా ద్విరుక్తటకారరహితరూపములే యగును.

ప్రౌఢవ్యాకర్త 'చిట్టెలుక' మున్నగు సమాసములందు 'చిట్టి' యనునదే పూర్వశబ్ద మని యభిప్రాయపడెను. కాని అన్నిచోట్ల నిట్లు

చెప్పుటకు వీలు కాదు. అంతే కాక, తెలుగునందలి సమాసమునుబట్టి అనుచితవిభాగమువలన నిట్టి శబ్దము లేర్పడిన నేర్పడి యుండవచ్చును.

ఆమ్రేడితంబు పరంబగునప్పుడు కడాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల ఆదంతం బగు ద్విరుక్తటకారం బగును. కడ-కడ> కట్టకడ; పగలు-పగలు> పట్టపగలు॥ నున్నగుచోట్ల పునరుక్తి భృశార్థమున కలిగినది. ఒకే మాటను పునరుక్తము చేయునెడల, అందును నన్నియు లఘువులే యైనప్పుడు, క్లేశమెక్కువ; ఉచ్చారణ వేగమున కొన్ని యక్షరములు జారిపోవుట కూడ తటస్థించును. క్లేశమును పరిహరించి, ఉచ్చారణమున సుస్థితిని సాధించుటకుగాను ఉత్తరపదము ప్రారంభమునకు ముందరి యక్షరమును ఊనికతో పలుకుట యవసరము. అట్లు పలుకగా ఆద్యంతవర్ణములపై నూనిక యుండుట వలన నడిమివర్ణములకు నష్టము వాటిల్లవచ్చును. అట్లు నష్టము కలిగినప్పటికిని, ఆమ్రేడిత మున్నది గనుక, అర్థగ్రహణమున కష్టము కలుగదు. బయలు-బయలు> బట్టబయలు॥ పూర్వపదమునందు నున్న 'య' కారము స్రస్థమైనది; ఐనను పరపద మర్థగ్రహణమున సహకరించును. ఇందలి పదముల చివర సాధారణముగా డ,ల,ట,ర వర్ణములు గలవు. వీనికి ద్విత్వము కలుగగా టకారోచ్చారణమే కలుగుట ద్రావిడభాషాసంప్రదాయము. ఇటుగాక తెలుగున 'పిడుగు' మొదలయిన శబ్దములు అన్యవర్ణాంతములైనను అరవమందు 'ఇడి' యున్నగు విధముగనే యున్నవి. కావున 'కట్టకడ' మున్నగునవి ప్రాచీన రూపము లనియే తలపవచ్చును. వానిని చూచి అర్వాచీన కాలమున సామ్యప్రభావమున కొన్నిరూపముల నేర్పరిచి యుందురు. చిలుకూరి నారాయణరావుగారు ఇట్టిచోట్ల నున్న 'కట్ట' మున్నగువానిని స్వతంత్రపదములుగానే భావించిరి. కొన్నింటిని అట్లు విడదీయుటకు వీలున్నను, దానిని సిద్ధాంతీకరించుట కవకాశము చాలదు. కన్నడమున 'తుత్తతుది, మొత్తమొదలు' అను విధముగా తకారద్విత్వ రూపములు గలవు. కడె - కడె > కట్టకడె॥ అను విధముగా టకార ద్విత్వ రూపములుకూడ కలవు.

అందదుకులు : 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యములు' అని సూరి సూత్రించెను. ఇదియు ఆమ్రేడితవిధికి సంబంధించినదే. తుముకు - తుముకు > తుత్తుముకు॥ ఇచ్చట రకారము ద్విత్వము నొందినది. తరువాత నున్న 'త'కారముతో సమీకరణము నొందుటవలన 'తుత్తుముకు' అని యైనది. చెల్లచెదరులు, ఇల్లిగ్గులు మున్నగుచోట్ల పూర్వపదము చిట్టచివరి వర్ణమునకు ద్విత్వము కలిగి, దానికి తక్కినయిన నడిమియక్షరములు జారిపోవుటచేత ఏర్పడిన రూపములు. ఇవి అర్వాచీనరూపము లగుటచేత, వీనికి టకారోచ్చారణము కలుగలేదు. మిఱుమిట్లు, అందదుకు మున్నగువాని రూపనిష్పత్తి భిన్నముగా కన్పట్టును. వీనిని ఆమ్రేడిత కార్యమునకు విషయముగా గ్రహించుట ఉచిత మనిపింపదు. 'మిట్లు' అను స్వతంత్రశబ్దము కానరాదు. మిట్ట, మిట్టిపడు మున్నగురూపములు గలవు. ఏమైనను ఇది 'దరిదాపులు' అను శబ్దమునలె నేర్పడియుండిన నుండవచ్చును. 'మిఱు - మిట్లు' ఎత్తు మీదికి చూచుటవలన కన్నులు చెదరుట అని యర్థము కావచ్చును. అదియే మిక్కిలి కన్నులు చెదరుట అని రూఢిని సంపాదించుకొని యుండును.

అద్దు, అదుకు అను రెండు శబ్దములు నొకే యర్థమున గలవు. అద్దునకు 'అరుందు' అను రూపమును గలదు. నడిమి 'ర' కారమునకు లోపము కలుగగా 'అందు - అదుకు' అని యేర్పడి 'అందదుకు' ఐయుండును.

'ఇంకు' అను దానికి 'ఇరుంకు' అనునది ప్రాచీనరూపము. భృశార్థమున కేవలము బహువచనప్రత్యయము 'లు' వచ్చి చేరి 'ఇరుంకులు' అని యైయుండును. పూర్వస్వరాక్షరమువలన 'రు' 'రి'గా మారి 'ఇరింకులు' అయి దానికొరకు ద్విత్వము వచ్చి 'ఇఱ్ఱింకులు' అని యైయుండును. తెలుగున 'ఇరుకు' అను శబ్దముకూడ కలదు. వజ్ఝలవారు 'ఇరికించుటచే ఇంకుట' యను నర్థము గ్రహించి ఇరుకు - ఇంకు > ఇఱ్ఱింకు॥ అయ్యెనని అభిప్రాయపడిరి. 'ఇఱ్ఱింకులు' అనుచోట నున్నది రెండుకే

శబ్ద మనియు, ఆధిక్యమును జెప్పుటకు బహువచనము నెనసెననియు భావించుట సమంజస మనిపించును.

(4) గసడదవాదేశము 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు' నని సూరి సూత్రీకరించెను. ఉక్తార్థమునందును, ప్రాతిపదికార్థమునందును, సంబోధనమునందును ప్రథమ యగును. గోడ, బల్ల - మున్నగువాని చివర ప్రథమాప్రత్యయము కనిపింపకున్నను, అవి ప్రథమాంతములే. అట్లే అప్పుడు, ఇప్పుడు - మున్నగునవికూడ ప్రథమాంతతుల్యములే. వీని నన్నింటినిబట్టి చూడగా కళలగు పదములపై నిల్చిన పరుషములకు గసడదవలు బహుళముగా నగునని తేలును. కళలగు క్రియాపదములపై నిగూడ ఈ కార్యము జరుగవచ్చును. వాఁడు - కొట్టెను > వాఁడు గొట్టెను/ వాఁడు కొట్టెను; రారు - కదా > రారుగదా/ రారుకదా.

ఇందు నాదములతోడి రూపములే ప్రాచీనములు. పరుషములతోడి రూపము లర్వాచీనములు. ద్వంద్వమునందు మాత్రము పదముమీఁది పరుషములకు గసడదవాదేశము నిత్యముగా నగును. తల్లి - తండ్రి > తల్లిదండ్రులు.

ద్రావిడభాషలందు తొలుత పరుషములే కాని సరళములు లేవు. ఈ స్థితి తమిళమునం దధికముగా కలదు. ఒకే యక్షరమును పదాదిని పరుషముగను, తక్కిన స్థానములందు సరళముగను పలుకుదురు. ద్విత్వాక్షరమైనచో పరుషముగనే పలుకుదురు. తెలుగున సంస్కృతసాహచర్యము అధికమగుటవలననేమో పరుషసరళములకు స్పష్ట మగు లేఖనము కలదు. ఐనను ప్రాచీనసాంప్రదాయము మాత్రము పూర్తిగా విడువలేదు. పదమునకు పైని వచ్చిన పరుషములు గసడదవ లగుచున్నవి. అచ్చునకు అచ్చునకు నడుమ పరుషములను పలుకవలసి వచ్చునప్పుడవి నాదము లగుట యిందులకు కారణము.

తమిళమున 'చ' కార మొక్కటియే 'శ' కారముగా కూడ పలుకబడును. చవర్ణము తాలవ్యస్పర్శము, శవర్ణము తాలవ్యోష్మము.

సవర్ణము దంతోష్ఠ్యము. ఊష్మత్వసామ్యమున శవర్ణము సవర్ణముగా మారుచుండును. తెలుగున కూడ నట్లే నాదత్వము కలిగినపుడు చవర్ణము జవర్ణము కాక 'సవర్ణము'గా మారుచుండును. అక్క-సెల్లెండ్రు॥ పకారము ఓష్ఠ్యము. దీనికి నాదత్వము కలిగినపుడు బకారము కావలయును గాని దంతోష్ఠ్యముగు 'వ'కారముగా మారుచుండును. ॥ఊరువల్లెలు॥

ద్రావిడసంప్రదాయమునుబట్టి యేర్పడిన యీ మార్పు తెలుగు శబ్దములకే యన్వయింపవలయును. అందువలననే వ్యాకర్తలు 'తెనుంగులమీఁది సాంస్కృతికపరుషములకీ కార్యము కాదు' అని శాసించిరి. అయినను 'ఎంత గుమతులైన' మున్నగువిధముగా ప్రామాణికప్రయోగములందును కొంత వ్యత్యయము కలిగినది.

ద్వంద్వమునందు నిత్యమని చెప్పినను 'కండతుండెములు, రాకపోకలు' మున్నగుచోట్ల ఈ మార్పు కలుగలేదు. 'ఏనువిదప' అని యొకచో ద్రుతాంతముమీఁద కూడ కలిగినది. కావున, ప్రారంభకాలమున ద్రావిడభాషాసంప్రదాయమును గుణముగా గసడదవాదేశము నిత్యముగా జరిగి, క్రమక్రమముగా తగ్గుచు వచ్చియుండును కన్నడమున 'చట'లు కాక లిక్కి-న యక్షరము లీ మార్పును బహుళముగా నొందును. పలుగన్నడం; మాత్తలె; పొసనెసర్.

**సరళాదేశము :** కళల్పై గసడదవాదేశము కలుగగా, ద్రుతప్రకృతికములపై పరుషములు పరమైనప్పుడు సరళాదేశము కలుగును. గజడదబలు సరళములు.

ద్రుతమునకు ప్రకృతి యైనది ద్రుతప్రకృతికము. ద్రుతము నకారము. నకారమునకు పరమైన పరుషము నాద మగును. తోచెన్-చుక్కలు > తోచెన్జుక్కలు. ఈ విధముగా నకారము మీఁదివాల్లుతో సంశ్లేషము చెందిన రూపములు ప్రాథమికములు. తరువాత పూర్ణబిందువు కలిగి 'తోచెంజుక్కలు' మున్నగు రూపము లేర్పడినవి. క్రమక్రమముగా పూర్ణబిందువు శ్లథముకాగా, దానికి గుర్తుగా అర్ధాను

స్వారము నిలుచుట తెలుస్తున్నది. లోచె జుక్కలు॥ సరళములు పరము లైనపుడు॥ ఉన్నతెంపు గోడుగు; ఉన్నతెంపుంగోడుగు, ఉన్నతెంపు న్గోడుగు - అను రూపము లేర్పడును. ఇచ్చట నున్నది సహజసరళము గావున లుప్తద్రుతమునకు గుర్తును నిలుపలేదు.

అరవమునందు నానాత్మకోచ్చారణము అపదాది నున్నట్లు తెలిసికొంటిమి. కావున తెలుగున సరళాదేశము కలుగుచోట్ల అరవము నందు పదాదిపరుషమునకు ద్విత్వము గలుగుచున్నది॥ మరమ్ - కోడు > మరక్కోడు; కుళమ్ - కరై > కుళక్కరై॥

ద్విత్వము : ఉచ్చారణసౌకర్యముకొరకు తెలుగున నిట్లు ద్విత్వము వచ్చినరూపములుకూడ కలవు. త్రికముమీది అసంయుక్త హల్లునకు ద్విత్వము కలుగగా అ-ఎడ > అయ్యెడ; ఈ-పదము > ఇప్ప దము; ఏ-చెలువ > ఎచ్చెలువ॥

తమిళమున అప్పొరుళ్, ఇప్పొరుళ్, ఎప్పొరుళ్ - అనునట్లు త్రికముమీది హల్లునకు ద్విత్వము కలుగుచున్నది. మలయాళమున గూడ నిట్టిది కలదు. కన్నడమున నిట్లు ద్విత్వము వచ్చుట లేదు.

'మూఁడు' శబ్దము డువర్ణమునకు లోపమును, మీది హల్లునకు ద్విత్వమును కలుగగా ముచ్చిరిమూలు, ముప్పిరి - మున్నగు రూపములు తెలుగున కలుగుచున్నవి.

ఇట్లే తమిళమునందు మూన్ఱు - పలన్ > ముప్పలమ్ మున్నగు రూపము లేర్పడుచున్నవి. కన్నడమున మూఱు - చోటుగళ్ > ముచ్చోటు మున్నగురూపము లేర్పడుచున్నవి. ద్విత్వము రాని రూపములుకూడ కన్నడమందు గలవు. 'కొత్త'శబ్దమునాద్యక్షరమునకు కొన్నియెడల నుగాగమంబును, కొన్నియెడల మీదిహల్లునకు ద్విత్వము నగును. క్రొత్త-నన > క్రొన్నన; క్రొత్త-గండి > క్రొగ్గండి॥

చిత్తడి, చిత్తనము మున్నగుచోట్ల వర్ణసమీకరణము కారణ ముగా ద్విత్వము కలిగినది. తమిళమున కట్టిదు; పొన్నను మున్నగు విధముగా ద్విత్వము కలుగును.

# నామ ప్రకరణము

భాష వాక్యసముదాయము. సమగ్రమయిన భావమును తెలి బుచ్చుటకు సమర్థమయినది వాక్యము. కావున వాక్యమే ప్రమాణము. ఈ వాక్యము వేర్వేరు పదములచేతను, ఆ పదములను కలుపు ప్రత్య యాదికముచేతను నేర్పడును. కాని, మాటలాడువానికి ఈపద ప్రత్యయ విధానముతో పనిలేదు. అతని బుద్ధిలో భాసించునది సమగ్రవాక్యమే. వ్యాకర్తలు ఇతరవాక్యములతో పోల్చి, విశ్లేషించి, అత్యల్పమైన భాగమును, ఇంక విడదీయుటకు వీలు కానంతవరకు విడదీసి చూపు దురు. ఇట్లు విడదీయుటకు వీలు కాకుండనున్న అత్యల్పభాగమునే ధాతువు (root) అని యందురు. వ్యాకర్తలు ధాతువునుండి బయలు దేరి, ప్రత్యయములను జేర్చి, పదములను నిరూపించి, క్రియాన్వయ మును కనుగొని, వాక్యమును నిర్ధారింతురు. భాషాశాస్త్రము దీనికి విరుద్ధమార్గమున ప్రసరించును. ఇందు వాక్యమే ప్రాథమికరూపము. దానిని తప్పుగనో, ఒప్పుగనో విడదీయుటవలన పదాదికము కలిగినది. కావున ప్రతిపదమునకు వాక్యమున గల ప్రయోజనమును స్థితినిబట్టి, అన్వయమునుబట్టి నిర్ధారించుట యందలి విషయము. డాక్టరు తారా పోరివాల ఒకచోట "We must take the sentence as the unit of language and the words and clauses composing it as parts functioning in it" అని చెప్పిరి.

Root అను పదమును 'ధాతువు' అను నర్థమున కాల్డ్వెల్ ప్రభృతులు ధారాళముగా వాడిరి. కాని సంస్కృత వ్యాకర్తల దృష్టిలో 'ధాతువు' వ్యాపారబోధక మగునది మాత్రమే. కావుననే ఈనాడు స్పష్టతకొరకు నామధాతువు, క్రియాధాతువు అని వేరుపరిచి వాడుట జరుగుచున్నది. ఈధాతువులపై ప్రత్యయములు చేరగా శబ్దములు ఏర్పడును. ప్రకృతి ప్రత్యయముల కలయిక వలన నేర్పడునది పదము. అటుకానిది అపదము. సంస్కృతమున ప్రకృతిప్రత్యయవిభాగము విస్పష్ట ముగా విరివిగా కలదు. కావుననే సంస్కృతమును ప్రత్యయాత్మకభావ

(**Inflectional Language**) గా పరిగణింతురు. సంస్కృతవ్యాకరణ మర్యాదనే యనుసరించిన తెలుగువ్యాకర్తలుకూడ ప్రకృతిప్రత్యయ విధానము నవలంబించిరి. కాని, తెలుగున పెక్కుచోట్ల ప్రత్యయరహితములుగా, ప్రకృతులే పదములుగా వాడబడును. అట్లని తెలుగున ప్రత్యయములే లేవని యనలేము. ఇందలి ప్రత్యయములు చాలవరకు స్వతంత్ర పదములే; కొన్నిమాత్రము పదత్వమును గుర్తింపలే నంతగా మారిపోయినవి. కావున పదమునకు పదము చేరియుండుట తెలుగువాక్య నిర్మాణమున నధికము. కావుననే తెలుగును సంయోగాత్మకభాష (**Agglutinative Language**) గా పరిగణించిరి.

### పద విభాగము

పదములను వ్యాకర్తలు వేర్వేరు విధములుగా విభాగించిరి. నన్నయ పదము లిన్నివిధములని చెప్పలేదుగాని ప్రాతిపదికము, క్రియ, ప్రత్యయము - అని చింతామణియందు సంజ్ఞలను వాడెను. దానినే యనురిసంచిన బాలవ్యాకరణము నందును పదములను విభజించి చెప్పలేదు. ప్రౌఢవ్యాకరణమునందు నామములు, క్రియలు, అవ్యయములు అని పదములను మూడు విధములుగా విభజించుట జరిగినది. ఆంగ్ల సంప్రదాయము ననుసరించి వచ్చిన యిటీవలి వ్యాకరణములందు ఈ విభాగము మరింత విరివిగా సాగినది. నామములు నామవాచకములు, సర్వనామములు, విశేషణములు అని మరలమూడు విధములుగా విభాగింపబడినవి. వీనియందును మరల అవాంతర భేదములు గలవు.

శ్రీ సోమయాజిగారు ఇన్ని భేదములకంటె ప్రత్యయాంతములు, ప్రత్యయరహితములు అని రెండు రకములుగా విభాగించిన బాగుండెడి దని యభిప్రాయపడిరి.

అవ్యయములు మాత్రము ఒకవర్గముగను, మిగిలిన వన్నియు నొకవర్గముగను, ఏర్పడును. స్థూలముగా ఈ విభాగము బాగున్నది కాని, విశేష శబ్దోత్పత్తికి సహకరించు వ్యాకరణగ్రంథమున సూక్ష్మ విభాగము మిక్కిలి యవసరము. అట్లు కానియెడల ఏ ప్రకృతి కే ప్రత్య

యమును విధింపవలయునో చెప్పుటయందు క్లేశ మెక్కువ కలుగును. తత్సమపరిచ్ఛేదమును విరివిగా రచించిన సూరి, ఆచ్ఛికపరిచ్ఛేదమున పట్టికలతో సంతృప్తిచెందుట ప్రక్రియాసౌలభ్యము నపేక్షించియే కదా!

కర్ణాటభాషాభూషణమునుబట్టి నామము, సర్వనామము, ఆఖ్యాతము, అవ్యయము, నిపాతము నని అయిదు భాగములను గుర్తింపనగును. కాని శబ్దమణిదర్పణమున నామము; ఆఖ్యాతము, అవ్యయము నని మూడు విధములే పేర్కొనబడినవి. ఈ విభాగము ప్రౌఢవ్యాకర్త తెలుగున జేసిన విభాగముతో సమానముగా నున్నది.

అరవమున తొల్కాప్పియమందు పెయర్, విన్రై, ఇడైచ్చొల్, ఉరిచ్చొల్ - అని పదములు నాలుగు రకములుగా నున్నవి. మొదటి రెండును నామమును, క్రియను దెల్పును. మూడవది నామములకు క్రియలకు, ముందుగాని వెనుకగాని చేరునట్టి ప్రత్యయములను, ఆగమములను, అవ్యయములవంటివానిని దెలుపును. ఉరిచ్చొల్ అనునది నామధాతు క్రియాధాతువులకు సమానముగా వాడబడినది.

సంస్కృతమునందు యాస్కుడు పదములను నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము అని నాలుగు విధములుగా విభాగించెను. కొందరు 'కర్మప్రవచనీయము' అని కూడ కలిపి పదముల నైదు విధములు చేసిరి.

తెలుగున 'కర్మప్రవచనీయము' అని చింతామణియందే కలదు. కాని సంస్కృతమున గల వానికిని, వీనికిని పోలికలేదు. కూర్చి, గురించి మొదలైనవి కర్మార్థకములయినద్వితీయాంతశబ్దములపై వచ్చును గావున కర్మప్రవచనీయములని అనియుందురు. 'దానినిగూర్చి వెళ్ళితిని' అను చోట 'ఉద్దేశించి' అని యర్థము. 'దానినుద్దేశించి వెళ్ళితిని' అని కూడ అనవచ్చును. కావుననే సూరి కూర్చి, గురించి మున్నగువానినిగూర్చి తలపెట్టనే లేదు. 'జప మను ప్రావర్షత్' అని యనగా 'జపము ననుసరించి వర్షించె' ననియర్థము. ఇట్టిప్రయోగము తెలుగున లేదు. కావున, ఆ పేరును వాడుట కూడ అవసరము కాదు.

## నామ విభక్తులు

నామప్రకృతులపై చేర్పబడు ప్రత్యయములు నామవిభక్తులు. సాధారణముగా ద్రావిడభాషలందు ప్రాతిపదికయే ప్రథమైకవచన రూపము. ద్వితీయాదివిభక్తులు ప్రాతిపదికకే చేరును. ద్వితీయాది విభక్తులు లింగమునుగాని, వచనమునుగాని ఏమాత్రమును బోధింపవు. బహుత్వమును బోధించుటకు ప్రథమాబహువచనరూపముపై చిన్న మార్పుతో (-అ) ప్రత్యయములు చేరును. పురుషవాచకములను బోధింపవలసి వచ్చినపుడు అరవమునందును, కన్నడమునందును 'న' కారము కలుగును; తెలుగున '-డు' వర్ణకము కలుగును. స్త్రీవాచకము లకు అరవ కన్నడములందు 'శ' కారము కలుగును; తెలుగున 'ఆలు' కొన్నింటికి కలుగును. తెలుగుశబ్దములు సాధారణముగా స్త్రీసమములు, నపుంసకసమములునై యుండును.

సంస్కృతవిధానము ననుసరించి, తెలుగున ఏడు విభక్తుల నంగీ కరించిరి. సంబోధనప్రథమావిభక్తిని ఎనిమిదవ విభక్తిగా కొందరు పరి గణించిరి. వైయాకరణుల పరిగణన మెట్లున్నను, ఈ విభక్తివిధానము మాత్రము తెనుగునకు సరిపడదనక తప్పదు. ప్రథమావిభక్తియు, 'ను,కు' అను ప్రత్యయములును తక్క తక్కిన ప్రత్యయము లన్నియు శబ్దములే. సంస్కృత ప్రత్యయములు వచ్చుచోట, తెలుగున ఏరూపములున్నవో, వాని నా యర్థమున ప్రత్యయములుగా పరిగణించుట జరిగినది. పెక్కు చోట్ల అవి పదములే కాని ప్రత్యయములు కావు.

**ప్రథమా విభక్తి :** ఇం దేకవచనమున 'డుము వు' అనునవియు, బహువచనమున 'లు' అనునదియు వచ్చునని వైయాకరణుల నిశ్చ యము. 'మగన్' మున్నగు ద్రావిడపదముపై, గౌరవార్థమున బహు వచనప్రత్యయము వచ్చి 'మగన్లు' అనిదై 'మగఁడు'గా మారియుండు నని శ్రీ సోమయాజిగారి యభిప్రాయము. రామున్, రామను-అన్నట్లు తెలుగునగూడ వాడుక యున్నట్లు శాసనప్రమాణములు గలవు. గౌర వార్థమున నిర్లేకవచనమునసే బహువచనప్రత్యయము వచ్చినదనుట

కంటె, బహుత్వమువనే బహువచనప్రత్యయమగు 'రు' వర్ణము కలిగి అనుచితవిభాగమువలన ఏకవచనమున డువర్ణాంతరూపము లేర్పడె ననుట యోగ్యతరముగా నుండును. మగన్రు > మగణ్రు > మగండ్రు॥ అని యేర్ప డగా 'రు' వర్ణము బహువచనమును భావమున 'మగండు' అను రూపము నేకవచనముగా గ్రహించి యుండును. కావుననే ద్వితీయా ద్యేకవచనము నందు 'మగన్' అనునది విభక్త్యంగ మగుచున్నది. దానిపై సంబంధా ర్థమున 'ఇ' కలిగి 'మగని' అని యేర్పడుచున్నది. నిగాగమము అనుపాంత తెనుగుశబ్దమంతమునకు నిత్యమగుట గమనార్హము. ఇచ్చట నకారము నామాంశము కావున దానికి నష్టము కలుగరాదు. తత్సమమున 'రాము' యనునది ప్రాతిపదికము. అందువలన రాముచేత, రామునిచేత అన్నట్లు నిగాగమవిరహితరూపముకూడ నుండుట కవకాశము కలుగుచున్నది.

శ్రీవజ్ఝలవారు నకారముపై 'తు' ప్రత్యయము కలుగగా 'డు' వర్ణకము ఏర్పడె నని యభిప్రాయపడిరి. అట్లే యనుకొన్నచో సర్వ నామములయందు మారుచున్నట్లే, యిచ్చట సైతము 'తు' వర్ణము 'టు' వర్ణముగా మారి అనునాసికసాహచర్యము వలన 'డు' వర్ణముగా నయ్యె నని నిశ్చయించుకొనవలసి యుండును.

తమిళమున ప్రాతిపదికయే ప్రథమైకవచనరూపము ॥అవన్॥ కన్న డమున నకారము పూర్ణబిందువై 'అవం' అని యగును.

నపుంసకతుల్యములపై మువర్ణకము తెలుగున నగును. ప్రాచీన కన్నడమునందున్న 'మ్' వర్ణము నిదియు నొక్కటే. ప్రాచీనాంధ్ర శాసనములందు రాజ్యమ్బు, కయ్యమ్బు, శాసనవు-మున్నగు ప్రయోగ ములు గలవు. కావున 'ము' వర్ణకమునకు ప్రాచీనరూపములుగా వ్రు.ంవు, బు. ంబు అనునవి యుండెడివని చెప్పనగును. ఇప్పటికిని ఇంపు, ఇంబు, ఇమ్ము అనునట్టి మూడురూపములు నుండనే యున్నవి. సంస్కృత ప్రాతి పదికములపై కొన్నిచోట్ల ఈ 'ము' ప్రత్యయముగా చేర్పబడెను ॥వృక్షము॥ కొన్నిచోట్ల సంస్కృత ప్రత్యయాంతరూపమునే తెచ్చుకొని అలవాటునుబట్టి సర్వసామరస్యముకొరకు 'ఉ'కారమును చేర్చిరి॥

కళత్రమ్-ఉ>కళత్రము॥ దేశ్యపదముల కడపటనున్న 'ము' వర్ణముకూడ ఆంగికమే. అందువల్లనే మువర్ణకేతరవిభక్తి పరమగునపుడు దీనికి నష్టము కలుగుటలేదు ॥వృక్షము; వృక్షములు; వృక్షమును; వృక్షంబు; వృక్షంబులు; వృక్షంబును॥

ఉకారాంతశబ్దములమీదను, గోశబ్దముమీదను, 'వు' వర్ణకము వచ్చును. ఇచ్చట నిజముగా వచ్చునది ఉకారము మాత్రమే వ్యవధానసంరక్షణమునకుగాను వకారము ఆగమముగా నగును. అప్పుడు ॥ధేను-వ్-ఉ>ధేనువు॥ అని యగును.

హళగన్నడమున 'వు' ప్రత్యయము అకారాంతములపైని గూడ నగుచున్నది ॥పుస్తకవు॥ ఇది తెలుగునందలి 'వు' ప్రత్యయము వంటిది కాదు. కన్నడమున పవర్గమంతయు వకారముగా మారు గుణము కలిగియున్నది. దానివల్లనే 'పుస్తకంబు' అనునది 'పుస్తకవు'గా మారినది.

తెలుగున వర్గము, వర్గువు; ధర్మము, ధర్మువు – అన్నట్లు కొన్ని వువర్ణకాంతరూపము లేర్పడినవి. కొన్నిచోట్ల వర్గు, రాహు, బాహు మున్నగువిధముగా 'వు' వర్ణరహితముగా వాడుక కలదు. బాతు, బాతువు; పుట్టు, పుట్టువు – అన్నట్లు కేవలసామ్యమునకూడ కొన్నిచోట్ల 'వు' వర్ణకము కనిపించును. అందువలననే బహువచనమునందు, ఇతర విభక్తులు పరమగునపుడు 'వు' వర్ణము లోపించినను లోపింపవచ్చును॥ ఆవు – లు > ఆవులు/ ఆలు.

బహువచనమునందు 'లు' వర్ణము కలుగును. భాష గ్రంథస్థమైనప్పటినుండియు బహువచనప్రత్యయముగా 'లు' వర్ణము గలదు. ఇది హల్లు పరమగునప్పుడుగాని, అవసానమునందుగాని ఉత్వమును గోల్పోయి, పొల్లులకారముగా మిగులును. దీనినిబట్టి లకారముమీది ఉత్వము స్వరసామరస్యముకొరకు వచ్చినదే యనవచ్చును. డ ల ర లకు పైని వచ్చి సంశ్లేషము చెందినపుడు 'ళ' కారముగా మారును. కావున లు, ల్, ళు అను మూడు రూపములును బహువచనప్రత్యయముగా గ్రంథస్థభాషయందు కనిపించుచున్నవి. ప్రాచీనశాసనములందు

సంవత్సరంబుళ్; కాపుళు; శివాప్పరాజుల్; పండరంగులు మున్నగు రూపములు గలవు.

అరవ కన్నడములందు బహువచనమునందు 'కళ్' అనునది శబ్దమునకు చేర్పబడును॥ ఎలి – కళ్ > ఎలికళ్; కుళమ్ – కళ్ > కుళఙ్కళ్॥ తెలుగున నివి ఎలుకలు; కొలఁకులు॥ అనుచితవిభాగము వలన 'లు' వర్ణమును మాత్రమే బహువచనప్రత్యయముగా గ్రహించుట జరిగినది. తెలుగున 'ల' కారముమీది యూనిక కారణముగా 'క' కారము జారిపోవుటయు దీనికి దోహదము కలుగజేసి యుండును. కావున 'లు' వర్ణమే బహువచనప్రత్యయముగా స్థిరమై పోయినది.

గోండుభాషలో 'కొడుకు' అను నర్థము గల 'మఱ్రీ' శబ్దము బహువచనమున 'మర్క్' అని యగును. కుయిభాషలో 'దున్నపోతు' అను నర్థము గల 'కోసు' అనుశబ్దము బహువచనమున 'కోర్క' అని యగును. గోండు కుయి భాషలందలి 'క' కారము 'కళ్' లోని ప్రథమాంశమని యనుమానింపదగియున్నది. కుయిభాషలో మహద్వాచకము బహువచనమునకు క కారము కాక 'రు' వచ్చును. తండ్రి యను నర్థము గల 'ఆబ' బహువచనమునందు 'ఆబరు' అని యగును.

తమిళకన్నడములందు మహద్బహువచనప్రత్యయము ర కారము॥ రామర్; గురువర్॥ అమహత్తులకు బహువచనమందు కళ్, గళ్ అని వరుసగా తమిళకన్నడములం దగును. కాని క్రమక్రమముగా మహత్తులమీద కూడ కళ్, గళ్ అనునవి చేరుట మొదలిడినవి॥ యానైకళ్; మరంగళ్; దేవర్ కళ్; అవర్ గళ్॥

తెలుగునందు 'కళ్' యొక్క అవశిష్టరూపమగు 'లు' వర్ణమే మిక్కిలి వాడుకను సాధించుకొన్నది. వ్యాకర్తలు కూడ దానినే గుర్తించిరి. తత్సమములందు అన్నివాచకము (లింగము) లందును లు వర్ణమే వచ్చుచున్నది॥ రాములు; బాలికలు; వృక్షములు॥ అదంతంబై దీర్ఘపూర్వలోపకంబైన నామంబుమీది బహువచన లకారంబునకు రేఫంబగును॥ బాలురు; నృపాలురు॥

కృపాళు శబ్ద మదంతము కాకపోయినను రువర్ణము వచ్చి 'కృపాళురు' అయినది. ఇక తక్కిన తత్సమపదములన్నియు బహువచనమున 'లు' వర్ణాంతములై యుండును.

ఆచ్ఛికశబ్దములు మాత్రము అట్లు కాదు. ఈ 'రు' వర్ణము సర్వనామములందు స్థిరముగా నిల్చియున్నది. మీరు; వారు॥ వీనికి మరల 'లు' వర్ణము కలుగగా 'మీరలు; వారలు' మున్నగురూపములుగూడ నేర్పడినవి. వాండ్రు, వీండ్రు అనునట్టి రూపములందు [అవన్-రు; ఇవన్-రు] కూడ 'రు' వర్ణము కనిపించును. నెయ్యురు, మూర్తురు, పెక్కురు మున్నగు చోటులందును, అందఱు, కొందఱు మున్నగుచోటులందును 'రు' వర్ణము కలదు. అతిప్రాచీనకాలమున 'ర ఱ'లు వ్యత్యస్తములుగా నుపయోగింపబడినట్లు శాసనప్రమాణములు గలవు. ఇచ్చట 'రు' వర్ణము మహద్బహువచనమున గాని, ఉభయ వాచక సమాహారమునందుగాని యగుచున్నది. 'లు' వర్ణము ఆచ్ఛికమహత్తుల మీద కూడ వచ్చుచున్నది॥ మగలు॥ అమహచ్ఛబ్దమైన 'చెయువు' బహువచనమున 'చెయువులు' అగునని సూరి వ్రాసెను. కాని ప్రయోగము కనిపింపదు. ప్రథమావిభక్తి ప్రాతిపదికార్థమునందును, ఉక్తార్థమునందును, సంబోధనమునందును నగును.

**ద్వితీయా విభక్తి** : 'కర్మంబున ద్వితీయ యగు'. కర్మకు ద్వితీయాప్రత్యయము కలుగును. ఉదంతజడవాచకము ద్వితీయకు ప్రథమయు కలుగవచ్చును. వాక్యమున వ్యాపారాశ్రయ మగునది కర్త; ఫలాశ్రయ మగునది కర్మము. జడము సాధారణముగా ఫలాశ్రయమే కాని వ్యాపారాశ్రయము కాదు. అందువలన ఇండో ఆర్యనుభాషలలో నపుంసకశబ్దము కర్త్రర్థమునను కర్మార్థమునను సమానముగనే యుండును॥ ఫలమ్; వనమ్॥ తెలుగున సమానముగ నుండుట కాదు కాని, ఉదంతజడవాచకములను 'ను' వర్ణకము చేర్పకుండ కూడ వాడవచ్చును. హిందీ మున్నగుభాషలందు కూడ నిట్టి ప్రయోగములు గలవు.

ఈ 'ను' వర్ణము ఇకారముమీద వచ్చినచో స్వరాకర్షణము వలన 'ని'వర్ణముగా మారును॥ హరి–ను > హరిని॥ హల్లుగాని అవసానము గాని పరమైనపుడు స్వరము లోపించి కేవలము హల్లు నకారము మిగులును ॥హరిన్ ॥

తమిళమునందు ద్వితీయావిభక్తిప్రత్యయము 'ఐ'. దీనికిని తెలుగు ప్రత్యయమునకును సంబంధము కనిపింపదు. పలగన్నడమందు 'అనె' అనియు, హళగన్నడమందు 'అన్ను' అనియు ద్వితీయాప్రత్యయములు. 'అన్ను' అనునదియు, 'ను' అను తెలుగువిభక్తియు సమానములే. కన్నడమున నకారమునకు బదులుగా మకారము కలుగు లక్షణమున్నది. కావున 'అన్' అను ప్రాచీనద్రావిడరూప మొకటి యుండగా. ప్రాచీన కన్నడమున నకారము మకారమై 'అమ్' ఏర్పడియుండును; తిరిగి ప్రాచీనద్రావిడరూపమునకే ఉత్వద్విత్వములు కలిగి 'అన్ను' ఏర్పడి యుండును. తెలుగున ముందరి అత్వము లోపించినది. ఇంతకును 'న్' అను హల్‌మాత్రమే ద్వితీయాప్రత్యయము. పైని 'ఇ,ఉ' మున్నగునవి కేవలము స్వరసామరస్యముకొరకు వచ్చినవే.

కుయిభాషలో మహత్తులకు ద్వితీయయందు తమిళమునకు సన్నిహితముగా 'ఇ' కలుగుచున్నది ॥ఆబయి (తండ్రిని)॥ అమహత్తులకు తెలుగులో వలె 'ని' కలుగుచున్నది ॥కోరుతిని (దున్నపోతును)॥

గోండుభాషలో ద్వితీయయందు 'మఱ్ఱిన్' (కొడుకును) అని నకారము కలుగుచున్నది. చతుర్థియందుకూడ దీనిరూప మిట్లే యుండును.

ల, కూర్చి, గుఱించి – యనువానినిగూడ కొందఱు ద్వితీయావిభక్తులుగా పరిగణించిరి. చిన్నయసూరి కూర్చి, గుఱించి యనువానిని తలపెట్టనే లేదు. ఆ రెండును క్త్వార్థక రూపములుగా స్పష్టముగా కనిపించుచున్నవి. మొదటిదానికి 'కూర్చును' మున్నగువిధముగా ఇతర రూపములుకూడ గలవు. 'గుఱించి' ఉన్నదున్నట్లుగా క్రియాపదములో వాడుక లేదు. 'గుఱియించెను' మున్నగువిధముగా ప్రయోగము లందున్నది. గుఱింపన్' అని నుఙ్యంతముగా ఒక ప్రయోగము లభించి

నది. లవర్ణము ద్వితీయావిభక్తిప్రత్యయము కాదు. సూరి దీనిని బహు వచనమున ద్వితీయాదివిభక్త్యంగమునకు చేరు ఆగమముగా తెలిపెను ॥రాములను॥ కాని నిజమునకు 'రాములు' అనునంతవరకు ప్రథమాబహు వచనరూపము. దానికి నువర్ణము కలుగగా, సంబంధమును తెలుపుచు 'అ'కారము నిల్చినది. ॥రాములు-అ-ను > రాములను॥ అందువలన వ్యాకర్తలు లడాగమము చెప్పినచోట అగునది అత్వము మాత్రమే.

**తృతీయా విభక్తి** : కరణమునకు తృతీయావిభక్తి యగును. 'చేత, తోడ' అనునవి తృతీయావిభక్తి ప్రత్యయములు. ఇవి పదములే కాని పదస్వరూపము మాసిపోయిన ప్రత్యయములు కావు. 'చేయి' అను ఔపవిభక్తిక శబ్దమునకు 'అన్' (అందు) అను శబ్దము కలిగి 'చేతన్' అని యగును. దీనికి చేతియందు, చేతితో అని రెండర్థములు గలవు. ఇప్పటికిని శబ్దముగా దీనికి వాడుక కలదు. కావున దీనిని ప్రత్యయముగా పరిగణించుట భావ్యము కాదు. 'తోడు' అనుశబ్దమునకు 'అన్' పరమై 'తోడన్' అని యైనది. దీనికి తోడుగా, సహకారముతో అని యర్థము. 'చే, తో' అనునవి అందు ఏకదేశములు. సంస్కృతమున తృతీయా విభక్తినిబట్టి తత్థ్సానమున తెలుగున గల శబ్దమును విభక్తి ప్రత్యయము గా పరిగణించిరే కాని తృతీయావిభక్తి యొకటి యున్నదనుటకే అవ కాశము కనిపింపదు.

అరవమునందు 'ఒడు' అనియు 'ఆన్' అనియు తృతీయావిభక్తి ప్రత్యయములు. 'తోడు'తో సమానమే 'ఒడు'. పటగన్నడమున 'ఇమ్' అనియు, హొసగన్నడమున 'ఇంద' అనియు తృతీయాప్రత్యయములు. కుయి, గోండు మున్నగుభాషలలో తృతీయావిభక్తి ప్రత్యేకముగా కనిపింపదు.

**చతుర్థీ విభక్తి** : సంప్రదానమునందు చతుర్థీవిభక్తి యగును. 'కొఱకు, కయి' అనునవి చతుర్థీవిభక్తి ప్రత్యయములు. కొఱ అనగా పని అని యర్థము. 'నాకొఱకు' అని యనగా 'నా పని నిమిత్తము' అని యర్థము. ఇచ్చట 'కు' అనునది మాత్రమే ప్రత్యయము. అట్లే 'కయి'

అని యన్నప్పుడు 'కు-అయి' అని విభాగము. 'అయి' అనునది 'అగు' ధాతువుయొక్క క్త్వార్థకరూపము. 'కునయి, కునై' అని కూడ రూపములు గలవు. ఛందస్సునందు 'కయి' యందలి కకారమునకు గాని, ద్వితీయపదాద్యక్షరమగు అత్వమునకు గాని యతి చెల్లుననుట ఈ రహస్యమును పట్టి యిచ్చుచున్నది. కావున 'కు' అనునదియే సంప్రదానమునం దగు ప్రత్యయము. దీనిని తెలుగువ్యాకర్తలు షష్ఠీప్రత్యయము గా శేషార్థమునందగునని వ్రాసిరి. శ్రీకోరాడవారు 'అగు' ధాతువు యొక్క అవశిష్టమే 'కు' అని అభిప్రాయపడిరి.

తమిళ మలయాళములందు 'కు' అనునదియే చతుర్థీవిభక్తి ప్రత్యయము.

పటగన్నడమున 'కె' అనియు హొసగన్నడమున 'ఇగె' అనియు చతుర్థీ విభక్తిప్రత్యయములు.

కుయిభాషయందు ఆబకి (తండ్రికి) ఆబరికి (తండ్రులకు) అని చతుర్థియందు కలదు. అమహత్తులకు కోరుటెన్గి (దున్నపోతునకు) కోర్కటెన్గి (దున్నపోతులకు) అని గివర్ణాంత రూపములు గలవు.

గోండుభాషలో ద్వితీయకును, చతుర్థికిని నొక్కటే రూపము. కూర్గుభాషయందు 'గె' అనియు బ్రాహుయీభాషయందు 'కి' అనియు గలవు. బెహిస్తాను ఫలకభాషలోని 'ఇక్క; క్క' అనునవి సామ్యమును నిరూపించును. నేటి ఉత్తరహిందూస్థానభాషలయందలి 'కా, కే, కీ, కో' యనునవి 'కు' వర్ణ సామ్యమును గలిగియున్నవి.

పంచమీ విభక్తి : వలన, కంటె, పట్టి యను మూడును ప్రత్యయములుగా పరిగణింపబడినవి. 'పట్టు' అను ధాతువు క్త్వార్థకరూపమే 'పట్టి' యనునది. కూర్చి, గురించి యనువానివలెనే యిదియు ద్వితీయాంతముపైని చేరును॥ జ్ఞానముఁబట్టి ముక్తుఁడగును॥ కావున దీనిని క్త్వార్థకరూపముగనే పరిగణించుట భావ్యము.

'కంటె' అనునది అనుచితవిభాగమువలన నేర్పడిన ప్రత్యయము. ఇది నిర్ధారణమునం దగును॥ రామునికంటె నన్నయందు ధానుష్కుండు

లేదు॥ రామునికంటె అనునప్పుడు 'రామునికి - అంటె' అనునది విభాగము॥ అంటివి-ఏన్ > అంటేన్॥ 'అనునట్లయిన' అని యర్థము. రామునికి పోల్చి చెప్పినట్లయిన మరొకథానుష్కుడు లేడని యర్థము. కావున ఇచ్చట విభక్తి స్థానమునుబట్టి 'కు' అనునదే. 'అంటే' అనునది యెదుటివానిని మూదలించుటలో ఏర్పడినది మధ్యమపురుష క్రియారూపము. ఇదే 'రామునికన్న' అన్నట్లుగా కూడ నున్నది. 'కు-అన్న' అనునది విభాగము. ప్రత్యయమునందు మార్పు లేదు. 'అన్నన్' అను చేదర్థకము పరమగుచున్నది. కావున 'కన్నన్' అనునది కూడ ప్రత్యయము కాదు. 'కు' అన్నది మాత్రమే ప్రత్యయము.

'వలను' అనగా దిక్కు అని యర్థము. 'దిక్కునందు' అను నర్థమున 'వలను-అన్' అని ఏర్పడి 'వలనన్' అగుచున్నది. ఔపవిభక్తికములకు తృతీయాసప్తములందు కలుగు 'అన్' అనునదియే యిచ్చటను కలుగుచున్నది. ఆవల, ఈవల మున్నగు శబ్దములందు 'వలను' అన్నదే సమాసాంతకార్యముల నొందినది. దీనినిబట్టి 'వలనన్' అన్నది న్యాయముగా అధికరణమునం దగుచున్నదని స్పష్టమగును. అపాయ భయ జుగుప్సాదులయందు 'వలన' అగునని వ్యాకర్తల నిర్ణయము॥ హిమగిరి వలన గంగ వొడమెను॥ ఇచ్చట 'వలన' అన్నది 'అందు' అనుటకు మారుగా ప్రయుక్తమైనది. 'హిమగిరియందు' అని యన్నను అర్థమున మార్పు కలుగదు. దీనిపై 'ఉండి' శబ్దము కూడ పరము కావచ్చును. 'హిమగిరియందుండి, హిమగిరివలననుండి - అనికూడ రూపములు కావచ్చును. ఉండుధాతువు క్త్వార్థకరూపమే 'ఉండి' యనునది. అందు, వలనలకు వైకల్పికముగా లోపము కలుగగా 'హిమగిరినుండి' అని యగును. దీనినిబట్టి కొందరు 'నుండి' పంచమీవిభక్తిప్రత్యయ మనిరి. చారిత్రకముగా ఈ నిర్ణయము సమంజసము కాదు. 'హిమగిరిన్' అను నప్పటి ద్వితీయ సప్తమ్యర్థమున వచ్చినదే. 'వలనన్' అన్నది సప్తమ్యర్థమున వ్యవహరించుచున్న దనుట సమంజసము. అట్లే 'దొంగవలన భయము' మున్నగుచోట్ల కూడ 'దొంగయందు భయము' అను స

మ్యర్థమే కలదు. అట్లే హేత్వర్థమున 'దొంగచేత భయము' అని కూడ అగును.

ఇట్లే అరవమునందు 'ఇన్' అనునది పంచమీ ప్రత్యయము. తెలుగున 'ఇన్ – దు' అనుదానియందలి మొదటి యంగ మిదియే. అన్, ఇన్, ఉన్ – అనునవి మూడును సప్తమ్యర్థకములే. ఇవి లకారాంతములుగా కూడకలవు. అరవమున ప్రత్యయముగా 'ఇన్'మాత్రమే గ్రహింపబడినది. తెలుగున ప్రత్యయము 'అన్' కాకపోయినను 'వలను – అన్' అని దిగ్వాచకమునకు సప్తమ్యర్థక మగు 'అన్' చేరుచుండుట గమనించితిమి. కన్నడమున తృతీయార్థకమయిన 'ఇమ్' అనునది 'ఇన్' అనుదానికి పరిణతరూపమే. ఇదియు 'కంటె, అందుండి' అను నిర్ధారణాపాదానములను బోధించును. పాతగన్నడమున పంచమీ ప్రత్యయ మగు 'అత్తణిం' అనుదానియందు 'అత్తణ' అను శబ్దమునకు 'ఇమ్' చేరనే చేరుచున్నది. దీనికి న్యాయముగా 'ఆ ప్రదేశమునందు' అని అర్థము. తెలుగున 'వలనన్' తో అర్థసామ్యము గలదు. హొసగన్నడమునందు 'దెసయింద' అన్నది పంచమీప్రత్యయము. ఇందు 'దెస – ఇమ్ – ద' అన్నది విభాగము. కావున దిగ్వాచకముపై సప్తమ్యర్థకము వచ్చుటయే యిందును జరిగినది.

పంచమీవిభక్తి సంస్కృతానుకరణమున నేర్పడినది. పంచమీ స్థానమున ద్వితీయా, తృతీయా, షష్ఠీ, సప్తమీ ప్రత్యయములు ప్రయుక్తము లయినను గావచ్చును.

షష్ఠీ విభక్తి : కు, యొక్క, లోపల అనునవి ప్రత్యయములు. చతుర్థీవిభక్తి విషయమున 'కు' వర్ణమునుగురించి పరిశీలించితిమి, స్వస్వామిభావమును దెల్పు 'యొక్క' అనుదానిచరిత్ర మాత్రము దురవగాహముగా నున్నది. ప్రాచీనకాలమున దీనికి ప్రయోగ మున్నట్లు కనిపింపదు. శేషషష్ఠికి 'యొక్క' యగునని చింతామణి సూత్రార్థము. బాలసరస్వతి దాని కుదాహరణముగా 'అంబయొక్క దాసుడు' అని యిచ్చెను. కేతన యే విభక్తి యెప్పుడగునో చెప్పుచు "బడయుండు

షష్ఠియు" అని యనెను. ఒడయుడు అనగా పొందువా డని, ప్రభువని యర్థము. ప్రత్యయములందు 'యొక్క' చెప్పియు, ఉదాహరణములందు మాత్రము కేతన 'సుతుని ధనము, సుతు ధనము; వృక్షము తుది, వృక్షంబుల తుదలు" మున్నగు విధముగా 'యొక్క'ను విడనాడియే పలికెను. ఇటీవల 'యొక్క' యెక్కువగనే వాడబడుచున్నది.

'లోపల' అనగా అంతర్భాగము అనునదియే యర్థము. 'ఈ యిద్దఱిలోపల రాముఁడు పెద్ద' అనుచో నిరువురయందు అను సప్తమ్యర్థమే కలదు. 'లోపల' అనునది ప్రత్యేకము శబ్దముగా కూడ తెలుగున గలదు. లోపల, బయట అన్నట్లుగా స్వతంత్రమైన వాడుక యున్నది దీనికి 'లో' అనురూపము గలదు. తమిళమునందలి 'ఉల్' అను శబ్దమే స్వరప్లుతి కారణముగా 'లో' అయినది. దానిపై 'పల' అన్నది చేరగా 'లోపల' అయినది. వెలుపల, వలపల, దాపల మున్నగునవి యిట్టివే. చిన్నయసూరి దీనిని నిర్ధారణషష్ఠికి మాత్రమే గ్రహించుటచేత బహువచనమునందే విధించెను. కాని 'నూతిలో' మున్నగు విధముగా ఏకవచనమునందు కూడ పెక్కు ప్రయోగములు గలవు.

అరవమునందు షష్ఠీవిభక్తి ప్రత్యయము 'అదు'. ఇది అమహత్తిచ్ఛబ్దమే కాని వేరు కాదు. మలయాళమందు షష్ఠీప్రత్యయము 'ఉడె'; పటగన్నడమున 'అద్'; హొసగన్నడమున 'అ'.

వ్యాకర్తలు చెప్పకపోయినను ఇవన్నియు తెలుగున నున్నవనుట నిర్వివాదము.

అరవమున 'అదు' అను ప్రత్యయమును చేర్చుటకు పూర్వము నామమునకు 'ఉడైయ' అనునది చేరును. 'ఎన్నుడైయదు కై' నాచేయి యని యర్థము. 'ఎన్ కై' అన్నను నిదే యర్థము. వ్యావహారికతమిళమున 'ఉడైయ' అనునది యెక్కువ వాడుకలో కలదు. మలయాళమున చిట్టచివరి అకారము పోయి 'ఉడై'కి రూపాంతర మగు 'ఉడె' ప్రత్యయముగా నిల్చినది. 'ఉడైయవన్' అనగా ప్రభువు. అదే తెనుగున 'ఒడయడు' అని నైనది. కావున శేషషష్ఠియందు స్వస్వామి సంబంధమును దెల్పుచు 'యొక్క' అనునది తెలుగున వచ్చును.

నీ, నా, తన, మనలకు సమాసమునందు 'దుగాగమ' మగును॥ నీదుకరుణ॥ అరవమున 'నినదు దయవు'. తెనుగున 'దు' సమాసము నందు విధింపబడినను, తమిళమునందలి 'అదు' శబ్దపు టవశిష్టముగా గ్రహించుట కభ్యంతర ముండదు.

హాలసగన్నడమందలి 'అ' తెలుగున బహువచనద్వితీయాద్యంగ మునకు చేరు అకారముతో సమానము॥ కోమ్మల పూలు > కోమ్మ లు-అ-పూలు॥

గోండుభాషలో ఏకవచన బహువచనములందు ఆకారమే వచ్చు చున్నది॥ మఱ్ఱీనా (కొడుకుయొక్క); మర్క్‌నా (కొడుకులయొక్క)॥ తక్కువజాతివానికి 'ట' కారము ఆగమముగా నగును॥ ఇగ్గాటా (ఇంటి యొక్క)॥ బ్రాహుయీభాషలో కూడ నకారపూర్వక మైన ఆకారమే షష్ఠీప్రత్యయము.

తెలుగున ఏకవచనమున షష్ఠియందు 'ఇ'వర్ణము అగుచుండును॥ మగని, రాముని॥ సర్వనామములకు కొన్నింటికి బహువచనమున కూడ 'ఇ'వర్ణమే యగుచున్నది॥ వారియిల్లు॥

టి, తి అను వర్ణములుకూడ కొన్నినామములకు ఏకవచనము నందు సంబంధార్థమున నగుచున్నవి॥ ఏటి నీరు; నూతి నీరు॥ నిజమున కిట్టియెడల ఏటి, నూతి యనువానిని విశేషణములుగా గ్రహింపవలయును. ఇవియే ద్వితీయాద్యేకవచనాంగములు. కావున విశేషణములకు అన్య పదములు పరమై యేర్పడిన సమాసములే విభక్త్యంతరూపములు అను నభిప్రాయముకూడ కలదు. మాక్సుముల్లరు "విశేషణముల నుండియే సంబంధార్థక షష్ఠి యేర్పడె" నని నిశ్చయించెను. ఇదియే ద్వితీయాది విభక్త్యంగ మగుట తెలుగు విభక్తుల పదస్థితిని నిశ్చయించును. యుష్మదస్మదాత్మార్థకముల ద్వితీయావిభక్తి తక్కిన విభక్త్యంగము కంటె భిన్నముగా నుండును॥ నీ, నిన్ను; నా, నన్ను; తన, తన్ను॥ ఇట్లే బహువచనమున నకారస్థానమున మకారమును కలిగియుండును.

'టి, తి' వర్ణములందు ఇవర్ణమే ప్రధాన మనియు, పూర్వమున నున్న యకారముల కలయికనొందిన 'ఇ' వర్ణము అనుచితవిభాగమువలన నిట్లు మారెననియు సంధిప్రకరణమున తెలిసికొంటిమి.

కుయిభాషలో షష్ఠియందు ఇవర్ణమే కలుగుచున్నది॥ (ఆబరి ॥ (తండ్రులయొక్క)అమహత్తులకు మాత్రము అకారము కలుగుచున్నది.

**సప్తమీ విభక్తి** : అందు, న అనునవి ప్రత్యయములు. అందు అనునది స్థలవాచకము; దూరమును సూచించును. ఇందు సమీపస్థల వాచకము అన్, ఇన్ అను వానిపై 'దు' వర్ణము కలిగి తెలుగున నివి యేర్పడినవి. సంధిప్రకరణమున వీనినిగురించి ముచ్చటించుకొంటిమి. 'న' యనునది ఉదంతజడమునకు నేకవచనమున నగు ప్రత్యయ మని వ్యాకర్తల నిర్ణయము. చారిత్రకముగా 'న' కారము 'అన్' కంటె భిన్నము కాదు. ఇది ఔపవిభక్తికములకు తృతీయాసప్తములందు వచ్చుచున్నట్లు ఇదివరకు చెప్పుకొంటిమి॥ జలమునన్॥ జలము అను పదమును వేరుపరిచి 'నన్' ప్రత్యయ మని యభిప్రాయపడిరి. కాని 'జలము - న్ - అన్' అనుచోట నడిమినకారము వ్యవధాన సంరక్షకముగా వచ్చినది. బహువచనముపై నయినచో 'లన్' అని కావలసియుండును. దానిని ద్వితీయా ప్రత్యయముగా మఱొక మార్గమున సాధించుటచేత దీనిని ఏకవచనమునకే విడిచిపెట్టవలసి వచ్చినది. ఉదంత జడవాచకములపైనే వచ్చును గనుక పూర్వమందు నకారముకూడ నిశ్చితముగా కలుగును. కావున ఇచ్చట 'అన్' అనునదియే ప్రత్యయము. 'అందు'లోని పూర్వాంశమే ప్రత్యేకము విభక్తిగా కూడ నున్నది. ఇదియే పూర్వకాలికము. 'అందు' అన్నది దువర్ణమును పొంది, తరువాత ఏర్పడినది. ఇప్పటికిని దాని పదస్వరూపము నష్టము కాలేదు.

తమిళమున సప్తమీవిభక్తిప్రత్యయము 'కణ్'. ఇది స్థలవాచకము. మలయాళమునందు 'ఇల్'. ఇది గృహవాచకము. పటిగన్నడమున 'ఒళ్, అల్లి' అను రెండుప్రత్యయములు గలవు. హొసగన్నడమున 'అల్లి' అనునది ప్రత్యయము. 'ఒళ్' అనగా 'లోపల' అని యర్థము.

అరవమున లోపల, బయట అను నర్థము గల 'ఉళ్' 'పుఱమ్' అనునవి కూడ సప్తమ్యర్థకము లని తొల్కాప్పియనారు వ్రాసెను. 'అన్' అను దానికి రూపాంతరమగు 'అల్' స్వరసామరస్యమును పొంది 'అ౯్ని' యైనది. దీనికిని 'అందు' అనియే అర్థము.

సంబోధన ప్రథమా విభక్తి : సంబోధనమునందు ప్రథమా విభక్త్యేకవచనరూపమునకు అత్వము కలుగును. అత్వోత్వములకు దీర్ఘము కలుగును. విభక్తిప్రత్యయముగా విధించిన డువర్ణమునకు లోపము కలుగును. ఉదంతముల కైనచో డువు వర్ణములకు లోపము కల్గి, తుది ఉత్వమునకు దీర్ఘము కలుగును. అరవ కన్నడములందు ప్రథమావిభక్తియం దగుప్రత్యయమునకు లోపము కలుగును.

తెలుగున బహువచనమందు 'ఆర' అనునది చివర వచ్చును. ॥బాలకులార॥

ఇంతవరకును "డు, ము, వు, లు, ను, కు అ, ఇ" అనునవి మాత్రమే తెలుగున ప్రత్యయములుగా కనిపించును. ఒక విభక్తికి బదులుగా మరొక విభక్తి వచ్చుట కూడ సప్తవిభక్తి విధానము తెలుగునకు సరిపడదనియే నిరూపించును. ప్రథమైకవచనమున ఏ ప్రత్యయమును రాని రూపములే తెలుగు శబ్దములందు చాల యెక్కువగా గలవు. షష్ఠీవిభక్త్యంతము తెలుగున విశేషణముగను, ఇతరవిభక్త్యంగముగను నుండుటచేత ద్వితీయాది విభక్త్యంతరూపము సమాసస్థితిని చూపుచున్న దనవచ్చును.

ఈ విభక్తిప్రత్యయములు నామవాచక, సర్వనామ, సంఖ్యావాచక, విశేషణముల ప్రాతిపదికలపైని, కృదంత తద్ధితములపైని వచ్చును. విభక్తియే వాక్యమునందు పదమునకు గల స్థానమును, క్రియతోడను ఇతరపదములతోడను గల అన్వయమును నిరూపించును.

సంస్కృతమునందలి నామవిభక్తులకును వీనికి నేమియు సంబంధము లేదు.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమా | సు | ఔ | జస్ |
| ద్వితీయా | అమ్ | ఔట్ | శస్ |
| తృతీయా | టా | భ్యామ్ | భిస్ |
| చతుర్థీ | ఙే | భ్యామ్ | భ్యస్ |
| పంచమీ | ఙసి | భ్యామ్ | భ్యస్ |
| షష్ఠీ | ఙస్ | ఓస్ | ఆమ్ |
| సప్తమీ | ఙి | ఓస్ | సుప్ |

ప్రథమావిభక్తి యేకవచనప్రత్యయ మగు 'సు' తో సప్తమీ బహువచనమందు 'సుప్'లోని పకారమును జేర్పగా 'సుప్' అను ప్రత్యాహారసంజ్ఞ యేర్పడును. కావున నామవిభక్తులను సుప్పు లనియు, నామాదికమును సుబంతము అనియు వాడుదురు.

తెలుగునను కన్నడమునను ప్రథమావిభక్తి మున్నగు సంస్కృత నామములనే వాడుదురు. అరవమున ఈ పేళ్ళను అనువదించి 1. ముదల్ వేట్రుమై 2. ఇరణ్డామ్ వేట్రుమై 3. మున్ఱామ్ వేట్రుమై 4. నాన్కామ్ వేట్రుమై 5. ఐన్దామ్ వేట్రుమై 6. ఆఱామ్ వేట్రుమై 7. ఏఱామ్ వేట్రుమై- అని యందురు. సంబోధనమును ఎట్టామ్ వేట్రుమై అనియు విళివేట్రుమై అనియు నందురు.

## లింగ విభాగము

లింగవిభాగము రెండు మార్గముల ననుసరించి యున్నది. అర్థమునుబట్టి పురుషులను బోధించునది పుంలింగము; స్త్రీలను బోధించునది స్త్రీలింగము; రెండును కానిది నపుంసకలింగము. ఇది లౌకికలింగవిభాగము. ఇట్లుకాక పారిభాషిక లింగవిభాగము మరొకటి కలదు. ఇది యెక్కువగా అర్థముతో సంబంధము లేనిదిగానే కన్పడును. 'రాముడు' అను పురుషవ్యక్తిని బోధించు 'రామః' అనునదియు, 'చెట్టు' అను జడ వాచకమును బోధించు 'వృక్షః' అనునదియు, 'పెండ్లము' అను స్త్రీ వ్యక్తిని బోధించు 'దారాః' అనునదియు కూడ పుంలింగ శబ్దములే. పారిభాషిక మగు లింగవిధానమే సంస్కృతమున నుపయోగింపబడినది.

ద్రావిడభాషలందు లింగవిధానము స్వతంత్రరీతి ననుసరించి యున్నది. ఇచ్చట అర్థము ప్రధానముగా ఈ విభాగము జరిగినది.

అరవమునందు శబ్దములను రెండు విధములుగా విభాగింతురు.
1. ఉయర్ తిణై-చ్చొల్ 2. అ:ఃఱిణై-చ్చొల్.

ఉయర్ తిణై-చ్చొల్ అని యనగా ఉన్నతజాతిశబ్దములని యర్థము. మనుష్య దేవ రాక్షసాదులను దెల్పు శబ్దములిందు చేరును. ఇది తిరిగి ఆణ్ పాల్, పెణ్ పాల్, పలర్ పాల్ అని మూడువిధములు. ఆణ్ పాల్ పురుషవ్యక్తిని బోధించును; పెణ్ పాల్ స్త్రీవ్యక్తిని బోధించును. ఇందే పేడి (నపుంసకుడు) చేరును. ఏకవచనమునందు గల విభాగమిది. బహువచనమునందు చేరు శబ్దముల నన్నింటిని పలర్ పాల్ బోధించును. ఇందు స్త్రీపురుషభేదమును సూచించు ప్రత్యయము లేమియు లేవు.

అ ఱిణై-చ్చొల్ అని యనగా అజాతిశబ్దము లనియర్థము. ఉన్నత జాతికి చెందని వన్నియు నిందు చేరును. ఇందు ప్రాణివాచకములు, జడ వాచకములు - రెండును నుండు నన్నమాట. దీనియందు స్త్రీపుంస భేదము పాటింపబడక కేవలము వచనభేదము మాత్రమే పాటింపబడును. కావుననే అ ఱిణై-చ్చొల్ అనునది ఒన్ఱన్ పాల్ (ఏకవచనము), పల విన్ పాల్ (బహువచనము) అని రెండువిధములు.

ఆణ్ పాల్ సాధారణముగా నకారాంతముగ నుండును ॥అవన్॥ పెణ్ పాల్ ళకారాంతముగా నుండును ॥అవళ్॥ పలర్ పాల్ రకారాంతముగ నుండును ॥అవర్॥ ఒన్ఱన్ పాల్ 'దు'కారాంతముగా నుండును ॥అదు॥ ఱు, డువర్ణములుకూడ అంతమందు నిలుచును. పలవిన్ పాల్ శబ్దముల చివర 'అ,ఆ,వ' అను వర్ణములలో నేదేని నిల్చుచుండును.

కన్నడము సంస్కృతపుసంజ్ఞలనే పుంలింగము, స్త్రీలింగము, నపుంసకలింగము అని స్వీకరించినది. విభాగము మాత్రము శబ్దమును బట్టికాక, లౌకికవిధానము ననుసరించి, అర్థమునుబట్టి కావించినది. పురుషులను బోధించు శబ్దములు పుంలింగములు ॥అవం॥ స్త్రీలనుబోధించు

శబ్దములు స్త్రీలింగములు ॥అవళ్॥ ఈ రెండును కానివి నపుంసక లింగ ములు ॥అదు॥ బహువచనమునందు స్త్రీలింగ పుంలింగములకు రకారము కల్గును ॥అవర్॥ నపుంసకములకు 'వు' వర్ణము కలుగును ॥అవు॥

తెలుగునందు లింగము అను పేరు వాడక 'వాచకము' అని వాడుదుము. దేవ మనుష్య రాక్షసాది జాతులకు చెందిన పురుషవ్యక్తిని బోధించునది మహద్వాచకము ॥రాముడు॥ మిగిలినది అమహద్వాచకము; అనగా ఇందు స్త్రీలు, పశుపక్ష్యాదులు, జడములు కూడ చేరును ॥చిన్నది॥ ఈ అమహద్వాచకమునుండి స్త్రీలను వేరుపరిచి ప్రత్యేకముగా మహతీవాచకములుగా గణించిరి ॥మటందలు॥ అరవమున ఉయర్ తిణై లో ఒక భాగముగా చేరిన స్త్రీవాచకములు, తెలుగునందు అమహద్వాచకములలో చేరుచున్నవి. "సీత చిన్నది" "విల్లుదొడ్డది" అని యన్నప్పుడు ఏకవచనమున స్త్రీవాచకమునకు, జడవాచకమునకు కూడ విశేషణముగా 'అది' యనునదే వచ్చినది. బహువచనమున స్త్రీ పురుష విశేషణములు సమానముగా నుండును ॥రామకృష్ణులు మంచివారు; సీతారుక్మిణులు మంచివారు॥

చాలవరకు తెలుగుశబ్దములు స్త్రీలింగ తుల్యములుగను, నపుంసకలింగ తుల్యములుగను నుండును. స్త్రీ లింగ తుల్యములనగా ప్రథమా విభక్తి యేకవచన ప్రత్యయములు లోపించినట్టివి. కేవలప్రాతిపదికయే ప్రథమావిభక్తి యేకవచనమున నుండును॥ తల్లి, తండ్రి, వాక్కు, గోడ॥

నపుంసకలింగసమము లనగా 'ము' వర్ణకాంతశబ్దములు ॥బియ్యము; నెయ్యము; వృక్షము; ఋక్షము॥

పుంలింగసమము లనగా 'డు' వర్ణకాంతశబ్దములు ॥నెయ్యుడు; బల్లిదుండు; రాముడు; మగడు॥

డు వర్ణము మహద్వాచకములకే కలుగవలసియున్నను, అమహత్తులకు కూడ కొన్నిచోట్ల కలుగుచున్నది ॥కైరడు; కత్తెళడు; నీలడు; జన్నడు॥

తెలుగున సంస్కృతశబ్దము లధికముగా ప్రవేశించినందువలన ప్రక్రియాసౌలభ్యముకొరకు సంస్కృతలింగసమత్వమును గూడ తెలుగు వ్యాకర్తలు వేరుగా పరిగణింపవలసి వచ్చినది.

ద్రావిడభాష లన్నింటియందును స్త్రీ ప్రత్యయములు విశేషముగా గలవు. తమిళమునందును గన్నడమునందుననగు 'ళ' కారము 'ఆళ్' శబ్దమునందలి అవశిష్టమై కాననగును. తెలుగున పెక్కు శబ్దములపై దీని పరిణతరూప మగు 'ఆలు' చేరుచున్నది॥ మనుమరాలు; జవరాలు॥ తత్సమములకు కూడ ఆలు పరమగుచున్నది॥ శ్రీమంతురాలు; విద్వాంసురాలు॥ కొన్నియెడల రుగాగమము లేకుండ కూడ ఆలువచ్చుచున్నది ॥పేరటాలు; పురుటాలు॥ కొన్నియెడల ఆలుశబ్దపు టవశిష్ట మగు 'లు' మాత్రమే అంతమందు కనిపించుచున్నది. ॥చెల్లెలు; మఱఁదలు; కోడలు॥

అరవమునందు త్తి, ఇ అనునవి కూడ స్త్రీప్రత్యయములై శబ్దాంతమున కనిపించుచున్నవి॥ వణ్ణాత్తి (చాకలిది); ఒరుత్తి (ఒకరిత); పుడవి(మధ్య మమ్మ స్త్రీ॥)కన్నడమున కూడ త్తి, తి, ఇ, ఇతియను స్త్రీ ప్రత్యయములు గలవు॥ బళెగార్తి (గాజులది); కమ్మరితి (కమ్మరిది); ఆటగార్తి (నట్టువరాలు); ముదుకి(ముసలిది); బాణసిగితి(వంటకత్తె)॥ తెలుగున తి, త, తు, తె, ఉక, ఇ, కత్తె మున్నగునవి స్త్రీప్రత్యయములు॥ ఒకతి; చాకిత; ఎవర్తు; ఒకతె; పడతుక; బలిసివి; ఆటకత్తె॥

కొన్నింటికి 'అది' అను సర్వనామమును చేర్చి స్త్రీవాచకముగా వాడుదురు॥ చిన్నది, ముసలిది; వంటది॥

బిడ్డ మున్నగువానికి ముందు 'ఆడు, మగ' అను శబ్దములను జేర్చి వ్యవహరింతురు॥ ఆడుబిడ్డ, మగబిడ్డ॥

అక్క, అమ్మ, మున్నగువానిని చేర్చి స్త్రీవాచకములుగా వ్యవహరింతురు॥ సీతక్క; రామమ్మ॥

సంస్కృత స్త్రీలింగశబ్దములకు తెలుగున ప్రథమావిభక్తి లోపించును. నామముల తుదిదీర్ఘమునకు హ్రస్వము కలుగును. 'రమా' శబ్దము

తెలుగున 'రమ' అని యగును. అరవమున 'రమై' అనియు, కన్నడమున 'రమె' అనియు నగును. అట్లే స్త్రీలింగశబ్దములు స్వస్వనియతములయిన ప్రత్యయములతో తెలుగులోనికి తత్సమములుగావచ్చును॥ ధీర; విదుషి; శ్రీమతి; పద్మనేత్ర॥

బ్రాహుయీ, తోద భాషలలో లింగ విభాగమే లేదు. పరిసరములందలి పారశీకప్రభావము పనిచేసియుండిన నుండవచ్చును. గోండు భాషలో స్త్రీవాచకములను అమహత్తులతో చేర్చి పల్కుట సామాన్యము; దేవతలనుగూడ అమహత్తులలోనే యీ భాషయందు చేర్తురు. ఇదియే ప్రాథమికదశయని, అది యిందు నిల్చియుండెనని యూల్సు బ్లాక్ నిర్ణయము.

కురుఖ్ భాషయందు ఏకవచనమున స్త్రీవాచకములను అమహద్వాచకములను సమానముగనే పరిగణింతురు. కాని బహువచనమందు స్త్రీపురుషవాచకములకు సమానముగా'అర్'అను ప్రత్యయము కలుగును. కురుఖ్ భాషలో అమహత్తులకు బహువచనము లేదు. కుయిభాషలో స్త్రీ వాచకములకును, అమహద్వాచకములకును బహువచనప్రత్యయ మొక్కటే.

## వచన విభాగము

లింగవిభాగమునుగూర్చి చర్చించునపుడే కొంతవరకు వచన విభాగమును గూర్చి పరిశీలించితిమి. ద్రావిడభాషలలో లింగవచనములకు ఆ విధమైన సంబంధ మున్నది.

సంస్కృతమునందు మూడు లింగము లున్నవి; మూడువచనము లున్నవి. లింగమునుబట్టియు, వచనమునుబట్టియు సంస్కృతమున విభక్తి ప్రత్యయము మార్పు నొందును. ద్రావిడభాషలయందు ఆ మార్పు లేదు. సాధారణముగా ఒక్క ప్రథమావిభక్తియందు తప్ప తక్కిన యన్నింటియందును, ఏకవచన బహువచనములందు విభక్తి ప్రత్యయములు సమానముగా నుండును. సంస్కృతమునందలి ద్వివచనము ద్రావిడభాషల కేమాత్రమును తెలియదు. ఇందు కేవలము ఏకవచన బహువచనములు మాత్రమే కలవు.

అరవమునందు ఉన్నతజాతిపదములలో ఆణ్‌పాల్, పెణ్‌పాల్ అని ఏకవచనమున పురుష స్త్రీభేదము కలదు. బహువచనమున సన్నియు పలర్‌పాల్ అను విభాగములోనే చేరును. అజాతిపదములు ఒన్రన్‌పాల్, పలవిన్‌పాల్ అని ఏకవచన బహువచనములను రూపించును. ఇట్లున్నను అమహత్తులకు బహువచనము నియతముగా చేర్చు లక్షణము తొల్కాప్పియమ్ నాటికే లేదు. 'ఆవు వచ్చెను' అను నర్థమున 'మాడువందాన్' అని యుండగా 'మాడుగళ్ వందన' అని బహువచనమున నుండవలయును. అట్లుకాక నామముపై బహువచనప్రత్యయము చేర్పకుండ 'మాడు వందన' యని బహువచనక్రియను వాడిన సరిపోవును. ద్రావిడ భాషలలో పెక్కుచోట్ల అమహత్తులకు బహువచనరూపములు లేవు.

తెలుగులో నిట్టిదే కొంచెముమార్పుతో కలదు. 'వాడు పలికెను' అన్నప్పుడు ఏకవచనము. బహువచనమునందు 'వారు పలికిరి' అని యగును. అమహదర్థమునందు కర్త ఏకవచనమున నున్నను, బహువచనమున నున్నను క్రియ ఏకవిధముగా నుండును॥ చిలుక పలికెను; చిలుకలు పలికెను॥ అన్ని, ఇన్ని, కొన్ని మున్నగు బహ్వర్థక సర్వనామములకు ఏకవచనరూపములు లేవు. 'కాయకోసిరి; విస్తరి వేసిరి'మున్నగుచోట్ల బహువచనమునకు బదులు ఏకవచనమును వాడిరి. ఇట్లు ఏకవచనమును వాడుటయే ద్రావిడ భాషా సంప్రదాయము. కాని సాధారణముగా తెలుగునందు మహత్తులు, అమహత్తులు, మహతీవాచకములుకూడ బహుత్వము నొందుచుండును. వీని కనుగుణముగా క్రియాపదములు మారును.

తుదభాషయందు సర్వనామములును, సర్వనామములు కర్తలుగా ఉన్న క్రియాపదములును మాత్రమే బహుత్వము నొందును. కొడగు భాషలో అమహత్తులకు బహువచనమే లేదు. మాక్సుముల్లరు అమహద్బహువచనరూపము సమాసమనియు అందువల్లనే క్రియాపద మేకవచనమున నుండుననియు భావించెను. కాల్డ్వెలు ద్రావిడభాషలలో ఏకవచన మొక్కటే ప్రథమమున నుండెడిదనియు, క్రమక్రమముగా

ఉన్నతజాతిశబ్దములందును, క్రియాపదములందును వచన విభాగము కలిగెననియు నుద్దేశించెను.

కురుఖ్ భాషలో బహువచనమును జెప్పుటకు నామముపై మరొక శబ్దమును చేర్తురు॥ ఎర్పా గుట్ఠి (ఇండ్ల సమూహము; ఇండ్లు)॥ తమిళ కన్నడములందలి కళ్, గళ్ అనునవి గూడ నట్టివే ॥ కైగళ్॥ కురుఖ్ భాషలో ఏకవచనమున పురుషబోధకము లొక విధముగను, స్త్రీ జడ బోధకము లొక విధముగను నుండును॥ కుక్కొ-స్ (బాలుడు); ముక్కా- (స్త్రీ); ఎర్పా (ఇల్లు)॥ బహువచనమున జడవాచకము మార్పు నొందదు॥ ఎర్పా॥ స్త్రీపురుష వాచకములకు బహువచన ప్రత్యయమగును॥ ముక్కర్ (స్త్రీలు); కుక్కొర్ (బాలురు)॥

కన్నడమున తమిళమునందువలెనే నపుంసకములకు 'గళ్'అనియు, స్త్రీపుంలింగములకు 'ర్' అనియు బహువచనమున నగును॥ మరగళ్ (చెట్లు); ఊర్గళ్ (ఊళ్ళు); స్త్రీయర్ (స్త్రీలు); అరసర్ (రాజులు)॥ కొన్నిచోట్ల ఉన్నతజాతి పదములమీద కూడ 'గళ్' అని వచ్చుచున్నది॥ తండెగళ్ (తండ్రులు); తండెతాయిగళ్ (తల్లిదండ్రులు)॥

గోండుభాషలో సమూహార్థమునను, కొన్ని మృగములకును బహువచనమున రకారము వచ్చును॥ మామురియలోర్ (మామలు); వర్తలోర్(అతిథులు); అర్జలోర్ (ఎలుగు బంట్లు)॥ ఇతరములగు వానికి బహువచనమున 'క' కారమగును॥ కైక్ (చేతులు); పుల్క్ (పెద్ద పులులు); మల్క్ (నెమిళ్ళు)॥ బ్రాహుయీభాషలోకూడ॥ బాక్ (నోళ్ళు); ఈర్క్ చెల్లెండ్రు)॥ అన్నట్లుగా బహుత్వమునందు కకార మగును.

మొత్తముమీద ద్రావిడభాషలలో పెక్కింట కకార గకార ములే బహువచన ప్రత్యయములుగా నగుచున్నవి. మహద్బహువచన ప్రత్యయముగా పెక్కుచోట్ల రకారము వచ్చుచున్నది. తెలుగున 'చెలి యలు' మున్నగు స్త్రీవాచకములకు కూడ బహువచనమున 'చెలి యండ్రు' అన్నట్లు 'రు' వర్ణము కలుగుచున్నది.

తమిళమందు కొన్నిచోట్ల 'అ' కారమే బహుత్వమును సూచించును॥ పొరుళ (వస్తువులు); పల (పెక్కు)॥ అట్లే 'ర' కారము చేరిన మీదట మరల 'కళ్' అని చేరుటయు కలదు॥ అవర్‌గళ్॥ తెలుగున మీరు, మీరలు, వీరు, వీరలు-అను నిట్టిచోట్ల బహువచనముపై మరల 'లు' వర్ణకము కలుగుచున్నది.

స్త్రీవాచకమునకు ఏకవచనమున అది, ఇది అని వాడినను, బహువచనమున వారు, వీరు అని మహదర్థక సర్వనామములనే వాడవలయును. క్రియాపదమునుకూడ ఇట్టియెడల ఏకవచనమున 'అది'శబ్దముతో అంతము చేయవచ్చును; బహువచనమున మహదర్థక క్రియనే వాడవలయును॥ అది మంచిది; వారు మంచివారు; అది వచ్చెను; వారు వచ్చిరి॥

అరవమునను, తెలుగునందును ఉభయార్థకాస్మద్బహువచనము కూడ కలదు. 'నేను' అనునది యేకవచనము. 'మేము' అనునది బహువచనము. 'మనము' అనునది ఉభయార్థక బహువచనము. అరవమున ఏకవచనమున 'యాన్' అనియు, బహువచనమున 'యామ్' అనియు, ఉభయార్థక బహువచనమందు 'నామ్' అనియు నుండును. ఈ ఉభయార్థకమునకు గూడ అన్ని విభక్తులయందును రూపనిష్పత్తి కలదు. కన్నడమునందు కర్తృభూత మగు నుభయార్థకము లేదుగాని ఉభయార్థక కర్తృక క్రియ గలదు.

# సర్వనామ ప్రకరణము

ఆంగ్ల వ్యాకరణసంప్రదాయము ననుసరించి సర్వనామము లనగా, నామవాచకములకు బదులుగా వాని స్థానమున నుపయోగించుటకు వీలగునవి యని యర్థము. He, It, I, Thou Thisమున్నగునవి యుదాహరణములు.

సంస్కృతమున "సర్వాదీని సర్వనామాని" యని నిర్వచించిరి. సర్వ, విశ్వ, ఉభ, ఉభయ మున్నగునవి ముప్పదియైదు సర్వాదిగణము నందు గలవు. విభక్తివిధానము వీనికి నామవాచకములకంటె భిన్నముగా నుండును॥ రామాయ (రామునికొఱకు); తస్మై (వాని కొఱకు)॥

తెనుగున "అన్నిప్రభృతులు సర్వనామములు" అని సూరి సూత్రించెను. ఇది సంస్కృత నిర్వచనమున కనువాదమే యైనను వీని కన్నింటికి నొకసామ్య ముండుటవలన ఈ నిర్వచనము సమంజసమే యనిపించుకొనును. నేను, తాను మున్నగు స్త్రీపురుషోభయయోగ్యములును; అది, వాడు మున్నగు నామవాచక స్థానయోగ్యములును; అన్ని, కొంత మున్నగు పరిమాణ బోధకములును; ఏమి, ఎవడు మున్నగు ప్రశ్నార్థకములును; సంబంధబోధకములును మూలభూతమైన యేకత్వమును కలిగియున్న వనుటలో విప్రతిపత్తి లేదు. సంఖ్యావాచకములుకూడ సర్వనామములందే చేరును. సర్వనామములందును సంఖ్యావాచకములందును, నిత్యోపయోగిశబ్దములందును గల సామ్యమునుబట్టియే యే భాషలనైనను నొక కుటుంబముగా పరిగణింపనగును. ద్రావిడభాషల యందు ఆ సామ్యము స్పష్టముగా కనిపించును.

కన్నడ వైయాకరణులు సర్వనామశబ్దమును సంస్కృతమునుండి యథాతథముగా గ్రహించిరి. శబ్దమణిదర్పణకర్త సర్వనామశబ్దములను వేరుగా పరిగణించి, యుదాహరించెను. అరవమున ప్రత్యేకముగా నొక విభాగముగా సర్వనామములను పేర్కొనలేదు. ఐనను 'యాన్' 'తాన్' మొదలయిన సర్వనామశబ్దములను నన్నూల్ రచయిత యగు

పవణంది 'పొదు పెయర్' అను పేరున పరిగణించెను. రెండు లింగము లకును సామాన్యమగు పేరు గావున దీనికి ఈ పేరు గల్గియుండును.

### నిర్దేశాత్మకములు

ద్రావిడభాషలయందు సాధారణముగా నిర్దేశాత్మక సర్వనామ ములు ఏకాచ్కములై యుండును. వానికి పిమ్మట ప్రత్యయము చేరి అవి పదస్థితిని పొందును. ప్రత్యయము చేరని రూపము ద్వితీయాద్యేకవచన విభక్త్యంగముతో సమానముగా నుండును. 'ఆ, ఈ, ఊ' అనునవి నిర్దేశాత్మకములు. 'ఏ' ప్రశ్నార్థకము; కొన్నిమెడల 'యా' అనియు నుండును. తెనుగున 'ఊ' అన్నది నశించిపోయినది. అట్లే కురుఖ్, తుళు, గోండు భాషలలో కూడ 'ఊ' కనిపింపదు.

తమిళమందు 'ఆ' అనుదానికి పుంలింగబోధకమయిన 'అన్' చేరగా 'అవన్' అని యైనది. అట్లే స్త్రీ లింగబోధక మైన 'అళ్' చేరగా 'అవళ్'అని యైనది. బహువచనమందు రెండింటిరూపము కూడ 'అవర్' అని యుండును. ఈ రూపము లన్నింటియందును ప్రధానముగు మూలప్రకృతి 'ఆ' యనునది స్పష్టముగా కనిపించుచున్నది. ప్రాచీన కన్నడమునందుకూడ 'ఆ' యను దానిపై నే రూపనిష్పత్తి జరిగినది. అవమ్, అవళ్,అవర్ అను రూపము లేర్పడినవి. ద్వితీయాది విభక్త్యం గము 'అవన్–' అనునది. ప్రథమైకవచనరూపమును నిదియును తుల్య ములే.

తెలుగున 'అవన్–' అనుదానికి గౌరవార్థమున బహువచనప్రత్య యము కలిగి 'అవన్రు' అనియై, స్వరప్లుతి కలిగి వఅన్రు > వాన్రు > వాండు అని యైనది. కావున తెలుగున నున్న 'వాడు' అను సర్వ నామముకూడ నిర్దేశాత్మక సర్వనామ మగు 'ఆ' కారము మూలభూత ముగా ఏర్పడినదే. ఆకారము దూరమును నిర్దేశించును.

సమీపనిర్దేశకమగు 'ఈ' కారముపై ఇట్లే జరుగగా అరవమున ఇవన్, ఇవళ్, ఇవర్ అనురూపములు కలుగుచున్నవి. ప్రాచీన కన్నడ మున ఇవమ్, ఇవళ్, ఇవర్ అను రూపములును, తెలుగున 'వీడు'

అను రూపమును కలుగుచున్నవి. హళోసగన్నడమునందు ఉదంతత్వము కలిగి అవను, అవళు, అవరు అనియును; ఇవను, ఇవళు, ఇవరు అనియు రూపములు కలుగుచున్నవి. హళోసగన్నడమందు 'ఆతను' అని మహ దర్థక తచ్ఛబ్దము మరొక రూపమును గూడ పొందును. తెలుగున అతఁడు, ఆతడు అన్నట్లు హ్రస్వదీర్ఘములతో రెండు విధములయిన రూపములు గలవు. "అతగాఁడు" అను 'గా' ప్రత్యయముతోడి రూపముకూడ గలదు.

కుయిభాషలో మహత్తచ్ఛబ్దము ఏకవచనమున 'అలన్జు' అనియు, బహువచనమున 'అలరు' అనియు నుండును. తుళుభాషలో ఏకవచనమున 'ఆయె' అనియు బహువచనమున 'ఆరు' అనియు నుండును. గోండుభాషలో ఏకవచనమున 'ఓల్' అనియు, బహువచనమున 'ఆర్' అనియు; కురుఖ్ భాషలో ఏకవచనమున 'ఆన్' అనియు, బహువచనమున 'ఓర్' అనియు నుండును.

అవళ్. ఇవళ్ శబ్దములతో సమానమగు స్త్రీలింగ బోధకము తెలుగున కనిపింపదు. ప్రాచీనకాలమున తెలుగున స్త్రీబోధకముగ 'అది, ఇది' శబ్దములనే అమహత్తులతో సమానముగా వాడెడివారు. అయినను భాషలో 'ల' కార యుక్తమైన రూపము లేకపోలేదు. 'ఆలు' (ఆ-అళ్) అని అనగా భార్యయను రూఢి కలదు. కాని కేవలము స్త్ర్యర్థమున మనుమరాలు, జవరాలు మున్నగుచోట్ల కనిపించు చున్నది. అనగా స్త్రీ యను నర్థమున ప్రాథమికదశలో నుండియు, తరువాత ఆ యర్థమును గోల్పోయి, భార్యయను నర్థమున రూఢిని సంపాదించుకొనియుండును. ఇంతకును భాషలో ఆమె, ఆపె, ఆకె, ఆయమ, ఆవిడ మున్నగుశబ్దములు స్త్రీబోధకములు పెక్కులు గలవు. వీని యన్నింటియందును మూలభూత మగు 'ఆ' కారము కలదు. అట్లే ఈమె, ఈపె మున్నగువానియందు సమీపనిర్దేశక మగు 'ఈ' కారము మూలభూతముగా కనిపించును.

తుళుభాషలో వలెనే కూర్గుభాషలో మహదేకవచనమున 'ఆమె' అను రూపము గలదు. దానికి స్త్రీలింగ రూపము 'ఆలు' అనియే. తెలుగున 'ఆయన, ఈయన' యనువానితో ఈ మహద్రూప మునకు సంబంధము స్పష్టముగా కనిపించును.

అమహదర్థకములందును, నిర్దేశాత్మకసర్వనామములే మూల భూతములై యున్నవి. తమిళకన్నడములందు మిక్కిలి దూరమును సూచించుటకు 'అదు' అనియు, కొంతదూరమును మాత్రము సూచించు టకు 'ఉదు' అనియు, సామీప్యమును సూచించుటకు 'ఇదు' అనియు అమహద్రూపమును వాడుదురు. తెలుగున 'అది' 'ఇది' అను రెండు రూపములే కాని మాధ్యమికరూపము లేదు. బహువచనమునందు 'ద' కారమునకు బదులుగా 'వ' కారము కలిగి 'అవు, ఇవు; అవి, ఇవి' అను రూపములు కలుగును.

కురుఖ్ భాషయందు ఇద్, కూద్, ఆద్ అనునట్టి రూపములు గలవు. బ్రాహుయీభాషయందు ఏతచ్ఛబ్దమునకు 'ఈ' అని 'ఎద్' అని రెండు రూపములు నుండును. 'ఓద్' 'దాద్' అను రెండును కించి ద్దూర, దూరవస్తువులకు ఉపయోగించును.

కుయిభాషలో 'ఆ, ఈ, ఓ' అనునవి నిర్దేశాత్మకములు. 'ఓ' యనునది 'ఊ'యొక్క రూపాంతరమే యగును॥ 'ఈవడిన్గ' (ఈజాలు) ఓకొడి (ఆ[దూరముననున్న] యావు)॥ కూర్గుభాష యందు 'ఇదు, అదు' అనియు, తుళుభాషయందు 'ఈ, ఆ' అనియు, గోండ్ భాష యందు 'ఇద్, అద్' అనియు రూపములు గలవు.

### ప్రశ్నార్థకములు

ప్రశ్నార్థకమునందు 'ఏ' అని కాని 'యా' అని కాని సర్వరూప ములందును మూలభూతమై కనిపించును. అరవమునందు యావన్, యావళ్, యావర్ మున్నగువిధముగా ప్రశ్నార్థకరూపము లుండును. పలగన్నడమునందు 'యా' అనునది 'ఆ'గా పరిణతి నొంది కనిపించును. 'ఆవమ్, ఆవళ్, ఆవర్' అను విధముగా రూపము లుండును. హాస

గన్నడమందు 'యావను, యావళు, యావరు' అను రూపములుగలవు. మహదేకవచనమున 'ఏను' అను రూపముగూడ గలదు.

తెలుగున ఎవఁడు, ఎవతె, ఎవరు, అని ఎకారవిశిష్ట రూపము లుండును. 'ఎవఁడు' అనునది 'ఏవాఁడు, ఎవ్వాఁడు, ఎవ్వఁడు' మున్నగు రూపములను 'వేఁడు' అను వర్ణవ్యత్యయముతోడి రూపమునుగూడ పొందును.'ఎవతె'అనునది 'ఎవ్వతె, ఎవ్వరితె, ఎవ్వరిత' మున్నగు పెక్కు రూపములను బొందును. 'ఏది' మున్నగు అమహదర్థక ప్రశ్నార్థకము స్త్రీ వాచకమైనప్పుడును ఉపయోగించును.

బ్రాహుయీభాషలో 'ఎవరు' అను నర్థమున 'దేర్' అనియు, 'ఏది' అను నర్థమున 'అరా' అనియు రూపములు గలవు. తుళుభాషలో 'ఏమి' అను నర్థమున 'దా' అనియు 'దానె' అనియు రూపములు గలవు. ఇందలి దకారము పూర్వపద మగు ఇద్, అద్ అనుదాని అవశిష్టమే యని యూల్సుబ్లాక్ అభిప్రాయము. కూర్గుభాషలో 'ఎవరు' అను నర్థమున 'ఏవు' అని యుండును. 'ఏమి' అను నర్థమున అరవకన్నడములందు 'ఏన్' అని యుండును. తెలుగున 'ఏమి' అని యున్నను 'ఏన్' అన్నరూపముకూడ ప్రశ్నార్థకముగ లేకపోలేదు॥ నీకే బ్రాఁతియే॥

'ఏది' అను నర్థమున అరవమున 'ఎన్న' అనియు, కూర్గు భాషయందు 'యెన్న' అనియు, కురుఖ భాషయందు 'ఏకా' అనియు, తుళు భాషయందు 'వొవు' అనియు గలవు. వీనిలో ఎక్కువభాగము ఏకారముతో ప్రారంభమైనవే. కొన్నిచోట్ల 'ఏ' అన్నది 'యా' కారముగను, కొన్నిచోట్ల 'ఆ' కారముగను కనిపించుచున్నది.

ఇట్లే ప్రదేశనిర్దేశమందుకూడ అక్కడ, ఇక్కడ, ఎక్కడ అని ఆ, ఈ, ఏలతోడి రూపములే కలవు. అటు, ఇటు, ఎటు అనునవికూడ అట్టివే. అరవమున గల అంగె, ఇంగె, ఎంగె అనునవియు అవ్విడమ్, ఇవ్విడమ్, ఎవ్విడమ్ అనునవియు నిట్టివే. అందు. ఇందు, ఎందు అను వానిలో కూడ అ, ఇ, ఎలు దూర సమీప ప్రశ్నార్థకములై ఉన్నవి.

అంత, ఇంత, ఎంతయను మానార్థకములు నిట్టివే. అరవమున గల 'అత్తనై' కన్నడమున గల 'అనితు' అను రూపములు తెలుగున'అంత'తో సమానార్థకములు.

'అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు' అనునవి అరవమున 'అప్పోదు, ఇప్పోదు, ఎప్పోదు' అనియు కన్నడమున 'ఆగ, ఈగ, యూవాగ, అనియు నుండును.

'అన్ని, ఇన్ని, ఎన్ని' 'అందఱు, ఇందఱు, ఎందఱు' మున్నగు రూపములు కూడ 'ఆ ఈ ఏ' లను మూలరూపములుగా కలిగియున్న వనుట నిర్వివాదము. కాల్డ్వెలు అభిప్రాయము ప్రకారము 'ఆ ఈ ఊ ఏ' అనువానికంటె 'అ ఇ ఉ ఎ' అను హ్రస్వరూపములే ప్రాచీనతరములు. శ్రీసోమయాజిగారు 'విశేషణరూపము లన్నియును 'ఆ ఈ ఊ' అను దీర్ఘరూపములతో నుండుటవలన నవియే ప్రాచీనతరము లేమో యనియు ననుమానము కలుగక మానదు' అని చాల సమంజసముగా నూహించిరి. ప్రౌఢవ్యాకర్త ఆ, ఈ, ఏ అను దీర్ఘముల పైనే సర్వనామరూప సాధనప్రక్రియను జరుపుట దీనికి ప్రోద్బలకముగా కూడ నున్నది.

ప్రశ్నమునందును సంభావనమునందును వాక్యాంతమున గాని, పదాంతనముగాని ఆ, ఏ, ఓ అనునవి కలుగును. 'వాఁడా?' అని కాని 'వాఁడు వచ్చునా?' యని కాని యన్నప్పుడు ఆకారము ప్రశ్నార్థకము. 'నమ్మవచ్చునే, ఉండునే' మున్నగుచోట్ల ఏకారము ప్రశ్నార్థకము. 'వేంచేయునో, ఏమిగాఁదలఁచునో'' మున్నగుచోట్ల 'ఓ' సంభావనమునందగును. ప్రశ్నమా, సంభావనమా యన్నది కాకువుమీద నెక్కువగా ఆధారపడి యుండును. అరవమునకూడ నిట్లే 'వమ్మది త్తానా ?' 'వరువానా?' అని ఆకారము ప్రశ్నార్థకమగును. కురుఖ్ భాషలో 'నే' అనియు, తుళుభాషలో 'నా' అనియు 'వా' అనియు, గోండుభాషలో 'బా' అనియు నున్నరూపముల కడపటి 'ఏ, ఆ' వర్ణములు ప్రశ్నార్థకములే. అనిర్దిష్టములకు 'ఓ' అనునది చేరును॥ ఎవరోయని॥

పైని చూపిన 'ఈ ఆ' అను సర్వనామములు యుష్మదస్మత్ శబ్దములకు సైతము మూలభూతములై యుండెనని పరిశీలనమీదట తెలిసికొన నగును.

యుష్మదస్మదాత్మార్థకములు

ఇండో యూరోపియనుభాషలలో ప్రథమైకవచనరూపమునకును ద్వితీయాద్యేకవచనాంగమునకును, సంబంధము చాల తక్కువగా కని పించును. కాని ద్రావిడభాషలలో ఈ సంబంధము స్పష్టముగా గలదు. చిన్న చిన్న మార్పు లేమేని యున్నను, వానికి కారణములను వివరించు నవకాశము కలిగియే యుండును.

యుష్మదస్మదర్థకముల మూలప్రకృతి దీర్ఘము; దాని పైని ప్రథమయందు చేసు ప్రత్యయము హ్రస్వము. ఇది యించుమించుగా ద్రావిడభాష లన్నింటియందును నొక లక్షణముగా కనిపించును.

అరవమందు అస్మదర్థకము ప్రథమైకవచనమున 'యాన్' అనియు, బహువచనమున 'యామ్' అనియు నుండును. ద్వితీయాదు లందు 'ఎన్నై, ఎమ్మై' అనునట్లుగా ఎత్వవిశిష్టము లగు రూపము లేర్ప డును. మలిగన్నడమున ప్రథమావిభక్తియందు 'ఆం' అనియుండును. దానికి రూపాంతరము 'నాం' అని కూడ కలదు. ద్వితీయాదివిభక్తు లందు 'ఎన్నం, ఎమ్మం' అను విధముగా ఎత్వవిశిష్టముగా నుండును. రూపాంతరములుగా 'నన్నం, నమ్మం' మున్నగు రూపములు గలవు. హొసగన్నడమున ప్రథమైకవచనమున 'నాను' అనియు బహువచన మున 'నావు, నావుగళు' అనియు రూపములు. ద్వితీయాదులందు 'నన్నన్ను, నమ్మన్ను, అను విధముగా రూపములు గలవు. తెలుగునందు ప్రథమైకవచనమున 'ఏను, నేను' అనియు, బహువచనమున ఏము, నేము, మేము' అనియు రూపములు గలవు. ద్వితీయాదులందు 'నన్ను, మమ్ము మున్నగురూపములు గలవు.

తుళుభాషలో ప్రథమైకవచనమున 'యాన్', ద్వితీయాది విభక్త్యం గముగ 'యెన్' అని యుండును. తుద భాషలో ప్రథమైకవచనమున

'ఆన్', ద్వితీయాదివిభ క్త్యంగము 'ఎన్' అని యుండును. గోండుభాషలో ప్రథమైవచనము 'అన్నా', ద్వితీయాదివిభ క్త్యంగము 'నా'. ఖోండు భాషలో ప్రథమైకవచనము 'ఆను', ద్వితీయాదివిభ క్త్యంగము 'నా'.

పైనున్న రూపముల నన్నింటిని చూడగా అకారాదులయిన 'ఆం' మున్నగురూపములును, యకారాదులయిన 'యాన్' మున్నగు రూపములును, నకారాదులయిన 'నాం' మున్నగురూపములును గని పించుచున్నవి. ఇందు దేనిని ప్రధానరూపముగా గ్రహింపవలయు నన్నది ప్రశ్న. అరవమునందు నన్నూల్ గ్రంథకర్త 'నాన్, యాన్' అను రూపములందు 'యాన్'కే ప్రాధాన్యమిచ్చెను. కాల్డ్వెల్లు మాత్రము 'నాన్' అనునది ప్రాచీనరూప మైయుండునని మొట్టమొదట నిర్ణయించెను; కాని తరువాత తన యభిప్రాయమును సవరించుకొనెను. 'నాన్' అనుదానియందు 'ఆ' అనునది మూలధాతువు. చివరనున్న 'న'కారము ఏకత్వమును బోధించు ప్రత్యయము. ముందర నున్న 'న' కారము కూడ ఒక ఆగమము. ఇది యుష్మదస్మదర్థకశబ్దములు రెం డింటి యందును సమానముగా నున్నది. కావున కాల్డ్వెల్లు 'ఆ' యను నది అస్మదర్థకమూలధాతు వని నిర్ణయించెను. డా॥ గుండెర్టు కూడ 'నాన్' రూపముకంటె 'యాన్' రూపమే ప్రాచీనమని తలంచెను. వగోర్ 'నాన్' రూపముకంటే 'యాన్' రూపమే ప్రాచీనమని చెప్పుచు, ముందరనున్న 'య' కారమును కూడ తొలగించి 'ఆన్' అని కాని 'ఏన్' అని కాని అస్మద్రూపమూలధాతువగునని నిర్ణయించెను. కాల్డ్వెల్లు వారి వాదముతోనే ఏకీభవించెను.

ద్రావిడభాషలందు 'య' కారమునకు ఒకవిశిష్టమైన లక్షణ మున్నది. అది కొన్నిభాషలలో ఆకారముగను, కొన్నిభాషలలో ఏకా రముగను పరిణామము నొందును. ఇచ్చట అట్టియకారమే పూర్వమందు చేరియుండును. అరవమున నున్న 'యార్' వ్యావహారికతమిళమున 'ఆర్' అని అయినది. తెలుగున నది 'ఎవరు' అనినైనది. అట్లే అర వమునందలి 'యానై' కన్నడమున 'ఆనె'గా మారి, తెలుగున 'ఏనుగు'

అని నైనది. కావున 'ఆ ఏ' లుగా మారు గుణము 'య' కారమునకు గలదు. 'స' కారము వ్యవధానసంరక్షకముగా అతిప్రాచీనకాలము నుండియు అరవమున చేరుచునే యున్నది. అరవమునందలి 'నీన్దు' తెలుగున 'ఈదు' అని యగును. సంస్కృత 'యుగ' శబ్దము అరవమున 'నుగమ్' అనినైనది. 'యమ' శబ్దము తమిళకావ్యములందు 'నమన్' అనియు 'ఎమన్' అనియు మారినది.

వీని యన్నింటినిబట్టి 'యూన్' అనునది మూలభూత మగు రూప మని గ్రహింపవచ్చును.

యుష్మదర్థమునందు అరవమున ప్రథమైకవచనమున 'నీ'యనియు, బహువచనమున 'నీయర్' అనియు రూపము; ద్వితీయాదివిభక్తులందు 'నిన్నై, నుమ్మై' మున్నగు రూపములు గలవు. పఱిగన్నడమున ప్రథమావిభక్తియందు 'నీం' అనియు ద్వితీయాదివిభక్తులందు 'నిన్నం, నిమ్మం' మున్నగురూపములును గలవు. హొసగన్నడమున ప్రథమైకవచనమున 'నీను' అనియు, బహువచనమున 'నీవు, నీవుగళు' అనియు, ద్వితీయాది విభక్తులందు 'నిన్నన్ను, నిమ్మన్ను' మున్నగువిధముగను రూపములు గలవు. తెలుగున ప్రథమైకవచనమందు 'ఈవు, నీవు' అనియు, బహువచనమున 'ఈరు, మీరు' అనియు, ద్వితీయాదివిభక్తులందు 'నిన్ను, మిమ్ము' మున్నగువిధముగను రూపములుండును.

కుయిభాషలో ప్రథమైకవచనము 'ఈను', ద్వితీయాది విభక్త్యంగము 'నీ'. తుళుభాషలో ప్రథమైకవచనము 'ఈ', ద్వితీయాదివిభక్త్యంగము 'నిన్'. కురుఖ్ భాషలో ప్రథమైకవచనము 'నీన్', ద్వితీయాదివిభక్త్యంగము 'నిన్'. బ్రాహుయీ భాషలో ప్రథమైకవచనము 'నీ', ద్వితీయాదివిభక్త్యంగము నకారము.

ఈ రూపములందును తొలుత చేరిన నకారము ఆగమమే. 'ఈ' అనునదే యుష్మదర్థకమూలధాతువు. తెలుగు, కుయి మున్నగు భాషలలో ఏకవచనమున ఈకారముతోడి రూప మున్నది. బహువచనమున తెలుగు, కుయి, అరవములలో 'ఈరు' అని ఈకారముతో కూడిన రూపములున్నవి.

బహువచనమునందు అరవమున ద్వితీయాదులందు 'ని' 'ను' గా మారుచున్నది. ఇది తరువాత వచ్చు 'మ'కారము యొక్క ఆకర్షణ వలన కానగును.

ఆత్మార్థమున అరవమున ప్రథమైకవచనమున 'తాన్' అనియు, బహువచనమున 'తామ్' అనియు ద్వితీయాదులందు 'తన్నై, తమ్మై' మున్నగువిధముగను రూపము లుండును. పటగన్నడమున ప్రథమా విభక్తియందు 'తాం' అనియు, ద్వితీయాదులందు 'తన్నం, తమ్మం' మున్నగువిధముగను రూపము లుండును. హాసగన్నడమున ప్రథమైక వచనమున "తాను" అనియు బహువచనమున 'తావు, తావుగళు' అనియు, ద్వితీయాదులందు 'తన్నన్ను, తమ్మన్ను' మున్నగువిధముగను రూపములుండును. తెలుగున ప్రథమైకవచనమున 'తాను' అనియు, బహువచనమున 'తాము' అనియు, ద్వితీయాదులందు 'తన్ను, తమ్ము' మున్నగువిధముగను రూపము లుండును.

కురుఖ్ భాషలో ప్రథమైకవచనమున 'తాన్' అనియు బహువచనమున 'తాం' అనియు, ద్వితీయాదివిభక్త్యంగమునందు 'తన్' అనియు రూపములు గలవు. తుళు, కూర్గు, కుయి భాషలలో ప్రథమైకవచనమున 'తాను' అనియు, బహువచనమున వరుసగా 'తనుక్ళు, తంగ, తారు' అనియు రూపములుండును. ద్వితీయాదివిభక్త్యంగ మేర్పడుటకు ధాతుగతమగు అచ్చు హ్రస్వమగును.

యుష్మదస్మదాత్మార్థకములందు కడపట నున్న నకారము బహువచనమునందు మకారమగుచున్నది. తెలుగునందు కడపట నున్న నకారమే కాక, తొలి నకారముకూడ మకారముగా మారుట విశిష్ట లక్షణము॥ నేను; మేము; నీవు; మీరు; తాను; తాము॥

ద్రావిడభాషలయందు అస్మదర్థకశబ్దమునకు బహువచన రూపమే కాక, ఉభయార్థవాచక మొకటి యుండుట విశిష్ట లక్షణము. ఇండో యూరోపియను భాషలలో ఇట్టి రూపము లేదు. "సంస్కృతమున 'అస్మద్' శబ్దమునకు 'ఆవామ్, నౌ' అను రెండురూపములు గలవనియు

అందు 'నౌ' అనునది ఋగ్వేదమునందలి 'సహనావవతు' మొదలగు స్థలములలో ఉభయార్థవాచి యనియు నట్టి యభ్యాసము సంస్కృతము నుండియే ద్రావిడభాషలకు వచ్చినదనియును ఊహింపఁబడినది" అని శ్రీ సోమయాజిగారు వ్రాసిరి. అది యన్నిచోట్లను వక్తను శ్రోతను కలిపియే బోధించినప్పటికిని, 'మే మిరువురము' అను నర్థముకూడ నుండి యున్నచో, దానిని ఉభయార్థవాచకమనుటకు వీలులేదు. ఆంగ్లమున 'we' అను పదమునకు హిందీలో 'హమ్' అను పదమునకు 'మేము, మనము' అను రెండర్థములును గలవు. అన్నిభాషలయందు ఇట్లుండ వచ్చును. ద్రావిడభాషలయందు 'మనము' అనునది 'మేము' అనుదాని కంటెభిన్నమైనది. వక్త శ్రోతనుగూడ కలిపికొన్నప్పుడుమాత్రమే దీనిని వాడును. తమిళమునందు 'నామ్'అనియు, తెలుగునందు 'మనము'అనియు, కుయిభాషలో 'ఆజు' అనియు, కురుఖ్ భాషలో 'నామ్' అనియు, తుళు భాషలో'నమ'అనియు ఉభయార్థకములు ప్రథమావిభక్తియందుండును. ద్వితీయాదివిభక్త్యంగము అరవము, కురుఖ్, తుళుభాషలందు 'నమ్' అని యుండును. తెలుగున 'మన' యని కుయిభాషయందు 'మా'యని యుండును.

పెక్కు ద్రావిడభాషలలో కనిపించు ఈ ఉభయార్థకము ద్రావిడ భాషలలో విశిష్టమైనది.

సంబంధబోధకములు

యత్తత్ప్రయోగము ద్రావిడభాషలలో సంస్కృత సాహచర్య మున నేర్పడియుండును. తెలుగున గల ప్రాచీన శాసనములలోగాని, అరవ కన్నడభాషలలోగాని యీవిధమగు యత్తద్బోధక సర్వనామ ముల వ్యవహారము అంతగా కనిపింపదు. 'ఎవడు బాగుగా వ్రాయునో వాఁడు కృతార్థుడగును.' అని యీవిధమగు సమాంతరములగు రెండు వాక్యములను 'ఎవడు, వాడు' అను సర్వనామములసంబంధముచేత ఏక వాక్యముగా వ్రాయుట ద్రావిడ మనస్తత్వమునకు తెలియని విద్య. ఈనాటికిని వాడుకయందుగాని, గ్రంథములందుగాని 'బాగుగా వ్రాసిన

వాఁడు కృతార్థుఁడగును' అన్నట్లు క్రియాజన్యవిశేషణముతోడనే వాక్య రచన గావించుట సంప్రదాయము. సూటియగు చిన్నవాక్యమే ద్రావిడ భాషలలో సాధారణముగా కనిపించును. క్రీ. శ. 1006 వ సంవత్సరము నందలి యొక శాసనవాక్యమును శ్రీ సోమయాజిగారు ఉదాహరించిరి. అది యిది. 'వేంగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ్వ స్థితిం దప్పక పాలించువారు'. ఇందు 'ఎవ్వరు, వారు' అను రెండు సంబంధ బోధకసర్వనామములతో వాక్యరచన సాగినది. ఇట్టి రచన కావ్య భాషలో మిగుల అనుకూలము. వాక్యమున కొకతూగును, సమాంతర మగు శైలిని కల్పించును. సంస్కృతము, ఆంగ్లము మున్నగు ఇండో యూరోపియను భాషలలో ఈ విధమగు రచనయెక్కువగా గలదు. నేటి ఉత్తర హిందూస్థానభాషలలోకూడ ఎక్కువగా కలదు. సంస్కృతము నుండి అనువాదము చేయునప్పుడుగాని, ఆంగ్ల హిందీ భాషలనుండి యనువాదము చేయునప్పుడు గాని మూలభాషల ప్రభావమువలన తెలుగులోనికి సంబంధబోధక సర్వనామముల తోడి రచనము ప్రవేశించినది. ఈనాడు ఈ విధమగు రచన యెక్కువగా నున్నను శ్రీ సోమయాజిగారు చెప్పినట్లు "నన్నయవ్రాసిన నాలుగువేల పద్యముల యందును, సుమారు 25 ప్రయోగములను మాత్రమే చేయుట యీ వాడుకయొక్క విరళప్రచారమునే సూచించుచున్నది".

ప్రశ్నార్థకములగు "ఎవఁడు, ఏది, ఎందు, ఏ, ఎంత" మున్నగు నవి వాక్యపూర్వభాగమున వచ్చును. వాక్యోత్తర భాగమున, సమాధానము రాకుండగనే సమాధానపరముగా "వాఁడు, అది, అందు, ఆ, అంత" మున్నగునవి వచ్చును. "ఎవడు, మున్నగుశబ్దములపై ఏని, ఓ మున్నగునవి రావచ్చును. అట్లే "వాడు" మున్నగు వానిపై "ఏ" అను నిర్ధారణార్థకము కలుగుచుండును.

అరవమున తొల్కాప్పియమందు యత్తత్ప్రయోగ ప్రసక్తి లేదు. కాని "మణిమేకలై" గ్రంథమునాటికే యీ విధమగు ప్రయోగము గ్రంథములకు కొంచెముకొంచెముగా నెక్కినది. కన్నడమున పవవ

శతాబ్దినాటికి సంబంధాత్మక సర్వనామముల ప్రయోగము శాసనములలో కనిపించుచున్నది. ఏమయినను ద్రావిడభాషలకు యత్తదన్వయము సాంప్రదాయికము కాదనియు, సంస్కృత ప్రభావమువలన ఏర్పడిన దనియు, ఇప్పటికిని విస్తృతిని పొందలేదనియు, అనుకొనుట సత్యసమ్మతము కాగలదు.

## అనిర్దిష్టార్థకములు

ఇంతవరకు చెప్పికొన్న వానిని గాక మిగిలినవానిని అనిర్దిష్టములుగా పరిగణింతురు.

కొంత, కొన్ని, కొందఱు మున్నగువానియందు ఆద్యక్షరము 'కొ'. సూర్యరాయాంధ్ర నిఘంటువు 'కొంచెము – అంత > కొంత' అయ్యెనని వ్రాసినది. ప్రౌఢవ్యాకరణమున 'ఒక – అంత > కొంత' అని వర్ణవ్యత్యయము కారణమున నైనట్లున్నది. భాషలో 'కొంచెము' అను శబ్దము గలదు. అది 'ఒక – ఇంచు' అను వానినుండి 'కొంచు' ఏర్పడి, తర్వాత 'కొంచెము' అయ్యెనని శ్రీ సోమయాజిగారి యభిప్రాయము. 'ఒక – ఇంచు' అన్నప్పుడు 'ఒకించు' అనిగాని తొలివర్ణమునకు లోపమురాగా 'కించు' అనిగాని యగుట సమంజసము. 'ఒక – అంత' అన్నప్పుడు 'ఒకంత' అనియై, స్వరప్లుతి కలిగి 'కొంత' యని కాగలదు. కావున 'కొంచెము' అను శబ్దముతో దీనిని ముడిపెట్టు నవసరమే లేదు. 'కొంత' అన్నది ఏర్పడిన పిమ్మట 'అంత, ఇంత, కొంత' అనియు 'అన్ని, ఇన్ని, కొన్ని' యనియు 'అందఱు, ఇందఱు, కొందఱు' అనియు సామ్యమున నేర్పడుట సులభమే.

'పెక్కు' అనునది పెక్కురు, పెక్కండ్రు మున్నగు విధముగా మహద్రూపములను పొందును. 'పెక్కు, పెక్కులు' అనునట్లుగా అమహద్రూపములును గలవు. 'పెర్' అనగా అధికము; దానికి కువర్ణము కలిగి 'పెక్కు' అనియైనది. ఇదే ధాతువు 'పేరు, పెరుగు, పేర్చు, పెద్ద' మున్నగు శబ్దములలో కనిపించును. అర్థమునుబట్టి బహువచనమేయైనను, 'పెక్కింటిని' మున్నగు ఔపవిభక్తికరూపము దీని ఏకవచనస్థితిని నిరూపించుచున్నది.

“పలు” అనునది “పలువురు, పలువుండ్రు” మున్నగు విధముగా మహద్రూపములను పొందును. “పలు పల్కులు” మున్నగువిధముగా అమహద్రూపమును పొందును. అరవమున “పల” అన్నది బహ్వర్థకము. తెలుగున అమహదర్థమున దీనికి వ్యస్తప్రయోగము లేదుగాని అరవమునను కన్నడమునను వ్యస్తముగా కూడ ప్రయోగములు గలవు.

సర్వార్థకమయిన ఎల్లశబ్దమొకటి గలదు. దీనిని చిన్నయసూరి అవ్యయముగా తెలిపెను. ఇది ద్రుతాంతము. సమాసమున దీనికి పూర్వమందే ప్రయోగము. సమాసద్రుతమునకు లోపమగును గనుక “ఎల్లయసురులు” అన్నట్లు రూపనిష్పత్తి యుండును. వ్యస్తముగానైనచో విశేష్యమునకు పిమ్మటనే దీనిని వాడవలయును. అప్పుడిది “అసురులెల్లన్” అనునట్లు ద్రుతాంతముగా నుండును. కావుననే దీనిని సర్వనామములతో చేర్పక సూరి అవ్యయముగా పేర్కొనెను.

ఇట్లు పెల్లు, లెస్స మున్నగునవి క్రియావిశేషణములై కనుపట్టును. పై సర్వనామములవలె నివి విశేష్యములకు పూర్వమందుగాక, క్రియలకు పూర్వమందు నిల్చును.

# విశేషణ ప్రకరణము

"విశిష్యతే అనేన ఇతి విశేషణమ్" అని విశేషణమునకు నిర్వచనము. దీనిచేత విశేషింపబడును కావున నిది విశేషణము. విశేషింపబడునది విశేష్యము. "లోకాభిరాముఁడు రాముఁడు" ఇందు 'రాముడు' విశేష్యము; 'లోకాభిరాముఁడు' అనునది విశేషణము. సంస్కృతమునందు విశేషణములు లింగ విభక్తి వచనములందు విశేష్యములతో సమానముగా నుండును. "మహాన్ పురుషః" ఇచ్చట విశేష్యము ఏకవచనము, పుంలింగము, ప్రథమావిభక్తి యందు కలదు. కావున విశేషణముకూడ సమముగా ఏకవచనము, పుంలింగము, ప్రథమావిభక్తియందే యున్నది. అట్లే "రమణీయాని వనాని"అని "నిరాశ్రయా లతా" యని విశేష్యముతో తుల్యమైన లింగ విభక్తి వచనములందే విశేషణముకూడ నుండును. ద్రావిడభాషలయందు విశేషణములకు ప్రత్యేకముగా లింగ విభక్తి వచనములు లేవు. గుణమునుగాని, జాతినిగాని, క్రియనుగాని, ద్రవ్యమునుగాని, సంఖ్యనుగాని, సంజ్ఞనుగాని తెల్పుశబ్దము నామవాచకమునకు ముందునిల్చును. స్థానమునుబట్టియే వీని కితరశబ్దములతో సంబంధ మేర్పడి, విశేషణత్వము కలుగును. 'మాట తీపి' అనునపుడు 'మాట' యనునది విశేషణమై 'తీపి' విశేష్యమగును. మాటయొక్క తియ్యదనమని యర్థము. 'తీపిమాట' యని యనునప్పుడు 'తీపి' యనునది విశేషణమై 'మాట' విశేష్యమగును. తియ్యన యగుమాట యని యర్థము. ఇచ్చట మాటలరూపమునందే మాత్రమును భేదములేదు; వేర్వేరుగా రెండును నామవాచకములే. రెండింటి నొకచోట చేర్చినప్పుడు స్థానమునుబట్టి ఒకటి విశేషణమును, ఒకటి విశేష్యమును నగుచున్నవి. ఇట్లే నడకమంచి, మంచినడక; వయసుపెద్ద, పెద్దవయసు - మున్నగువిధముగా ఎన్నెని ప్రయోగములు గలవు. అరవమున 'పొన్' అనగా బంగారము. 'పొన్నరిదు' అనునపుడు బంగారము అరుదైనది అని యర్థము. ఇచ్చట 'పొన్' అన్నది నామవాచకము. 'పొన్ ముడి'

అని యన్నపుడు బంగారు కిరీట మని యర్థము. ఇచ్చట 'పొన్' అన్నది విశేషణము. ఇట్లే నాయ్‌కుట్టి, ఎలివత్తై, ఈచ్చంపటం-మున్నగుచోట్ల చేరికనుబట్టియే పూర్వపదము విశేషణమగుచున్నది.

తత్సమ మువర్ణకాంతములు విశేష్యములకు ముందుచేరి విశేషణము లగును. ఇట్టియెడల మువర్ణకమునకు లోపమగును. ॥శుభము - దినము > శుభదినము॥ తెలుగులో నిట్లు వాడుచుండినను నిది సంస్కృత సిద్ధరూపమే. సంస్కృతములో నున్న సమాసమునే గ్రహించి తత్సమముగా వాడుకొనుచుంటిమే కాని, తెలుగున మువర్ణకమునకు లోపము గావించుటలేదు. తెలుగుశబ్దములలోని 'ము'వర్ణకాంతములకు ప్రత్యేకముగా విశేషణత్వము లేదు. స్థానమునుబట్టియే విశేష్యత్వముకాని విశేషణత్వముకాని కలుగును. ॥అందము-మొగము > అందపుమొగము॥ అని మువర్ణకము పుంపులుగా మారును. మువర్ణకచరిత్రమును సమీక్షించుచోట 'పుం, ంపు, ంబు' అనునవి 'ము' కారమునకు పూర్వరూపములని చెప్పికొంటిమి. సమాసములందు పూర్వరూపములే కనిపించును. అయినను 'మొగమందము' మున్నగుపుంపులు లేనిరూపములుకూడ లేకపోలేదు. భారతమున నన్నయభట్టారకుడు పుంపులకంటె పూర్ణబిందుపూర్వక బువర్ణముతోడివానినే విశేషణములుగా ఎక్కువగా వాడెను. 'తపంబు గౌరవంబు' 'తపముబలము' 'ఆశ్రమంబుదెస' మున్నగునవి యుదాహరణములు. తిక్కనకూడ 'లోకము సమరంబులు' మున్నగు విధముగా మువర్ణకాంతరూపములను వాడినను, పుంపులతోడి రూపములనే ఎక్కువగా వాడెను. ఇటుకాక 'మత్స్యమైన రూపంబు' 'నిత్యంబులైన కృత్యంబులు' మున్నగువిధముగ 'ఐన' అను క్రియాజన్యవిశేషణముతో కలుపుటయు గలదు. 'అగు' అను క్రియాజన్యవిశేషణమును కూడ తెలుగున వాడుదురు.

అరవమున విశేషణముమీాద 'ఆన' అనునది వచ్చి విశేష్యముతోడ సంబంధమును స్థాపించును.

"నామ్వాది కనుమ్వాదులకు పజ్చవర్ణంబులగును" అని చిన్నయ సూరి సూత్రించెను. ॥నాము–చేను > నాపచేను॥ ఇచ్చటకూడ పూర్వము వలెనే 'ము' వర్ణము పూర్వరూపమైన 'పు' వర్ణముగా మారుచున్నది. సంబంధమును తెలియజేయుటకు 'అత్వము' మరల చేరుచున్నది. అరవ మున నిట్టిచోట్ల ద్విత్వము కలుగుచున్నది. 'ఇరుమ్బు–కోల్'. బకారము నకు ద్విత్వము కలుగగా పకారమగును. 'ఇరుప్పుక్కోల్' అను రూప మేర్పడును. తెలుగున 'ఇనుపపెట్టె' అనునప్పుడు ఈ 'ప' కారము కని పించును. ఇది శబ్దగతమైనదే కాని ఆదేశము కాదు.

సంబంధమును నిరూపించుటకు అకారము చేరునని పైని చెప్పి కొంటిమి. అరవకన్నడములందు హలంతములై, ఏకాచ్కములయిన పదములు తెలుగున అదంతములై, ద్విత్వము నొంది విశేషణములైనవి. తెల్ల, నల్ల, పుల్ల, తియ్య మొదలయిన విశేషణములన్నియు ఆసామ్య మున నేర్పడినవే. కాని కాలక్రమమున ననియు విశేష్యములుగా వాడుక చేయబడుటచేత, విశేషణత్వమును సాధింపదలచి, కొన్నియెడల అత్వ మును, కొన్నియెడల ఇత్వమునుజేర్చి క్రొత్తరూపములను సాధించుకొన వలసి వచ్చినది॥ తెల్లన, తెల్లని; నల్లన, నల్లని; పుల్లన, పుల్లని; తియ్యన, తియ్యని॥ ఇందు తెల్లన మొదలగు అనంతరూపములు విశేష్యములుగా కూడ వాడుక నొందినవి. 'తనము'ను జేర్చి తెల్లని మున్నగువానికి విశేష్యత్వమును మరల కల్పించిరి॥ తెల్లనితనము, తెల్లదనము, తెల్లం దనము॥

ఇట్లు విశేషణము విశేష్యముగను, విశేష్యము విశేషణముగను వ్యత్యస్తముగా వాడబడుటనుబట్టి తెలుగుభాషలో విశేషణ విశేష్య నియమము సువ్యవస్థితముకాదని స్పష్టమగుచున్నది. ఒకపదమును విశేషణమనియు, విశేష్యమనియు వేఱుపఱిచియుంచుట భాషా సంప్ర దాయవిరుద్ధము.

అరవమునందు 'నాడు' మున్నగుశబ్దములకు 'ఇల్' అను ప్రత్య యము చేరును. ఇట్టియెడల శబ్దమునందలి తుదియక్షరమునకు ద్విత్వము

కలుగును. అరవమున ద్విత్వము పరుషాక్షరమే మైయుండును ॥నాట్టిల్॥ దీనిని విభక్త్యంగముగను, సమాసపూర్వపదముగను గూడ వాడ వచ్చును. నిన్నటి, మొన్నటి, క్రిందటి, ముందటి మున్నగువానిలోని టివర్ణముకూడ ఇట్టిదే. తెలుగున నిదియే 'నాటి' యని మైనది. ఔప విభక్తికములయిన ఇ, టి, తి యనునవి సంబంధార్థమునందలి 'ఇ'వర్ణము వలననే యేర్పడును. టి, తి అనువానిలోని టకార తకారములు పూర్వ శబ్దముల కడపటి భాగములు మాత్రమే. కాని, వానిసామ్యమున, తెలుగున కొన్ని తెలుగుశబ్దములకు ఇ, టి, తి అను వర్ణములు చేరి విశేషణత్వమును కలిగించుచున్నవి॥ ఊరికోవెల; నీటిలోతు; చేతిబలము॥ ఇవన్నియు సమాసకార్యములనియే వ్యాకర్తల నిర్ణయము. ఇళ్లే ఇందలి వారు, దొంగవలని భయము, తోడికోడండ్రు-మున్నగుచోటు లందలి ఇ వర్ణముకూడ సమాసకార్యములందే యగును.

క్రియాపదములందు 'ఇనాంతము' లయిన భూతార్థకములను, 'ఎడు, ఎడి' అని అంతమందుగల తద్ధర్మార్థకములను, 'కల' అని అంత మందుగల భవిష్యదర్థకములను, 'ఉన్న' అని యంతమందుగల వర్త మానార్థకములను, 'ని' వర్ణకాంతములయిన వ్యతిరేకార్థకములను విశేష ణములుగా వాడుదురు॥ వచ్చిన, వచ్చెడు, రాగల, వచ్చుచున్న, రాని॥ వీనికి విభక్తిని వినఞ్చించునపుడు దచ్ఛబ్దము వచ్చి చేరును॥ వచ్చినది, వచ్చినవాడు॥ మంచి, చెడ్డ మున్నగువానికి కూడ తచ్ఛబ్దము చేరును॥ మంచిది; మంచివాడు॥

## సంఖ్యావాచకములు

ద్రావిడభాషలయందు సంఖ్యావాచకములు విశేషణములుగను, విశేష్యములుగను రెండు విధములుగా నుండును. అరవ మలయాళ కన్నడములందు మహత్తులకును, అమహత్తులకును సమానముగనే సంఖ్యావాచకములను చేర్చుటకూడ కలదు॥ ఇరణ్డు పెయర్; ఇరు పెయర్॥ ఇట్టిసందర్భమున 'ఇరువర్' అని వాడుట సరియైనది. అయి నను విశేషణరూపమునకు బదులుగా విశేష్యరూపమును వాడుట

వ్యాకరణవిరుద్ధము కాదు. కాని తెలుగున మహదర్థకము లోకవిధము గను; అమహదర్థకము లోకవిధముగను నుండును॥ రెండు గుఱ్ఱములు; ఇద్దరు పురుషులు॥ సంస్కృతమునకూడ సంఖ్యావాచకములు మూడు లింగములందును భిన్నభిన్నరూపములు దాల్చును॥ ఏకః పురుషః; ఏకా స్త్రీ; ఏకం వనమ్॥ ఈ సంప్రదాయమున తెలుగు సంస్కృతసామ్య మును సంపాదించుకొన్నది. కాని తక్కిన ద్రావిడభాషలయందు ఈ సామ్యము కనిపింపదు.

ద్రావిడభాషలు పెక్కింటియందు విశేషణములు ఏకరూప మున గాన్పించును. విశేష్యములం దున్నంత రూపభేదము విశేషణము లందు లేదు. కావున విశేషణములే ప్రాచీనములనియు, విశేష్యములు తరువాత నేర్పడినవనియు ఊహించుట కవకాశము గలదు. ఒక్కొక్క యంకెను దీసికొని పరిశీలింతము.

ఒకటి ఈ యర్థమున అరవమునందు 'ఒన్ఱు' అనియు, పఱ గన్నడమున 'ఒందు' అనియు రూపములు గలవు. తెలుగున ఒండు, ఒకడు, ఒకటి, ఒక్కడు, ఒక్కటి యన్న రూపములు గలవు. ఒకడు, ఒక్కడు అనునవి మహత్తులుగను, అమహత్తులుగనుకూడ వాడ బడును. విశేషణరూపముగా ఒక్క, ఒక యనునవి వాడబడును. తక్కిన ద్రావిడభాష లన్నింటియందును 'ఒరు' అనునది ప్రధానముగా కనిపించును. 'ఒరు' అను రూపమునుండియే ఒన్ఱు, ఒండు, ఒందు అనునవి యేర్పడుటకు అభ్యంతరము లేదు. తెలుగునందలి 'ఒక' యను నదికూడ 'ఒరు' నుండియే యేర్పడు నవకాశము కలదు. అరవమున ఒరుకై, ఒరుక్కమ్, ఒరుక్క మున్నగురూపములు ఏకత్వబోధక ములై యున్నవి. పైని చెప్పిన రూపములలో 'ర'కారము శ్లథమగుట వలన గాని, లేదా మీది కకారముతో సంయోగము నొందుటవలనగాని 'ఒక్క' యనునది యేర్పడి 'ఒక' యని కాగలదు. కావున 'ఒరు' అను నదియే ప్రాచీనరూనము ఒన్ఱు, ఒండు, ఒందు మున్నగువానిలోని అద

నపు వర్ణములు ఉచ్చారణసౌకర్యముకొఱకు వచ్చియుండును. ఈ 'ఒన్రు' అను శబ్దము అరవమున క్రియగా కూడ వాడుక నొందియున్నది.

ఇండోయూరోపియనుభాషయందలి one లాటిను భాషలో Unus, గోథిక్ భాషలో Ains, తుంగీషియను భాషలో Um, మంచూ భాషలో Emu, సంస్కృతభాషలో 'ఏక' 'ఊనః' (ఏకోనవింశతి) మున్నగునవి ఒరు, ఒన్ పదములతో సంబంధము కలవిగా చూచియు చూచుటతోడనే అనిపించును. కాని ద్రావిడభాషలయందలి 'ఒర్' అను రూపమునుండియే 'ఒన్' అను రూపముకూడ ఏర్పడెనని తెలిసిన పిమ్మట ఆ భ్రమ తొలగిపోగలదని కాల్డ్వెల్ నిశ్చయము.

తెలుగునందలి 'ఒకడు' అను దానినుండియే మహదర్థకములయిన 'ఒకనిని; ఒకనిచే' మున్నగురూపము లేర్పడుచున్నవి. అమహదర్థకములై, ఔపవిభక్తికములయిన 'ఒకటి' మున్నగురూపము లేర్పడుచున్నవి. 'ఒండు' శబ్దమునుండి ఔపవిభక్తిరూపము 'ఒంటి' యనియేర్పడి, సమాసమున పూర్వపదముగను, వ్యస్తముగనుకూడ వ్యవహరించుచున్నది॥ ఒంటిగాడు; ఒంటిబ్రతుకు; ఒంటరి॥ అరవమున సంబంధసూచకమైన ఇకారము గలిగి 'ఒన్ఱిక్కారన్' అనురూప మేర్పడుచున్నది. విశేషణరూపముగా ఒకడు, ఒకతె, ఒకమాట మున్నగు విధముగా 'ఒక' యనునది తెలుగున నగును. అరవమున 'ఒరువర్' అనియు 'ఒరుత్తన్' అనియు పఱుగన్నడమున 'ఒర్వర్' అనియు, హళగన్నడమున 'ఒబ్బను' అనియు రూపములు. తెలుగున 'రు' వర్ణముపై 'డు' వర్ణము చేరిన రూపములుకూడ గలవు॥ ఒకరుడు; ఒకొరుడు॥ మహతియందు తెలుగున ఒకతె, ఒకతి, ఒకరిత మున్నగురూపములును; అరవమున 'ఒరుత్తి' అనియు, పఱుగన్నడమున 'ఒబ్బళు' అనియు రూపములు గలవు.

'ఒరుడు, ఒండు' అను రెండు పదములును తెలుగున 'ఇతరుడు' అనువర్థమునకూడ కలవు. ఒకటి మున్నగునవి అల్పార్థమునుబోధించును. 'ఒండు' శబ్దముపై 'ఏన్' అను ప్రత్యయము కలిగి 'ఒండె' అనినై వికల్పార్థక మగును.

'ఏక' శబ్దతుల్యముగా 'ఎక్కటి' అను పదము తెలుగున గలదు. అది యితరద్రావిడభాషలయందు లేదు. ఏక శబ్దమునకు ప్రాకృతమున 'ఎక్కమ్' అను రూపము గలదు. రెంటిని, మూటిని-అన్నప్పటివలె ఇక్కడకూడ ఔపవిభక్తిక టివర్ణము కలిగి 'ఎక్కటి' యైయుండును॥ ఎక్కటి కయ్యము॥ దీనికిని ఒరు శబ్దమునకును ఏ మాత్రమును సంబంధము లేదు.

రెండు : అరవమున 'ఇరణ్డు' అనియు, కన్నడమున 'ఎరడు' అనియు, మలయాళమున 'రండు' అనియు, తుళుభాషయందు రడ్డు' అనియు రూపములు గలవు. అరవమునందలి 'ఇరా' అనునది తెలుగున 'రే' అయినట్లే 'ఇరణ్డు' అనునది 'రెండు' అని కాగలదు. ఇదియు విశేషణముగను, విశేష్యముగనుకూడ నుపయోగింపబడును. కాని సమాసమున పూర్వపదముగా 'ఇర్' అని కాని 'ఈర్' అని కాని ద్రావిడ భాష లన్నింటియందును సమానముగా కనిపించును. అరవమున 'ఇరువర్' అనియు, కన్నడమున 'ఇబ్బరు' అనియు, తెలుగున 'ఇరువురు, ఇద్దరు' అనియు మహద్విశేషణములు గలవు. తెలుగు కన్నడములందు 'ఇరు' శబ్దరకారము తరువాతిహల్లుతో సంయోగము చెందునట్లు స్పష్టముగా కనిపించుచున్నది. తెలుగున మాత్రము మకారమునకు ముందు 'ర' కారము నకారముగా మారుచున్నది॥ ఇనుమారు; ఇను మిక్కిలి॥

'ఇర్' అనునదియే యిందు ధాతువు, ఉచ్చారణ సౌకర్యము కొరకు 'ఉ' అని కలుగగా 'ఇరు' అని యేర్పడినది. కన్నడమున నున్న 'ఎరడు' అనునది ప్రాచీనరూపమునకు సన్నిహితరూపమై యుండునని కాల్డ్వెల్ అభిప్రాయము. అరవమునందలి 'ఇరణ్డు' అనునది స్వరసామరస్యముకొరకు నడుమ నకారము చొచ్చినరూపము. దీనికంటె 'డ' కారము ద్విత్వమై పారుష్యమునొందిన 'ఇరట్టు' అనునది మూలమునకు సన్నిహితముగా కనిపించును. తెలుగున పదాంత డువర్ణమునకు వెనుక బిందువుండుట సాధారణలక్షణ మైపోయినది. గుండెత్తు 'రాత్రి' అను

నర్థము గల 'ఇరా' అను శబ్దమునకు 'చీకటి' యను నర్థము గల 'ఇరుల్' శబ్దమునకును 'ఇరు' శబ్దమునకును ముడిపెట్ట జూచెను. 'ఉండు' అను నర్థముగల 'ఇర్' అను మరొకధాతువుకూడ గలదు. కిట్టెల్ 'వేరుపరుచు' అను నర్థము గల 'ఈర్' అనునది 'ఇరు' అను దానికి మూలము కావచ్చు నని యభిప్రాయపడెను. ఏకత్వమును నిరూపించు 'ఒక్కమ్' అనునది 'ఒక్క' అయినట్లే, చీలికను దెల్పు 'ఈర్' సంఖ్యావాచకముగా 'ఇరు' అయియుండు నన్నవాదమును కాల్డ్వెల్ అంగీకరింపలేదు. 'ఇరు' అన్నది ప్రాథమికము. 'రెండు' అన్న అర్థముగల దీనినిబట్టియే 'రెండుగా చీలి పోవుట' అను నర్థమున క్రియాధాతు వేర్పడియుండు నని యతని వాదము. 'రెండు రెటు' అను నర్థమున తెలుగునందు 'రెట్టించు' అను క్రియయు, 'రెట్టింపు' అను కృదంతరూపమునుగూడ గలవు.

'రెండు' అను శబ్దముతో పోలికగల సమానార్థక శబ్దములు ఇండో యూరోపియనుభాషలయందు లేవు.

**మూఁడు** : అరవమున 'మూన్ఱు' అనియు, మలయాళమున 'మూన్ను' అనియు, కన్నడమున 'మూరు' అనియు, తుళుభాషయందు '**మూజి**' అనియు రూపములు గలవు. విశేషణములుగా 'ము, మూ' అను రెండు రూపములును గనిపించును. కన్నడమునందలి 'మూరు' అనునదియే ప్రాథమికరూపమునకు సన్నిహితరూపమేమోయనిపించును. 'ఒన్ఱు' శబ్దమునందువలెనే దీని నడుమ నకారము చేరి 'మూన్ఱు' అని యైనది. తెలుగున 'మూఁడు' అను బిందుపూర్వకడువర్ణముతోడి రూప మేర్పడినది. విశేషణములుగా ముప్పేట, మూనాళ్లు అన్నట్లు హ్రస్వదీర్ఘము లగు రెండు రూపములును గలవు. వీనినిబట్టి కాల్డ్వెల్ 'మూర్'లోని రకారము ఆంగికమా? ప్రత్యయమా? యను నాలోచ చనలో పడెను. ఆంగికమైనచో విశేషణరూపములలో దానికి లోపము కలుగుట యెట్లు? ఆంగికము కాక కేవలప్రత్యయమైనదేమో! కాని 'ఇబ్బడి' అనునప్పటివలె 'ముబ్బడి' అనునప్పుడుకూడ 'ర'కారము తరు వాతిహల్లుతో కలిసిపోయి యుండు ననుకొనుట కభ్యంతరముండదు.

కావున ఇచ్చటకూడ 'ముర్' అనుదానిని ప్రాథమిక రూపముగా నంగీకరింపవచ్చును. 'ముమ్మారు' మున్నగువానిలో ఇట్లే సంయోగము చెందుచున్నది. పరమందు ద్విత్వాక్షరము లేనప్పుడు లోపపూర్తికై దీర్ఘము కలిగి 'మూనాళ్లు' మున్నగువిధముగా నగుచున్నది.

మహదర్థకమునందు తెలుగున మూగురు; ముగ్గురు; మూవురు; ముప్వురు–అను రూపములు గలవు. ఇవన్నియు ఒకే రూపమునుండి యేర్పడిన వనుటలో విప్రతిపత్తి లేదు. అరవ కన్నడములందు 'మూవర్' అని యుండును.

**నాలుగు** : అరవమున 'నాలు' అనియు 'నాఙ్గు' అనియు మలయాళమున 'నాలు' అనియు 'నాన్కు' అనియు, కన్నడమున 'నాలు' అనియు రూపములు. అన్ని భాషలయందును, 'నాల్' అను నంశము సమానముగా నున్నది. తరువాత వచ్చిన 'గు, కు' ల వలన సంధిసంబంధము లైన చిన్నమార్పులు కలిగినవి. తెలుగునందు విశేషణ రూపముగ 'నలు' అని కలదు. అరవమలయాళకన్నడములందు 'నాల్' అను దీర్ఘముతోడి రూపమే కలదు. అరవమున 'నార్పదు', మలయాళమున 'నాల్పదు,' కన్నడమున 'నాల్వత్తు' అని యుండగా 'నలువది' యని తెలుగున నుండును. అరవమందలి 'నాన్మగన్' కన్నడమున 'నాల్మ్గ' యై తెలుగునందు 'నలువ' యయ్యెను.

'నల్' అను పదమునుండి యేర్పడిన 'నఙ్గు' అను పదమునకు తమిళమలయాళములందు 'అందము' అని యర్థము. కన్నడమున 'నల్' అనగా 'మంచి' అనియు 'నలి' అనగా 'ఆనందము' అనియు అర్థములు. 'ప్రేమించు' అను నర్థమునమున క్రియారూపముకూడ కలదు. అరవమున 'నప్పు' అను మాటకు 'ప్రేమ' యని యర్థము. తెలుగున 'అందము' అను నర్థమున 'నలువు' అను పదము గలదు. వీని యన్నింటియందు 'నల్' సమానాంశముగా నున్నది. కావున సంఖ్యావాచకమగు 'నల్' సమానత్వమును పురస్కరించుకొని సంఖ్యావాచకముగా నేర్పడెనని కిట్టెల్ అభిప్రాయపడెను. కాని, ఏభాషయందును 'సమా

సము' అనునర్థమున ఇది కనిపింపనందున కాల్డ్వెల్ పైయభిప్రాయము ముతో ఏకీభవింప లేదు.

ఇండోయూరోపియనుభాషలలో 'నాలుగు'ను పోలిన సమానార్థకమగు శబ్దములు లేవు. బ్రాహుయీభాషలో మొదటి మూడంకెలును ద్రావిడభాషాసామ్యమును కలిగియున్నవి. కాని నాల్గునుండి పది వరకు సంస్కృతసామ్యమును కలిగియున్నవి.

మహదర్థకమైనప్పుడు తెలుగున 'నలుగురు, నలువురు' అని యుండును. అరవకన్నడములందు 'నాల్వర్' అని యుండును.

**అయిదు :** అరవమున 'ఐన్దు' అనియు 'అఞ్జు' అనియు, మల యాళమున 'అఞ్చు' అనియు, కన్నడమున 'ఐదు' అనియు, తుళుభాష యందు 'ఐను' అనియు రూపములు గలవు. తెలుగునందు 'ఐదు' అను నది కలదు. కాని తొలుదొల్త గ్రంథముల కెక్కిన శబ్దము 'ఏను' అను నదే. సమాసములందు కూడ 'ఏబది' మున్నగువిధముగా 'ఏను' అను నదియే స్థిరపడియున్నది. కావున తెలుగున విశేషణరూపముగా 'ఏను' అనుదానిని గ్రహింపనగును. అరవ మలయాళ కన్నడ విశేషణము లందు సమానాంశముగా 'ఐ' అనునదియే కలదు.

తెలుగు కన్నడములందలి 'ఐ' అనునదే ప్రాచీన రూపమును బోలియున్న దనవచ్చును. అరవమునందు ఉచ్చారణసౌకర్యముకొరకు నకారము చేరి 'ఐన్దు' అనిమైనది. అదియే వ్యావహారిక తమిళము నందును, మలయాళమునందును 'అఞ్జు' అని మారినది. కూర్గుభాషలో 'అంజి' అని యైనది. దకారమునకు జకారము పలుకు నభ్యాసము ద్రావిడభాషలయందు సామాన్యముగ కనుపట్టును. కావున 'ఐదు' అను నది మూలరూపమని భావించుట కవకాశము కలదు. ఇందలి 'దు' వర్ణముకూడ స్వరసామరస్యముకొరకు వచ్చినదే. అందువలననే విశే షణరూపములందు 'ఐ' అమనదే అన్ని భాషలయందును కనబడును. ఈ 'ఐ' కారమే తెనుగునందు 'ను'వర్ణమును గ్రహించి 'ఐను' అని యై 'యేను' అని మారియుండును. కడపటిరూపము గ్రంథస్థమగుటవలన






స్థిరపడియున్నది. తుళుభాషయందు 'ఐను' రూపమే యున్నది. తెలుగున తరువాతికాలమున ఇతర భాషాశబ్దములతో సామ్యము గల 'ఐదు' ప్రవేశించి ప్రచారము నొందినది. ఈ 'ఐ'కారమునకు 'అయి' అను నుచ్చారణము గలదు. కావున తెలుగున 'అయిదు' అను మరొక రూపముకూడ నేర్పడినది. అరవకన్నడములందు విశేషణరూపములో 'అయ్' అనియు గలదు. అయ్మ్బదు; అయ్వత్తు;ఏఁబది; అయ్న్నూర్; ఏనూఱు॥ ఈ ప్రయోగములందు 'అయ్'కి మీదట నకారమకార ములు విశేషణవిశేష్యసంబంధ నిరూపకములై వచ్చినట్లు కనబడును. ఇది అరవమునందే యుండి, తక్కిన భాషలందు లేకపోవుటవలన, నిశ్చితముగా నామాంశము కాదని నిరసింపవచ్చును.

సంస్కృతమునందలి 'పంచ' శబ్దమునకును వ్యావహారిక తమిళ మలయాళములందలి 'అఞ్జు' శబ్దమునకును సంబంధము కలదని కొంద రూహించిరి. 'పంచ' యనునది అరవమున 'పఞ్జ' అని యగును. ఆదిమ వ్యంజనాక్షరము లోపించుటవలన 'అఞ్జ' అనినై, అదియే 'అఞ్జు' అని అయియుండునని వారి యూహ. 'అఞ్జు' అను రూపము వాడుక యందును, దాని ననుసరించిన మలయాళమునందును గలదు. కాని గ్రంథస్థము కాదు. కాని 'కురల్' అను గ్రంథమున ఈ రూపము కని పించుట యాధారముగా 'పంచ' శబ్దమునకు వికృతిగనే దీనిని గ్రహింప దలచిరి. కాల్డ్వెల్ దీనిని కాకతాళీయమగు సామ్యమని భావించెను. మలయాళమునందలి 'ఒన్ను' శబ్దమునకును ఆంగ్లమునందలి one శబ్ద మునకును జన్యజనకసంబంధమును గల్పించిన నెట్లుండునో, యిదియు నట్టిదే. విశేషణరూపము ప్రాథమికము; దానిపై నొక ప్రత్యయము చేరి విశేష్య మగును. ఇచ్చట 'ఐ' అను ప్రాథమిక రూపముపై 'దు' వర్ణము చేరి 'ఐదు' అని నైనదని చెప్పికొంటిమి. కావున దీనికిని, పంచశబ్దమునకును ఏమాత్రమును సంబంధములే దనుట నిశ్చయము.

'ఐ' అనగా అర్థ మేమని యాలోచింతము. కొన్ని భాషలయందు 'ఐదు' అనునది 'చేయి' అను నర్థముగల పదము గాని, ఆ పదముతో

సంబంధముగల పదము గాని యైయుండును. తెలుగున ఈనాటి వాడు కలో 'ఒక హస్తము' అనగా 'ఐదు' అను నర్థము గలదు. రెండు చేతులు, మూడు చేతులు అని లెక్క పెట్టు నలవాటుకూడ కొన్ని చోట్ల గలదు. రెండు చేతు లనగా రెండయిదు లని యర్థము. ఆ విధముగా చూచినచో 'ఐ-' అనునది 'కై' అను శబ్దమునుండి యేర్పడి యుండవచ్చును. కిట్టెల్ కన్నడమునందలి 'ఎయ్దు' అను శబ్దమునుండి 'ఏదు' ఏర్పడినట్లు భావించెను. 'ఎయ్దు' అనగా 'పొందుట' యని యర్థము. చేతియందలి వ్రేళ్ళ సంఖ్యను సూచించుటయే పొందుట యని కిట్టెల్ భావము. కాల్డ్వెల్ ఈ యభిప్రాయమున కంత సుముఖుడు కాడు.

మహద్వాచకము తెలుగున 'ఐదుగురు' అనియు, 'ఏవురు' 'ఏగురు' అనియు నుండును. అరవమున 'ఐవర్' అనియు, పటగన్నడమున 'అయ్‌వర్' అనియు, హాసగన్నడమున 'అయ్‌వరు' అనియు నుండును.

**ఆఱు :** అన్ని భాషలయందును 'ఆఱు' అను రూపములోనే యున్నది. తుళుభాషయందు మాత్రము 'ఆజి' యను రూపము గలదు. విశేషణవిశేష్యములకుకూడ ఎక్కువ భేదము లేదు. 'ఆఱు' అనునది విశేషణము. మొదటిహ్రస్వమునకు దీర్ఘము కలుగగా విశేష్య మైనది. అరవమున 'అఱుబదు' అనియు 'అఱునూఱు' అనియు రూపములు గలవు. తెలుగున 'అఱువది' యనునప్పుడు హ్రస్వమే కాని 'ఆఱునూఱు'మున్నగు చోట్ల దీర్ఘమే యగుచున్నది. కన్నడమున 'అఱువత్తు' 'అఱునూఱు' అని హ్రస్వముతోడి రూపములే కలవు. అరవమున 'ఆఱువేలు' అను నర్థమున 'ఆరాయిరమ్' అని దీర్ఘముతోడి రూపముకూడ గలదు. వీని నన్నింటినిబట్టి 'అఱు' అనుదానినే మూలధాతువుగా నిర్ణయింపనగును. విశేష్యరూపమునందు 'రెండు, మూడు' అను శబ్దములకు చేరినట్లుగా 'డు' వర్ణము కాని, 'నాలుగు' అను శబ్దమునకు చేరినట్లుగా 'గు'వర్ణము కాని చేరక, మొదటి యచ్చునకు దీర్ఘము మాత్రము కలుగుచున్నది. తెలుగున అట్లు విశేష్యమైన రూపమే తిరిగి విశేషణముగా వాడబడు చున్నది.

'పెంపారు' మున్నగుచోట్ల 'మనసార' మున్నగుచోట్ల 'ఆరు' అను శబ్దము కలదు. దీనికి 'నిండుగా' అనిగాని 'పొంపునట్లుగా' అని కాని యర్థము. పఱగన్నడమున 'బలపడు' అని కాని 'బలపఱుచు' అని కాని అర్థమిచ్చు 'ఆరు' అను శబ్దముతో దీనికి సంబంధము కలదనియు; ఇది అదనపుగలయికను సూచించుచున్నదనియు కిట్టెల్ అభిప్రాయము. 'ఆరు' అనగా ఇంకిపోవుట అని, 'అరు' అనగా నశించుట యని కూడ నర్థములు గలవు. కాని యీయర్థములకును, ఆఱు శబ్దార్థమునకును నేమాత్రమును సంబంధము కనిపింపదు.

మహద్వాచకము తెలుగున 'ఆరుగురు, ఆర్వురు' అని యుండును. అరవకన్నడములందు 'ఆఱువర్' అని యుండును.

ఏడు - తమిళమలయాళములందు 'ఏఴు' అనియు, తుళుకన్నడములందు 'ఏళు' అనియు రూపములు గలవు. తెలుగునందు 'ఏడు' అను రూపమున నున్నది. అరవమునందలి ఴ కారము కన్నడమున ళ కారముగను, తెలుగున డ కారముగను పరిణతి నొందెనని చెప్పనగును. విశేషణరూపమున 'ఏడు' శబ్దము చిన్న చిన్న భేదములను పొందును. అరవమలయాళములందు 'ఎఴు' అనియు, కన్నడమున 'ఎళ్' అనియు, తుళుభాషయందు 'ఎళ్' అనియు రూపములు గలవు. అరవమున 'ఎఴుగడల్' అనియు, కన్నడమున 'ఎప్పత్తు' అనియు ప్రయోగము లుండును. తెలుగులో 'ఏడుగడ' మున్నగువిధముగా 'ఏడు' శబ్దమే విశేష్యముగా కూడ వాడబడును. 'ఏడు - పదులు' అనునప్పుడు స్వరప్లుతి కలిగి 'ఏడు' అన్నది 'డే' గా మారును. తరువాత 'ప' కారమునకు సారళ్యము కలిగి 'డేబది' అగును. బకారమునకు ద్విత్వము కలిగి 'డే' అనునది హ్రస్వమై 'డెబ్బది' యగును.

మహదర్థమున అరవమునందు 'ఏఴువర్' అనియు, కన్నడమున 'ఏళ్వర్' అనియు రూపములు గలవు. తెలుగునందు 'ఏడుగురు, ఏడ్వురు'' అను రూపములు గలవు.

**ఎనిమిది :** అరవ మలయాళములందు 'ఎట్టు' అనియు, కన్నడమున 'ఎంటు' అనియు, తుళుభాషయందు 'ఎణ్మ' అనియు రూపములు కలవు. తెలుగున 'ఎనిమిది, ఎన్మిది' అను రూపములు గలవు. 'ఎన్' అనునది అన్నింటియందు విశేషణ రూపముగా కనిపించును. చివరి ఉకారమును, అకారమును స్వరసామరస్యమునకో స్వరాకర్షణమునకో యేర్పడిన వనుకొన్నచో 'ఎన్' అన్నది విశేషణరూపమగును.

సాధారణముగా అరవమున 'మూన్ఱు, నాఙ్గు, ఐన్దు' అనునట్లుగా నకారయుక్తమయిన రూపము లుండుటయు, కన్నడమున నకారవిరహితరూపము లుండుటయు కనిపించును. కాని, యిచ్చట ఆ లక్షణము తారుమారైనది. కన్నడమందు నకారయుక్తరూపము కనిపించు చుండగా, అరవమున టకార ద్విత్వముతోడి రూపము కనిపించుచున్నది. అయినను 'ఎంటు' 'ఎట్టు' అనునవి యేకరూపజనితములే యనుటకు సందేహింపవలసిన పనిలేదు. ఇక తుళుభాషయందలి 'ఎణ్మ' అనునది 'ఎన్మిది' అను తెలుగు రూపముతో కొంత సాదృశ్యమును కలిగి యున్నది. రెండింటియందును 'ఎణ్' అనునది సమానముగనున్నది. 'ఎణ్' అనునదియే ఇతరభాష లన్నింటియందును, విశేషణరూపముగా నున్నదని యనుకొంటిమి.

తెనుగున శాసనములందు 'ఎణ్బది' అనియు, 'ఎణుంబొది' అనియు, 'ఎనుబొది' అనియు రూపములు కనిపించుచున్నవి. వీనిని బట్టి యీరూపమున పూర్వాంగము 'ఎణ్' అనియు, ఉత్తరాంగము 'బది, బొది' యనియు నిర్ణయింపనగును. 'బది, బొది' యనునవి 'పది' యొక్క రూపాంతరములే. 'ఎన్మిది' అనురూపమునందు ఉత్తరాంగము 'మిది' యనునది. 'ఎన్' అను శబ్దముపై 'పది' శబ్దము చేరి 'ఎన్మది' అని మైయుండును. అరవమున మహాదర్థమునందు 'ఎణ్మర్' అను రూపము గలదు. ఇచ్చట పరమందున్న 'వర్' శబ్దములోని వకారము 'మ'కారమైనది. 'పదుగురు' అను నర్థము గల 'పదిన్మర్' అను శబ్దమునందుకూడ ఇట్టిమార్పు జరిగినది. వకా

రము పవర్గమును పరస్పరము మారుట కన్నడమునందు కూడ కలదు. కావున దీనిని ఒకలక్షణముగా గ్రహింపవచ్చును. అట్లు 'ఎన్మది' అని యేర్పడి. తుది యికారముయొక్క ఆకర్షణవలన 'ఎన్మిది' అని నైయుండును. సౌలభ్యముకొరకు 'ఎనిమిది' అని నైయుండును. కావున 'ఎన్' అనునది పూర్వశబ్దము, 'పది'కి రూపాంతరమైన 'మిది' యనునది ఉత్తర శబ్దము. 'ఎనమండ్రు' అను మహద్వాచకమునందు 'ఎనమ' అనునది పూర్వాంగము. దీనికిని అరవమందలి 'ఎణ్మర్' అనురూపమునకును గల సామ్యము స్పష్టముగనే కనిపించుచున్నది. ఇందు 'పది' యను రూపములోని 'ది' వర్ణము అదృశ్యమైనది. 'ఎనిమిది పదులు' అనునప్పుడుకూడ 'ఎనుబది' యనియే యగుచున్నది. నడుమనున్న 'మిది' లోపించుచున్నది. అనగా విశేషణరూపముగా తెలుగున, ఇతరభాషలలో వలెనే 'ఎన్' అనునదియే యున్నది. విశేష్యమునందు పదిశబ్దమునకు రూపాంతరమైన 'మిది'ని కల్గియుండుట తెలుగులోని విశేషము. ఇతరభాషలలో పూర్వశబ్ద మగు 'ఎణ్' అనునదియే ఉచ్చారణసౌకర్యమునకై 'టు' మున్నగు అక్షరములను బొంది విశేష్యమగుచున్నది.

మాక్సుముల్లరు 'ఎణ్' అనునది 'ఎర్' అనుదానితో సమానమనియు, 'ఎర్' అనునది 'ఇర్'కు రూపాంతరమనియు నభిప్రాయపడెను. 'ఇర్' అనగా 'రెండు' అని యర్థము. తెనుగునందు 'జత' యనునర్థము గల 'ఎన'కు తుల్యార్థకములుగా అరవమునందు 'ఇణై' అనియు, కన్నడమునందు 'ఎణె' అనియు రూపములు గలవు. 'ఎన్మిది' అనగా 'జత తక్కువ పది' యని యర్థము. కావున 'ఎణ్' అనునది 'రెండు' అను నర్థమున వచ్చి 'పది' నుండి రెంటిని తగ్గించుచున్నది. దీనినిబట్టి తెలుగున గల 'ఎన్మిది' శబ్దమును సమాస మనవచ్చును. అరవము మున్నగుభాషలయందు ఈ యర్థమున పదికి ఏమాత్రమును ప్రమేయము లేదు. క్లే 'ఎల్లి' అను శబ్దమునందలి 'ఎల్' అనునదియే 'ఎన్మిది'కి పూర్వరూపముగా భావించెను. "రెండు" అను నర్థమున 'ఎల్'

అనునది భాషలో ఎచ్చటను కనిపింపనందున కాల్డ్వెల్ ఈ వాదమును నిరాకరించెను.

అరవమునందలి 'ఎట్టు' అను శబ్దమునకును, లాటిను భాషలోని 'ఆక్టో' అను శబ్దమునకును, గోథిక్ భాషలోని 'అహ్తాన్' అను శబ్దమునకును పోలిక గలదు. సంస్కృతము నందలి 'అష్ట' శబ్దమును తమిళులు 'అట్ట' అని పలుకుదురు. ఈ పోలికను చూచి 'అష్ట' శబ్దభవమే 'ఎట్టు' అని కొందరు నిర్ధారించిరి. కాని ఇందు 'ఎణ్' అనునది మాత్రమే ధాతువు; అదియే విశేషణము. ద్రావిడభాష లన్నిటియందు నున్నది. కావున 'ఎట్టు' అను ఒక రూపముతో కాకతాళీయమగు సామ్యము కనిపించినను దానిని నిరూపించుటకు తగిన యవకాశము లేదు.

**తొమ్మిది**: అరవమందు 'ఒన్బదు, ఒన్బాన్' అనియు, మలయాళమందు 'ఒంబదు' అనియు, కన్నడమందు 'ఒంబత్తు' అనియు, తుళుభాషయందు 'ఒర్ మ్బ' అనియు రూపములు గలవు. తెలుగున 'తొమ్మిది' యని యొక్కటియే రూపము. 'ఎనిమిది'లో వలెనే ఈ శబ్దములో కూడ 'మిది' యనునది ఉత్తరాంగముగా నున్నది. 'ఎనిమిది' యందు తెలుగున మాత్రమే యుండగా, 'తొమ్మిది' యందు 'పది' యను నర్థము గల శబ్దము అన్ని భాషలయందు నున్నది. 'తొమ్మిది' మున్నగు నవార్థకశబ్దము లన్నియు సమాసము లన్నమాట!

'ఒన్బదు' మున్నగువానిలో పూర్వాంగము 'ఒన్' అనునది. ఇది 'ఒకటి' అను నర్థముగల 'ఒర్' అను శబ్దమునకు రూపాంతరమే. 'ఎనిమిది' అన్నప్పుడు 'రెండు తక్కువ పది' యని యర్థము చెప్పినట్లే 'ఒన్బదు' అనగా 'ఒకటి తక్కువ పది' యని యర్థము చెప్పికొనవలయును. అన్ని భాషలయందును ఈ విధముగా చెప్ప వచ్చును. కాని తెలుగునందలి 'తొమ్మిది'యొక్క విధానము వేరుగా నున్నది. ఇందు 'ఒకటి' అను నర్థము గల పద మేమియు లేదు. తొలుతటి, తొల్లి, తొంటి మున్నగుశబ్దముల మూలరూపమైన 'తొల్' అనునది యిందలి పూర్వాంగము. దీని యర్థము. 'ముందరిది' అని, 'తొమ్మిది' అనగా పదికి ముందరిది అని అర్థమన్నమాట! తమిళాది

భాషలయందు ఈ తొల్ శబ్దములోని 'త' కారమునకు లోపము కలిగి, 'ఒల్, ఒన్' మున్నగు విధముగా నేర్పడెనను నభిప్రాయము కలదు. కాని, దానినంత దూరము సాగదీయుట యవసరము కాదు. అరవమున గల 'తొన్నూఱు' 'తొల్లాయిరమ్' మున్నగునవి తొల్ శబ్దము తోడి రూపములే. 'తొన్నూరు' అనగా నూటికి ముందరి దని యర్థము; అనగా తొంబది. 'తొల్లాయిర' మ్మనగా వేయికి ముందరి దని యర్థము; తొమ్మిది వందలు. కాబట్టి 'తొమ్మిది' యను నర్థమున అరవము 'తొల్' శబ్దమును వాడకపోయినను, ఇంకను పెద్దసంఖ్యలో వాడుచునే యున్నదన్నమాట !

తొమ్మిది పదులను బోధింపవలసివచ్చినప్పుడు తెలుగున 'తొంబది' అనియు, అరవమున 'తొన్నూరు' అనియు, కన్నడమున 'తొంబత్తు' అనియు రూపములు. అరవమందలి 'తొన్నూఱు' అను రూపమునకు నూటికి ముందరి దను నర్థము చెప్పుకొంటిమి. తెలుగు కన్నడ రూపములకు అట్లు చెప్పుటకు వీలుకాదు. కోరాడ రామకృష్ణయ్య గారు 'తొళ్' అను ధాతువును 'తొలిచివేయు' అను నర్థమున గ్రహించిరి. 'తొంబది' యనగా పదిని తొలగింపగా నేర్పడినది అని యర్థము. అట్లే కన్నడమందలి 'తొంబత్తు' నకు కూడ చెప్పుకొనవలయును.

'తొమ్మిది' శబ్దమునకు మహదర్థమునందు తెలుగున 'తొమ్మండుగురు, తొమ్మండ్రు' అనియు, అరవమున 'ఒన్పదిన్మర్' అనియు, కన్నడమున 'ఒంబత్తువర్' అనియు రూపములు గలవు.

పది : అరవమున 'పత్తు' అనియు, 'పాన్, పదు' అనియు, కన్నడమున 'పత్తు, హత్తు' అనియు, తుళుభాష యందు 'పత్తు, పాద్' అనియు రూపములు గలవు.

సమాసమున ఉత్తరపదముగా వచ్చినపుడు అరవమునందలి 'పత్తు' అనునది 'పదు' అనికాని 'బదు' అనికాని మారును ॥ఇరుబదు॥ కావ్యభాషయందు ఇట్టి చోట్ల 'పాన్' అనికాని 'బాన్' అనికాని వచ్చును॥ ఇరుబాన్॥ సమాసమున పూర్వపదముగా నున్నప్పుడు 'పత్తొమ్బదు'

మున్నగువిధముగా 'పత్' అనికాని 'పన్నిరణ్డు' మున్నగు విధముగా 'పన్' అనికాని మారును. 'పదినొన్ఱు, పదిన్మూన్ఱు' మున్నగు శబ్దములలో వలె 'పదిన్' అను రూపమునుగూడ పొందును.

అరవములోకంటె తెలుగులో 'పది' శబ్దము ఎక్కువ మార్పులను పొందును. ఎనిమిది, తొమ్మిది అను వానియందు 'పది' శబ్దము 'మిదిగా' మారిన సంగతి చూచితిమి. ఇరువది, నలువది, అరువది అను శబ్దములందు పకారము వకారముగా మారుచున్నది; ఏబది, డెబ్బది, ఎనుబది, తొంబది అను శబ్దములందు బకారముగా మారుచున్నది. వ్యావహారికమునందు 'పది' లోని దకారమునకు లోపము కలిగి, ముందరి వర్ణము కొన్నియెడల మహాప్రాణముగ మారుచున్నది॥ ఇర్వై ; ముప్పై, నలభై, ఏభై, అరవై, డబ్బాయి, ఎనభై, తొంభై॥

సమాసమున పూర్వశబ్దమైనపుడు పదునొకటి, పదుమూడు, పదునాలుగు, పదునైదు, పదునారు, పదునేడు, పదునెనిమిది అను వానియందు 'పదు' అని యగుచున్నది. వ్యావహారికమందు పదకొండు, పదమూడు – మున్నగువిధముగా అదంతరూపము పెక్కుచోట్ల కలదు. సంధి నాపుటకు గ్రాంథిక రూపములో 'ను' వచ్చుచోట్ల వ్యావహారికమున 'హ' వచ్చుచున్నది॥ పదిహేను, పదహారు, పదిహేడు॥ పద్ధెనిమిది మున్నగుచోట్ల నాదాక్షరము వచ్చుచున్నది. ద్వాదశసంఖ్యయందు పది 'పన్' అని మారుచున్నది. ద్వాదశసంఖ్య అరవమున 'పన్నిరణ్డు' అని యున్నది; తెలుగున 'పన్–రెండు' అనియైన, నడుమ డకారోచ్చారణము కలుగగా 'పండ్రెండు' అని యైనది. 'పన్ఇద్దఱు' మున్నగు మహదర్థకములందు సంధి నాపుటకు వచ్చిన ద్విత్వమే కాని డకారోచ్చారణము లేదు॥ పన్నిద్దఱు॥

గుండెర్టు 'పది' శబ్దమును సంస్కృత పఙ్క్తి శబ్దభవముగా గ్రహించెను. పఙ్క్తి యనగా వరుస యని యర్థము. పంక్తిరథుడు, పంక్తికంధరుడు మున్నగుచోట్ల 'పది' యను నర్థము లాక్షణికముగా నేర్పడినది. ప్రత్యేకముగా 'పంక్తి' యనునప్పుడు పది యను నర్థము

కనిపింపదు. విశేషరూపమునందలి పన్; పదిన్, ఖాన్ మున్నగువానిని బట్టి చూడగా సంస్కృత 'పంక్తి' శబ్దమునకును ద్రావిడ 'పది' శబ్దమునకును సంబంధములేదని కాల్డ్వెల్ నిశ్చయము.

మహదర్థమున తెలుగునందు పదుగురు, పదుగుండ్రు, పదురు, పదుండ్రు అను రూపములు గలవు. అరవమున 'పదిన్మర్' అనియు, కన్నడమున 'పత్తువర్, పదివర్' అనియు రూపములు గలవు.

**నూఱు**: అన్నిభాషలయందును 'నూఱు' అనియే కలదు. తుళు భాషయందు 'నూదు' అను రూపమున నున్నది. నూఱుట అనగా చూర్ణము చేయుట అని యర్థము. 'నీఱు' అనగా బూడిద యని యర్థము. అరవమున 'నీఱు' అనివ్రాసి 'నూఱు' అని బూడిద యను నర్థము గల ధాతువును పల్కుదురు. తెలుగు మలయాళములందు రెండు విధములగు రూపములు గలవు. అసంఖ్యాకము అను భావమున 'నూఱు' అను క్రియాధాతువు సంఖ్యావాచకమై యుండును. ద్రావిడ భాషలలో 'నూఱు' అనునదే కడపటి ద్రావిడ సంఖ్యావాచకము. దాని తరువాత వచ్చునవి సంస్కృతసమములు గాని, సంస్కృతభవములుగాని అయియున్నవి॥ ఆయిరమ్॥ ఇది సంస్కృత 'సహస్ర' శబ్దభవము. కన్నడమున నిది 'సాసిరమ్' అనురూపమున నున్నది.

తెలుగునందలి 'వేయి' శబ్దము సంస్కృతముతో సంబంధము లేని స్వతంత్రశబ్దము. 'వే' యను రూపముతో తొలుత వాడుక యందుండగా 'రే' మున్నగువాని సామ్యమున 'యి' వర్ణము చేరి యుండును. బహువచనమునందు 'వేలు'అను నదియే రూపము. తెలుగున కూడ ఇంతకంటె నున్నతమగు స్వతంత్ర సంఖ్యావాచకము లేదు. ఈ పైని లక్ష, కోటి మున్నగు సంస్కృతశబ్దములనే వాడుకొందురు.

'నూఱు' అను నర్థమున ఇతర భాషలలో లేని 'వంద' అను శబ్దమొకటి తెలుగున నున్నది. నన్నయ భారతమున దీనికి ప్రయోగము లేదు. కావున అనంతకాలమున ఇది ఏర్పడి యుండవచ్చును. సంస్కృత 'బృంద' శబ్దము ప్రాకృతమున 'వంద' యని యగును. సమూహార్థమున

గల వంద యను శబ్దమునే అప్పటికి తమకు పెద్దసంఖ్యగా వాడుకొని యుండిన నుండవచ్చును.

ఇంతవరకుచూచిన దానినిబట్టి సంఖ్యావాచకములు స్వతంత్రము లని తేలినది. పూరణార్థమునందు 'అగు' నకు పరిణతరూపమగు 'అవ' వచ్చి 'మూడవవాడు' మున్నగువిధముగా నగును. విశేషణములే ప్రధాన రూపములు. వానికి స్వరసామరస్యముకొరకు ఏమేని యక్షరములు రావచ్చును. సాధారణముగా సంఖ్యావాచకము విశేషణముగను విశేష్యముగనుకూడ ప్రయోగింపబడును .సంఖ్యాగణనము తెలుగున మొదట పెద్దస్థానమునుండి ఒకట్లస్థానమునకు వచ్చుచుండగా, సంస్కృతమున ఒకట్లస్థానమునుండి పెద్దస్థానమునకు వెళ్లును॥ పదునొకటి; ఏకాదశ॥ సంఖ్యావాచకము లన్నియు ఔపవిభక్తికములు॥ రెండింటిని; మూఁటిని॥

## నిర్దేశాత్మక విశేషణములు

'ఆ ఈ ఏ' అను మూడు సర్వనామములను త్రికము అను పేర సామూహికముగా వ్యవహరింతుము. సర్వనామ ప్రకరణమునందు వాని యాకారమున నేర్పడు పెక్కు రూపములను చూచితిమి. సర్వనామము లయిన ఈ మూడు వర్ణములును పెక్కు చోట్ల విశేషణములై వ్యవహరించును. వాడు, వీడు మున్నగుచోట్లగాని అప్పుడు, ఇప్పుడు మున్నగు చోట్లగాని మూలభూతములై యున్న ఆ ఈ వర్ణములను గుర్తుపట్టుట సులభముకాదు. పరిశీలన కలవానికి, వివేకము గలవానికి మాత్రమే అట్టిది సాధ్యమగును. అన్యునకు అట్టి యనుమానముకూడ కలుగుట కవకాశము లేదు. అటుకాక ఆ చెట్టు, ఈ పుట్ట, ఏ గట్టు - మున్నగు విధముగానున్న రూపములయందలి త్రికమును సులభముగా గుర్తుపట్ట వచ్చును. 'ఆ' యనునది దూరప్రదేశమును, 'ఈ' యనునది సన్నిహిత ప్రదేశమును నిరూపించును. 'ఏ' ప్రశ్నను నిరూపించును. ఇవి యెక్కడ విశేషణధర్మమును నిర్వహించుచున్న వనుట నిర్వివాదము.

చిన్నయసూరి సమాసపరిచ్ఛేదమునందు "విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియె కర్మధారయంబు నాఁబడు" అని తెల్పెను. కావున విశేషణ విశేష్యముల కగు సమాసమునకే కర్మధారయ మని పేరు. ఆయనయే కర్మధారయ సమాసమునందలి పూర్వపదమునుగూర్చి చెప్పుచు "కర్మధారయంబు త్రికస్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు"నని సూత్రించి ఆచందము – ఈచిందము – ఏబృందము మున్నగువిధముగా నుదాహరించెను. దీనినిబట్టి 'ఆ ఈ ఏ' అనునవి విశేషణములని తేలినది.

ఇవి విశేషణములై నప్పుడు తరువాతిశబ్దముతో నిత్యముగా సమసించును. అందువలన సర్వనామధర్మమునుబట్టి నామవిభక్తులను పొందవలసియున్నను, విశేషణములైనప్పుడు సమాసపూర్వాంగములుగా మాత్రమే యుండుటచేత విభక్తి యోగమునకు ఎంతమాత్రము నవకాశము లేదు.

"త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" నని యనుటచేత 'ఆ+కన్య' మున్నగుచోట్ల కవర్ణము ద్విత్వమును పొందవచ్చును. అట్లు ద్విత్వమును పొందినప్పుడు పూర్వమున్న దీర్ఘము హ్రస్వమగును. అనగా 'అక్కన్య' అను రూపమేర్పడు నని యర్థము. అట్లు కానినాడు 'ఆకన్య' అని యుండును. అరవమునందు ద్విత్వమును హ్రస్వమును కలిగినరూపములే కలవు॥ ఆ + నాల్ = అన్నాల్॥ కన్నడమునందును మలయాళమునందును ద్విరుక్తి యంత ప్రచురముగా లేదు. ఉత్తరపదము స్వరాదియైనప్పుడు తమిళమునందు వకారము ఆగమముగా కలుగును॥ ఆ+ఊర్=ఆ+వ్+ఊర్=ఆవూర్॥ ఇప్పుడు వకారమునకు ద్విత్వము కలిగి పూర్వమున్న దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'అవ్వూర్' అను రూపము సిద్ధించును. కన్నడమునందు కూడ వకారాగమము కలుగును; కాని ద్విరుక్తి కలుగదు. అందువలన 'ఆవూరు' అనియే రూపముండును. తెలుగునందు ఆగమముగా యకారము కలుగును. అందుచేత 'ఆయూరు' అనియైు 'అయ్యూరు' అనికూడ కావచ్చును.

కాల్డ్వెలు నిర్దేశాత్మక వర్ణములను హ్రస్వములుగా నిర్ణయించు కొనెను. ఉత్తరపదమునందలి తొలివర్ణము ద్విరుక్తి నొందుట యను లక్షణము నిర్దేశాత్మక వర్ణమునందే కలదని మాత్రమె యొప్పుకొనెను. నిజమునకు నిర్దేశాత్మక వర్ణములు దీర్ఘములు. కావుననే హ్రస్వములుగా మారినప్పుడు, తరువాతి వర్ణములు ద్విత్వము నొందుట యావశ్యక మయ్యెను. అట్లు కానిచో మాత్ర యూనిక సరిపోదు; ఆ యూనికను సరిపెట్టు కొనుటకే ఉత్తరపదాది వర్ణము ద్విత్వము నొందుచున్నది. అట్లు కాని నాడు మాత్రికము యొక్క దీర్ఘము యథాతథముగా నిలిచిపోవును.

అరవమునందు ఆ, ఈ, ఏ - అనువానితో పాటుగా అన్ద, ఇన్ద, ఎన్ద - అను విశేషణములుకూడ కలవు. వీనినికూడ ప్రయోగమునుబట్టి నిర్దేశాత్మక విశేషణములనియే పేర్కొన వలసి యుండును. ఆచెట్టు అను నర్థమున 'అన్దమరమ్' అనియు, ఈనేల యను నర్థమున 'ఇన్ద నిలమ్' అనియు, ఎవరు అను నర్థమున 'ఎన్దఆళ్' అనియు వాడుట కలదు. కాని యిట్టి వాడుక యితర ద్రావిడభాషలయందు కనుపట్టదు. మలయాళము నందు కాని, ప్రాచీన తమిళమునందు కాని యిట్టి రూపములవాడుక లేనందువలన, ఇది తరువాతికాలమున నేర్పడెనని నిశ్చయముగా చెప్ప వచ్చును. తమిళ మలయాళములందు విశేషణములుగా అదు, ఇదు అనువానిని వాడు నభ్యాసము కలదు॥ అదు పొఱుదు; ఇదు కారియమ్॥ ఇట్లు ప్రయుక్తములయిన అదు, ఇదు శబ్దములే యనంతరకాలమున అన్ద, ఇన్ద అని మారి యుండవచ్చును.

మొత్తముమీద సర్వనామములై పెక్కు సర్వనామ రూపము లకు మూలభూతములైన ఆ, ఈ, ఏ - అనునవి సమాసమునందు పూర్వశబ్దములై విశేషణములుగా కూడ వ్యవహరించుచున్న వన్నది సారాంశము.

## క్రియా విశేషణములు

నామముయొక్క విశేషమును తెల్పునది నామ విశేషణము. దీనినే విశేషణము (adjective) అని వ్యవహరింతుము. క్రియయొక్క

విశేషమును తెల్పునది క్రియా విశేషణము. దీనినే ఆంగ్లమున adverb అని యందురు. మనవ్యాకర్త లెవ్వరును క్రియావిశేషణములను వేరుగా పరిగణించి వ్యవహరించుట జరుగలేదు.

కాల్డ్వెలు adverbs గురించి వ్రాయుచు "It is unnecessary in a work of this kind to enter into the investigation of the Dravidian adverbs, for, properly speaking, the Dravidian languages have no adverbs at all. Every word that is used as an adverb in the Dravidian languages is either a noun, declinable or indeclinable, or a verbal theme, or the infinitive or gerwnd of a verb" అని వ్రాసెను. కావున ప్రత్యేకముగా క్రియావిశేషణములని పిలువదగిన పదములు లేవని తెలియును. అయినను భాషయందు క్రియావిశేషణముల స్థానమున నుపయోగింపబడు పదములను గూర్చి యోజించుట యవసరము. ఆంగ్లమునందును 'Come soon' మున్నగు తావులందు క్రియావిశేషణమును స్పష్టముగా నిరూపింపవచ్చును. These are sweet roses అని యన్నప్పుడు sweet విశేషణము (adjective). అదే పదము These roses smell sweet అని యన్నప్పుడు క్రియావిశేషణముగా ఉపయోగపడుచున్నది. అట్లే కొన్ని విశేషణములకు చివర 'ly' అని చేర్చుటచేత క్రియావిశేషణములు ఏర్పడుచున్నవి. His voice is loud అని యన్నప్పుడు loud అన్నది విశేషణము. He talks loudly అని యన్నప్పుడు loudly అన్నది క్రియావిశేషణము. కావున నియతముగా ఒక పదము ఒకే భాషా భాగమునకు చెంది యుండవలసిన యవసరము కనిపింపదు. కావున క్రియావిశేషణములను వేరుగా గుర్తింపక పోయినప్పటికిని వాడుక యందు రూఢమై యున్నవానినిగూర్చి పరిశీలింపక విడుచుట యుచితము కాదు.

క్రియావిశేషణములను మొత్తముమీద కాలవాచకములు, స్థలవాచకములు, పరిమాణవాచకములు, ప్రకారవాచకములు - అని

నాలుగువిధములుగా విభాగింప వచ్చును. పెక్కు క్రియావిశేషణములు నిర్దేశాత్మక సర్వనామముల నాధారముగా చేసికొని యేర్పడినవే యన్న సంగతిని గుర్తుంచుకొనుట యవసరము. ఈ ఏ- యనునవి హ్రస్వ రూపముతో సమాసమునందు పూర్వాంగములై విశేషణములుగా వ్యవహరించిన రూపములను చూచితిమి. అటుకాక తరువాతనున్న పదముతోనో, ప్రత్యయముతోనో కలిసిపోయి అఖండపదముగా కని పించు రూపములనుకూడ చూచితిమి. ఆరూపములలో చాల భాగము క్రియావిశేషణములుగా వ్యవహరించుచున్న విషయమును ప్రస్తుతము పరామృశింతము.

**1. కాలవాచకములు :** ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడు అని తెలుగు నందు ఇన్ఱు, అన్ఱు, ఎన్ఱు అని అరవమందు ఇందు. అందు, ఎందు అని కన్నడమునందు రూపములు కలవు. 'వాడిప్పుడు వచ్చెను' అని యన్నప్పుడు 'వచ్చెను' అను క్రియకు 'ఇప్పుడు' అనునది విశేషణముగా వ్యవహరించుచున్నది. అట్లే తక్కినవాని యుపయోగమునుకూడ నూహింపవచ్చును.

పైని చెప్పినట్లు త్రికము మూలభూతముగా నేర్పడిన రూపములే కాక నేడు, రేపు, నిన్న, మొన్న, ముందు, వెనుక, మొదట, చివర- మున్నగుపదములు క్రియా విశేషణములుగా ప్రయుక్తము లగును.

**2 స్థలవాచకములు :** ఇక్కడ, అక్కడ, ఎక్కడ; ఇచ్చట, అచ్చట, ఎచ్చట- అని తెలుగునందును ఇఙ్గు, అఙ్గు, ఎఙ్గు అనియు ఈణ్డు, ఆణ్డు, యాణ్డు అనియు ఇమ్బర్, అమ్బర్, ఎమ్బర్ అనియు తమిళమందును ఇల్లి, అల్లి, ఎల్లి అనియు ఇత్త, అత్త, ఎత్త అనియు కన్నడమునందును రూపములు గలవు. ఇవి యన్నియు త్రికము మూల భూతముగా నేర్పడిన రూపములే.

ఇవియే కాక ముందు, వెనుక, ప్రక్క, వెంట, క్రింద, పయిని, లోపల, బయట, దగ్గర, దూరము-మున్నగునెన్నియో పదములు క్రియావిశేషణములుగా వ్యవహరించుచున్నవి.

**3. పరిణామవాచకములు** : ఇంత, అంత, ఎంత; ఇన్ని, అన్ని, ఎన్ని - మున్నగునవి తెలుగునందును ఇత్తనై, అత్తనై, ఎత్తనై - మున్నగునవి తమిళమునందును ఇనితు, అనితు, ఎనితు - మున్నగునవి కన్నడమునందును పరిమాణసూచకములై క్రియావిశేషణములుగా వ్యవహరించుచున్నవి.

ఇవియే కాక తక్కువ, ఎక్కువ, పెక్కు, పలు, చాల, కొంచెము, కొంత-మున్నగునవి పరిమాణసూచక క్రియావిశేషణములుగా వాడుక నొందుచున్నవి.

**4. ప్రకారవాచకములు** : ఇట్లు, అట్లు, ఎట్లు; ఇట్టి, అట్టి, ఎట్టి -మున్నగునవి తెలుగునందును ఇప్పడి, అప్పడి, ఎప్పడి - మున్నగునవి యరవమందును ఇంత, అంత, ఎంత - మున్నగునవి కన్నడమందును ప్రకారసూచకములయిన క్రియావిశేషణములు. త్రికము నాధారముగా చేసికొని పై రూపము లేర్పడును.

మెల్లగా, వేగముగా, తియ్యగా, పుల్లగా, వాలుగా, కోరగా - మున్నగునవికూడ ప్రకారవాచకములే. ఇవియే కాక ధ్వన్యనుకరణ ములుకూడ ప్రకారవాచక క్రియావిశేషణములయందే చేరును. నీరు జలజల ప్రవహించెను - అని యన్నప్పుడు 'జలజల' యను ధ్వన్యనుకరణ శబ్దము ప్రకారవాచక క్రియావిశేషణ మగును. కొన్నియెడల దీనిపై 'అని' యని చేర్చి 'జలజలమని ప్రవహించెను' అని వాడుదురు. 'మడ మడ వెన్ఱు ఇడి విరున్దదు' అను తమిళవాక్యమునకు 'మడమడ మని పిడుగుపడె'నని యర్థము. ఇచ్చట 'మడమడ' అనునది క్రియావిశేషణము.

అప్పుడు, ఇప్పుడు - మున్నగువానిని విభక్తుల యపేక్ష లేకుండ గనే యుపయోగించుట జరుగును. నిన్న, మొన్న, వెనుక, ముందు - మున్నగునవి ద్వితీయాంతములుగా కాని, సప్తమ్యంతములుగా కాని యుపయోగపడుచున్నవి. స్థలవాచకములయిన అక్కడ, ఇక్కడ మున్నగునవికూడ సప్తమ్యంతములుగానే యుపయుక్తము లగుచున్నవి. పరిమాణవాచకములు ఈ విధమగు మార్పునకు లోనగుట లేదు. అయి

నను వానిపై 'అగు' శబ్దముయొక్క నుజ్యంతరూపమైన 'కాన్' అను నది వికల్పముగా చేరి అంత, అంతగా; ఇంత, ఇంతగా - మున్నగుపిథ ముగా నగుట కనిపించుచున్నది. చాలన్, మిగులన్ - మున్నగునవి చాలు, మిగులు - అను ధాతువులయొక్క నుజ్యంతరూపములే యన్న విష యము స్పష్టముగనే తెలియుచున్నది. వానిపై ని కూడ 'కాన్' అను నద వచ్చి చాలగా, మిగులగా - మున్నగురూపముల నేర్పరుచుచున్నది. దీని దీర్ఘమునకు హ్రస్వము కలిగి చాలగ, మిగులగ-అనియు కావచ్చును. విశేషణములపైని 'కాన్' చేరుటవలన క్రియావిశేషణము లేర్పడు చున్నవి. ॥నల్లగా, ఎఱ్ఱగా, మంచిగా, చెడ్డగా, తేలికగా, బరువుగా॥ కొన్నిచోట్ల విశేష్యములమీద సైతమీ రూపముచేరి ఔపమ్యసాధక మగుచున్నది॥ కన్నుగా వ్యవహరింపుము; దూతగా వెళ్ళెను॥

అసమాపక క్రియారూపములయిన క్త్వార్థకాదులుకూడ క్రియా విశేషణములుగా వ్యవహరించుట జరుగుచున్నది॥ పనుగెత్తుకొని వెళ్ళి తిని, ఊరక వచ్చితిని, వణకుచుఁ బలికెను, చూడ నరిగెను॥ మున్నగు చోట్ల ఆయారూపములు క్రియావిశేషణములై యున్నవి. సందర్భమును బట్టి క్రియావిశేషణములను గుర్తింప వచ్చును. నామవాచకములు, సర్వనామములు, విశేషణములు, అవ్యయములు - అన్నియు క్రియా విశేషణములుగా వ్యవహరించుటకు యోగ్యములై యున్నవి. విభక్తి రహితములై యుండుటయే సాధారణలక్షణమైనను, క్వాచిత్కముగ విభక్తిసహితములై కూడ కనిపించుచున్నవన్న విషయము పైని చూపిన ప్రయోగములనుబట్టి గుర్తింప వచ్చును.

# సమాస ప్రకరణము

సమాస మను పదమును, సమాసప్రక్రియయు ఆంధ్రశబ్దచింతా మణినుండియు తెలుగున నున్నవి. చింతామణియందు సమాసములను గూర్చి మొత్తము నాలుగు శ్లోకములు గలవు. అందు మొదటి శ్లోక మున ద్విగువు, కర్మధారయము, తత్పురుషము, ద్వంద్వము, బహు వ్రీహి అను సమాసములును, ఇంకను ఉపమానము, ఉత్తరపదలోపము, రూపకము మొదలయిన మఱికొన్ని సమాసములును గలవు అని గలదు. రెండవ శ్లోకమునందు సమాసాంగము లయిన పదములకు ఔపవిభక్తి కములవంటి అంతవిధులును, విభక్త్యాదిలోపమును గనబడుచున్న వని కలదు. మూడు నాలుగు శ్లోకములయందు కేవలవికృతిపదములతోడి దానిని సమాసక మని, సంస్కృత వైకృతశబ్దములతోడి దానిని మిశ్ర సమాస మని, సంస్కృత పదముతో పరిమిత మైన యాంధ్రపదము కర్మ ధారయ మగునని, ఇట్లే తెనుగుసంస్కృతము లగు ననేకశబ్దములు స్వస్వ విభక్తి వికారములతో సమసించు నని కలదు.

సమాసముల పేరులు, వచ్చెడు మార్పులు స్థూలముగా చెప్ప బడినవే కాని చింతామణియందు సమాస మను పదమునకు నిర్వచనము చెప్పబడ లేదు.

ఆంధ్రభాషాభూషణ మాం ప్రయత్నము కొంతగా చేసెను. అందు "మొదలి పదంబు విభక్తులఁ బుచ్చి మీఁది పదంబులతోడ సమ్యక్సం సక్తంబు లగుటంజేసి సమాసంబులయ్యె"నని కలదు. కేతన పేళ్ళు పెట్టుటలో కూడ స్వతంత్ర రీతి ననుసరించెను; సంస్కృతమునందు ప్రసిద్ధములై చింతామణియందు గ్రహింపబడిన ద్విగువు, కర్మధార యము మున్నగు సంజ్ఞలను విడనాడి వివరణాత్మకమయిన విధానము ననుసరించెను. "పూర్వపదార్థప్రధానంబును నుత్తరపదార్థప్రధానంబును నన్యపదార్థ ప్రధానంబునునుభయపదార్థప్రధానంబుననం జతుర్విధంబు లైవర్తిలు"నని తెల్పి వేర్వేఱుగా వరుసగా ఉదాహరణముల నిచ్చెను.

గణపవరపు వేంకటపతి సర్వలక్షణశిరోమణియందు "మొదలి పదము తుది యక్షరమ్ముతోఁ బెలి నుడి మొదలి యక్కరము గదియ నదికించిన సమాస మంద్రు కోవిదులు" అని నిర్వచించెను. సమాసము లాఱు విధములనియు, అవియె యిరువదిన్నైదు విధము లగుననియు తెల్పి పిమ్మట వివరణము మొదలిడెను. "రహిగ నుత్తరపదార్థప్రధానంబయి తత్పురుషంబది తనరుచుండు। ననువొంద నన్యపదార్థప్రధానమై యొందు బహువ్రీహి యొసఁగుచుండు। నమరంగ నుభయపదార్థప్రధానమై ద్వంద్వసమాసంబు వఱలుచుండు। నరయంగఁ బూర్వ పదార్థప్రధానమై యవ్యయీభావ మొప్పగుచునుండు" అని నాలుగింటిని మాత్రము చెప్పెను; వానిని విస్తరించి చెప్పునపుడు కర్మధారయమును, ద్విగువును గూడ తెలిపెను.

చిన్నయసూరి "సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు" అని నిర్వచించెను. పైని చెప్పినట్లు తత్పురుషాదిసంజ్ఞలతో పాటుగ వివరణమునుగూడ పూర్వవ్యాకర్తలనుండి గ్రహించెను. అయినను "లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు"నని వివరణ క్లేశమునుండి తప్పుకొనెను. దీనినిబట్టి యొకటి స్పష్టము. సమాస విధానము సంస్కృతమున నతివిస్తృతముగా గలదు. తెలుగునకూడ సమాస విధానము కలదు కాని, సంస్కృతానుసారి కాదు. కేవలతత్సమములకు సంస్కృతపద్ధతియే యనుసరింపనగును. అట్లు సంస్కృతము ననుసరించిన సమాసములు సాంస్కృతికములు; ఇవి రెండు విధములు- సిద్ధములనియు, సాధ్యములనియు. సిద్ధములు సంస్కృతమునందే యేర్పడి తెలుగున తత్సమములుగా ప్రవేశించినవి॥ రాజాజ్ఞ॥ రెండును తత్సమములే యయ్యును తెలుగున సమాసములైన వానిని సాధ్యములని యందురు॥ రాజునాజ్ఞ॥ ఇవికాక మిగిలిన యాచ్ఛికములు, మిశ్రములు నను నివి తెలుగున నేర్పడినవి. వీనియందు విభక్తిలోపము నున్నగునవి జరుగనే జరుగవు. తత్సమములకు మాత్రమే విభక్తిలోపమగును. ఆచ్ఛికము లందు సాధారణముగా స్త్రీసమములయిన పదములే పూర్వాంగములుగా

నుండును; కొన్నియెడల మువర్ణకము పుంపువర్ణములుగా మారును. అయినను సూరి తెలుగు సమాసలక్షణమును చక్కగా గుర్తించి "సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు" అని సూత్రించెను. సంస్కృతమున నైనచో 'రాజపుత్రులు' అనునప్పుడు 'రాజుయొక్క పుత్రులు' అనియు 'రాజులయొక్క పుత్రులు' అనియు కూడ అర్థము కావచ్చును; తెలుగున బహుత్వనిరూపకమైన లవర్ణమునకు లోపము రాదు॥ చెలుల పల్కులు॥ సంస్కృతమున లింగబోధకమునకు కూడ నష్టము వాటిల్లవచ్చును॥ పితృవాక్యము; మాతృవాక్యము॥ ఇందు ప్రాతిపదికమునకు తరువాతిపదము చేర్పబడినది. తెలుగున 'మగని మాట' యనునట్లు లింగబోధనసామర్థ్యమునుగూడ గలిగియే యుండును. అందులకే చిన్నయసూరి విభక్తికి కాక డుమంతమునకు నిగాగమమును విధించెను. పైవిషయములనుబట్టి చూచినపుడు సాంస్కృతిక సిద్ధసమాసము ఒక రీతిగను, మిగిలిన సమాసము లన్నియు వేరొక రీతిగను ఏర్పడు చున్నవని స్పష్టముగా తేలుచున్నది.

తెలుగు సంయోగాత్మక భాష యగుటవలన సమాస విధావ మత్యధికముగా కలదని అంగీకరింపగలము. విభక్త్యంతము లన్నియు సమాసములే యని యీవరకే నిర్ణయించుకొంటిమి. ఇక ఈ సమాస విధానమునందలి వైశిష్ట్యమును గుర్తింతము. ఇరువదియైదు విధములుగా సమాసములను విభజించిన సర్వలక్షణశిరోమణినుండియే యుదాహరణములను గ్రహింతము.

అడుగు - మోయి; కొండ - తాల్పరి; కత్తి - నఱకు; ముద్దు - కాటుక; పాము - బీరు; కల్వ - దండ॥ ఇవి యన్నియు ప్రథమాది తత్పురుషముల కుదాహరణములు. వీనిని పరిశీలింపగా రెండుపదము లొకదాని ప్రక్క నొకటి చేర్పబడినట్లు కనిపించునే కాని, ఏవిధమయిన మార్పులు పొందినట్లు కనిపింపవు.

కన్గవ, పలుదీపు - మున్నగుచోట్ల సరళాదేశము గాని గసడదవాదేశము గాని కనిపించును; ద్వంద్వమునందును, గసడదవాదేశము

మిక్కిలి యధికముగా గలదు. పదము మీది పదము అరవమునందు ద్విత్వయుక్తమై యుండును. తెనుగున గసడదవాదేశము కనిపించు చున్నది. ఉచ్చారణసౌకర్యముకొరకు వచ్చిన నువర్ణముగాని, నామాంశమైన నువర్ణముగాని యున్నయెడల సరళాదేశము కలుగుచున్నది. ద్రావిడభాషలయందు రెండచ్చుల నడిమియక్షరము నాదాత్మకమై పలుకబడుట స్వభావము. తెలుగున పదముమీంది పదముయొక్క మొదటి యక్షరము మారి నాదాత్మకత్వము నొందుచున్నది.

పుంప్వాదేశము, టుగాగమము, రుగాగమము, నుగాగమము, ఔపవిభక్తికవర్ణములు మున్నగున వన్నియు సమాసవిధులయందే కనబడుచున్నను నిజమున కవి పూర్వపదాంతిమాక్షరములో, లేక సంబంధ బోధకములో యగుచున్నట్లు సంధిప్రకరణమున చూచితిమి.

తెలుగున సుదీర్ఘ సమాసములు లేకుండుటయు నొక లక్షణము. సుదీర్ఘత్వమువలన అర్థగ్రహణమున క్లిష్టత యేర్పడును. నాగరకమైన జాతి, బృహద్గ్రంథరచన సమర్థమైన జాతి ఆ యా విధములయందు ప్రయోగములు చేయవచ్చును. కేవలము పామరజనాదరణీయమై నిత్య వ్యవహారమాత్ర యోగ్య మయిన భాషలో అర్థ గ్రహణాక్లిష్టత యుండ రాదు. కావుననే తెలుగున కృతకములగు సుదీర్ఘసమాసములు లేవు. తెలుగు సాహిత్యభాషగా స్థిరపడిన పిమ్మట సంస్కృతసమాసములవలె తెలుగునకూడ దీర్ఘములయిన సమాసములను రచించు యత్నము కొందరు చేసిరి. "జడ బ్రతుకుగూడు పుట్టువు సామి" "జాళువా వింటి వాడు"మున్నగునవి ఆ గ్రంథములందే మిగిలినవి కాని, ప్రజాబాహుళ్య మున కలవడినవి కావు. ఈ రకమగు రచనము తెలుగు సంప్రదాయమునకు విరుద్ధము.

కాకి నలుపు, మగపులి, సిగ్గుసొమ్ము మున్నగు సమాసముల యందు ఔపమ్యము గలదు. 'అలరుబోడి' యనునపుడు చిన్నయసూరి 'మేనునకు బోడి'ని విధింపగా సీతారామాచార్యులు పోడిమియొక్క

రూపాంతరమైన 'పోడి'నే విధించెను. ఇచ్చటకూడ ఔపమ్యమే ప్రధాన విషయము.

తెలుగున సమాసవిధానము స్వాభావికమే యైనను, సంస్కృత మర్యాద ననుసరించుట మాత్రము కృత్రిమమనియు, మాటప్రక్క మాటను చేర్చినంతలో తెలుగున సమాసమేర్పడు ననియు, విభక్త్యాది లోపములను జెప్పవలసిన యవసరము తెలుగున నేమాత్రము లేదనియు స్పష్టముగా తేలినది. సమాసమున స్థానమునుబట్టి పూర్వపదము విశేషణమును, ఉత్తరపదము విశేష్యము నగుచుండును. ఆ రెండింటికి సంబంధము గలుగజేయుటకు ఇ, అ, దు మున్నగునవి నడుమ వచ్చును.

ద్వంద్వము రెండు పదములకు సమానప్రాధాన్యము కలది యను నర్థమున సార్థకము కాగలదు. ద్విగు, బహువ్రీహి, తత్పురుష, కర్మధారయములకు సార్థకత్వము కనిపింపదు. కావుననే కేతన మున్నగు వారు ఈ సంజ్ఞలను విడనాడి యుందురు.

'బహువ్రీహి' అనగా 'అధికముగా ధాన్యము కలవా' డని యర్థము. ఇది బహు శబ్దార్థమును కాని వ్రీహి శబ్దార్థమును గాని తెలుపక అన్యపదార్థమును తెలుపుచుండుటచేత బహువ్రీహి మున్నగు పదములను ఒకవర్గముగా గుర్తించి యుందురు. అవి బహువ్రీహి ప్రభృతి సమాసములు.

'ద్విగువు' అనగా 'రెండావు'లని యర్థము. సంఖ్యావిశేషణము తోడి సమాసము; కాబట్టి ద్విగుప్రభృతిసమాసములు మరొకవర్గముగా పరిగణింపబడి యుండును.

'తత్పురుషః' అనగా 'అతని మనుష్యుడు' అని యర్థము. ఈ విధముగా విశేషణ విశేష్య సంబంధమును దెల్పునవి తత్పురుషప్రభృతి సమాసములుగా వేరుగా పరిగణింపబడి యుండును. కావున ఈ పేళ్ళకు సార్థక్యము లేదనియు, సంస్కృతమున గల పదముల యాకృతినిబట్టి వాడుక కలిగినదనియు నిర్ణయింపవచ్చును సంస్కృతాభ్యాసమునుబట్టి

తెలుగువ్యాకరణములందుకూడ ఈ సంజ్ఞలే వాడబడినవి. ఒకరూఢి యేర్పడిన పిమ్మట శబ్దము సార్థకమగునా ? కాదా ? యను ఆలోచన సాధారణముగా కలుగదు.

అరవమున సమాసవిధానము తొల్కాప్పియమునుండియు కలదు. సమాసము అను సంస్కృతపదమునకు బదులుగా, దానికి సమానార్థకమైన 'తొగై' అను పదము వాడుకయందు కలదు. ఇందు ఆఱు విధములగు సమాసములు గలవు.

1. వేట్రుమైత్తొగై : ఇది తత్పురుషసమాసము వంటిదే. విభక్తితో చేసిన సమాసమని యర్థము॥ నిలమ్ - కడన్దాన్ > నిలఙ్కడన్దాన్॥ (నేలను గడచెను) ద్వితీయావిభక్త్యంతమగు 'నిలమ్' అను శబ్దమునకును, 'కడన్దాన్' అను క్రియారూపమునకును నిచ్చట సమాసము కలిగినది. కారకమునకును క్రియకును సమాసము కలుగుట తమిళకన్నడముల రెండింటను గలదు. ఇట్టిది తెలుగున సమాసరూపమున పేర్కొనబడ లేదు. 'మాటపడెను; తలపోసెను; చెట్టపట్టెను' -- మున్నగువాట్ల ఈ పోలిక స్పష్టముగా కనిపించును. చిన్నయసూరి యిట్టివానిని శబ్ద పల్లవరూపములుగా పరిగణించి నిరూపించెను. కన్నడమునందు॥ మొగమ్ - నోడిదం > మొగనోడిదం (మొగమును చూచెను)॥ ఇచ్చట 'మొగమ్' అను ద్వితీయాంతమును 'నోడిదం' అను క్రియారూపమును సమసించినవి.

2. ఉవమైత్తొగై: దీనికి ఉపమితసమాస మని యర్థము॥ పొన్ - మేని > పొన్మేని (బంగారమువంటి మేను కలది)॥ బంగారము అను నర్థము గల పొన్నుశబ్దము ఉపమానము; మేను ఉపమేయము. ఈ రెండింటికి కలిగిన సమాసము కనుక ఉపమితసమాసమైనది. ఇది తెలుగు నందలి ఉపమానపూర్వపద కర్మధారయము వంటిది. తెలుగున 'పూ-పోడి' అను శబ్దములు పూవు వంటి పోడిమి గల స్త్రీ యను నర్థమున 'పూఁబోడి' యని యగును. ఇట్టి ఉపమితసమాసములు సంస్కృతమునను గలవు॥ సరసిజనేత్రుడు॥ ఉపమానపూర్వపద కర్మధారయము

లను పేర తెలుగున నున్న 'చిగురుఁగేలు' మున్నగునవి సంస్కృతమునందు లేవు. క్రియాంతమైన ఉపమిత సమాసముకూడ అరవమున కలదు. దీనికి 'వినై యువమత్తొగై' అని పేరు॥ పులిప్పాయ్ తత్తుగళ్॥ దీనికి పులి వలె మీద బడుట యని యర్థము. ఇట్టివి తెలుగున లేవు.

3. వినైత్తొగై: క్రియాసమాస మని యర్థము. క్రియాజన్య విశేషణములతోడి సమాసములను ఈ పేరున పిలుతురు ॥కొల్ యానై (చంపు ఏనుగు)॥ కొల్ అనునది క్రియాజన్య విశేషణము; యానై అనునది విశేష్యము. తెలుగున వచ్చెడు, వచ్చెడి, రాఁగల, వచ్చిన, వచ్చుచున్న, రాని మున్నగు క్రియాజన్యవిశేషణములతో సమాసము కలుగవచ్చును॥ వచ్చెడు రాయుడు॥ ఇటుగాక తచ్ఛబ్దముకూడ సమసింప వచ్చును॥ వచ్చెడిది; వచ్చెడివాడు॥

4. పణ్బుత్తొగై: గుణసమాస మని యర్థము; అనగా విశేషణము పూర్వపదముగా గల కర్మధారయ మనియే భావము॥ కరున్ కుదిరై (నల్లనిగుఱ్ఱము)॥ 'కుదిరై' అను విశేష్యమునకు పూర్వమందు గుణవాచకమగు 'కరి' వచ్చి సమాసమైనది. తెలుగున నల్లని గుఱ్ఱము, నల్లగుఱ్ఱము అన్నవిట్టివే. కన్నడమునందలి 'కర్మదు' (నల్లని చెఱువు) మున్నగునవి యిట్టివే.

5. ఉమ్మైత్తొగై: ద్వంద్వసమాస మని యర్థము. ॥ఇరాప్పగల్॥ ఇది తెలుగున గల 'రేయింబవళ్ళు' అను సమాసముతో సమానము. కన్నడమున 'కెయికాల్గళ్' అను రీతిగా ద్వంద్వము గలదు.

6. అన్మొళిత్తొగై: అన్యపదములనుగూర్చి చెప్పుసమాసము. ఇది బహువ్రీహి యను నర్థమున వాడబడినది. దీనికి 'పలనెల్' అను సమానార్థక తమిళశబ్దమునుగూడ వాడుదురు. 'వెళ్ళాడై' తెల్లని వస్త్రములు గల స్త్రీ యని యర్థము. తెలుగున వేయి వెలుగులు గల సూర్యుడు అను నర్థమున 'వేవెలుగు' అను సమాస మిట్టిదే. కన్నడమందు ఎఱ్ఱని కన్నులు గలవా డను నర్థమున 'కెంగణ్ణం' అని యగును.

పై రూపములన్నింటినిబట్టి చూచినచో కేవలము ఒక పదమునకు మరొక పదమును చేర్చుటచేతనే ద్రావిడభాషల యందు సమాసము లేర్పడుచుండె ననుట స్పష్టమగును. కొన్నియెడల నామము పూర్వ శబ్దమై క్రియ పరశబ్ద మగుటయు, కొన్నియెడల క్రియాజన్యవిశేషణము పూర్వశబ్దమై నామము పరశబ్ద మగుటయుకూడ ఇందు కలదు.

# కృత్తద్ధిత ప్రకరణము

క్రియాధాతువులకు, నామత్వమును సిద్ధింపజేయుటకు చేర్చు ప్రత్యయములను కృత్ప్రత్యయము లందురు. అట్టినామములను కృదంతములని యందురు. నామములకు విభక్తులకంటె భిన్నము లయిన ప్రత్యయములు కలిగి మతుబర్థము, భావార్థము, స్వార్థము మున్నగు వానియందు ప్రయోగార్హతను కలిగించును. అట్టి ప్రత్యయములను తద్ధితములని యందురు. ఆంధ్రశబ్దచింతామణి యీ విభాగము జోలికి పోలేదు. అయినను హలంతపరిచ్ఛేదమున "నామ్నః కవర్ణక స్స్యాత్ స్వార్థే స్యాదుత్వ మపి పరే తస్మిన్" అని కలదు. దీని కుదాహరణములుగా బాలసరస్వతి "పొలంతి, పొలంతుక; గొంతు, గొంతుక; నిప్పు, నిప్పుక; మొలంత, మొలంతుక" యను రూపములను చూపెను. ఆంధ్రభాషాభూషణము తద్ధితప్రత్యయములను, కృత్ప్రత్యయములను కలియగలిపి చూపినది; సంజ్ఞలను వాడలేదు. కావ్యాలంకారచూడామణి తద్ధితములనుగూర్చి కొంచెముగా తెలిపెను గాని కృత్ప్రత్యయముల పేరైనను తడవలేదు. సర్వలక్షణశిరోమణి "కృదంతభావార్థరీతులం దెలుపుదు" నని కృత్తులను, తద్ధితములను కలిపియే చెప్పెను. బాలవ్యాకరణము కృదంతపరిచ్ఛేద మని, తద్ధితపరిచ్ఛేద మని రెండు పరిచ్ఛేదములను వేర్వేరుగా నిరూపించెను. అంతే కాక "ధాతువునకు విహితం బగు దుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు" అని కృత్ప్రత్యయమును నిర్వచించెను. ఇంతవరకు కృత్తులను, తద్ధితములను వేరుపరిచి బాలవ్యాకరణము మాత్రమే చూపినట్లు చూచితిమి. పూర్వులు కలియగలిపియే చెప్పిరిగాని వేరుపరుపలేదు. దీనినిబట్టి కృత్తద్ధిత ప్రత్యయములకు విస్పష్టమైనభేదములేదని చెప్పనగును. తెలుగున నామక్రియాధాతువుల కంతరము కనుపట్టదు. కాని సంస్కృతవ్యాకరణానుసరణము వలన తద్ధితప్రత్యయములు వాడుకలోనికి వచ్చినవి; కృత్ప్రత్యయముల కంతయెక్కువ వ్యాప్తి కలుగలేదు. ప్రస్తుతభాషయందు కృదంత,

తద్ధితాంతములు స్వస్వరూపముతో స్పష్టముగా కనిపించును. అయినను కొన్నియెడల ఒకే ప్రత్యయము కృత్తద్ధితములకు రెండింటికిని వాడబడు చున్నది.

తొల్కాప్పియము కృత్తద్ధితసంజ్ఞలనుగాని, తద్విధానమునుగాని నిరూపింపలేదనియు. పదునొకండవశతాబ్దికి చెందిన 'వీరచోళియమ్' అను అరవవ్యాకరణము కృత్తద్ధితసంజ్ఞలను, తద్విధానమును గ్రహించె ననియు శ్రీసోమయాజిగారు వ్రాసిరి. కన్నడమునందలి శబ్దమణిదర్పణము 'తద్ధిత ప్రకరణము' అని ప్రకరణమునకు పేరు పెట్టి అందు కృదంతము లనుగూడ చేర్చి నిరూపించినది.

కావున తెలుగుభాషలో వలెనే అరవకన్నడములందును కృత్తద్ధితవిభాగము విస్పష్టముగా లేదని చెప్పవచ్చును. సంస్కృతమున నున్నంత విరివిగా ఈ విధానము ద్రావిడభాషలందు లేదనుటకు సందేహము లేదు.

కృత్ప్రత్యయములు

సంస్కృతమున 'కర్తవ్యమ్' మున్నగు వానియందు 'తవ్య' అనియు; 'గమనమ్' మున్నగు వానియందు 'న' అనియు; 'గతిః' మున్నగు వానియందు 'తి' అనియు; 'కారః' మున్నగు వానియందు 'అ' యని వచ్చి తొలియచ్చునకు దీర్ఘమగుటయు మున్నగువిధముగా ననేక ప్రత్యయములు గలవు. తెలుగునందలి ప్రత్యయములు వీనికంటె భిన్నములు.

తెలుగున కొన్నియెడల క్రియాధాతువే నామముగాకూడ వ్యవహరించును. ఇట్టియెడల వేరుగా ప్రత్యయము వచ్చుట యను మాట లేదు॥ పలుకు; చదువు; అడ్డు; దూకు॥ అరవమున 'కట్టు' మున్నగునవియు కన్నడమున 'ఓదు' మున్నగునవియు క్రియాధాతువులై నామములుగా కూడ వాడబడును.

కొన్నిచోట్ల ధాతువునందలి తొలియచ్చునకు దీర్ఘము కలుగును॥ పడు; పాటు; చెడు; చేటు॥ అరవమున నిట్లే డకారమునకు ద్విత్వము కలుగుచున్న రూపములు గలవు॥ పాడు, పాట్టు; ఆడు, ఆట్టు॥ తెలుగున

నిచే యర్థమున 'పాట. ఆట' యని యదంతములయిన రూపములు కనబడుచున్నవి. కన్నడమున 'తోడు' ధాతువునకు కృదంతరూపము 'తోట' యనునది. వీని యన్నింటియందును చిట్టచివరి డకారము పారుష్యము నొందుట సమముగా కనిపించుచున్నది; అట్లే తొలుత హ్రస్వమున్నచో దీర్ఘముకూడ నగుచున్నది.

కలిమి, ఓరిమి, పేరిమి మున్నగువానియందలి 'ఇమి' మరొక ప్రత్యయము. అరవమునందు 'ఓర్మై, నేర్మై' మున్నగు విధముగా 'మై' అనియు, కన్నడమున 'కూర్మె, తక్కు-మె' అను విధముగా 'మె' అనియు నున్నది యీ ప్రత్యయమే. అరవమున 'తలై' మున్నగు విధముగా ఐకారాంతములుగా నున్నవి కన్నడమున 'తలె' యన్నట్లుగా ఎకారాంతముగా నుండుట స్వాభావికమే. తెలుగున 'కల్మి, ఓర్మి, పేర్మి' మున్నగు రూపములే ప్రాచీనములైనను గావచ్చును. ఉచ్చారణ సౌకర్యముకొరకు 'కల్ - మి' అనువానికి నడుమ 'ఇ' ప్రవేశించియుండును. అట్టిమొదల 'మి' యనునదే ప్రత్యయమగును. 'మి, మై, మె' యనువానిని ఆ యా భాషల స్వభావమునుబట్టి మారిన ఒకే ప్రత్యయము యొక్క రూపములుగా గణింపవచ్చును.

నడక, మొలక - మున్నగువానియందు తెలుగున 'క' ప్రత్యయము గలదు. 'కానిక, పోలిక' - మున్నగువానియందు ప్రత్యయమునకు పూర్వము ఇత్వముకూడ కలుగుచున్నది. అరవమందు దీనికి సమానముగా 'నడక్కై' అనియు, కన్నడమున 'మొళకె' యనియు రూపములు గలవు. అరవమున 'పోగై' యనునట్లు సరళముతోడిరూపము కూడ కలదు. కాని అది భిన్నము కాదు; అచ్చుల నడుమనున్న వ్యంజనము అరవమందు సరళముగానే పలుకును. అది ద్విత్వమైనపుడు పారుష్యము నొందును. కావున 'కగ' లు భిన్నములు కావు. ఇంక అరవమందలి ఐకారము కన్నడమున ఎత్వముగను, తెలుగున అత్వముగను నుండును. వినికి, ఉనికి, మనికి - మున్నగు శబ్దములయందలి 'ఇకి' వర్ణముకూడ పైనిచెప్పిన 'క' వర్ణమునకు సంబంధించినదే కావలయును. పోల్కి,

ప్రాన్కి- మున్నగువానిని పోలిక, ప్రానిక మున్నగు అదంత రూపములతో పోల్చి చూచినప్పుడు ఈ సామ్యము బోధపడగలదు. నమ్మకము, పంపకము, ప్రానకము - మున్నగు శబ్దములకు ప్రథమావిభక్తి ప్రత్యయమగు మువర్ణకముకూడ కలుగుచున్నది.

నడత, మడత - మున్నగు శబ్దములయందలి తవర్ణము కృత్ప్రత్యయము. ఇదే తవర్ణము దీర్ఘములమీద నైనచో బిందుపూర్వకమై కనిపించుచున్నది. అరవమున 'నడత్తై' అని ఐకారాంతముగా నుండును; కన్నడమున 'నడతె' యని ఎకారాంతముగ నుండును. దీర్ఘాంతములగు శబ్దములమీద కన్నడమున 'తం' అని యగును. నేయ్తం, కోయ్తం - అను నవి తెనుగున గల నేంత, కోంత - యనువానితో సమానములు పోయు మున్నగుధాతువులపై 'త' వర్ణమునకు పూర్వమిువర్ణమును, పిదప మువర్ణమును గలుగుచున్నవి॥ పోరితము, ఇంపితము, బిగితము॥ కొన్నిచోట్ల 'త' కారస్థానమున 'ద' కారము కలుగుచున్నది॥ ఒప్పిదము; మప్పిదము॥

మాంపు, త్రేంపు, కాంపు - మున్నగు వానియందలి పువర్ణము కృత్ప్రత్యయము. హ్రస్వములపై పూర్ణబిందుపూర్వకముగ ఇంపు, పెంపు అనువానిలో వలె గనిపించును. కన్నడమునందు ఇంపు, పెంపు అనునట్లుగానే యుండును. ధాతువుయొక్క చివరిహల్లుతో ఒక్కొక మారు ఈపువర్ణము సంయోగము చెందియుండును॥ మార్పు; కూర్పు॥ కన్నడమున కూడ ఇట్టి మార్పు కలదు॥ ఏర్పు, తోర్పు॥ అరవమందు 'చార్పు' మున్నగువిధముగా కడహల్లుతో సంయోగము చెందిన రూపములతోపాటు, ధాతువునకు కడపల ద్విత్వయుక్త 'పు' వర్ణము చేరిన పడిప్పు, ఉడైప్పు మున్నగురూపములును గలవు. సారళ్యము నొందకుండుటకు పువర్ణము అరవమున ద్విత్వము నెనసియుండును.

కట్టడము - మున్నగు అడాంతములు తెలుగులో కొలదిగా గలవు. వ్యావహారికమున భావార్థమునందు 'కట్టుట, చేయుట' మున్నగు వానికి బదులుగా 'కట్టడము, చేయడము' మున్నగురూపములు గలవు. అట్టి రూపములే కొన్నిచోట్ల స్థిరీకరణము నొంది, అర్థభేదమును పొంది

యుండవచ్చును. 'కట్టడము' అను పదమునకు 'కట్టుట' యను నర్థమే కాక, భవనాదికము అను నర్థము విరివిగా నున్నది. 'చెక్కడము' అనగా శిల్పము అను అర్థ మేర్పడినది. అరవమున 'కట్టడమ్' అనియు, కన్నడమున 'కట్టడ' యనియు సమానరూపములు గనబడుచున్నవి. కట్టడి, ఆఱడి మున్నగురూపములయందు ఈ 'అడ'యే ఇవర్ణాంతముగా కనిపించుచున్నది. అరవమునందలి 'కట్టళై' యనునది దీనితోడి సామ్యమును నిరూపించుచున్నది. 'డ,ళ'లు ద్రావిడభాషలయందు పరస్పరము మారుచుండుట ఒక లక్షణము. 'ఒత్తడము' అను తెనుగుశబ్దము తెనుగుననే 'ఒత్తడి' యను రూపముతో కనిపించుచున్నది. కన్నడమున నిదే యర్థముతో 'ఒత్తడ' యను రూపము కలదు. తెలుగున ఒత్తిడి, ఒత్తుడు; రాపిడి, రాపుడు - మున్నగు విధములైన రూపములు దీనికి సంబంధించినవే యనవచ్చును.

కొన్నియెడల ధాతువులకు 'అ ఇ ఉ' లు చేరుటవలన విశేష్యరూపము లేర్పడును. 'ఎండు' అను ధాతువునకు 'అ' వర్ణము చేరి 'ఎండ' అను రూపమేర్పడినది. చేయు, వ్రాయు, కూయు మున్నగువానికి చేయి, వ్రాయి, కూయి మున్నగురూపము లేర్పడును. కొన్నియెడల చివరి వర్ణమునకు పకారము కలుగగా దప్పి, పుప్పి మున్నగురూపములు కలుగును. తెలుగున గల ధాతువులన్నియు ఉకారాంతములుగా పరిణతి చెందుటవలన, మరల ఉకారము చేరినదని చెప్పుట యనావశ్యకము. నగు, నొచ్చు మున్నగువానియందలి కడపలి వర్ణములకు 'వ'కారము కలుగగా నవ్వు, నొవ్వు మున్నగురూపము లేర్పడును. అరవకన్నడములందు 'ఇ' ప్రత్యయము బహువ్రీహిసమాసమునం దధికముగ కలదు.

పాఱుంబోతు, వదఱుంబోతు మున్నగు శబ్దములయందలి 'పోతు' కృత్ప్రత్యయము. ఇది అరవకన్నడములందు లేదు. ఎగుబడి, దిగుబడి, రాబడి, పోబడి, ఎగుమతి, దిగుమతి మున్నగువానిలోని 'బడి' 'మతి' యనునవి కృత్ప్రత్యయములుగా తెలుగున వాడబడుచున్నవి. అరవమున 'వరుంబడి' మున్నగు 'బడి' ప్రత్యయముతోడి ప్రయోగములును, ఏత్తు

మది, ఇరుక్కమది మున్నగు 'మతి' ప్రత్యయముతోడి ప్రయోగము లును గూడ కలవు.

'తల' యనునది యంతమందు గల శబ్దములు తెలుగున ననేక ముగా కలవు. 'విడుదల' అను పదమునకు సమానముగా బిడుదలె, విడుదలై అనురూపములు కన్నడమునందును తమిళమునందును గలవు. పెంపుదల, ఒప్పుదల మున్నగురూపములందలి 'తల' యను ప్రత్యయ మునకు సమానముగా అరవమున 'తల్'అను ప్రత్యయము భావార్థమున కనిపించుచున్నది. పోదల్, సెర్దల్, వళర్దళ్ మున్నగు వానియందలి చివరి లకారమునకు అత్వము కలిగి తెలుగు రూపములు సిద్ధించె ననిపించును.

రాకడ, పోకడ మున్నగుచోటులందలి 'కడ' యనునది కృత్ప్ర త్యయము. పన్నుగడ, ఎత్తుగడ మున్నగుచోటులందు ఆ కకారము నాదత నొందినది. కన్నడమున 'ఎత్తుగడె' అను రూపము కలదు. అడఁ కువ, మెలఁకువ మున్నగుచోటులందలి 'కువ' యనునది కృత్ప్రత్య యము. అరవమున 'అడక్కమ్' అనియు, కన్నడమున 'అణకువె' యనియు రూపములు గలవు. కావున 'కువ' యనునది ప్రాచీనరూప ముల నుండియే సిద్ధించి, కన్నడమునందును తెలుగునందును నిలిచి యున్నదని అనిపించును.

## తద్ధితములు

సంస్కృతమున తద్ధితప్రత్యయములు అనేకవిధములుగా కలవు. సంబంధార్థమునను, అపత్యార్థమునను తైజసము, రాజతము; దాశరథి, జామదగ్న్యుడు మున్నగురూపములు కలుగును. ఇట్టి ప్రక్రియ ద్రావిడ భాషలయందు లేదు. ఇందలి విధాన మంత విస్తృతమైనది కాదు. ప్రత్యయాత్మక భాషలగు సంస్కృతాదులయందలి విస్తృతప్రణాళిక సంయోగాత్మకభాషలగు తెనుగు మున్నగువానికి అన్వయింపదు. అయి నను సంస్కృతముతోడి సంబంధమువలన కొన్ని లక్షణములు కలిగినవి.

తెలుగున మద్దెలవాడు, తములపాకులవాడు మున్నగువిధముగా తచ్ఛబ్దమును చేర్చి పలుకుదుము. సంస్కృతమున 'ఇక' యను ప్రత్య

యము కలిగి 'మార్దంగికః' 'తాంబూలికః' మున్నగువిధముగా రూపము లేర్పడును. కన్నడము సంస్కృతము ననుసరించి 'మద్దలింగం, తంబు లింగం' మున్నగువిధముగా వాడుచున్నది. వీనిని సంస్కృతరూపముల నుండి ఉద్భవించిన తద్భవములుగా గ్రహించుట యుక్తము. వీని ప్రభావమువలన కేవలదేశ్యములపై 'ఇగ' ప్రత్యయము చేరి క్రొత్త రూపము లేర్పడుట స్వాభావికమే॥ సుంకిగం; అటమటిగం॥

'హాస్యకారః' మున్నగు సంస్కృతరూపములు కన్నడమున 'నగెకారం' మున్నగువిధముగ 'కార' ప్రత్యయముతో నుండును. అరవమునకూడ 'వాద్యక్కారన్' మున్నగు విధముగా 'కార' ప్రత్యయము కనిపించుచున్నది. తెలుగున 'ఆటగాడు, వేటగాడు' మున్నగు రూపములందలి 'కా' ప్రత్యయము 'కార' ప్రత్యయముతోడి పోలికను గలిగియున్నది. బహువచనమున 'వేటకాండ్లు, విలుకాండ్లు' మున్నగు విధముగా 'అ' కారముతో నున్నరూపము లీ సామ్యమును బలపఱుచు చున్నవి.

తెనుగున గల కమ్మరము, కుమ్మరము మున్నగుశబ్దములు 'కమ్మరం' 'కుంబరం' మున్నగువిధముగా కన్నడమున గలవు. ఇవి కర్మకారః, కుంభకారః అను సంస్కృతశబ్దములకు వికృతులుగనే ఏర్పడి యుండవచ్చును. ఉత్తరాదిభాషల యందును వీనితో పోలిక గల 'కుంభార్' మున్నగురూపములు గలవు. కావున కమ్మర, కుమ్మర మున్నగునవి ప్రాకృతమునుండి వచ్చి యుండవచ్చును. అయినను 'ఇ' ప్రత్యయము కలిగి కమ్మరి, కుమ్మరి మున్నగురూపము లేర్పడినవి. వీనిని మరల విడదీయగా 'అరి' అనునది ప్రత్యయముగా వేరుపడినది. సుంకరి, జాలరి మున్నగు మతుబర్థకయుక్తశబ్దము లట్లేర్పడియుండును. సంస్కృతమునందలి 'కార' ప్రత్యయము కారణముగా కన్నడమందును, అరవమునందును 'కార' యనియు, తెలుగున 'కాడు' అనియు, కన్నడ మున 'గం' అనియు రూపములు కలిగినట్లు ఊహింపనగును. 'కార' యనునదియే ప్రాకృతమునందు 'ఆర' మై 'ఇ' వర్ణము నొంది 'అరి'

వర్ణకముగా మరల వాడబడుచున్నది. ద్రావిడభాషలయందు 'వాఁడు, అది' అను తచ్ఛబ్దములను చేర్చుటయే స్వాభావికము॥ నల్లవన్, నల్లదు; మంచివాఁడు, మంచిది॥ వాఁడు అనుశబ్దమే 'వ' ధ్వనిని గోల్పోయి 'ఆఁడు' అనియై మతుబర్థకముగా వాడబడుటయు గలదు॥ వగలాఁడు॥ తెలుగున స్త్రీవాచక మగునపు డిత్వము కలిగి 'వగలాడి' మున్నగు విధముగా నగును. కన్నడమున 'సిగ్గాళి' మున్నగురూపములు గలవు.

ఆయుష్మంతుడు మున్నగువిధమైన తత్సమరూపములు తెనుగున ననేకముగా గలవు; కన్నడమునందు 'ఆయువంతం' అను విధముగా వికృతులు వాడుకయందు గలవు. అరవమునందును నిట్టివి గలవు. 'పశుప్రాయుడు' మున్నగుచోటులందు 'పశుప్రాయన్' అను విధముగా, తత్సమరూపములు గలవు. అంతమాత్రముచేత మతుప్ప్రత్యయము ద్రావిడభాషలయందు గల దనరాదు. తెలుగున 'పనిమంతుడు' మున్నగు రూపములు వాడుకలో ఒకటి రెండేర్పడినవి; కాని, వానిని సరియగు రూపములుగా వ్యాకర్త లంగీకరింపరు. అరవమునందు 'బుద్ధియుళ్ళవన్' అనునట్టి రూపములే అధికముగా కలవు. తెలుగున 'తెలివైనవాఁడు, తెలివిగలవాడు' అను విధముగా నుండును.

మంచితనము, రామునితనము – మున్నగువిధముగా 'తనము' అను ప్రత్యయముతోడి శబ్దములు గలవు. అరవమున 'తన్మై' అని స్వభావార్థమున నొక శబ్దము కలదు. ఇదియే అరవమున 'తనమ్' అనియు, కన్నడమున 'తనం' అనియు భావార్థకముగా నగుచున్నది॥ పురుషతనం; జాణతనం॥ దీనికిని సంస్కృతమున గల ప్రాక్తన, నూతన, సనాతన, అధునాతన మున్నగుశబ్దములయందలి 'తన' ప్రత్యయము నకును సంబంధమున్నట్లు భ్రమ కలుగుట కవకాశము గలదు. కాని తెలుగునందలి 'తనము' కేవలము పదము. ఆత్మార్థమున గల సర్వనామ రూప మగు 'తన' అనునదే 'స్వభావము' అను నర్థమున 'తనము' అని యైనది. సంస్కృతమునందలి 'తన'కు ఇట్టి సంబంధమును, ఉపయోగ మును లేవు.

మేల్మి, బల్మి – మున్నగు రూపములందు 'మి' వర్ణము తద్ధితప్రత్యయము. కల్మి, ఓర్మి మున్నగు చోటులందలి 'మి' వర్ణమునకును దీనికిని న్యాయముగా భేదము లేదు. నామముపై వచ్చుటచేత తద్ధితమనియు, క్రియాధాతువుమీద వచ్చుటచేత కృత్ప్రత్యయమనియు పరిగణించిరి. కాని యీ విభాగమునకే ప్రయోజనమును కనిపింపదు. అరవమునందు పెరుమై అనియు, కన్నడమున పెర్మె అనియు రూపములు గలవు. తెలుగున పెరిమ, పెరిమె అను రూపములు రెండును గలవు.

తెలుపు, మునుపు – మున్నగు శబ్దములందలి 'పు' వర్ణము తద్ధిత ప్రత్యయము; కాని, 'చూపు, మాపు' మున్నగు శబ్దములందలి పువర్ణమే యిది. కావున ఇది కూడ తద్ధితముగను, కృత్ప్రత్యయముగనుగూడ వాడబడుచున్నది. అరవ కన్నడములందుకూడ ఇదే స్థానమున 'పు' వర్ణము వాడబడుచున్నది.

పెద్దఱికము, చిన్నఱికము మున్నగు చోటులందలి 'ఱికము' తద్ధితములం దగును. దీనికి కృత్ప్రత్యయముగా వాడుక లేదు.

ముక్కిడి మున్నగు శబ్దములందు అభావార్థమున 'ఇడి' ప్రత్యయము కలుగుచున్నది. కన్నడమునందును. 'వాలిలి' మున్నగువిధముగా అభావార్థమున కొన్నిచోట్ల 'ఇడి' వర్ణకము కనిపించుచున్నది. 'రాయిడి, రాపిడి' మున్నగుచోట్ల కృత్ప్రత్యయముగా కూడ 'ఇడి' వర్ణకము కలదని యీవరకు చూచితిమి.

తిండిపోతు, నిద్రపోతు–మున్నగు చోటులందలి 'పోతు' తాచ్ఛీల్యమునం దగు తద్ధితప్రత్యయము; కాని పాఱుఁబోతు, వదరుఁబోతు మున్నగుచోట్ల కృత్ప్రత్యయముగాకూడ నున్నది.

ఒయ్యారి మున్నగుచోటులందు ఇవర్ణకము కలదు. మతుబర్థమున 'వెళ్ళి' మున్నగువిధముగా అరవమునను, 'చాగి' మున్నగువిధముగా కన్నడమునను ఇవర్ణకము కలుగుచున్నది. బానసీఁడు మున్నగు చోట్ల 'ఈ' వర్ణము కూడ తెలుగున తద్ధిత ప్రత్యయముగా వాడబడుచున్నది.

పర్యాయము అనునర్థమున తెలుగునందు మెయి, మై అనునవి తద్ధితప్రత్యయములుగా గలవు. అరవమందు ఒరుమై మున్నగువిధము గను, కన్నడమున ఒర్మె అను విధముగను ప్రయోగములు గలవు.

ఇంతవరకు చూచిన దానినిబట్టి ఒకే ప్రత్యయము కృత్ప్రత్యయముగను, తద్ధితప్రత్యయముగను వాడుక గల్గి యున్నట్లు కనిపించును. చాల ప్రత్యయములు స్వతంత్ర ప్రయోగము గల శబ్దములుగనే కనిపించును॥ 'కొలది, బంటి' మున్నగుశబ్దములు కొన్ని తద్ధితప్రత్యయములుగానే స్థిరపడినవి. సంస్కృతప్రభావమువలన అరి, ఇ - మున్నగు ప్రత్యయములు ద్రావిడభాషలలో నేర్పడినట్టు లనుమానించు నవకాశ మున్నను, సంస్కృతసంబంధము లేని స్వతంత్రవిధాన మున్నట్లు స్పష్టముగా గ్రహింపగలము.

# క్రియా ప్రకరణము

ప్రౌఢవ్యాకర్త తెలుగునందలి పదములను నామములు, క్రియలు, అవ్యయములు అని మూడు విధములుగా విభాగించెను. ఆంధ్రశబ్ద చింతామణియందు 'క్రియా ధాతుః' అను సూత్రమున ధాతువునే క్రియగా పరిగణించుట జరిగినది. క్రియాపరిచ్ఛేదమునందు ఉపకృతి, పరిణతి, సంవృతి భేదములచేత క్రియ మూడు విధములుగా నిరూపితమైనది. "తద్ధర్మ వర్తమానాతీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః" అనియనుటచేత కేవలధాతువునే కాక పురుషప్రత్యయములతోడి తిఙంత రూపములనుకూడ 'క్రియ' యను పేర వాడినట్లు స్పష్టము. ఆంధ్రభాషా భూషణమున కేతనకూడ "అనంతరంబ క్రియాపదంబు లెఱింగించెద" ననిపల్కి త్రికాలబోధకములగు సమాపక క్రియారూపములను నిరూపింప సాగెను. ఆంధ్రకౌముదియందు గణపవరపు వేంకటపతికవి "వరుస నింకఁ దిఙంత వాచకరీతులు తెనుఁగునఁ దగునట్లు దేటపఱుతు"నని మొదలిడి లఙ్ఙు, లిఙ్ఙు మున్నగు సంజ్ఞలను వాడుకొనెను. సంస్కృత గ్రంథములందు క్రియాపదముతోపాటు 'ఆఖ్యాత'మనుపదము కూడ వాడుకలో కలదు.

తమిళమునందు ఇతరసంజ్ఞలకువలెనే వ్యాపారబోధకమయిన క్రియాశబ్దమునుగూడ తమిళములోనికి అనువదించి గ్రహించిరి. 'వినై' అనగా క్రియ యని యర్థము. ధాత్వర్థమున 'ఉరిచ్చొల్' అని తొల్కాప్పియనారు వాడియుండెను.

కన్నడభాషయందు సంస్కృతపదములనే గ్రహించిరి. కన్నడ భాషాభూషణము 'ఆఖ్యాత విధాన'మనియు, శబ్దమణి దర్పణము 'ఆఖ్యాత ప్రకరణ'మనియు శీర్షిక లుంచినవి.

మొత్తముమీద తెలుగునందు ధాతుక్రియాపదములను చింతామణికారునినుండియు సమానముగా వాడినప్పటికిని ప్రక్రియయందు భేదము కనిపించుచున్నది. చిన్నయసూరి 'ధాతువునకు' అన్నది అధికార

సూత్రము అని తెల్పి ప్రత్యయాదికము ధాతువునకు కలుగునట్లుగా విధించెను. కావున పురుషప్రత్యయాదులను చేర్చుకొన్నవి 'క్రియ' లనియు, అటుకాక మూలరూపములైనవి 'ధాతువు' లనియు గ్రహించిన ఒక స్పష్టత కలుగును. నామములకు మూలరూపము లైనవి. నామ ధాతువులైనట్లే క్రియలకు మూలరూపము లైనవి క్రియధాతువు లగును.

## తెనుగుధాతువుల స్వరూప స్వభావములు

ద్రావిడధాతువులలో చాలభాగము క్రియలకును, నామములకును గూడ మూలములుగా వాడబడుచుండును. విభక్తిప్రత్యయములను జేర్చుకొని నామముగా వాడుకొనుట కుపయోగపడిన ధాతువే పురుష ప్రత్యయములను జేర్చుకొని క్రియగా కూడ వాడుకొనుట కుపయోగ పడుచుండును. 'పలుకు' అనునప్పుడు మాట యని యర్థము; ఇది నామము. 'పలుకుము' అను నర్థమున క్రియ యగుచున్నది. ఇట్లే 'అదుకు పెట్టెను' అను వాక్యమున 'అదుకు' నామము. 'అదికెను' అను చోట అదే ధాతువు స్వరాకర్షణమువలన చిన్నమార్పు నొంది క్రియ యైనది. ఇట్లే పెక్కు ద్రావిడధాతువులు రెండువిధములగు ఉపయోగ ములను గలిగియున్నవి. నామము అని యనుటచేత విశేషణవిశేష్య ములను రెండింటిని గ్రహింపవలయును. 'పలుకు తీపి' యనునప్పుడు 'పలుకు' విశేషణమాత్రముగా నున్నది. ఇదియే 'తీపిపలుకు' అనియైనచో 'పలుకు' విశేష్యమగును. కావున ఒకే ధాతువు క్రియకును, విశేష్య విశేషణములకును మూలమై వాడుక నొందగలదని తెలియుచున్నది.

ఇట్లే ఒకద్రావిడభాషయందలి ధాతువు మూడువిధములగు ప్రయోగమును అదే భాషలో పొందకపోయినను పొరుగుభాషలో పొందియుండవచ్చును. ఒకభాషలో కేవలము క్రియగానే యుపయోగ పడిన ధాతువు మరొకభాషయందు నామముగానే యుపయోగపడి యుండవచ్చును. 'త్రవ్వు' అనునర్థముగల 'అగఴ్' అను ధాతువు తమిళ కన్నడములందు క్రియగా నుపయోగపడును. తెలుగున క్రియారూపము

కనిపింపదు. కాని కృత్ప్రత్యయమగు తకారముతోడి నామము 'అగ_త్త'
యని కనుపట్టును. 'పర్ణము' అను నర్థము గల 'ఆకు' అను నామము
నకు సరియగు క్రియారూపము తెలుగున లేదు. కాని కన్నడమున
'అగె' యనియు, అరవమున 'అగ్గై' యనియు 'ఆకు తొడుగు' అను
నర్థమున క్రియారూపము గలదు. కాబట్టి ధాతువులకు త్రివిధోపయో
గము సమ్మతమైనను, ఒక్కొక్క-భాషలో ఒక్కొ-కరూపమునకు
ప్రాచుర్యము తగ్గియుండవచ్చును.

ప్రాచీనమూల ద్రావిడధాతువులకు కు, గు, చు, దు, బు, సు
మున్నగు ప్రత్యయాదులు చేరి రెండవతరపు ధాతువుల నేర్పరుచుచుండును.
కొన్నియెడల ఈ ప్రత్యయములు పూర్ణబిందుపూర్వకములై యుండును.
తమిళమందున్న 'అడఙ్గు' అను ధాతువునకు 'అడగియుండు' అని
యర్థము. ఇదే యర్థమున కన్నడమున 'అడకు' యని, తెలుగున
'అడగు' అని రూపము లుండును. వీని యన్నింటికి మూలరూపము
ప్రాచీన ద్రావిడమున 'అడ్' అని యూహింపనగును. ఇట్లే తిరుందు,
దిద్దు, నీన్దు, ఈదు, నిరమ్పు, నింపు మున్నగురూపములు ప్రత్యయాదిక
మును గ్రహించి, రెండవతరపు ధాతువులై యున్నవి.

తెలుగును వీని యునికిని వ్యాకర్తలు గ్రహించియే యుండిరనుట
సమంజస మనిపించును. ముత్తు పరంబగునపుడు ఈ రెండవతరపు ధాతు
వులు చాలవరకు ప్రాథమికరూపములతోనే ప్రత్యక్షమగును॥ ఇచ్చు -
ఇమ్ము; తెచ్చు - తెమ్ము; వచ్చు - రమ్ము; చచ్చు - చావుము;
నొచ్చు - నోవుము॥

ఇట్లే కృత్ప్రత్యయములు పరమగునపుడు ధాత్వంతమునందలి
కగచయవలకు లోపము విధింపబడినది. దీనినిబట్టి ప్రాథమికధాతువులపై
చేరినవానికి లోపము చేసిన మీఁదటనే కృదంతరూపము లేర్పడు నని
తెలియుచున్నది. అనగా కృదంతరూపములు ప్రాథమికధాతువులపైనే
యేర్పడెననియు, తరువాతి కాలమున క్రమముగా రెండవతరపు ధాతువు
లేర్పడి యుండుననియు ఊహింపనగును. 'కలుగు' అను ధాతువునకు

'ఇమి' అను ప్రత్యయము పరముకాగా 'కలిమి' అని యైనది. దీనినిబట్టి 'కల్' అనునది మూలధాతువనియు, దానిపై ఉత్వముతోడి గువర్ణము అదనముగా వచ్చి చేరెననియు, స్పష్టముగా తెలియుచున్నది. ఇట్లే పిలుచు - పిలుపు; అలుగు - అలుక; కొలుచు - కొలత మున్నగునవి యేర్పడుచున్నవి. ధాత్వంతమునందలి క గ చ య వ లు ధాత్వంశ ములు కావు గనుకనే లోపించుచున్నవి; అట్లు కానియెడల వానికి నష్టము కలిగింపరాదు.

ద్రావిడభాషలలో ప్రప్రథమముగా తమిళము సాహిత్యస్థితిని పొందియున్నది. కావున, ప్రాచీనద్రావిడమునకు సమానరూపముకాని, సన్నిహితరూపముకాని తమిళమున సాక్షాత్కరించుననుట సమంజసము. నిరనుబంధములయిన క్రియాధాతువులు తమిళములో నుండగా, ఈవరలో చెప్పిన ప్రత్యయాదికమును కలిగిన రూపములు కర్ణాటాంధ్ర ములలో కనిపించుచున్నవి. అరవమునందలి 'అల' కన్నడమున నట్లే యుండగా, తెలుగున 'అలయు' అని యైనది. అరవధాతువగు 'అడి' తెలుగు కన్నడములందు 'అడుచు, అడచు' అని చువర్ణమును పొంది యున్నది. ఇట్లే అనేకధాతువులు సానుబంధములగుట అర్వాచీనతను స్పష్టము చేయును.

అట్లని రూపసామ్యము గల ధాతువులును లెక్కకు తక్కువగా లేవు; ఏమాత్రమును భేదము లేకుండ తమిళకర్ణాంధ్రములం దనేక ధాతువులు గలవు. అంటు, అరుగు, ఎక్కు, ఒట్టు, కదలు, మెచ్చు, కూడు, తప్పు, ఒప్పు మున్నగునవి యెన్నేని ఉదాహరణములు కాగలవు. అరవకన్నడములందు హలంతములై యున్నధాతువులు స్వర సామరస్యము కొరకు తెలుగున ఉత్వము నొందినవి. అరవమునందలి 'అదర్' తెలుగున 'అదరు' ఐనది. 'ఆర్' అనునది 'ఆరు' ఐనది. కాని 'కను, విను' మున్నగు ఉకారాంతముల ఉత్వము వైకల్పికముగా లోపించుటకు వ్యాకర్తలవకాశము కల్పించిరి. దీనినిబట్టి ప్రాచీనధాతువు హలంతమే యనియు, ఉత్వము నొంది తెలుగున నున్నను,కొన్నియెడల

కాలాంతరూపప్రయోగముకూడ లేకపోలేదనియు తెలియుచున్నది. ఒక భాషయందు అనుస్వారసహితముగా నున్న ధాతువు, మరొకభాష యందు నిరనుస్వారముగా నుండవచ్చును. అరవమునందలి 'తుడంగు' కన్నడమున 'తొడంగు' అనియు తెలుగున 'తొడఁగు' అనియు నుండును. అరవమునందలి 'అడంకు' తెలుగున 'అడంగు' అని యగును. కన్నడ మున నిరనుస్వారముగా 'అడకు' అని యగును. ఇట్టి మార్పులును వర్ణ సమీకరణము, తాలవ్యీకరణము, ధ్వనిక మార్పు మున్నగువానివలన కలిగిన మార్పులును ధాతువులలో కనిపింపవచ్చును. అయినను ద్రావిడ భాషాధాతువులకు గల సామ్యము స్పష్టముగా కనిపించుచునేయుండును.

ద్రావిడక్రియలు పూర్తిగా సంయోగాత్మకస్వభావము గలవి. ముఖ్యముగా సమాపకక్రియలను సమాసములుగా పరిగణింపవచ్చును. ధాతువుపై కాలమును గాని అర్థమును గాని సూచించు ప్రత్యయము చేరును; వచనమును వాచకము (లింగము)ను సూచించు పురుషప్రత్యయము చేరును. ఇవన్నియు కలిసి ఒక యర్థమును బోధించుచు సమాస సామ్యమును సాధించుకొనును. 'రాఁగలఁడు' అను ప్రయోగము 'వచ్చుట యున్నవాఁడు' అను నర్థమును దెల్పును. 'వచ్చు' అను ధాతువునకు అన్నంతరూపము 'రాన్' అనునది; వచ్చుటయను భావార్థ మునే బోధించును. పైనున్న 'కల' అస్త్యర్థకము; భవిష్యత్కాలసూచ కము. 'డు' ప్రథమపురుషైకవచనమున మహద్వాచకప్రత్యయము; 'వాఁడు' అను తచ్ఛబ్దమునందలి యవశిష్టరూపము. వీని యన్నింటి కలయికవలన 'రాఁగలఁడు' అను సమాస మేర్పడినది. ఇట్లే క్రియా పదము లన్నియు సమాసములే. పైని ప్రత్యయాదికము చేరుటవలన ధాతువు ధ్వనిసూత్రముల కనుగుణముగా చిన్న చిన్నమార్పులను పొందవచ్చును.

విధ్యాద్యర్థమునందు మధ్యపురుషైకవచనము కేవల ధాతువే యైయుండును. దీనిపై ఈవరలో చెప్పికొన్నట్లు కాలబోధక పురుష బోధక ప్రత్యయాదికము చేరదు. తెలుగున పురుషబోధకము వైకల్పి కముగా చేరుచుండును॥ తిను – తినుము; పో – పొమ్ము॥

ధాతువుపైని ధాతువు చేరుటవలన మరొకధాతువు కలుగుట ద్రావిడభాషలలో విశేషముగా గలదు. ఇట్టియెడల పూర్వధాతువుల కున్న యర్థముకంటె, భిన్నమై విలక్షణమైన యర్థము కలుగును. ఇట్టి రూపములను చిన్నయసూరి శబ్దపల్లవములని యనెను. కొందరు ధాతు పల్లవములని పేర్కొనిరి. చనుదెంచు, అందిచ్చు, నిలుచుండు మున్నగు నవి యిట్లు రెండు ధాతువులు కలియగా ఏర్పడిన శబ్దపల్లవరూపములే. ఇందు పరమందున్న తెంచు, ఇచ్చు అనువానికి తెచ్చు, ఇంచు అను రూపాంతరములుకూడ కలవు. నామములపైని ధాతువులు చేరుట వలనగూడ శబ్దపల్లవములు ఏర్పడును. పేరాడు, సెంపొందు, ఇంపారు, పరుగెత్తు, తలపోయు మున్నగు వానియందు ముందరిది నామము; రెండవది క్రియాధాతువు. కొన్నియెడల సంధివశమున రూపమునందు కొంతమారుపాటుకూడ కానవచ్చును. తో తెంచు, ఏతెంచు, వాపోవు, పన్నుండు మున్నగురూపములలో నిట్టి పరిణతి కొంత కనిపించును. సామాసికరూపసాతత్యమువలన నిట్టిమార్పులు కలుగుట ఉచ్చారణాను గుణమై ఉచితమై కనుపట్టును. ఇట్టివి తెలుగుభాషయందు చాల నధిక ముగా కలవు. ధాతువుపై ధాతువును జేర్చి, నామముపై ధాతువును జేర్చి క్రొత్తధాతురూపములను ఏర్పరుచుట భాషాగతమైన వికాసశీల మును వ్యక్తముచేయును. అవశ్యకమునుబట్టి శబ్దపల్లవములు భాషలో ప్రవేశించి ప్రతిష్ఠను సంపాదించుకొని యుండును. అరవమునందును, కన్నడమునందునుగూడ ఈ విధమగు రూపము లుండుటవలన దీనిని ద్రావిడభాషకు విలక్షణమైన లక్షణముగా గ్రహింపవలసి యున్నది.

ద్రావిడక్రియలకు మరొకస్వభావముకూడ కలదు. క్రియకు కర్తగా క్రియాపదముకూడ నిలుచుచుండును. 'చేయవలయును' అను చోట 'వలయును' అను ప్రధానక్రియకు 'చేయన్' అను అన్నంత రూపము కర్తయైనది. కావుననే వాక్యమున కర్తతోడి సంబంధమును గాక క్రియ యగు 'వలయును' అన్నంతక్రియాన్వయమునే కలిగియున్నది. నీవు, మీరు, వాడు, వారు, నేను, మేము — వీనిలో ఏది కర్తయైనను

'వలయును' అను క్రియారూపముమాత్ర మట్లే యుండును. అట్లే 'రావచ్చును' మున్నగు పెక్కు ప్రయోగములు గలవు.

ద్రావిడక్రియ ప్రక్రియావైపుల్యము కలది కాదు. వచనమును బట్టియు, వాచకమునుబట్టియు కొంతమార్పు క్రియారూపమునందు గోచరింపవచ్చును గాని, యథార్థమున కది యంతక్లిష్టము కాదు. సమాపకక్రియలకు చివర యుష్మదస్మచ్ఛబ్దముల అవశిష్టములే చేరును. ప్రారంభకాలమున సమాపకక్రియయే ఒక వాక్యము. అదియే సమాస రూపమునొంది విశేషణ మైనది; అనంతరకాలమున క్రియాత్వము నొందినది; 'వచ్చినవాఁడు ఫల్గునుఁడు' అనుచోట 'వచ్చినవాడు' అను నది సమాసము; 'ఫల్గునుఁడు' శబ్దమునకు విశేషణము. కాని, తరువాతి కాలమున నిట్టి ప్రయోగములు విశేషణములుగా గాక సమాపక క్రియలుగానే చెల్లుచున్నవి. నిజమునకు 'నల్లనివాడు' అనునది యెట్టిదో 'వచ్చినవాడు' అనునదికూడ అట్టిదే. అందువలననే సమాపకక్రియలను సమాసరూపములుగానే గ్రహించుట చరిత్రానుగుణమై సమంజసమై యుండును. తెలుగున భూత భవిష్యద్వర్తమాన కాలములును, భావ వ్యతిరేకవిధ్యాద్యర్థకములును మాత్రమే కలవు. చారిత్రకముగా చూచిన 'వర్తమానకాలము' కూడ ప్రారంభదశలో కాక, తరువాతికాలమున బయలువెడలినది.

దేశ్యక్రియలన్నియు అరవకన్నడములందు గల క్రియాధాతువు లతో సామ్యమును సన్నిహితత్వమును కలిగియున్నవి. ఇట్లే యితర భాషలనుండి నామక్రియలను తెలుగున క్రియాధాతువులుగా వాడు కొనుట సంప్రదాయము. అరవకన్నడములందు చేర్చియే వాడుకొను సంప్రదాయము కలదు. కావున, తెలుగుక్రియ స్వరూపస్వభావములను బట్టి లక్షణతను ద్రావిడభాషావి నిరూపించుచున్నదని నిర్ణయము చేయవచ్చును.

### అకర్మక సకర్మక విభాగము

అర్మకములని సకర్మకములని క్రియలు రెండువిధములు. కర్మ యొక్క ఆకాంక్ష లేనివి అకర్మకములు; కర్మయొక్క ఆకాంక్ష గలవి సకర్మకములు. ఎవనిని, దేనిని మున్నగువిధముగా ప్రశ్న వేయుటకు వీలు పడని క్రియలను అకర్మకములని, అట్లు వీలుపడినప్పుడు సకర్మకములని యందురు. 'వచ్చెను' అనురూపమున్న దనుకొందము. 'ఎవనిని వచ్చెను' అనికాని 'దేనిని వచ్చెను' అనికాని ప్రశ్నించు నవకాశముకలుగదు. కావున ఇచ్చట కర్మాకాంక్ష లేదు. కాబట్టి యిది అకర్మకక్రియ. 'వండెను' అని యన్నపుడు 'దేనిని వండెను' అను ప్రశ్నకు అవకాశము కలదు. 'వంటకమును వండెను' మున్నగువిధముగా సమాధానము లభించును. కావున 'వండెను' అనుదానికి కర్మాకాంక్ష కలదు; కాబట్టి ఇది సకర్మకక్రియ. ఇట్లు స్పష్టముగా అకర్మకక్రియలును, సకర్మకక్రియ లును వేర్వేరుగా కనిపించును. ఐనను, కొన్నిచోట్ల ప్రేరణార్థకము నకును సకర్మకమునకును స్పష్టమైనభేదము గోచరముకాక కొంతక్లేశము నాపాదించుటయు గలదు.

తమిళవ్యాకర్తలు క్రియలను 'పిరవినై' అనియు 'తన్ వినై' అనియు రెండు విధములుగా విభాగించిరి. మొదటి దానికి 'పరక్రియ' అనియు, రెండవదానికి 'ఆత్మక్రియ' అనియు అర్థము. సంస్కృ తమునందలి 'పరస్మైపదము, ఆత్మనేపదము' అనువానికి పై రెండు సంజ్ఞ లును కేవలానువాదములే. కాని సంస్కృతమున గల భేదము మాత్రము ద్రావిడధాతువులలో కనిపింపదు. 'భూ' ధాతువు పరస్మైపది. కావున దీనిపై ప్రత్యయములు వచ్చి 'భవతి, భవతః, భవన్తి' మున్నగు విధ ముగా నగును. ఆత్మనేపదియగు 'రమ' ధాతువుపై ప్రత్యయములు కలు గగా 'రమతే, రమేతే, రమన్తే' మున్నగు విధముగా రూపములు కలు గును. పరస్మైపదికిని, ఆత్మనేపదికిని చేరు ప్రత్యయములయందు చిక్కులి అంతరము గలదు. తమిళమున గల ప్రత్యయములందు ఇట్టి భేదము ఏమాత్రము లేదు. అంతేకాక క్రియాఫలము అన్యులకు చెందు నెడల

పరస్మైపది అనియు, వక్తకే చెందునెడల ఆత్మనేపది అనియు సంస్కృత వ్యాకర్తల తత్త్వము. కాని, వ్యావహారికముగా ఈ తత్త్వము తడబాటునొంది కేవల మొకరూఢి ననుసరించి యున్నది. ఇంతకును ఈ విభాగమునకును, అకర్మక సకర్మక విభాగమునకును ఏమియు సామ్యము కనిపింపదు. తెనుగున ఆత్మనేపదార్థమున ధాతువునకు 'కొను' ధాతువు అనుప్రయుక్త మగును. 'తెచ్చెను' అనునది సకర్మకక్రియ. దీని ఫలము ఎవరికైనను చెందవచ్చును. అటుకాక, కర్తకే చెందవలయునన్నచో 'తెచ్చుకొనెను' అని వాడవలయును. ఇప్పుడు తన నిమిత్తము మాత్రమే తెచ్చుట యను క్రియ జరిగిన దనునర్థము వచ్చును. ఈ విధముగా 'కొను' అను అనుబంధక్రియా ధాతువు సకర్మకములకు మాత్రమే యగును.

సకర్మకములకును, అకర్మకములకును కాలపురుషబోధక ప్రత్యయములు చేరుటలో భేదము లేదు. 'చేయు' అను నర్థముగల 'పన్ను' సకర్మధాతువు. వర్తమానార్థమున 'పన్నుగిరేన్' భవిష్యదర్థమున 'పన్నువేన్' అని రూపము లుండును. ఇట్లే అకర్మకధాతువులకును ఇదే విధమగు ప్రత్యయములు గలుగును.

అకర్మకధాతువులను సకర్మకములుగా మార్చుటకు కొన్ని మార్గములు కలవు. అరవమున ధాతువునకు చివరనున్న గు, ంగు మున్నగువానికి ద్విత్వము కలిగించుట యొకటి. 'పెరుగు' వర్ధిల్లు అను నర్థముగల అకర్మకధాతువు. చివరి 'గు' వర్ణమునకు ద్విత్వమును కలిగింపగా పారుష్యముకూడ కలిగి 'పెరుక్కు' అని యగును. దీనికి 'పెంచు' అని యర్థము. ఇది సకర్మకము. 'అడైసు' అను అకర్మకధాతువునకు 'అడగియుండు' అని యర్థము. స, చ, శ వర్ణములకు అరవమున ఒకే లేఖనము కలదు. కావున చివరివర్ణమునకు ద్విత్వము కలిగింపగా 'అడైచ్చు' అని సకర్మకధాతు వగును; దీనికి 'అడచు' అనియర్థము. 'సరియగు' అను నర్థముగల 'తిరున్దు' అను అకర్మకధాతువుయొక్క చివరివర్ణము ద్విరుక్తము కాగా 'తిరుత్తు' అని యగును. ముందున్న అనునాసికమునకు లోపము కలిగినది. ఇట్లే 'నిరమ్బు' అనునది 'నిరప్పు' అని యగును.

కొన్నియెడల కాలసూచకసంజ్ఞలలోని మొదటిహల్లునకు ద్విత్వ మును కలిగించుటవలన సకర్మకధాతువు లేర్పడుచున్నవి. కొన్నియెడల ధాతువునకును, కాలసూచకసంజ్ఞకును నడుమ 'త్తు' అని చేర్చుటవలన సకర్మకత్వము కలుగును.

తెలుగునందు 'తూగు' మున్నగు అకర్మకముల చివరి వర్ణము నకు బదులు 'చు' ప్రత్యయము కలిగి 'తూచు' మున్నగువిధముగా సకర్మకధాతువు లేర్పడును. 'అగు, వచ్చు'మున్నగు అకర్మకములకు 'ఇంచు' అను ఆగమము కలిగి 'కావించు, రావించు' మున్నగువిధముగా సకర్మకధాతువు లేర్పడును. ఇంచుగాగమము కలుగునపుడు పూర్వము కొన్నిమార్పులు జరుగుచుండును. ॥మాయు, మాపు; చచ్చు, చంపు; తిరుగు, త్రిప్పు॥

ఇంచుగంతమగు సకర్మకధాతువును అకర్మకముగా మార్చుట కూడ తెలుగున కలదు. రంజాదులకు స్వార్థమున 'ఇల్లు' అని యగును. 'రంజించు' అనునది సకర్మకధాతువు; అకర్మకధాతువుగా 'రంజ్ – ఇల్లు' అని యగును. కొన్నియెడల 'రంజిలు' అనికూడ ఉండవచ్చును. ఇట్టివే 'భేదిల్లు' మున్నగునవి.

అకర్మకములు సకర్మకములుగా మార్పునొందినప్పుడు ప్రేరణార్థ మునుగూడ కలిగియే యుండును. 'తిరుగు' అను అకర్మకము 'త్రిప్పు' అని సకర్మకముగా మారునపుడు 'తిరుగునట్లుగా చేయు' అనియే యర్థము. కావున, ఇందు ప్రేరణము లేకపోలేదు. అయినను 'త్రిప్పించు' మున్నగు రూపములందలి ప్రేరణమును దృష్టిలో పెట్టుకొని 'త్రిప్పు' మున్నగు వానిని సకర్మకములుగా మాత్ర మెంచుట సముచిత మనిపించును. 'చచ్చు' అనుదానికి ప్రేరణముగా 'చంపు' అని చెప్పికొనినచో 'చచ్చు నట్లు చేయు' అను నర్థము కలుగుమాట నిజమే; కాని యిచ్చట చచ్చిన వానికి కర్తృత్వము నంటగట్టుట అర్థమునుబట్టి అంత సమంజసము కాదు. కావున 'చంపు' అను క్రియను సకర్మకముగా గ్రహించి 'చంపించు' అను క్రియను ప్రేరణార్థకముగా గ్రహించుట బాగుగా నుండును.

## ప్రేరణార్థకములు

కొంతవరకు ఇప్పటికే ప్రేరణార్థకముల రూపమును చూచితిమి. సంస్కృతభాషయందు ధాతువునకు ఆదివృద్ధి కలిగి ప్రేరణార్థకము ఏర్పడును. కరోతి = చేయును; కారయతి=చేయించును. ద్రావిడభాషలందు భిన్నభిన్నమార్గములుగా ప్రేరణార్థకములు బయలువెడలినవి. ఈవరలో చూచినట్లుగా అరవమున ధాతువుల తుదిహల్లును ద్విరుక్తము గావించుటవలన ప్రేరణార్థకములు కలుగును. 'ఆడు' స్వార్థమున నుండగా 'ఆట్టు' ప్రేరణార్థకము. 'ఆడించు'అని దీనియర్థము.

తెలుగున నిట్టియెడల 'చు' ప్రత్యయము కలుగుచుండును. 'ఆడు' అను ధాతువునకు ప్రేరణమున ఆడుచు, ఆడ్పుఅని యగును. 'విను'నకు 'వినుచు' అని యగును. కాల్డ్వెల్ చు, ంచు, పు, ంపు మున్నగు ప్రత్యయములు అంతమందు గలవి సకర్మకములే కాని ప్రేరణార్థకములు కావని యభిప్రాయపడెను. కాని, యథార్థము దానికి విరుద్ధముగానున్నది. అకర్మకములు చు, ఇంచు, పు, ఇంపు మున్నగునవి చేరుటవలన సకర్మకము లగుచున్నమాట సత్యమే. సకర్మకములు ఈ ప్రత్యయములు చేరుటవలన ప్రేరణార్థకము లగుచున్నవనుట అనుభవసిద్ధము. ఒకక్రియను ఒకరిచే చేయించుట ప్రేరణము. కావున అర్థమునుబట్టి యెచ్చట ప్రేరణమున్నదో చెప్పుట కష్టము కాదు. 'బెశ్చి' ఇట్టి క్రియలను 'Verbs of Command' అని పిలిచెను. శ్రీ శేషగిరిశాస్త్రి 'ప్రయోజకక్రియలు' అని వ్యవహరించెను. ఇండోయూరోపియను భాషలలో ప్రత్యయము చేర్చి స్వార్థక్రియను ప్రేరణార్థకక్రియగా చేయు ప్రక్రియ యేమాత్రమును కనిపింపదు. కొన్నియెడల స్వార్థధాతువుతోపాటు మరొక అనుబంధధాతువును వాడుటవలన ప్రేరణార్థము సిద్ధించుచున్నది.

ద్రావిడభాషలలో కూడ అనుబంధధాతువును వాడి ప్రేరణార్థకమును సాధించు ప్రక్రియకూడ క్వాచిత్కముగా లేకపోలేదు. అరవమున 'సెయ్' అనియు 'పన్' అనియు, కన్నడమున 'మాడు' అనియు, తెలుగున 'చేయు' అనియు ధాతువుయొక్క భావార్థకరూపముపై

వాడిన ప్రేరణార్థకములు కలుగును. ఇట్టి ప్రక్రియ సాధారణముగా తత్సమక్రియల విషయమున అనుసరింపబడును. అట్లని "ఉండఁజేయు, తనరఁజేయు" మున్నగురూపములు భారతమునందును లేకపోలేదు.

అరవమునందు వి, బి, ప్పి అను ప్రత్యయములు ప్రేరణార్థకములు. 'వరువి' యను తమిళక్రియకు 'రావించు' అని యర్థము. 'చెయ్‌వి' అని యనగా 'చేయించు' అని యర్థము. దీనిపై మరల ప్రేరణార్థకము కలుగగా 'చెయ్‌విప్పి' అనియై 'చేయింపజేయు' అను నర్థము నొసగును. 'పడిప్పి' అనగా 'పఠింపించు' అని యర్థము. 'కాణ్‌బి' అనగా 'చూపించు' అని యర్థము. ఈ ప్రత్యయములు మూడింటియందును 'ఇకారము' సమానముగా నున్నది. అదియే ప్రేరణార్థము నొసగుచున్నది. అవశిష్టములయిన 'వబ'లు భావ్యర్థకములు. ముందు చేయవలసిన పనిని తెలుపుటవలన ప్రేరణమునందు భావ్యర్థకము అంతర్భవించి యుండుట తప్పదు. 'బకారము' ద్విరుక్తమైనపుడు పారుష్యమునొందుట ద్రావిడ భాషానుకూలమగు వర్ణవిపరిణామము. 'తు, చు, పు' మున్నగునవి చేరుటవలన కూడ ప్రేరణార్థకము లభించుచున్నది ॥వరుతు(రప్పించు), కాయ్‌చ్చు (కాచు), మరప్పు (మరపించు)॥ కొన్నియెడల ధాతువు యొక్క తుదిహల్లును ద్విరుక్తము గావించుటవలన కూడ ప్రేరణార్థకము కలుగును. 'ఆడు' అనునది 'ఆడించు' అను నర్థమున 'ఆట్టు' అని యగును. 'నిరమ్పు' అనునది 'నింపు' అను నర్థమున 'నిరప్పు' అని యగును.

కన్నడమున 'ఇసు' ప్రత్యయము ప్రేరణార్థమును బోధించును. స్వార్థమునందు కూడ 'ఇసు' ప్రత్యయము కలదు. 'సేవిసు' అని యనగా 'సేవించు' అని యర్థము. 'చేయు' అను నర్థముగల 'మాడు' ధాతువు 'చేయించు' అను ప్రేరణార్థమున 'మాడిసు' అని యగును.

తెలుగునందు 'ఇంచు, చు, పు' అనునవి ప్రేరణార్థకములు. 'వచ్చు' అను ధాతువునకు 'ఇంచు' చేరగా 'రావించు' అని ప్రేరణార్థకమగును; వచ్చునట్లు చేయుట యని యర్థము. 'విను' మున్నగువానికి

'చు' ప్రత్యయము వచ్చి 'విరుచు' అని యగును. 'మాయు' మున్నగు వానికి 'పు' ప్రత్యయము కలుగగా 'మాపు' అని యగును. 'పిలుచు' మున్నగువానికి ప్రేరణార్థమున 'పిలిపించు' మున్నగువిధముగా రూపము లేర్పడును. చకారము పకారముగా పరిణతి నొందిన విషయము గుర్తింప దగినది. 'తెచ్చు' అనునది 'తెప్పించు' అని యగును.

సంస్కృతధాతువులకు తెలుగున 'ఇంచు' అనునది యాగమముగా నగును. కన్నడమున చేరు 'ఇసు' ప్రత్యయమును, అరవమున చేరెడి 'ఇ' ప్రత్యయమును దీనితో నభిన్నములే. 'ఇంచు' అనునదియే ప్రాథమికము కానగును. ఇది 'చేయు' అను నర్థమునగాని 'ఇచ్చు' అను నర్థమునగాని యుపయుక్తమై ప్రేరణార్థమును గలిగించుచున్నది. 'చు' అన్నది దీని అవశిష్టరూప మనుట నిర్వివాదము. ఇదియే కొన్నియెడల 'తు' అనియు 'పు' అనియు మార్పాటు నొందినట్లు కనిపించును. అరవమునందలి ప్రేరణార్థకప్రత్యయమగు 'ఇ' యనునది 'ఇచ్చు' ధాతువునకు ప్రాథమికరూపమైన 'ఈ' యనుదానికి హ్రస్వరూపము కావచ్చును. అరవమున 'కు చు టు తు పు' అనువాని నన్నింటిని ప్రేరణార్థకములుగా గుర్తింపవలసి యున్నట్లు కనిపించును. కాని 'చు' వర్ణమునకు పరిణామరూపములుగానే తక్కినవి యున్నవనుట, సత్యసమ్మతము కాగలదు.

తుళుభాషయందు ప్రేరణప్రత్యయములుగా 'అ' 'డు' అనునవి కనిపించుచున్నవి. 'చేయు' అను నర్థముగల 'మళ్పు' అనునది ప్రేరణార్థమున 'మళ్పావు' అని యగును. 'నడచు' అను నర్థముగల 'నడుపు' అను తుళుభాషాధాతువు 'నడిపించు' అను నర్థమున 'నడపుడు' అని ప్రేరణరూపమును పొందును.

ప్రేరణార్థకక్రియకు రెండేసి కర్మపదము లుండు నవకాశము గలదు. "నేను వానిని పుస్తకమును కొను మంటిని" అని యన్నప్పుడు 'వానిని' అనునదియు 'పుస్తకమును' అనునదియు కర్మములే. ఇట్టి ద్వికర్మక వాక్యములు ద్రావిడభాషలలో నుండవచ్చును. కాని, కొన్ని యెడల ఒక కర్మమును తగ్గించి వాడుటకూడ అలవాటులో కలదు.

"వీట్టైక్కట్టు విత్తేన్" అని యన్నపుడు 'ఇంటిని కట్టించితిని' అని యర్థము. ఇచట పురుషవాచకమైన కర్మము అధ్యాహార మైనది. ఒకొక్కప్పుడు తృతీయాంతముగా పురుషవాచకమును నిబంధించి అస్పష్టతను తొలగించు ప్రయత్నము కనిపించును. 'అవనైక్కొండు వీట్టైక్కట్టువిత్తేన్' అని యనగా 'అతనిచేత నే నింటిని కట్టించితిని' అని యర్థము. మలయాళమునందు సైతము ద్వికర్మకత్వము లేకపోలేదు. 'అవనె యమలోకం పోగిచ్చు' అని యన్నపుడు 'వానిని యమలోకమునకు బంపెను' అని యర్థము. సంస్కృతాభ్యాసమువలన ఇట్టి యలవాటు కలిగె నను కాల్డ్వెల్ నిర్ణయము కొంతవరకు సత్యమే కావచ్చును.

ప్రేరణముపైని ప్రేరణమును చేర్చునపుడు తెలుగున ఒక నియమము గలదు. ప్రేరణేంచుక్కుమీద మరల ఇంచుక్కురాదు. స్వార్థము నందలి ఇంచుక్కుపై రావచ్చును. 'చదివించు' అనుదానికి 'చదివింపం జేయు' అని ప్రేరణరూపము. 'రక్షించు' అనుదానికి 'రక్షింపించు' అని ప్రేరణరూపము కలుగవచ్చును. 'పోగిరేన్' అనుచో 'పోగు' అకర్మక రూపము. దీనికి 'అనుప్పు' అన్నది సకర్మకరూపము. దీనికి ప్రేరణ రూపము 'అనుప్పువి' అని యగును. టర్కీభాషలో కూడ ధాతువుపైని అనుబంధమును జేర్చుటవలన ప్రేరణార్థకము కలుగుచున్నది. 'ప్రేమించు' అను నర్థము గల 'సెవ్' ధాతువు ప్రేరణార్థమున 'సెవ్‌దుర్' అని యగు నని కాల్డ్వెల్ ఉదాహరించెను.

తెలుగున రంజాదిధాతువులకు స్వార్థమున 'ఇల్లు' అనికాని, 'ఇలు' అనికాని, చేరును. ప్రేరణమునందు అట్టివానికి 'ఇంచు' చేర్చునపుడు పూర్వము చేరిన 'ఇల్లు, ఇలు' అనునవి లోపించిపోవును. 'వర్తిల్లు, వర్తించు' మున్నగువిధముగా స్వార్థమున రెండు రూపములును గల ధాతువులుకూడ కొన్ని కనిపించును. 'కురియు' మున్నగు అంతర్గర్భిత ప్రేరణార్థకములు కొన్ని తెలుగునందు కనిపించును. వర్షము కురిసెను-- ఇచ్చటి క్రియ స్వార్థమున నున్నది. మేఘములు వర్షము కురిసెను -- ఇచ్చటి క్రియ ప్రేరణార్థమున నున్నది.

## కర్మార్థకములు

కర్మాన్వయము గల క్రియలను కర్మార్థకము లందురు. సంస్కృత భాషయందు ఇట్టి కర్మార్థక వాక్యనిర్మాణము అధికముగా కలదు. 'రాముడు వనమునకు వెళ్ళెను' అను నర్థమున 'రామో వనమగచ్ఛత్' అని యుండును. ఇచ్చట క్రియ కర్త్రాకాంక్షను కలిగియున్నది. 'రామేణ వనమగమ్యత' మున్నగు వాక్యములందు క్రియ కర్మాకాంక్షను కలిగి యుండును. కర్త తృతీయాంతమున నుండును. 'రామునిచే వనము వెళ్ళఁబడెను' అని యర్థము. ఇట్టి ప్రయోగములు తెలుగున విచిత్రముగా కనిపించును. నిరర్థకముగా కూడ కర్మార్థకము నుపయోగించుట ఇండో యూరోపియనుభాషలలో ఒక యభ్యాసముగా కనిపించును. ద్రావిడ భాషలలో అట్టి యవసరము కలిగినపుడు సైతము మరొకమార్గమున దానిని సాధించుకొందురే కాని కర్మార్థకములను సాధారణముగా వాడరు. 'నేనేమి చేయవలయును?' అని యడుగుట తెనుగు సంప్రదాయము. సంస్కృతములో నైనచో 'మయా కిం కర్తవ్యమ్' మున్నగు విధముగా కర్తను తృతీయాంతముగా వాడుదురు. ఆంగ్లమున "What is to be done?" అనునదికూడ ఇట్టి కర్మార్థక ప్రయోగమే.

కాల్డ్వెల్ ద్రావిడభాషలందు కర్మార్థకప్రత్యయముగాని, కర్మార్థ బోధకమగు విభక్తిపరివర్తనముగాని యేమాత్రమును లేదని సిద్ధాంతముగా పలికెను. కాని ద్రావిడభాషలు సారస్వతదశ నొందిన నాటి నుండియు క్వాచిత్కముగ కర్మార్థకములు కనిపించుచునే యున్నవి. ఆంధ్రశబ్ద చింతామణియందు "కర్మణ్యానుబంధస్యాత్పతిధాతుః కర్తృ వచ్చ తద్విధయః" అని 'పడు' ధాతువు కర్మార్థకమున ధాతువున కను బంధముగా నగునని కలదు. ఆంధ్రమహాభారతమున ఆదిపర్వప్రథమాశ్వాసమునందు "దానములను బహువిధక్రతుహుత జప। బ్రహ్మచర్యములను బడయఁబడిన। పుణ్యఫలముఁ బడయఁబోలు నశేషపాపక్షయంబు నగు శుభంబుఁ బెరుఁగు" అను పద్యమున 'పడయబడిన' అను కర్మార్థకము గలదు. తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణ

మున "పిసులనఁ గొంద అంస్తుహి వినఁగఁబడిరి" అని ప్రయోగించెను. కావున, ఇట్టి ప్రయోగములను అత్యంత ప్రామాణికులైన కవులే చేసి యుండగా 'ఏ మాత్రమును లేదు' అని నిరాకరింపబూనుట యుచితము కాదు. అయినను సంస్కృతాదిభాషలలో వలె కర్మార్థక ప్రయోగము ప్రచురముగా లేదనుట నిశ్చితము.

అరవమునందు 'చొల్లప్పట్టదు' అను ప్రయోగమును తానే చూపి కాల్డ్వెల్ స్వభావవిరుద్ధముగను కటువుగను నున్నదని పల్కెను. 'చెప్పఁబడెను' అని పైదాని యర్థము. తెలుగున 'పడు' ధాతువువలె అరవమున 'పట్టు' ధాతు వనుబంధముగా నగును. ఈ విషయము తొల్కాప్పియమునందే విదితము కాగలదు. 'తేర్ తచ్చనాల్ చెయ్యప్పట్టదు' అనగా రథము వడ్రంగిచేత చేయబడెను అని యర్థము. 'తచ్చనాల్' అనునది తృతీయావిభక్త్యంతము. 'చెయ్యప్పట్టదు' అనునది కర్మార్థకము.

కన్నడమునందు కర్మార్థమునందు 'పడు' ధాతువునే ప్రయోగించుచున్నారు. ఇదియే సంధికార్యముల మూలమున 'పట్టు' అని పరిణతమగుచున్నది. "నోడల్పట్ట సరస నంగనెయిం" అనగా రాజు స్త్రీ చేత చూడబడెను అని యర్థము. ఇచ్చటను కర్మార్థకప్రయోగము స్పష్టముగా కనిపించుచున్నది.

ఇంత విశదముగా వ్యాకర్తలు నిరూపించినను సాహిత్యమునందును, వ్యవహారమునందునుగూడ ద్రావిడభాషలలో కర్మార్థక ప్రయోగములు విరళముగా నున్నవని చెప్పక తప్పదు.

అరవమునందు 'ఎన్నాల్ ఉడైక్కప్పట్టదు' అని యన్నప్పుడు 'నాచేత ముక్కలైనది' అని యర్థము. ఇచ్చట కర్మార్థకమునకు అవకాశమున్నను కర్త్రర్థమునే వాడుట కనిపించును. ఇది ద్రావిడభాషలయందు అధికముగా కనిపించెడి అభ్యాసము. 'ఇల్లు కట్టిరి' అని కర్తను విడిచిపెట్టి పలుకనైన పలుకుదురు కాని, కర్మార్థమున 'ఇల్లు కట్టబడినది' అనునట్లు సాధారణముగా పలుకరు. అటుకానియెడల 'ఇల్లు కట్టుట యైనది'

అనిష్టమైన ఉపయోగింతురు. అరవమునందు 'కట్టుట' యను భావార్థకమునే కాక 'కట్టి' యను క్త్వార్థకమునుగూడ వాడుట కలదు. ఇట్లే ఇంటిని నిర్దేశింపవలసి వచ్చినపుడు 'నీవు కట్టిన యిల్లు' అనియే యెక్కువ వాడుక కలదు. 'నీచేత కట్టబడిన యిల్లు' అని సాధారణముగా వాడరు.

'తిను' అను నర్థము గల ధాతువును అనుబంధముగా చేర్చి వాడుట కూడ ద్రావిడభాషలలో కనిపించును. 'వాడు దెబ్బ తినెను' అని వాడుదుము. 'వానికి దెబ్బలు పడెను' అనునప్పుడు గల యర్థమే యిచ్చటను గలదు. కినను 'పడెను' అనునప్పుడు 'దెబ్బలు' కర్తృస్థానమును పొందుచున్నది; 'తినెను' అనునప్పుడు కర్మస్థానమును పొందుచున్నది. అరవమునందు 'అడిఉణ్డాన్' అని యనగా 'దెబ్బ తినెను' అని యర్థము. ఈ 'తినుట' ఇచ్ఛాపూర్వకముగా జరిగినది కాదు. ఇతరుల యిచ్ఛకు తాను లొంగుటయే యిందు కలదు. కావున కర్మప్రాధాన్యమే యుచితమై కనుపట్టును. కాని 'కొట్టబడెను' అని యనక ద్రావిడభాషాభాషులు 'దెబ్బలు తినెను' అని వాడుట ఒక యభ్యాసము. తిను, పడు-అను ధాతువులు రెండును పొందు, అనుభవించు అన్న యర్థములనే యొసగును.

కొన్ని ధాతువులకు 'పడు' స్వార్థమునందే అనుప్రయుక్తమై కనిపించును. 'నిలువబడు' మున్నగుచోట్ల కర్మార్థము గోచరము కాదు. 'వినబడు' అనునది కర్త్రర్థ కర్మార్థములను రెంటిని బోధించును. 'నామాటలు వినబడినవా?' అనునప్పుడు కర్మార్థము. 'నీ చెవులు వినబడునా?' అనునప్పుడు 'వినునా?' యనియే యర్థము. కావున, కర్త్రర్థమునే బోధించును.

తెలుగునందు ఈ 'పడు' ధాతువు అన్నంతక్రియకు చేరుచున్నది॥ చేయఁబడును॥ అరవకన్నడములందు 'అల్' అంతమందు గల రూపములకు చేరుచున్నది. ॥ శెయప్పడుమ్ ॥ శెయల్ అనునది భావార్థము. ఇచటి 'అల్' అనునదియు తెలుగునందలి 'అన్' అన్నదియు ఒకేమూలము నుండి పుట్టియుండవచ్చును.

సంస్కృతమునందు కర్మార్థమున 'య' అను ప్రత్యయము చేరును. దాని పిమ్మట ఆత్మనేపదక్రియావిభక్తి చేరును॥ భవతి - భూయతే; కరోతి - క్రియతే॥ ఇచ్చటి 'య' ప్రత్యయము 'పొందు' అను నర్థము గల 'యా' ధాతువునుండి నిష్పన్నమైనది. 'య' ప్రత్యయమును, 'పడు' ప్రత్యయమును అర్థసామ్యమును గలిగి యున్నమాట యథార్థము. కాని, యీ సామ్యము కేవలయాదృచ్ఛికము కాదు. క్రియా ఫలముయొక్క అనుభవమును కర్మమునకు చెందించుట యిందలి విషయము. కావున 'పొందు' అను నర్థము గల ధాతువును ఉపయోగించుట మానసిక వ్యాపారఫలము. సంస్కృతముయొక్క ప్రభావము వలన ద్రావిడభాషలు 'పడు' ధాతువును ఉపయోగించుచున్న వనుట యుచితము కా దనిపించును. ఈనాడు సంస్కృతాంగ్లప్రభృతిభాషల ప్రభావమువలన తెలుగు మున్నగుభాషలయందు కర్మార్థకము కొంచెము విరివిగానే వాడుకలోనికి వచ్చినది. తెలుగున అకర్మక సకర్మకములు రెండింటిమీదనుకూడ 'పడు'ధాతువు అనుప్రయుక్తము కావచ్చును. కర్మార్థమునను. కర్త్రర్థమునను పురుషప్రత్యయములు సమానముగానే చేరును. వానిలో మార్పు లేదు.

టర్కీదేశపుభాషలో 'ఇల్' అనియు 'ఈల్' అనియు కర్మార్థక ప్రత్యయములు. ఫిన్నిషు భాషలో 'ఎల్' అని యుండును. హంగేరి యనుభాషలో 'అత్, ఎత్, తెత్' అని మూడు విధములుగా కర్మార్థక ప్రత్యయము గలదు.

## వ్యతిరేకార్థకములు

వ్యతిరేకార్థమును సూచించుటకుగాను సంస్కృతమున క్రియకు ముందు 'న'వర్ణమును చేర్తురు. నిషేధమును దెలుపవలసి వచ్చినప్పుడు 'మా' యని చేర్తురు. 'కరోతి' అనగా 'చేయును' అని యర్థము. వ్యతిరేకార్థమున 'న కరోతి' అని పల్కుదుము. 'చేయుము' అను నర్థము గల 'కురు' అను మధ్యమపురుషక్రియకు 'మా' యని చేర్చి 'మా కురు' అని యనునెడల 'చేయవలదు' అను నిషేధార్థము కలుగును. సమాస

మునం దైనచో 'అ' వర్ణమును పూర్వమందు చేర్చి 'అగౌరవము' మున్నగువిధముగా వాడుదురు. అజాదిపదమునకు ముందైనచో 'అన్' అనినయి 'అనర్థ్వాత' మున్నగువిధముగా నుండును. కొన్నియెడల 'నో' యన్నది వ్యస్తముగా నిలిచి వ్యతిరేకార్థము నొసగును.

ద్రావిడభాషలందు 'అ' కారము వ్యతిరేకార్థకము. తెలుగున ధాతువుపై 'అ'వర్ణమును జేర్చి, పిదప పురుష ప్రత్యయమును చేర్చు నెడల వ్యతిరేకక్రియ గేర్పడును. ఆంధ్రశబ్దచింతామణియందు "వ్యతిరేకాఖ్యా భావిని చాత్ స్యాత్" అని కలదు. కొన్నియెడల అన్నంత క్రియపై 'లేదు, కాదు' మున్నగు నిషేధార్థకములను జేర్చుటచేత వ్యతిరేకక్రియ లేర్పడును. వీని కింక పురుషప్రత్యయములు చేరవు॥ చేయావు; చేయలేదు॥

తమిళమున 'ఆ' వర్ణము వ్యతిరేకార్థకము. తెలుగులో వలెనే ధాతువుపై ఆ వర్ణమును జేర్చి పురుషప్రత్యయమును కలిపిన వ్యతిరేక క్రియ యగును. 'చెయ్యాన్' అని యనగా 'చేయడు' అని యర్థము.

'ఇన్టు, అన్టు, ఇల్ల, అల్ల' మున్నగు రూపములను చేర్చుటచేత అరవమున వ్యతిరేకక్రియ లేర్పడును. వీనిపై పురుషప్రత్యయములు చేర్తురు॥ చెల్వేమ్ అల్లేమ్ (మేము పోము)॥

కన్నడమందు వ్యతిరేకార్థకప్రత్యయము లేదని కన్నడవ్యాకర్తల నిర్ణయము. కాని 'బాటదు' మున్నగుచోటులను పరిశీలింపగా 'అ' వర్ణము వచ్చి పురుషప్రత్యయములోని స్వరముతో కలిసిపోయిన దని బోధపడును. కన్నడమున పురుషప్రత్యయము లన్నియు స్వరాదు లగుట చేత వ్యాకర్తలు పైవిధముగా నిర్ణయించుట కవకాశము కలిగినది. తెలుగునందు 'పోని, లేని, ఈని' మున్నగు వ్యతిరేకరూపములయందు కూడ అత్వము కనిపింపదు. స్వార్థవ్యతిరేకార్థములు స్పష్టముగా తెలియు చోటులందు అత్వము లోపించినను అర్థగ్రహణమునందు కష్టము కలుగదు; కావుననే లోపించియుండును. చిన్నయసూరి కజి, మిజి, నిజి మున్నగు విధముగా వ్యతిరేకార్థకములను జీత్తులని పేర్కొని, పూర్వము

నందలి ఉకారమునకు అత్వమును విధించెను. కావున అకారము అవశ్యము వచ్చునని చెప్పవక్లైనది. తెలుగున అగు, వచ్చు, వలయు- మున్నగు ధాతువులకు వ్యతిరేకార్థమున కాదు, రాదు, ఒల్లదు- మున్నగు రూపము లేర్పడును.

ద్రావిడభాషలలో వ్యతిరేకసమాపకము కాలత్రయ బోధకము. అసమాపక క్రియలయందు వ్యతిరేకార్థమున ధాతువుపై అకారము వచ్చి, పిదప అసమాపక క్రియాప్రత్యయము చేరును॥ చేయని (తెలుగు); శెయ్యాద (అరవము); గేయద (కన్నడము)॥

కొన్నిచోట్ల వ్యతిరేకార్థమునకూడ కాలబోధన మావశ్యకమని తలచినపుడు "అగు" ధాతువును సమాపక రూపముపై చేర్చి పలుకుట తెలుగులో కనిపించుచున్నది.॥ రాదయ్యెను; విననైతిని॥

కాల్డ్వెల్ ద్రావిడవ్యతిరేక బోధకమైన 'అ' వర్ణమును తమిళమునందలి 'అల్' అనుదానితోను, సంస్కృతభాష యందలి 'అలం' అనుదానితోను ముడిపెట్టుచున్నట్లు పలికెను. సంతాలుభాషయందును ఫిన్నిషుభాషయందును 'ఆలా' యనియు, హీబ్రూభాషయందు 'అల్' అనియు, ఓష్టియాకు భాషయందు 'ఇలా' అనియు వ్యతిరేకార్థ బోధకములు.

ఇక్కడ ఒకటి గమనింపవలయును. తమిళమునందలి 'అల్ల, ఇల్ల' అనువానికి పైవానితో సామ్యము కనిపించును. అయినను ప్రయోగవిధానమందు కావలసినంత భేదమున్నది. సంస్కృతమునందలి వ్యతిరేకార్థక చిహ్నము క్రియాపదమునకు పూర్వమందు విడిగా ప్రయోగింపబడును. ఆంగ్లాదిభాషల యందును అట్లే వేరుగా మరొక శబ్దముగా ప్రయోగింపబడును. ద్రావిడభాష లన్నింటియందును వ్యతిరేకార్థక చిహ్నము ధాతు పురుషప్రత్యయముల నడుమ వేరుపరుచుటకు వీలు కాకుండ క్రియాపదఘటక మగుచున్నది. కావున యాదృచ్ఛికమగు రూపసాదృశ్యముచేతనే పరస్పరము ప్రభావ మున్నట్లు నిర్ణయించుట యుచితము కాదు. ద్రావిడవ్యతిరేక చిహ్నము తన మార్గమున తాను ప్రత్యేకతను ప్రతిష్ఠించుకొన్నది.

## ప్రార్థనాద్యర్థకములు

చిన్నయసూరి 'ఆశీశ్శాప సంప్రార్థనా విధులందు లోట్టగు' నని తెల్పెను. వీని యన్నింటికి భావ్యర్థబోధకత్వము సామాన్యము. అట్లే విధిప్రార్థనార్థకములు రెండును మధ్యమపురుష లై యుండును. ఆశీశ్శాపములు ప్రధానముగా మధ్యమపురుష లై యుండును; కొన్నియెడల ప్రథమపురుషయు అంతకన్న తక్కువగా ఉత్తమపురుషయు కావచ్చును.

ద్రావిడ సంప్రదాయమునుబట్టి కేవలధాతువే మధ్యమపురుష క్రియారూపము॥ చూడు; విను॥ బహువచనమును సూచింపవలసి వచ్చినపుడు 'డు' వర్ణమును, ఏకవచనమున 'ము' వర్ణమును అగుటకూడ కలదు॥ చూడుడు; చూడుము॥

'శెయ్యుమ్' అనునది ప్రాచీనతమిళమున ప్రథమపురుష క్రియారూపము; నేటికాలమున మధ్యమపురుష ప్రార్థనార్థకము. మకారము తెలుగున నకారముగను, కన్నడమున పూర్ణబిందువుగను మారుచున్నట్లు ఈవరకు చాలసారులు చూచితిమి. ఇచటకూడ అట్లే యైనచో 'చేయుము' అనునదియు 'చేయును' అనునదియు సమానార్థకములే యన వచ్చును. 'చేయును' అనునది ఏకవచన మైనపుడు బహువచనప్రత్యయమగు రువర్ణమును చేర్పగా చేయున్రు > చేయుంద్రు > చేయుఁడు అని యగును. తెలుగున మధ్యమపురుషైకవచన బహువచనప్రత్యయము లగు 'ము; డు'లు ఇట్లేర్పడుచున్న వని శ్రీ సోమయాజిగారి నిర్ణయము. అట్లేర్పడిన రూపములు ప్రార్థనాద్యర్థబోధనసమర్థములు. ఐనను స్పష్టత కొరకు ఇంకను కొన్ని ప్రత్యయములు చేరవచ్చును.

చింతామణియందు 'సంప్రార్థనార్థకాదీత్' అని కలదు. దీనినిబట్టి 'చూడుమీ, చూడుడీ' మున్నగురూపము లేర్పడును. 'ఏదోత్తౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః' అని వ్యతిరేకరూపములపై 'ఏ ఓ'లను విధించిన సంప్రార్థనరూపము లగునని చింతామణియందు కలదు॥ వినవే, వినరే, వినవో, వినరో॥ అట్లే అయ్య, అమ్మ మున్నగునవి వచ్చినపుడుకూడ 'వినవయ్య, వినరమ్మ' మున్నగువిధముగా

రూపము లేర్పడుచున్నవి. 'వింటివికదా!' అని సానుకూలసమాధానము నపేక్షించుచు ప్రశ్నింతుము. అదియే రూపాంతరమున వ్యతిరేకార్థము నకు ప్రశ్నమును చేర్చి 'వినవా?' మున్నగువిధముగా నడుగుటయు కలదు. ఈప్రశ్నరూపమే ప్రార్థనాద్యర్థక మయ్యెననుట యుక్తిసంగతము. ఇట్టి చోట్ల వక్తయొక్క ఉచ్చారణ స్వరమే అర్థనిర్ణాయకము కాగలదు.

'అండి' యను గౌరవవాచకము వ్యావహారికమున విరివిగా గలదు. 'వినుండీ; తెలియుండీ' మున్నగుచోట్ల ఉచ్చారణ త్వరనుబట్టి 'వినండీ; తెలియండీ' అను రూపము లేర్పడును. అందలి ధాతువును వేరుచేయగా మిగిలిన 'అండి' అనుదానిని గౌరవవాచకముగా భావించి 'ఏమండీ' మున్నగువిధముగా సంబోధనాదిరూపములందు చేర్చుట కనిపించు చున్నది. అట్లే ఏకవచనమున 'రా' అనునది క్రియలపై చేరి 'విను మురా, వినరా' మున్నగువిధముగా నుండి 'ఏమిరా' యనునట్లు లన్యో పయోగమునుకూడ అలవరుచుకొన్నది.

ఆశీశ్శాపములందు ప్రథమపురుషరూపములే యగును. 'ఎడు, ఎడి, త' అను ప్రత్యయములుకూడ రావచ్చును. వచ్చెడు, వచ్చెడి అనునవి తద్ధర్మార్థకములకు భిన్నములుకావు. 'త' యనునది వ్రాత, కోత మున్నగు కృదంతరూపములలోని తకారమునకు రూపాంతరమే. అచ్చట వలెనే ఇచ్చటను భావార్థద్యోతనమే దీని ప్రయోజనము. విధ్యర్థము నందు 'అది' అని చేరి 'చేయునది' మున్నగురూపము లేర్పడును.

అరవమునందును ప్రత్యయరహితముగనే మధ్యమపురుష మందును, 'వా' అనగా 'రమ్ము' అని యర్థము. బహువచనమున 'వమ్మిన్' అని 'మిన్' అను ప్రత్యయముతోడి రూపము కలుగును. దీనికి 'రండు' అని యర్థము. 'ఇరుమ్, కెడుమ్' మున్నగువిధముగా ఉమ్మంతములై బహువచనవిధ్యర్థకములు కలవు. కావ్యములందు ఏక వచనప్రత్యయముగా 'మో' అనునది కలదు. దానిని నిరర్థకముగా నగుచున్నదని వ్యాకర్తలు నిరాకరించిరి.

కన్నడమునందు విధ్యర్థకబహువచనప్రత్యయముగా 'ఇరి' యన్నది యగుచున్నది. 'మాడిరి' అని యనగా 'చేయుడు' అని యర్థము. పలగన్నడమున 'ఇం' అను ప్రత్యయముకూడ బహువచనమందు అగుచున్నది॥ బాటిం, ఇటియిం॥ ఏకవచనమున ప్రత్యయమునకు లోపము కలిగి కేవలధాతువే ప్రయుక్తమగుచున్నది. 'మాడు' అని యనగా 'చేయుము' అని యర్థము.

భావ్యర్థప్రత్యయములకును, ప్రార్థనాద్యర్థకములకును సామ్యము చాల కలదు. తమిళకన్నడములందు విధ్యర్థకములకు ముందర 'క, మ' మున్నగువానిని చేర్చుటచేత భవిష్యదర్థకము లేర్పడుచున్నవి. ప్రార్థనాద్యర్థములందలి భవిష్యత్సూచనమే యీ సామ్యమునకు కారణము కానగును.

## అసమాపక క్రియలు

ధాతువులపై కాలబోధకప్రత్యయములును, పురుషప్రత్యయములును చేరి వాక్యమునకు సమాప్తిని చేకూర్చు క్రియారూపములను సమాపకక్రియలని యందురు. అట్లు కాక, ధాతువులపై వేర్వేరర్థములను బోధించు ప్రత్యయములు మాత్రము చేరి, పురుషప్రత్యయములు చేరకయే యుపయోగింపబడు రూపము లసమాపకములు. వీనికి వాక్యమును సమాప్తము గావించు సామర్థ్యము చాలదు. కావుననే యీ పేరు సార్థకముగా నున్నది. సమాపకక్రియలు కాలమును, పురుషను, వచనమునుబట్టి భేదించుచుండును. అసమాపక క్రియలకు అట్టిభేద మేమాత్రమును కలుగదు.

చిన్నయసూరి అసమాపక క్రియలకు సంస్కృతనామములనే యిడెను. వాని ననుసరించి స్థూలముగా వివేచనము గావింతము.

క్త్వార్థకము : సంస్కృతమున గత్వా, పీత్వా మున్నగు రూపములతో సమానార్థకము లయిన వెళ్ళి, త్రాగి మున్నగునవి క్త్వార్థకములు. ధాతువుపై 'ఇ' వర్ణకము చేరగా క్త్వార్థక మేర్పడినది. తెనుగున 'ఇ' భూతకాలికచిహ్నము; ఏకకర్తృకములందు పూర్వకాలిక

క్రియ క్త్వార్థక మగును. కావున భావార్థసూచక మైన కేవలధాతువు పై భూతకాలికచిహ్నము వచ్చుట సమంజసము.

అరవమునందును కన్నడమునందును గూడ క్త్వార్థకచిహ్నము 'ఇ' వర్ణమే. అరవమునందు 'గానము చేసి' యను నర్థమున 'పాడి' అని యుండును. కన్నడమున 'చూచి' యను నర్థమున 'నోడి' అని యుండును. ఇకారముపై దువర్ణముకూడ కొన్నిచోట్ల కన్నడమున చేరు చున్నది. 'నుడిదు' అని యనగా 'నుడివి' అని యర్థము.

వ్యతిరేకక్త్వార్థకమునకు తెలుగున 'అక' అని వచ్చి చేరును. వెళ్ళక, త్రాగక మున్నగునవి ఉదాహరణములు. శ్రీసోమయాజిగారు 'వెళ్ళ - అ - క' అని విభాగముచేసి చివరి కవర్ణము రాక, పోక మున్నగువానిలోని కృత్ప్రత్యయమే యనియు, భావార్థమున నగుచున్న దనియు తెల్పిరి. దానికి పూర్వమందున్న 'అ' వర్ణము వ్యతిరేకార్థ సూచకము. అరవమునందు 'ఆ' వర్ణము చేరిన రూపము వ్యతిరేకార్థ కము. 'చెయ్యా' అని యనగా 'చేయక' అని యర్థము.'చెయ్యా మల్, చేయ్యామే' అనునవికూడ వ్యతిరేకక్త్వార్థకములుగా నుపయోగ పడును. కన్నడమునందు వ్యతిరేకక్త్వార్థకచిహ్నము 'అదె' యనునది. 'చేయక' యను నర్థమున 'మాడదె' అని యగును.

శత్రర్థకము : వర్తమానకాలికాసమాపక క్రియారూపము. 'వచ్చుచు' మున్నగురూపములు శత్రర్థకములు. 'చువర్ణము' తెలుగున శత్రర్థమును బోధించుచున్నది. గ్రంథప్రామాణ్యమునుబట్టి చూడగా చువర్ణముతోడి రూపములు భూతభవిష్యద్వర్తమానకాలములను మూడింటిని సూచించుచున్నట్లు కనిపించును. దీనినిబట్టియే శ్రీసోమ యాజిగారు చుప్రత్యయముకూడ భావార్థకమునే బోధించుచున్నదని నిర్ణయించిరి.

అరవకన్నడములందు శత్రర్థకరూపములు మిక్కిలి యరుదుగా కనిపించును. వర్తమానార్థకసమాపకక్రియలే అరవమునందు అరుదుగా నున్నవని కాల్డ్వెల్ వ్రాసెను. కాబట్టి తెలుగునందలి 'చు' ప్రత్యయ

ముతో సమానమయిన రూపమును ఆ భాషలందు గుర్తించుట సులభము కాదు, అయినను ప్రాచీనద్రావిడమునందలి 'తు, ఉతు' అను వానికిని తెలుగునందలి 'చు' ప్రత్యయమునకును సంబంధ ముండియుండు నని అనుమానించుటకు తగినంత యవకాశము కలదు.

తుమర్థకము : కొరకు అను నర్థము గల అసమాపక క్రియా ప్రత్యయము. 'చేయన్' అని యనగా 'చేయుటకొరకు' అని యర్థము. సంస్కృతమున గల 'గంతుం, భోక్తుం' మున్నగురూపముల సామ్యమున వీనికి తుమర్థకము లని పేరు కలిగెను. తెలుగున అన్నంతరూపము సమాపకక్రియగా ప్రయుక్తమై ఆశీరాద్యర్థకముగా వ్యవహరించుటయు కలదు. 'నీ మొగము మండ' అన్నప్పుడు శాపార్థక మగుచున్నది. 'నీ కడుపు పండ' అన్నప్పుడు ఆశీరర్థక మగుచున్నది.

అరవమునందు 'శెయ్యియల్, శెయ్యియ, శెయక్కు' మున్నగు విధముగా తుమర్థకము గలదు. కన్నడమునందు 'పాడల్' మున్నగు విధముగా కలదు. అరవకన్నడములందున్న 'అల్' ప్రత్యయమునకును, ఇదే అర్థమున తెలుగున గల 'అన్' ప్రత్యయమునకును సామ్యము గలదు. లకారము నకారముగా మారుట ద్రావిడభాషలలో పెక్కు చోట్ల జరుగుచున్నట్లు ఈవరలో చూచితిమి. హొసగన్నడమందు తుమర్థకము 'పాడికె' మున్నగువిధముగా నుండును.

భావలక్షణముగా కూడ తెలుగున 'అన్' ప్రత్యయము వచ్చును. భావలక్షణమునందు మరొక ధాతువునకు అన్నంత ధాతువు కర్త యగును॥ చేయవలయును॥ ఇట్లే 'చేయఁగన్' మున్నగురూపము లేర్పడును. అరవమున ఈ యర్థమున 'శెయ' అని యుండును. పటగన్నడ మునందు 'అల్' ప్రత్యయమే కాక, 'ఎ' అను ప్రత్యయముకూడ వచ్చుచుండును. ॥పాడల్; పాడె॥ హొసగన్నడమునందు 'బసుత్తిరలు' మున్నగువిధముగా భావలక్షణార్థకరూపము లుండును.

ఆనంతర్యార్థకము : అనంతర మగు పనిని సూచించు అసమాపక క్రియారూపము ఆనంతర్యార్థకము. తెలుగున ధాతువునకు 'డు'

అను ప్రత్యయము చేరగా ఈ రూపము సిద్ధించును. 'అనుడు' అని అనగా 'అన్న యనంతరమందు' అని యర్థము. శ్రీ సోమయాజిగారు 'పెంపుకు చిలుక' యున్నగుచోట్ల వచ్చు 'డు' వర్ణముతో దీనికి సామ్యము సు స్థిరీకరించుచున్నారు. ఇచ్చటి 'డు' వర్ణము భావార్థకమునందే యగుచున్న దనియు క్రమముగా తరువాత చేరిన ద్రుతమమూలముగా ఆనంతర్యబోధక మయ్యెననియు వారి సిద్ధాంతము. దీని కనుగుణము గనే హాసగన్నడమందు భావార్థక ప్రత్యయమగు 'వదు' పై 'ఊ' అను సముచ్చయార్థకమును చేర్పగా ఆనంతర్యార్థకము కలుగుచున్నది. 'కేళువదు' అనునది 'వినుట' యను నర్థమున భావార్థకము. దీనికి పర మందు 'ఊ' వర్ణము చేరి 'కేళువదూ' అని యగును. 'వినిన పిమ్మట' యని యర్థము. తెలుగున కూడ భావార్థకముపై సముచ్చయార్థకము చేరగా ఏర్పడిన 'వినుటయు' మున్నగురూపములు ఆనంతర్యబోధకము లనుట అనుభవమునందలి విషయమే.

చేదర్థకము 'అయినచో' అను నర్థమున వచ్చు అసమాపక క్రియారూపము చేదర్థకము; తెలుగున 'ఇనన్' అను ప్రత్యయమును ధాతువుపైని చేరుటవలన చేదర్థక మేర్పడును ॥వచ్చినన్॥ కాలవాచకములగు 'నాడు' అప్పుడు'' అనువానినిగాని, దేశవాచకములగు 'చోన్, ఎడలన్' అనుశబ్దములనుగాని క్రియాజన్యవిశేషణములకు చేర్చిన చేదర్థక మేర్పడును॥ రానినాడు, వచ్చినపుడు; వచ్చుచోన్, వచ్చుచున్న యెడలన్॥ సమాపకక్రియారూపముపైని 'ఆ, ఏ' యను ప్రశ్నార్థక చిహ్నములను చేర్చుటవలన కూడ చేదర్థకము సిద్ధించును. 'ఏ' యను వర్ణముపై 'ని' కూడ కొన్నియెడల చేరవచ్చును. ॥ వచ్చెనేని ॥ నేటి వ్యవహారమున 'అయితే' మున్నగు రూపములు చేదర్థకములుగా వినిపించుచున్నవి. మధ్యమపురుష క్రియకు 'ఏ' వర్ణము పరముకాగా సిద్ధించిన రూపమునే, అన్ని పురుషలందును తప్పుగా ఉపయోగించుట జరుగుచున్నది.

అరవమునందు 'ఇన్' అను ప్రత్యయముచేరి 'శెయిన్' అని యగును. కాలవాచకము చేరి 'శెయ్‌దకాల్' అని యగును. దీనికి 'చేసిననాడు' అని యర్థము. దేశవాచకములగు 'కడై, వఴి, ఇడత్తు' అనునవి చేరి 'శెయ్‌దకడై, శెయ్‌దవఴి, శెయ్‌దవిడత్తు' మున్నగు రూపము లేర్పడును. పటగన్నడమున తుమున్నర్థకములే సందర్భమును బట్టి చేదర్థకములుకూడ నయ్యెడివి. హాలసగన్నడమున 'బోధించుచో' అను నర్థమున 'బోధిసలు' అనునట్లుగా చేదర్థకము గలదు. కావున ద్రావిడభాషలందలి చేదర్థకములకు రూపసామ్యము స్పష్టముగనే గోచరించుచున్నది.

భావార్థకము ధాతువుయొక్క అర్థమును తెలుపునది భావార్థకము. తెలుగున 'ట' వర్ణకము ధాతువునకు చేరును॥ చేయుట॥ కొన్ని యెడల ఆనంతర్యబోధకమగు 'డు' ప్రత్యయము భావార్థమును వెల్లడించును. అరవమునందు'అల్' అనికాని 'తల్' అనికాని ధాతువుపైని చేరి భావార్థము నొసగును. 'నోక్కల్' అని యనగా 'చూచుట' యని యర్థము. 'విడదీయుట' అను నర్థమున 'పిఱిత్తల్' అని యగును. తెలుగున కృత్ప్రత్యయములగు 'క, పు' మున్నగు వానితో సమానములగు ప్రత్యయములు చేరి 'ఇరుక్కై, కాప్పు' మున్నగురూపములు 'ఉండుట, కాపాడుట' అను నర్థములం దగును. పటగన్నడమునందు భావార్థమునందు 'పుదు' అనునది ధాతువునకు పరమగును. 'మాఱ్పుదు' అని యనగా 'చేయుట' అని యర్థము. హాలసగన్నడమున 'ఓణ, ఉవదు, ఉవికె' యనునవి భావార్థకప్రత్యయములు॥ మాడోణ, మాడువదు, మాడువికె॥

వ్యతిరేకభావార్థమునందు తెలుగున 'అమి' వర్ణకము వచ్చును॥ తెలియమి; లేమి॥ భావార్థకమును అసమాపకములందు చేర్చి పల్కినను, ఇది నామవాచకమే కాని క్రియారూపము కాదు.

ధ్వన్యనుకరణము: ఇవియే కాక భృశార్థమునందును మాహురర్థమునందును ద్విరుక్తములయిన క్రియాధాతువులు కొన్ని గలవు.

వీనిని తెలుగు వ్యాకర్తలు ధ్వన్యనుకరణశబ్దములుగా పరిగణించి, 'అను' ధాతువు ననుబంధముగా చేర్చి క్రియాత్వము కల్పించిరి. 'తళతళమను', 'మినుకు మినుకుమను' మున్నగునవి ఉదాహరణములు. ఇట్టివి అరవము నను గలవు॥ మినుమినుక్కు, కిరుకిరుక్కు॥

ప్రారంభార్థకము: ప్రారంభార్థకములు అను మరొక జాతి క్రియలను "Inceptive Verbs" అను పేరుతో కాల్డ్వెల్ సూచించెను. ప్రౌఢవ్యాకర్త "వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱుధాతు వనుప్రయుక్తం బగు" అని సూత్రించి 'పండఁబాఱిన పొల మెండఁబాఱె' అని లక్ష్యమును జూపెను. సాగు, వొచ్చు – అనునవి కూడ అనుప్రయుక్తములు కావచ్చును.

క్రియాజన్యవిశేషణములు: ధాతుజన్యము లయిన విశేషణములు. వీనికి పిమ్మట విభక్తిని వివక్షింపవలసి వచ్చినపుడు తచ్ఛబ్దమును చేర్పవలయును.

| | తెలుగు | అరవము | కన్నడము |
|---|---|---|---|
| భూత | చేసిన | శెయ్‌ద | మాడిద |
| వర్తమాన | | శెయ్‌గిఱ; | మాడిదప |
| | | శెయ్యుమ్ | మాడుత్తె, |
| | | | మాడుతె, |
| | | | మాడుత్తం, |
| | | | మాడుతుం |
| భావి | చేయగల | శెయ్యుమ్ | మాడువ |
| తద్ధర్మ | చేయు | | మాడువ |
| | చేసెడు, చేసెడి | | |
| వ్యతిరేక | చేయని | | మాడద |

పైవిధముగా క్రియాజన్యవిశేషణము లుండును. 'ఉన్న, కల, న' వర్ణంబులమీఁది తచ్ఛబ్దతకారమునకు లోపము విధించుటచే 'ఉన్న వాఁడు' మున్నగువిధముగా నుండు విశేషణములు 'ఉన్నాఁడు' మున్నగు

విధముగానై సమాపకక్రియలుగా చెల్లుచున్నవి. 'చేసినాడు' అను రూపమును వ్యాకర్త లంగీకరింతురు గాని 'చేసినాను, చేసినావు' వంటి రూపములను అంగీకరించుట లేదు. చిన్నయసూరి 'చేయుచున్నాను' మున్నగురూపములను క్రియలుగానే సాధించెను. తొలుత విశేషణములే యయ్యును క్రమముగా కొన్నిమార్పులకు లోనై యిట్టి రూపములు సమాపకక్రియలుగా పరిణమించినవి.

సమాపక క్రియలు

ధాతువులపై కాలబోధకప్రత్యయములును, పురుషబోధకప్రత్యయములును చేరగా సమాపకక్రియ లేర్పడును. వచనమునుబట్టి కూడ వీని యందు మార్పు కలుగును. వర్తమానకాలము, భవిష్యత్కాలము, భూతకాలము, తద్ధర్మార్థకము- అను నాలుగింటిని బోధించునవి సమాపకక్రియలు. ముందుగా పురుషబోధకప్రత్యయములను పరిశీలింతము. వీనినే క్రియావిభక్తు లనికూడ పిలుతురు. ఇవి పురుషబోధక సర్వనామముల యవశిష్టములే కాని వేరు కావు.

**క్రియావిభక్తులు** : తెలుగున ఏకవచన బహువచనములందు ప్రథమపురుషకు 'డు,రు' అనియు, మధ్యమపురుషకు 'వు, రు' అనియు, ఉత్తమపురుషకు 'ను, ము' అనియు నగును. అమహత్తునందు ప్రథమపురుషకు 'దు,వు' అని యగును.ఉత్తమపురుషకు ఉభయార్థకముగా 'ము' అనియే యగును.

అరవమున ఏకవచన బహువచనములందు ప్రథమపురుషకు 'అన్, అర్' అనియు, మధ్యమపురుషకు 'అయ్, ఈర్' అనియు, ఉత్తమపురుషకు 'ఏన్, ఏమ్' అనియు, ఉభయార్థక బహువచనము 'అమ్' అనియు నగును. మహతీవాచకము ప్రథమపురుషకు 'ళ్, అర్' అనియు, అమహద్వాచకము ప్రథమపురుషకు 'అదు' అని ఏకవచనమున 'అ, ఆన' యని బహువచనమున నుండును.

పటగన్నడమున ఏకవచన బహువచనములందు ప్రథమపురుషకు 'అమ్, అన్' అనియు, మధ్యమపురుషకు 'అయ్, ఇర్' అనియు, ఉత్తమ

పురుషకు 'ఎన్, ఎవు' అనియు నగును. ఇందు ఉభయార్థకము లేదు. అమహద్వాచకము ప్రథమపురుషకు 'దు, వు' అనియు, మహతీవాచక మందు 'ళ్, ర్' అనియు నగును.

హాలాసగన్నడమునందు ఏకవచన బహువచనములందు ప్రథమ పురుషకు 'అను, అరు' అనియు, మధ్యమపురుషకు 'ఎ, అరి' అనియు, ఉత్తమపురుషకు 'ఎను, ఎవు' అనియు నగును. మహతీవాచకమున 'అళు, అరు' అనియు, అమహద్వాచకమున 'అదు, అవు' అనియు నగును.

## వర్తమానకాలము

తెలుగున వర్తమానకాలమునందలి ధాతువునకు 'చు' అను ప్రత్యయము చేరిన పిదప 'ఉండు' ధాతువుయొక్క సమాపకక్రియా రూపము అనుబంధముగా నగును॥ చేయుచున్నాడు॥ ఈవరలో చెప్పి నట్లు ఈ వర్తమాన క్రియారూపము ప్రారంభమునందు కేవలము క్రియా జన్యవిశేషణమే. వచ్చుచున్నాడవు; వచ్చుచున్నాడను- మున్నగు యుష్మదస్మద్విశేషణముల కగు 'వును'లతోడి రూపముల కవకాశము కలిగినది. అటుకానియెడల ఇట్టి ప్రయోగముల కవకాశము కలుగదు.

ఇందు 'చు' అనునది వర్తమానార్థమును బోధించు ప్రత్యయము. అరవమున ప్రారంభకాలమున వర్తమానార్థకము లేదనియే చెప్ప వచ్చును. తరువాత తరువాత 'కిఱు, కిన్ఱు, ఆనిన్ఱు' అనువానిని వర్తమా నార్థకప్రత్యయములుగా గ్రహించిరి. 'ఇఱు' అనునది తెలుగునందలి 'ఉండు' ధాతువుతో సమానార్థకము. దానికి పూర్వమందున్న 'కు' భావ్యర్థకము. అట్లే 'ఆన్' అన్నది 'అప్పుడు' అను నర్థము కలిగి భూతార్థసూచక మగుచున్నది. దీనినిబట్టి ద్రావిడభాషలలో వర్తమా నార్థము భూతభవిష్యదర్థములకు సంబంధమును సాధించుచున్న దన వలయును. 'వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు' అని చిన్నయ సూరి నిర్వచించెను. అప్పటికి ముగియకుండునది; కావున భావిని స్పృశించుటయును సమంజసమే.

కన్నడమునందు 'ఉత్తు' అనునది వర్తమానార్థక ప్రత్యయము. ఇందు 'తు' ప్రత్యయమే కాక పూర్వమందు 'ఉన్' అనికూడ ఉన్నది. ఇది తమిళమునందు వర్తమానార్థమునందున్న 'ఉమ్'తో సమానమైనదే. తమిళమునందలి 'ఉ' కన్నడమునందలి 'తు' తెలుగునందలి 'చు' అను ప్రత్యయములు సమానార్థకము లనుట స్పష్టము. తెలుగునందలి 'చు'వర్ణము వ్యావహారికమున 'తు'వర్ణముగా పరిణతి నొంది 'చేస్తున్నాడు' మున్నగురూపములలో కనిపించుచున్నది.

భూతకాలము

చిన్నయసూరి 'భూతంబునా విద్యమానధ్వంస ప్రతియోగి' యని నిర్వచించి 'ముందుండి యప్పటికి లేకుండునది' అని వివరించెను. తెలుగున భూతకాలమును సూచించుటకుగాను 'ఇ' ప్రత్యయము వచ్చును. 'తి' అనునదికూడ ఆగమముగా నగును॥ చేసితిని॥ అరవమునందు కూడ 'ఇ, త్' అను రెండును భూతార్థచిహ్నములుగా నున్నవి. 'పాడి' అను క్త్వార్థకమునందు ఇవర్ణము తెలుగులోవలెనే భూతచిహ్నము. తకారము సంధివశమున టకార ఱకారములుగను, దకారముగను మారుచుండును. 'పట్' అను ధాతువు 'అనుభవించితిని' అను నర్థమున 'పట్టేన్' అని యగును. 'చేసితిని' అనునర్థమున 'శెయ్' ధాతువు 'శెయ్‌దేన్' అని యగును. 'తింటిని' అను నర్థమున 'తిన్' ధాతువు 'తిన్డ్రేన్' అని యగును.

ప్రాచీనతమిళమున 'చెయ్‌న్నన' మున్నగుప్రయోగములు అన్ని పురుషములను, కాలములను, వచనములను బోధించెడివి. తరువాత, స్పష్టతకొరకు వానికి ముందు కాలార్థకములును, పిమ్మట పురుషప్రత్యయములును చేరసాగినవి. ॥చెయ్‌దనెన్॥ అల్లే 'తు, తుమ్' అనునవి ఉత్తమపురుషమున ఏకవచన బహువచనములందు భూతభవిష్యత్కాలములు రెండింటియందును వచ్చెడివి.

కన్నడమునందు 'ఇ, ద' అను రెండే భూతకాలచిహ్నములు. కొన్నిమెడల మాత్రము 'దు' అనునదికూడ భూతకాలచిహ్నముగా నగుచున్నది. 'పోదం' అనగా 'పోయెను' అని యర్థము. 'నోడి' యనగా

'చూచి' యని యర్థము. 'బందు'అనగా 'వచ్చి'యని యర్థము. పఱిగన్న డమున 'గమ్' అనునది సర్వకాలవాచకపురుషబోధకముగా నున్నది.

ఈ ప్రయోగముల నన్నింటినిబట్టి చూడగా సర్వకాలములకు ఒకే క్రియారూపము వాడుకలో నున్నదని తెలును. తరువాతికాలమున భూతచిహ్నముగా 'ఇ' వర్ణము చేరినది. శ్రీ సోమయాజిగారు 'ఇవర్ణము' ఆగమమాత్రముగా నయ్యెనని నిర్ణయించిరి. కాని, యథార్థము దానికి భిన్నముగా నున్నదనిపించును. శ్రీవజ్ఝలవారు చెప్పినట్లు భూతార్థదార్ఢ్యమునకో, భూతార్థచిహ్న మొకటి కలదని లోకము మరచుట చేతనో కొన్నియెడల రెండేసి భూతచిహ్నములు నిలుచుచున్నవి. తెలుగులోని 'తి' వర్ణము, అరవమునందలి 'త' కారము, కన్నడమునందలి 'ద' వర్ణమును సమానములే. కన్నడమున 'మాడితు' మున్నగుచోట్ల తవర్ణమే కలదు.

తెలుగున ప్రథమపురుషమున నేకవచనమందు మాత్రము ఈ రెండు ప్రత్యయములును కనిపింపవు॥ చేసెను॥

'చేసినవాడు' మున్నగు క్రియాజన్యవిశేషణములు భూతకాలిక క్రియలుగా పరిణతి పొందినవి. 'చేసి' అను భూతకాలికముపై సంబంధార్థమున 'అ' కలుగగా సంధి నాపుటకై 'న'కారము ఆగమముగా వచ్చినది. చేదర్థమునందు కూడ భూతార్థమే యిమిడియున్నది.

భవిష్యత్కాలము

'భావినా విద్యమానప్రాగభావప్రతియోగి' అని నిర్వచించి చిన్నయసూరి 'అప్పటికిఁ బుట్టకుండునది' అని వివరించెను. 'అస్థిరనుబంధకస్స్యాద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః' అని చింతామణికారుడు ధాతువునకు 'కల' అను అనుబంధమును విధించెను. చిన్నయసూరి 'కలజ్యనుబంధంబు లృట్టు పరంబగునపు డగు'నని సూత్రించెను. 'చేయఁగలను' మున్నగురూపములు భవిష్యత్సూచకములు. క్రియాజన్యవిశేషణములగు 'చేయఁగలవాఁడు' మున్నగునవి 'చేయఁగలఁడు' మున్నగు విధముగా పరిణతి నొంది భావ్యర్థకసమాపకక్రియ లైనవి. 'కలదు,

కలవు' మున్నగునవి స్వతంత్రములుగా భవిష్యదర్థము నొసగుచున్నవి. అన్నంతధాతువుపై ఉంకుధాతువు నుపయోగించుటవలన సైతము భావ్యర్థకము సిద్ధించును॥ చేయనున్నాను॥

అరవమున 'కు' ప్రత్యయాంతములు కాలత్రయబోధకములుగా నుండి, పిమ్మట భవిష్యద్బోధకము లైనవి. 'చేయఁగలను' అను నర్థమున 'శెయ్‌కు' అనియు 'చేయగలను' అను నర్థమున 'శెయ్‌కుమ్' అనియు రూపము లుండును. వీనిపైని మరల పురుషప్రత్యయములు, కాలబోధకప్రత్యయములును చేరి క్రొత్తరూపము లేర్పడినవి॥ శెయ్ కేన్; శెయ్‌కువేన్॥ భావిచిహ్నములుగా వకార బకారములు ప్రచురముగా కనిపించును. కొన్ని యెడల బకారము పకారముగా మారును॥ శెయ్ వేన్; ఉణ్ బేన్; ఇరు ప్పేన్॥

పలుగన్నడమున 'గుమ్' ప్రత్యయముతోడి రూపము సర్వకాలికము కావున భవిష్యదర్థమున కూడ వాడబడును. ఇదికాక ప్రత్యేకముగా భవిష్యదర్థమును బోధించు 'వ'కారము కూడ కలదు. 'చేయఁగలను' అను నర్థమున 'మాడువెమ్' అని యుండును. హొసగన్నడమున సైతము ప్రత్యయమునందు మార్పేమియు లేదు. 'చేయగలను' అను నర్థమున 'మాడువెను' అని యుండును.

తెలుగున 'కల' అన్న అనుబంధము సామర్థ్యసూచకముగా కూడ నున్నది. 'చేయఁగలను' అని యన్నప్పుడు సంస్కృతమునందలి 'కరిష్యామి' అను భవిష్యదర్థముతోపాటు 'కర్తుం శక్నోమి' అను నర్థము కూడ లభించుచున్నది. నవీనకాలమున భవిష్యదర్థకమునకు బదులుగా తద్ధర్మార్థకమునే వాడుట అధికముగా కలదు. సామర్థ్యద్యోతనమునందు 'కల' అన్న అనుబంధము విస్తృతముగా కలదు. అట్లే 'కలదు' అని యన్నపుడు 'ఉండఁగలదు' అను భవిష్యదర్థమును కాక 'ఉన్నది' యను నర్థమునే యిచ్చుచున్నది.

## తద్ధర్మార్థకము

చిన్నయసూరి 'తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు' అని తద్ధర్మాదు లన్న మాటను వివరించెను. తద్ధర్మార్థక మనగా నేమో దీనివలన స్పష్టము కాలేదు. సంస్కృతవ్యాకరణమున వచ్చు 'తద్ధర్మపదము' తెలుగునందు చిన్నయ సూరి వాడిన 'తాచ్ఛీల్యముతో' సమానమయిన యర్థము కలదిమే. చింతామణికర్త వాడిన 'తద్ధర్మము' భూతభవిష్యద్వర్తమానక్రియలకు భిన్న మైనది. దీనికి నిర్వచనములు పెక్కుచు చేసినను, విషయము మాత్రము విశదముగా లేదు. ధాత్వర్థమునకే ప్రాధాన్య మొసగి 'తద్ధర్మము' అని నన్నయ వాడి యుండవచ్చును. ఇది త్రైకాలికము; ప్రత్యేకముగా కాలమును సూచించు ప్రత్యయ మేదేని చేరువరకు, ధాత్వర్థము మూడుకాలములను సూచించు నరుటలో విప్రతిపత్తి లేదు. ద్రావిడక్రియలు ప్రారంభకాలమున అన్ని కాలములను, పురుషలను, వచనములను, వాచకములను సూచించెడి వని యీవరలో పెక్కు పర్యాయములు గుర్తించితిమి. అట్టి తత్త్వమునకు పూర్తి ప్రాతినిధ్యము వహించునది తద్ధర్మార్థకము. ఇట్టి క్రియారూపము తమిళాదిభాషలందు కలదు. కాని, దానిని వారు వేరుపరిచి, వేరుగా పేరిడి పిలుచుట లేదు.

'చేయుదును, చేసెదను' అని రెండు విధములుగా తద్ధర్మార్థకములు కలవు. ఇందు 'దు' వర్ణముతోడి రూపములు ప్రాచీనములనియు 'ఎద' గాగమముతోడి రూపములు అర్వాచీనములనియు నిర్ణయింప నగును. ప్రథమపురుషయందు 'చేయును, చేసెడున్, చేసెడిన్' అని మూడు విధములుగా నుండును. మొదటిరూపము తమిళమునందలి 'ఉమ్' ప్రత్యయాంతరూపములతో సామ్యమును గలిగియున్నది. 'ఎడున్, ఎడిన్' ప్రత్యయాంతములు ఆశీశ్శాపములందు సాధారణముగా నగు చుండును.

'వత్తువు' మున్నగురూపములందు 'దువు' నకు పూర్వము 'వర్' అనియే కలదు. ఇది 'వచ్చు' ధాతువుయొక్క ప్రాథమికదశ. 'వచ్చితిని'

మున్నగు క్రియలయందు ద్వితీయదశలోని ధాతువులే కలవు. కావున భూతాదిక్రియలు ఏర్పడుటకు పూర్వమే తద్ధర్మక్రియలు నిరనుబంధకము లయిన ప్రాథమికధాతువులతో ఏర్పడినవనియు నిశ్చయింప వీలగు చున్నది.

వ్యాకర్తలలోనే తద్ధర్మార్థకముల విషయమున భిన్నాభిప్రాయ ములు కలవు. కొందరు కొన్ని తద్ధర్మార్థకములను వర్తమానక్రియలు గను, మఱికొందరు భవిష్యత్క్రియలుగను నిరూపించిరి. ఈనాడు వ్యవ హారమున తద్ధర్మార్థకము భవిష్యదర్థబోధకముగానే స్థిరపడుచున్నది.

# అవ్యయ ప్రకరణము

వాక్యమునందలి పదములకు క్రియతో గాని మరొక పదముతో గాని సంబంధ ముండును. ఆ సంబంధము ననుసరించి ఆ పదము కొంత మార్పునకు లోనగుట జరుగును. ఇది సాధారణ విషయము. కొన్ని పదములు ఈ విధమగు మార్పునకు లోనుగాక యెల్లప్పుడు నొక్క రీతి గానే యుండును. అట్టి వానిని నవ్యయములు (indeclinables) అని యందురు.

సంస్కృతమునందలి అవ్యయములను నిరూపించుచు సిద్ధాంత కౌముది 'స్వరాది నిపాత మవ్యయమ్' అని తెల్పెను. స్వర్, అంతర్, ప్రాతర్ మున్నగునవియు, నిపాతములును అవ్యయములని భావము. నిపాతములయందు అసర్వ విభక్తికములయిన తద్ధితములును, మాంత ములు ఏజంతములునైన కృత్తులును, క్త్వాప్రభృత్యంతములును, అవ్య యీభావములును అవ్యయములుగా పరిగణింపబడెను. 'అవ్యయాదాప్ సుపః' అని యనుటచేత అవ్యయముకంటె నున్న అప్ సుప్పులకు లోప మగుట యభీష్టము. మొత్తముమీద "సదృశం త్రిషు లింగేషు। సర్వా సుచ విభక్తిషు। వచనేషు చ సర్వేషు। యన్న వ్యేతి తదవ్యయమ్"అను నదియే సారాంశము.

సంస్కృతమునందలి అవ్యయములను నిదానించి చూడగా అవి పెక్కు భాషాభాగములకు చెందియున్నట్లు తెలిసికొనగలము. ఇంతకు ముందు చెప్పికొన్నట్లు ఒక పదము ఒక భాషాభాగమునకు చెందియున్న ప్పటికిని, సందర్భమునుబట్టి వాక్యమునందలి స్థానమునుబట్టి మరొక భాషాభాగమునకు సైతము చెందవచ్చును.

కొన్ని నామవాచకములపైని, విశేషణములపైని సర్వనామ ములపైని కొన్ని ప్రత్యయములు చేరుటచేత అవ్యయము లేర్పడును. అతః, ఇతః, తతః, కుతః మున్నగుచోట్ల చివరనున్న 'తః' అనునది కొన్ని సర్వనామములపైని చేరి మత్తః, త్వత్తః, అస్మత్తః, యుష్మత్తః మున్నగురూపములను కల్పించును. కొన్ని యుపసర్గలపైని చేరి

అభితః, పరితః అనియు; నామములపైని చేరి ముఖతః, నగరతః మున్నగు విధముగను అవ్యయరూపముల నేర్పరుచును.

అత్ర, తత్ర, యత్ర, కుత్ర మున్నగు చోట్ల నున్న 'త్ర' ప్రత్యయముగా కొన్ని సర్వనామముల పైని, తత్తుల్యములయిన యితరపదముల పైని చేరి అన్యత్ర, సర్వత్ర, ఇతరత్ర, ఏకత్ర, అనేకత్ర, పూర్వత్ర, పరత్ర - మున్నగురూపముల నేర్పరుచును.

తథా, యథా మున్నగురూపములయందలి 'థా' ప్రత్యయముగా చేరి సర్వథా, బహుథా, అన్యథా, అనేకథా, ఏకథా మున్నగు అవ్యయ రూపముల నేర్పరుచును.

తదా, యదా మున్నగువానియందు వలె 'దా' యనునది చేరుట వలన అన్యదా, ఏకదా, సర్వదా మున్నగురూపములు కలుగును.

ఇట్లే 'శః' యనునది చేరి బహుశః, ఏకశః, ముఖశః, అక్షరశః మున్నగురూపములును, 'వత్' అనునది చేరి పూర్వవత్, పరవత్ మున్నగురూపములును; 'సాత్' అనునది చేరుటవలన ఆత్మసాత్, బ్రహ్మసాత్ మున్నగు రూపములును ఏర్పడును.

కొన్ని విభక్త్యంతములయిన రూపములుకూడ అవ్యయములుగా ఉపయుక్తములగును॥ చిరం, సత్యం, నక్తం, పూర్వం, క్షణేన, అశేషేణ, చిరాయ, అర్థాయ, క్షణాత్, అకస్మాత్, అదా, సపది॥

కిల, ఖలు, తు, వై - మున్నగునవియు అవ్యయములే. వినా, ఋతే, అపి, సాకం, చ, తు, ధిక్, భోః, స్వస్తి, సాధు - మున్నగు నవియు ఏవిధమయిన మార్పును పొందకుండ అవ్యయములుగా వ్యవహృతము లగును.

ఇవి కాక యథాసుఖం, తథావిధం మున్నగు సమాసములును కర్ణాకర్ణి, ముఖాముఖి మున్నగు సమాసములును అవ్యయములుగానే వ్యవహరించును.

తెలుగునందు పైని చూపినంత విస్తృతమైన ప్రణాళిక కని పింపదు. అయినను అవ్యయము లనుపేర వ్యవహరింపదగిన రూపము లున్నవనుమాట వాస్తవము. ప్రత్యేకముగా అవ్యయములనుగూర్చి ఒక ప్రకరణము లేకపోయినను తెలుగువ్యాకరణములకు 'అవ్యయము' అను పదము క్రొత్తది కాదు.

సర్వలక్షణ శిరోమణికర్తయైన గణపవరపు వేంకటపతికవి 'అవల: దెలుఁగున నవ్యయాలయినట్టి పదములు కొన్ని యేర్పఱుతు వినుఁడి। యప్పు డిప్పుడు గాన నచ్చట నిచ్చట నక్కడ డిక్కడఁ గాక యాడ యీాడ। మఱియు వేమఱు పలుమఱు గావున నటు గనక వెండి క్రమ్మఱ నాఁదగు' అని మూడు సీసపాదములలో నన్నింటిని తేల్చివేసెను. ప్రౌఢ వ్యాకరణకారుడు పదములను మూడు విధములుగా విభాగించి నిర్వ చించెను. అందు అవ్యయములనుగూర్చి తెల్పుచు "అవ్యయము లనఁగా విభక్తి వచనశూన్యములు. అవి ప్రతిపదోక్తములు, లాక్షణికములని ద్వివిధములు. ప్రకృతి సిద్ధములు ప్రతిపదోక్తములు, లక్షణసిద్ధములు లాక్షణికములు" అని రచించెను. అనంతరవ్యాకర్తలు వీనిని మరల వింగడించి, ఒక ప్రకరణముగా గుర్తించి, వివరించి, ప్రదర్శించుట కూడ జరిగెను. వారి మార్గము ననుసరించి అవ్యయములస్వరూపము నరయు దము.

## ప్రతిపదోక్తములు

సహజసిద్ధముగనే పదరూపమున నుండి అవ్యయములుగా నుప యోగపడువానిని ప్రతిపదోక్తములు అని యనవచ్చును. వానిచే బోధింపబడు స్థల కాల మనఃస్థితులనుబట్టి వానిని మరల విభాగింప వచ్చును.

అక్కడ, ఇక్కడ, అచ్చట, ఇచ్చట – మున్నగునవి స్థలార్థక ములు.

అపుడు, ఇపుడు, నేడు, రేపు – మున్నగునవి కాలార్థకములు.

ఓహో, ఆహా, బళి, వహ్వా – మున్నగునవి ప్రశంసార్థకములు.

అవురా, అయ్యారే, అహో, అమ్మకచెల్ల - మున్నగునవి ఆశ్చర్యార్థకములు.

అక్కటా, అయ్యో, కటకటా - మున్నగునవి సంతాపార్థకములు.

ఊరక, మిన్నక - మున్నగునవి తూష్ణీమర్థకములు.

కద, కాదె, సుమ్ము, సూ - మున్నగునవి నిశ్చయార్థకములు.

అట, అంట - మున్నగునవి కిలార్థకములు.

అట్లు, ఇట్లు - మున్నగునవి ప్రకారార్థకములు.

అయ్యును, మఱియును - మున్నగునవి సముచ్చయార్థకములు.

వలెన్, పోలెన్ - మున్నగునవి ఔపమ్యార్థకములు.

సంస్కృతమునుండి కొన్ని యవ్యయములు తెలుగులో ప్రవేశించి వాడుక నొందుచున్నవి॥ సదా, సర్వథా, వృథా, స్వస్తి మున్నగునవి॥ ఇహము, పరము మున్నగునవి అవ్యయములే యైనను తెలుగునందు మువర్ణకాంతములై నామములుగానే యుపయోగము నొందుచున్నవి.

పై వన్నియు లింగ విభక్తి వచనభేదమును పాటింపక అన్ని వేళల నొక్కవిధముగనే యుండును. కాని కొన్ని యెడల వ్యత్యయము సైతము కనవచ్చును. అక్కడ, అచ్చట మున్నగురూపములు సప్తమ్యర్థకములై 'ఆప్రదేశమునందు' అను నర్థమునే బోధించుచున్నవి. అట్టే ఎదుటన్, ముందటన్ మున్నగునవికూడ సప్తమీవిభక్త్యంతములైన యవ్యయములు. కొన్ని శబ్దములపై దబ్బునన్, చట్టునన్ మున్నగురీతిగా 'నన్' అని చేరును. ఇదియు సప్తమీవిభక్తిని స్మరింపజేయుచున్నది. కొన్నిశబ్దములపై, కొన్ని యెడల అక్కడనుండి, అక్కడకు - మున్నగువిధముగా కొన్నివిభక్తులు మాత్రము పరిమితముగా చేరుట కనిపించును. అట్లు, ఇట్లు అను ప్రకారార్థకముల కడపట నున్న 'లు' వర్ణముకూడ విశేషమే. అయినను వీని నన్నింటిని వ్యవహారమునుబట్టి అవ్యయములుగానే గణించుట జరుగుచున్నది.

## లాక్షణికములు

వ్యాకరణలక్షణమువలన సిద్ధించి అవ్యయములుగా ఉపయోగ పడువానిని లాక్షణికములు అని యందురు. అసమాపకక్రియ లన్నియు లాక్షణికావ్యయములుగనే వ్యవహరించును.

వచ్చుచున్, చూచుచున్ - మున్నగునవి శత్రర్థకములు.
చూడన్, చూడఁగన్ - మున్నగునవి తుమున్నర్థకములు.
వచ్చుడున్, చూచుడున్ - మున్నగునవి అంతర్యార్థకములు.
వచ్చినన్, చూచినన్ - మున్నగునవి చేదర్థకములు.
వచ్చి, చూచి - మున్నగునవి క్త్వార్థకములు.
రాక, చూడక - మున్నగునవి వ్యతిరేక క్త్వార్థకములు.
వచ్చుట, చూచుట - మున్నగునవి భావార్థకములు.
రామి, చూడమి - మున్నగునవి వ్యతిరేక భావార్థకములు.

ఇవియేకాక ఆశీరాద్యర్థమునందు ఎడున్, తన్ - అను ప్రత్యయములు కలిగిన రూపములుకూడ అవ్యయములే॥ ప్రసన్నుఁడయ్యెడున్, ప్రసన్నులగుతన్॥ 'అగు' ధాతువుయొక్క క్త్వార్థకరూపమైన 'అయి' కాని నుఙ్యంతరూపమయిన 'కాన్' కాని చేరుటవలన అవ్యయము లేర్పడును॥ ముందయి యుండెను, వేగముగా వచ్చెను॥ చాలు, మిగులు, కూడు మున్నగునవికూడ నుఙ్యంతములై అవ్యయములుగా వ్యవహరించును॥ చాలన్, మిగులన్, కూడన్॥

ఆ, ఏ మున్నగు ప్రశ్నార్థకములును; ఏ యను నిశ్చయార్థకమును; ఆ యను సందేహార్థకమును; ఏ, ఓ మున్నగు అవధారణార్థకములును గూడ ఈ శ్రేణికి చెందినవే. ఇవి సమాపకక్రియలపైని చేరి వ్యవహరించును.

కొందరు అవ్యయములని యనగా క్రియావిశేషణములని భ్రమపడినట్లు కనిపించును. క్రియావిశేషణము లన్నియు అవ్యయములే యను మాట సత్యము. కాని అవ్యయము లన్నియు క్రియావిశేషణములు కావలసిన యవసరము లేదు. అవ్యయములలో నొకభాగము క్రియా

విశేషణములు. 'గాలి చల్లగా వీచెను' అని యన్నప్పుడు 'చల్ల' అను విశేషణముపై 'కాన్' అను నుజ్యంతము చేరినది. 'చల్లగా' అనునది 'వీచెను' అను క్రియకు విశేషణముగా వ్యవహరించుచున్నది; కావున క్రియావిశేషణము. ఈ'చల్లగా' అన్నది కర్తనుబట్టి కాని క్రియనుబట్టి కాని మార్పు నొందదు. కావున అవ్యయముకూడ నగుచున్నది. ॥గాలులు చల్లగా వీచెను; నీరు చల్లగా తాకెను; అది చల్లగా నుండును॥ విశేషణముపై 'కాన్' అన్నది చేరకుండ నుండవచ్చును॥ మీరు బాగుగా నుంటిరా; బాగుంటిరా॥

అప్పుడు, ఇప్పుడు- మున్నగునవి సర్వనామములు. అవియు అవ్యయములుగా వ్యవహరించునని చూచితిమి. సర్వపర్యాయమైన 'ఎల్ల' శబ్దము సర్వనామ మనుటకు సందేహములేదు. చిన్నయసూరి ద్రుతాంతమైన యవ్యయముగా పరిగణించెను. ఆయనయే 'ఎల్లయర్థములు' మున్నగువిధముగా, లక్ష్యము చూపి విశేషణముగా నిరూపించెను. కావున 'ఎల్ల' అను శబ్దము సర్వనామము, విశేషణము, అవ్యయము కూడ అగుచున్నది. లాక్షణికులయందు అసమాపక క్రియల విషయము చూడనే చూచితిమి. కావున విశేషణము, విశేష్యము, సర్వనామము, క్రియ - ఏదైనను వాక్యమునందలి స్థితినిబట్టియు వ్యవహారమునుబట్టియు అవ్యయము సైతము కావచ్చును. కావున అవ్యయము అని యనగా క్రియావిశేషణమును మాత్రమే గ్రహించుట సమర్థనీయము కాదు.

అవ్యయములను వేరుగా పరిగణించుట యవసరమా? కాదా? అను విషయమును చూతము. వాక్యమునందు క్రియతో కాని యితర పదములతో కాని ప్రతిపదమునకు సంబంధముండునన్న సంగతిని ముందుగనే చెప్పుకొంటిమి. ఆ సంబంధమును తెలియజేయుటకు ప్రత్యయమో ఆగమమో యేదో వచ్చును. అట్టి సంబంధ మున్నప్పటికిని ప్రత్యయాదుల యవసరము లేనిది అవ్యయము. నిపాతమువలెనే యిదియు ఉన్నది యున్నట్లుగా నుండి పోవునుగాని యితరసాహాయ్యము నపేక్షింపదు. ఆ విషయమును స్పష్టముచేయుటకై అవ్యయములను వేరుగా పరిగణించుట యవసరమని యనక తప్పదు.

# వాక్య ప్రకరణము

భాషయందు మిక్కిలి ప్రధానమైనది వాక్యము. వాక్యమువలననే మనభావములను స్పష్టముగా నొకనికి తెలియజెప్పుటకును, ఇంకొకని భావములను మనము తెలిసికొనుటకును అవకాశము కలుగుచున్నది. కేవలము వర్ణములవలన గాని, శబ్దములవలన గాని భావబోధ జరుగదు. వాక్యమువలననే సమగ్రభావబోధకు అవకాశము కలదు. కావున వాక్యమును భాషాశాస్త్రమునందు పరమప్రమాణము (Chief unit) గా గ్రహింతురు.

చిన్నపిల్లలు పెద్దల ననుసరించి, యనుకరించి భాషను నేర్చుకొందురు. పెద్దలు మాటాడుచుండగా వాక్యములను వాక్యములుగానే తిరిగి యుచ్చరించుటకు యత్నము చేయుదురు. అంతేకాని పదములను, వాని యన్వయమును, సంబంధసాధకములయిన ప్రత్యయాదులను గుర్తుపట్టి మాటాడరు. చిన్నపిల్లలే కాదు; పెద్దలుకూడ భాషావ్యవహారమునందిట్లే చేయుదురు. ప్రతిభాషకు ఒక సంప్రదాయముండును. ఆ సంప్రదాయము ననుసరించి వాక్యనిర్మాణము సాగుచుండును. మాతృభాషయందు మాటాడువాడు అప్రయత్నసిద్ధముగనే ఆయారీతులను గ్రహింపగల్గును. వక్త మనస్సునందలి భావమును, శ్రోత మనస్సున స్ఫురింపజేయునది వాక్యమే.

తెలుగు వ్యాకరణములు వాక్యనిర్మాణమునకు కావలసిన అంశముల నన్నింటిని విడివిడిగా పేర్కొన్నవి; కాని వాక్యస్వరూపమును నిరూపించుటకు పూనుకొనలేదు. ప్రౌఢవ్యాకరణము 'వాక్యపరిచ్ఛేదము' అనుపేర నొక ప్రకరణమునే చేర్చుకొన్నది. అనంతరవ్యాకరణములలో వాక్యపరిచ్ఛేదమునకు తావు కలుగుచునే వచ్చినది.

### వాక్య స్వరూపము

"రెండు విరామముల మధ్యనుండి పరిపూర్ణమైన భావమును కలిగిన పరిమితమైన యుచ్చారణము వాక్య"మని భాషాశాస్త్రవేత్తలు

పరిగణింతురు. చెప్పదలచుకొన్న విషయమును చెప్పుటకు సమర్థమైన పదములయొక్క పరిమిత సముదాయమును వాక్యము అని యనవచ్చును. సముదాయ మని యన్నంత మాత్రమున క్రమ నిరపేక్ష మని యర్థము కాదు. పెక్కు భాషలలో క్రమమే పదమునకున్న యర్థమును, ఇతర పదములతోడి సంబంధమును నిరూపించును. అది యేమి ? అను ప్రశ్న యున్నదనుకొందము. దానికి సమాధానముగా 'పుస్తకము' అని చెప్పుదుము. అప్పుడు ఈ ఒక్కపదమే వాక్యము కాగలదు. 'రా' అని యన్నప్పుడు ఇదొక్కటే వాక్యమై 'నీవురమ్ము' అను నర్థమును బోధించును. 'వాడు కూడ రావలయునా ?' అను ప్రశ్నకు సమాధానముగా 'వద్దు' అని అన్నచో అదియే ఒక వాక్యమగును. కావున ఒక వాక్యము అనేక పదఘటితమై యుండవలయు నన్న నియమము లేదు. కాని చెప్పదలచుకొన్న విషయము నంతటిని ఒకే పదములో చెప్పుట ఎల్లప్పుడు సాధ్యము కాదు. పెక్కు-పదములను వినియోగింపక తప్పదు. అప్పుడు ఆపదములకు వాక్యత్వమును గలిగించుటకు మూడు నియమము లను పాటింపవలయును. ప్రౌఢవ్యాకరణకారుడు "వాక్యమునా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థముగల యాసత్తియుక్త పదసముదాయంబు' అని నిర్వచించెను. ఇందుగల యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి యను వాని స్వరూపమును గమనింతము.

'యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ కలుగకుండుట' యని ప్రౌఢవ్యాకరణ వివరణము. 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు' అనునది యుదాహరణము. తడుపుటకు యోగ్యమైన వస్తువు నీరు కాని నిప్పుకాదు. కావున పై వాక్యమునందు యోగ్యత లేదు. 'నీటిచేఁ దడుపుచున్నాఁడు' అని కాని 'నిప్పుచేఁ గాల్చుచున్నాఁడు' అనికాని యున్నయెడల యోగ్యత కలుగును. అప్పుడు మాత్రమే వక్తయొక్క భావమును శ్రోత గ్రహించుటకు అవకాశము కలుగును.

'ఆకాంక్ష యనఁగా నిలుపుదలలేక పయిఁబయిఁబోయెడి పదార్థములమీఁది యాదరము'. వాక్యమును మొదలుపెట్టుటతోనే తరువాతి పదములను వినవలయునని, భావమును గ్రహింపవలయునని శ్రోత మనస్సున కలుగు ఉత్కంఠయే ఆకాంక్ష. 'రాముడు' అని చెప్పి ఆగిన యెడల శ్రోత వెనువెంటనే 'ఏమయ్యెను?' అనికాని 'ఎవడు?' అనికాని 'వచ్చెనా?' అనికాని యిటువంటి ప్రశ్న యేదియో అడుగుటకు కుతూహలపడును. 'రాముడు వచ్చెను' అని చెప్పినయెడల ఆ యాకాంక్ష తీరును. అటుకాక ఏమాత్రమును సంబంధములేని పొడిమాటలను చేర్చి పలికినయెడల వాక్యము కాదు.

'ఆసత్తి యనఁగాఁ బదముల చేరిక.' ఒక పదము నొకప్పుడు పలికి మఱొకపదము మఱొకప్పుడు పలికినయెడల సాన్నిహిత్యము లేనందువలన భావబోధ కలుగదు. ఉండవలసిన క్రమముకూడ అవశ్యముగా పాటింపదగినది. ఆక్రమముకూడ సరిగా లేనియెడల సమన్వయము కుదురదు. కావున ఆసత్తి యనునది ఒక ప్రధానమైన లక్షణము.

భాషాశాస్త్రవేత్తలు పైని చెప్పిన యోగ్యతను agreement, concord, congruence అను మూడు పేర్లతో పిలుచుచున్నారు. ఆకాంక్షను government, rection, regimen అని మూడు పేర్లతో పిలుచుచున్నారు.

వాక్యముయొక్క భౌతికరూపమునకు మీఁదినిరూపణము సరిపడును. ఇంక ఆంతరికస్వరూపమును నిరూపింపవలయును. అందు ప్రయోజనమును గతార్థ మగును.

'విషయబోధకము వాక్యము' అని తెల్పి ప్రౌఢవ్యాకరణకారుడు 'ఉద్దేశ్య విధేయభిన్నంబు విషయంబు' అని సూత్రించెను. విషయమును బోధించుటయే వాక్యప్రయోజనము. ఆ విషయము ఉద్దేశ్యము, విధేయము–అని రెండంశములుగా నుండును. దేని నుద్దేశించి చెప్పుదుమో అది ఉద్దేశ్యము; ఏమి చెప్పుదుమో అది విధేయము. 'రాముడు వచ్చెను'

అని యన్నప్పుడు 'రాముడు' అనునది ఉద్దేశ్యము. ఆ వాక్యమున రామునిగురించి చెప్పబోవుచున్నామని యర్థము. 'వచ్చెను' అనునది విధేయము. రామునకు సంబంధించి తెలియదగిన యంశము 'వచ్చెను' అని యనుటవలన తెలియు చున్నది. 'రాముఁడు వచ్చెను' అన్న వాక్యమునందు కర్తయు, క్రియయు మాత్రమే కలవు. 'రాముడు రావణుని సంహరించెను' అని యన్నప్పుడు రాముడు ఉద్దేశ్యమగును. 'రావణుని సంహరించెను'అనునదంతయు విధేయ మగును. విధేయమును మరల విభాగింపగా 'రావణుని' అను కర్మమును, 'సంహరించెను' అను క్రియయును గలవు. మొదటి వాక్యమునందు కర్త + క్రియ యుండగా రెండవ వాక్యమునందు కర్త + కర్మ + క్రియ యున్నవి.

'రాముడు తెచ్చెను' అనియన్నప్పుడుకూడ కర్త + క్రియ యున్నవి. ఐనను ఈ వాక్యమును విన్నంతనే ఎవరిని? దేనిని? అను ప్రశ్న లుదయించును. అనగా ఇది కర్మాకాంక్షగల వాక్యము. ఇక్కడి క్రియ సకర్మకము. 'రాముడు సీతను తెచ్చెను' అని యన్నప్పుడు కర్త + కర్మ + క్రియ కలిసిన వాక్యమేర్పడును. తెలుగుభాషయందు సాధారణముగా క్రమమిట్లేయుండును. 'రాముడు రావణుని సంహరించి సీతను దెచ్చెను' అను వాక్యము పూర్వవాక్యముల స్థితిని దాటినది. ఐనను 'రాముడు' అనునది ఉద్దేశ్యము; 'రావణునిసంహరించిసీతను తెచ్చెను' అనునదంతయు విధేయము. కావున వాక్యమునందు ఉద్దేశ్య విధేయము లవశ్యముగా నుండునని తేలును. అయినను 'రా' మున్నగు చోట్ల 'నీవు' అను ఉద్దేశ్యము లోపించుట చూచితిమి. అట్లే కొన్ని యెడల భావబోధకు బాధలేనిచో ఉద్దేశ్యముకాని విధేయముకాని లోపింపవచ్చును.

"there must be something to talk about and something must be said about this subject of discourse once it is selected. This distinction is of such fundamental importance that the vast majority of languages have emphasized it by creating some sort of formal

barrier between the two terms of the proposition" అని ఎడ్వర్డ్ సపీర్ ఉద్దేశ్యము, విధేయము - అను రెండంశముల యావశ్యకమునుగూర్చి తెలిపెను. 'విషయము' అని యనుటకు 'proposition' అన్న పదమును వాడెను. ఆయనయే ఉద్దేశ్యవిధేయముల స్వరూపస్వభావములను దెల్పుచు "The subject of discourse is a noun. As the most common subject of discourse is either a person or a thing, the noun clusters about defined concepts of that order. As the thing predicated of a subject is generally an activity in the widest sense of the word, a passage from one moment of existence to another, the form which has been set aside for the business of predicating, in other words, the verb, clusters about concepts of activity" అని వివరించెను.

ఇదే యభిప్రాయమును ప్రౌఢవ్యాకరణకారుడు 'విశేష్యాదిక ముద్దేశ్యము; క్రియాదికము విధేయము,' అని వివరించి, ఆవివరణమునకు మరల 'విశేష్యాదికము - విశేష్యము, విశేషణము, సర్వనామము; క్రియాదికము - క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము. ఆది పదద్వయముచే అన్నంత క్రియలును నేలాద్యవ్యయములును గ్రాహ్యములు. విశేష్యాదులుద్దేశ్య విధేయములు రెండునగు, క్రియలుద్దేశ్యములు కానేరవు." అని వివరణము వ్రాసెను.

ఈ విల్లు దొడ్డది; ఆ కనిపించుచున్న గ్రామము పెద్దది - మున్నగు విధముగా వాక్యము లున్నయెడల ఉద్దేశ్యము ఏకపద పరిమితము కాక విస్తరించియుండును. 'దొడ్డది' అన్నది విధేయము. 'ఈవిల్లు' అన్నది ఉద్దేశ్యము. దీనినింకను విభజింపగా 'విల్లు' అన్నది కర్తయు, విశేష్యమును కాగా దానికి 'ఈ' యను సర్వనామము విశేషణ మగుచున్నది. ఇట్లే రెండవ వాక్యమునందు 'ఆ కనిపించుచున్న గ్రామము'అన్నదంతయు

ఉద్దేశ్యము. అందు కర్త గ్రామము. 'ఆ' యనునది సర్వనామము, విశేషణము. 'కనిపించుచున్న' యన్నది క్రియాజన్యవిశేషణము.

'మాది మాకిచ్చుట మడిమాన్యము లిచ్చుట' అను వాక్యము నందు 'మాది మాకిచ్చుట' అన్నంతవరకు ఉద్దేశ్యము. 'మడిమాన్యము లిచ్చుట' అన్నది విధేయము. రెండు చోట్లను భావక్రియలే యున్నవి. వ్యాకరణ పరిగణనమునుబట్టి క్రియలని యనుచున్నను నిజమునకు వచ్చుట, ఇచ్చుట అనునవి విశేష్యముల వంటివే కావున విధేయము నందు క్రియయే యుండవలసిన యవసరము లేదు.

## వాక్య భేదములు

ప్రౌఢవ్యాకరణకారుడు వాక్యము సంపూర్ణవాక్యమని, అసంపూర్ణవాక్యమని రెండు విధములుగా నుండునని తెలిపెను. సమాపక క్రియలుగల వాక్యము సంపూర్ణవాక్యమని అసమాపక క్రియలు గల వాక్యము అసంపూర్ణవాక్యమని ఆయనయే వివరించెను. కాని యీ విభాగ మంత యుచితముగా లేదు. తొలుత వాక్యలక్షణమందు చెప్పికొన్న 'పరిపూర్ణమైన భావము' అసంపూర్ణవాక్యమునందు గోచరము కాదు. కావున వాక్యత్వము నంగీకరించుటకే వీలులేదు. సమాపక క్రియతో కూడియున్న పదసముదాయమును వాక్యము అనవచ్చును. సమాపక క్రియలేకున్నను భావపరిపూర్తి యున్నయెడల వాక్యము అనవచ్చును. అసమాపకక్రియ మాత్రమే కల పదసముదాయమును వాక్యము కంటె కొంచెము తక్కువగా పరిగణించి 'వాక్యకము' అని యనవచ్చును. ఆంగ్లమునందలి clause అను దానికి సమానముగా 'వాక్యకము' అని వాడుకొనుట సమంజసముగా నుండును.

ఆంగ్లప్రక్రియ ననుసరించి వాక్యమును మూడు విధములుగా పరిగణింపవచ్చును. 1. సామాన్య వాక్యము 2. సంశ్లిష్ట వాక్యము 3. సంయుక్త వాక్యము. పూర్వవ్యాకరణముల యందు ఈ విభాగము లేనందువలన, దీనిని తిరస్కరింపవలసిన యవసరము లేదు. పూర్వకావ్యములయందలి ప్రయోగములనుబట్టి, ప్రస్తుతమున్న వ్యవహారమును

బట్టి పై విభాగము యోగ్యమో కాదో పరిశీలించుకొనుట కర్తవ్యము. ప్రయోగము లున్ననాడు లక్షణము లేకపోయినను కల్పించుకొన వచ్చును. 'ప్రయోగశరణం వ్యాకరణమ్' ఇంతకును ఆయా వాక్య భేదములను గమనింతము.

1. సామాన్య వాక్యము (simple sentence) : ఒక సమాపక క్రియను మాత్రమే కలిగియుండి అసమాపకక్రియలకు అవకాశము లేని వాక్యమును సామాన్యవాక్యము అని యనవచ్చును. 'నేను పుస్తకము చదివితిని' అను వాక్యమునందు 'చదివితిని' అన్నది యొక్కటే సమాపక క్రియ. ఇతర క్రియలు లేవు, కనుక దీనిని సామాన్యవాక్యము అని యన వచ్చును.'నేను పుస్తకము గట్టిగాచదివితిని.'అన్న వాక్యమునందు'గట్టిగా' అనునది క్రియావిశేషణము. 'గట్టి' యను విశేషణముపై 'కాన్' అను నుజ్యంతము చేరుటచేతనే యేర్పడెను. అయినను దీని నసమాపకక్రియగా కాక క్రియావిశేషణముగా గ్రహించుట యనుభవసిద్ధము. కావున, ఈ వాక్యముకూడ సామాన్యవాక్యమే.

'నీవు వచ్చుట నా కిష్టము' అన్నవాక్యమునందు క్రియలేదు. అయినను భావపూర్తి యున్నది. కాబట్టి దీనినికూడ సామాన్యవాక్య ముగా గ్రహింపవలయును,

2. సంశ్లిష్ట వాక్యము (Complex sentence) : సమాపక క్రియలనుకూడ కలిగియున్న పదసముదాయమునకు సంశ్లిష్టవాక్యము అనిపేరు. 'రాముడు చూచుచుండగనే లక్ష్మణుడు మూర్ఛపోయెను' అనునది ఒక్కటే వాక్యము. ఇందు 'మూర్ఛపోయెను' అన్నది సమా పకక్రియ. దీనికి కర్త లక్ష్మణుడు. కావున 'లక్ష్మణుడు మూర్ఛపోయెను' అనునది యిచ్చట ప్రధానము. కావున దీనిని ప్రధానవాక్యకము (principal clause) అని యందురు. 'చూచుచుండగనే' యను అస మాపకక్రియకు రాముడు కర్త; 'రాముడు చూచుచుండగనే' యన్నది ప్రధానవాక్యకముపై ఆధారపడిన అనుబంధవాక్యకము (subordinate clause); వానిని విడువలేక వారలు బాధనొందిరి – వానలు కురిసెనేని

పంటలు పండును - వాలిని గుర్తుపట్టి రాముడు బాణము విడిచెను - సీతను వెదక సుగ్రీవుడు వానరులను బంపెను॥ మున్నగువిధముగా సంశ్లిష్ట వాక్యములుండును.

3. సంయుక్త వాక్యము (compound sentence): రెండు కాని, అంతకంటె నెక్కువ కాని వాక్యములు సంబద్ధములై యేకాన్వయము కలిగియున్న యెడల ఆవాక్యముల సముదాయమును సంయుక్త వాక్యము అని యందురు. 'రాముడయోధ్యకు వచ్చెను, పట్టము కట్టుకొనెను'. ఇక్కడ నిజమునకు 'వచ్చెను' అన్నంతవరకు ఒక వాక్యము. మిగిలినది మరొక వాక్యము. ఈ రెండును సన్నిహితములై యున్నవి. కర్త మొదటివాక్యమునందు మాత్రమే యున్నను, రెండవ వాక్యమునకును అన్వయించుచున్నది. తత్సంబంధముచేత ఏకవాక్య స్ఫురణ కలుగుచున్నది. కావుననే యిది సంయుక్తవాక్యము అగుచున్నది॥ నీవు రమ్ము నేనును వత్తును - నీవు రమ్ము, లేకున్న నేను వత్తును - నీవు రావు, నన్ను రానీవు - అత డారోగ్యముగా లేడు, కావున రాలేడు॥ మున్నగు ప్రయోగములయందు 'లేకున్న, కావున' మున్నగు సముచ్చయములు పూర్వాపరవాక్యములను సన్నిహితము గావించుచున్నవి, కొన్నియెడల అట్టివి లేకుండగనే అన్వయము కలుగుచున్నది. కావున అవి సంయుక్తవాక్యములుగా పరిగణింపబడుచున్నవి.

రూపమును బట్టి పై భేదములు నిరూపితములైనవి. అర్థమును బట్టి వాక్యమునందు మరల భేదములు పరిగణింపబడుచున్నవి. 1. భావార్థకము 2. అభావార్థకము 3. విధ్యాద్యర్థకము 4. ప్రశ్నార్థకము 5. ఆశ్చర్యాద్యర్థకము 6. ఆశీరాద్యర్థకము 7. సందేహార్థకము 8. వికల్పార్థకము - అని ఎనిమిది విధములు. వీని స్వరూపమును స్థూలముగా చూతము.

1. భావార్థకము: కేవలము భావమునుగాని యభిప్రాయమును గాని చెప్పుటకు ఉపయోగపడిన వాక్యమును భావార్థకవాక్యమని

యందురు॥ నేను పుస్తకము చదివితిని - నేను కొన్న పుస్తకమును రాముడు పుచ్చుకొనెను॥

2. అభావార్థకము : ఇదియును పై వాక్యము వంటిదే. ఇందు నఞర్థము చెప్పబడును॥ నేను పుస్తకమును చదువలేదు - వెళ్ళవలయు ననుకొంటిని గాని వెళ్ళలేదు॥

3. విధ్యాద్యర్థకము : విధినిగాని నిషేధమునుగాని తెలియ జేయు వాక్యమును విధ్యాద్యర్థక వాక్యము అని యందురు॥ విధి - నీవు వెంటనే రమ్ము; నిషేధము - పని చేయునప్పుడు దిక్కులు చూడకుము॥

4. ప్రశ్నార్థకము : ప్రశ్నరూపమైన వాక్యము ప్రశ్నార్థకవాక్య మనిపించుకొనును॥ నీవు పుస్తకమును చదివితివా? వాడు తిరిగి వచ్చెనా?॥

5. ఆశ్చర్యాద్యర్థకము : ఆశ్చర్యము, సంతోషము, సంతాపము మున్నగుభావములను వెల్లడించిన వాక్యమును ఆశ్చర్యాద్యర్థక వాక్యమని యందురు॥ ఓహో? దీనిని మెచ్చుటకు వేయినాల్కలు కావలయును; కటకటా ? ఎంత కష్టము॥

6. ఆశీరాద్యర్థకము: ఆశీస్సునుగాని శాపమునుగాని అభీష్టమును గాని తెలియజేయు వాక్యమును ఆశీరాద్యర్థక వాక్యమని యందురు॥ నీకు సుఖము కల్గుగాక; నీకు రాక్షసత్వము కల్గుతన్॥

7. సందేహార్థకము : సందేహమును వెల్లడించు వాక్యమును సందేహార్థకమని యందురు॥ భూసురు డేగనో నడుమమార్గ శ్రాంతుడై చిక్కెనో॥

8. వికల్పార్థకము : ఏదో ఒక విషయమును జెప్పి దానిమీద ఆధారపడి జరుగునట్లు మరొక విషయమును తెల్పుటకు వికల్పార్థక వాక్యమని పేరు॥ నీవు విందువేని చదివెదను; వాడువచ్చిన నేనును వత్తును॥

వాక్యమును క్రియారూపముయొక్క స్థితినిబట్టి కూడ మూడు విధములుగా విభాగింతురు. 1. కర్తృప్రధాన వాక్యము 2. కర్మప్రధాన వాక్యము. 3. భావప్రధానవాక్యము.

1. కర్తృ ప్రధాన వాక్యము: ఇందు కర్తయే క్రియాపదముచే ఉక్తమగును; అనగా వాక్యమున కర్తకు ప్రాధాన్యము కలదని యర్థము॥ రాముడు రావణుని సంహరించెను॥

2. కర్మప్రధాన వాక్యము; ఇందు క్రియాపదముచే కర్మము ఉక్తమగును; అనగా వాక్యమునందు కర్మకు ప్రాధాన్యము కలదని యర్థము॥ రావణుడు రామునిచే సంహరింపబడెను॥.

3. భావప్రధాన వాక్యము; ఇందు సమాపకక్రియనుగాక భావ క్రియను ఉపయోగించి విధేయాంశమును చెప్పుట జరుగును. విశేష ణాదుల నుపయోగించి కూడ విధేయమును తెలుపవచ్చును॥ నీవు వచ్చుట సర్వభాగ్యములు వచ్చుట॥

ఇట్లు రూపమునుబట్టి మూడు విధములుగను, అర్థమునుబట్టి ఎనిమిది విధములుగను క్రియాప్రాధాన్యమును బట్టి మూడు విధములు గను వాక్యమును విభాగించుట జరుగుచున్నది.

## తెలుగువాక్యము తీరుతెన్నులు

తెలుగువాక్యము సాధారణముగా కర్త + కర్మ + క్రియ క్రమములో నుండును. కర్తకు విశేషణము లైనవి కర్తకు ముందుగను, కర్మకు విశే షణము లైనవి కర్మకు ముందుగను, క్రియకు విశేషణము లైనవి క్రియకు ముందుగను వచ్చును॥ శ్రీరాముడు శివధనుస్సును విరిచెను - జగదభి రాముడగు శ్రీరాముడు సకలసద్గుణసమేతయగు సీతను మహావైభ వముగా వివాహమయ్యెను॥

క్రియాపదము లింగ విభక్తి వచనములయందు కర్తకు అను రూపమై యుండవలయు నన్నది పై యుదాహరణములనుబట్టి గ్రహింప నగును. కర్మార్థకవాక్యమునందు క్రియాపదము కర్తతో కాక, కర్మతో అన్వయము నొందును. కావున దాని కనురూపముగా నుండును ॥ సీత రావణునిచే నపహరింపబడెను - శ్రీరామునిచేత రాక్షసవీరు లనేకులు సంహరింపబడిరి॥

ఉదాహృత వాక్యములలో చివరివాక్యమునందు 'రాక్షసవీరు లనేకులు' అనుచోట విశేష్యము ముందును, విశేషణము తరువాతను వచ్చినవి. 'అనేకులు రాక్షసవీరులు' అని యుండుట సాధారణ లక్షణము. అయినను కొన్నియెడల వ్యత్యస్తము లగుటయు కలదు. 'రామ లక్ష్మణులు మహావీరులు' అని యన్నప్పుడు 'మహావీరులు' అన్నది విశేషణము. అది 'రామలక్ష్మణులు' అను ఉద్దేశ్యమునకు విధేయమై వాక్యమునకు పరిపూర్ణతను చేకూర్చుచున్నది. ఇదియు విశేష్యమునకు అనంతరమందే వచ్చినది. 'గాలి మెల్లగా వీచెను' అని యనుట సాధారణక్రమము. కాని 'గాలి వీచెను మెల్లగా' అనియు ననవచ్చును. ఇక్కడ క్రియకు పూర్వ మందుండవలసిన క్రియావిశేషణము అనంతర మందు వచ్చినది. కొన్నియెడల క్రమమునందలి మార్పువలన అర్థము నందును మార్పు గోచరించును. 'గాలి చల్లగా వీచెను' అని యన్నప్పుడు చల్లదనమునుగూర్చియే క్రొత్తగా చెప్పుకొనుట జరుగుచున్నదని యనిపించును. గాలి వీచుచునే యున్నది. అందు విశేషము లేదు. ఒక ప్రత్యేక సమయమునందు అది చల్లగా నున్నది, ఆవిషయమును పురస్కరించుకొనియే పైవాక్యము ప్రవర్తించినది. అట్టి సమయమునందు 'చల్లగా' అనుచోట మొదటి యక్షరమును నొక్కిపలుకుటయు వ్యవహారమునందు గోచరము కాగలదు. పదముల క్రమమును మార్చి 'చల్లగా గాలి వీచెను' అని యన్నయెడల గాలికి ప్రాధాన్యము లభించును. గాలి వీచునన్న భావములేని సందర్భమునందు గాలివీచుట జరిగెను. అది చల్లగా నుండెను. అనుకొననిది జరిగినప్పుడు కలుగు భావమే యిక్కడ కలదు. ఇప్పుడు వక్త 'గాలి' యందలి మొదటి యక్షరము పై ఊనిక నిల్పి పలుకును.

ఇంకొక్క యుదాహరణమును చూతము. 'సాధారణముగా వాడు అబద్ధము చెప్పడు' అన్న వాక్యమునందు 'సాధారణముగా' అను క్రియావిశేషణము క్రియనుండి వేరుపడి, చాల ముందుగనే యుపయుక్తమయ్యెను. ఇట్లుండుటవలన వాడు నిజముచెప్పు స్వభావము గలవాడే

యనియు, ఎప్పుడో కాని అబద్ధము చెప్పడనియు తాత్పర్యము. ఆ వాక్యమునందలి పదక్రమమును మార్చి 'వాడు అబద్ధము సాధారణముగా చెప్పడు' అని యన్నయెడల తాత్పర్యమునందు చాలమార్పు వచ్చుటకవకాశము కలదు. ఇక్కడ 'సాధారణముగా చెప్పడు' అన్నదానికి స్వల్పముగా చెప్పడని, మిక్కిలి ప్రమాదకరముగా చెప్పునని భావము స్ఫురించును. కావున పదములక్రమము నియతముగా లేకున్నను, పదములక్రమమును మార్చుటవలన ఊనిక నొకచోటనుండి మరొకచోటికి మార్చుట వలన భావభేదము కలుగు నన్నమాట వాస్తవము.

అమహద్వాచకము కర్త యైనప్పటివలెనే మహతీవాచకము కర్తయైనప్పుడును క్రియాపదముయొక్క యేకవచనరూపముండును॥ చిలుక పలికెను – కలికి పలికెను॥ బహువచనమునందు మహతీవాచకము అమహద్వాచకముతో కాక మహద్వాచకముతో సామ్యమును సంపాదించుకొనును॥ రామలక్ష్మణులు వచ్చిరి – కౌసల్యాసుమిత్రలు చూచిరి॥

కర్తృపదము సమూహార్థకమైనప్పుడు క్రియ సాధారణముగా ఏకవచనమునం దుండవలయును॥ మునిసమూహము విచ్చేసెను – జనము తండోపతండముగా నుండెను॥ కొన్నిచోట్ల వక్త సమూహార్థమునందలి బహుత్వమును మరవలేక పోవుటవలన నేమో! క్రియాపదము బహుత్వబోధకమై యుండుటయు కలదు॥ మునిసమూహము విచ్చేసిరి – జనము తండోపతండముగా నుండిరి॥

ఒకే క్రియకు కర్తలనేకముగా నున్నప్పుడు ఏకర్తతో అన్వయించి క్రియారూపమేర్పడవలయు నన్నది యొకప్రశ్న. 'రాముడును లక్ష్మణుడును' అని కర్తలుగా నున్నచో రెండును మహద్వాచకములు గావున మహద్బహువచనక్రియయైన 'వచ్చిరి' యనునది వాడవచ్చును. 'సీతయు రాముడును వచ్చుచున్నారు' అని యనవచ్చును. సీత మహతీవాచకము; కావున క్రియాపదము 'వచ్చుచున్నది' అని యుండవలయును. రాముడు మహద్వాకచము కావున 'వచ్చుచున్నాడు'

అని యుండవలయును. అయినను మహన్మహతీవాచకముల కగు బహు వచనక్రియారూపము సమానముగా నుండును. కావున 'వచ్చు చున్నారు' అను రూపమగును. అటు కాక మహత్తులును అమహత్తులును కర్తృస్థానీయములై యున్నచో క్రియ యెట్లుండవలయును? నామిత్రు నకు పెక్కు భూములు కలవు; నామిత్రునకు నాలుగైదిండ్లు కలవు - అను రెండు వాక్యము లున్నవి. భూములు, ఇండ్లు అనునవి అమహత్తులే కావున 'కలవు' అను క్రియాపదము ప్రయుక్తమైనది. పై రెండు వాక్య ముల నేకవాక్యముగా వ్రాయవలసివచ్చినచో, అప్పుడును 'కలవు' అను క్రియాపదమునే వాడవచ్చును॥ నామిత్రునకు పెక్కు భూములును నాలుగైదిండ్లును కలవు॥ అటుకాక 'బంధువులు' అనునది కర్తృపద మయినయెడల క్రియాపదము తదనుగుణముగా 'కలరు' అని యుండ వలయును॥ నామిత్రునకు అనేకబంధువులు కలరు॥ ఇప్పుడు పై వాక్య ములయందలి మొదటివాక్యమును ప్రస్తుతవాక్యమును కలిపి ఏకవాక్య ముగా వ్రాయవలసి వచ్చినయెడల క్రియ 'భూములు' అను పదమునకు అనురూపముగా నుండవలయునా? 'బంధువులు' అనుపదమున కనురూప ముగా నుండవలయునా? దీనికి సమాధానముగా ప్రౌఢవ్యాకరణకారుడు 'అనేక కర్తృకక్రియకు సమీపకర్త యొక్క లింగవచనంబులగు' అని సూత్రించెను. దానినిబట్టి పై వాని నేకవాక్యముగా రెండువిధములుగా వ్రాయవచ్చును॥ నామిత్రునకు పెక్కు భూములు ననేకబంధువులును గలరు- నామిత్రునకు అనేకబంధువులును పెక్కుభూములును గలవు॥

సర్వనామములు కర్తృపదములైనప్పుడు క్రియాప్రయోగము మరొకరీతిగా నుండును॥ వాడువచ్చెను - నీవువచ్చితివి॥ పై రెండు వాక్య ములను చేర్చి యొక్కటిగా వ్రాయవలయు నన్నచో క్రియ ఏకర్తతో అన్వయింప వలయును? దీనికి సమాధానముగా బాలవ్యాకరణకారుడు 'అన్య యుష్మ దస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అని చెప్పినది సరిపడును॥ వాడును నీవును వచ్చితిరి - నీవును వాడును వచ్చితిరి॥ వాడు అన్యార్థకము; నీవు యుష్మదర్థకము. ఈరెండింటి

లోపల యుష్మదర్థకము బలవత్తరము, కావున క్రియ దాని కనురూప ముగా నుండును. అనేక కర్తృకమగుటచేత బహుత్వము నొందును॥ నీవు వచ్చితివి - నేను వచ్చితిని॥ ఈ రెండువాక్యములను కలిపి ఏక వాక్యముగా వ్రాయునపుడు అస్మత్కార్యము బలవత్తరమగును॥ నీవును నేనును వచ్చితిమి - నేనును నీవును వచ్చితిమి॥ అన్యయుష్మదస్మ దర్థకములను మూడింటిని కర్తలుగా వాడునప్పుడు క్రియ అస్మదర్థకము తోనే అన్వయమును కలిగియుండును॥ వాడును నీవును నేనును వచ్చి తిమి - నీవును నేనును వాడును వచ్చితిమి - నేనును వాడును నీవును వచ్చితిమి - ఇత్యాదివిధముగా నుండును. అన్నిచోట్ల క్రియారూపము 'వచ్చితిమి' అనియే యుండును. దీనినిబట్టి క్రియకు సన్నిహితమైన కర్తయొక్క లింగవచనములు కలుగుట యన్నది యిక్కడ చెల్లదని తేలుచున్నది.

కర్త లనేకముగా నున్నను ఆత్మార్థకముకూడ చెప్పబడినప్పుడు క్రియ తదనుగుణముగా నుండుట మరొక లక్షణము. రాముడును సీతయు లక్ష్మణుడును వచ్చిరి - అనుచోట 'వచ్చిరి' అను బహుత్వ బోధకక్రియ యున్నది. 'తాను' శబ్దమును చేర్చినప్పుడు 'రాముడు సీతయు లక్ష్మణుడును దానును వచ్చెను' అని తాను శబ్దమున కనురూపముగా క్రియ ఏకత్వబోధక మయినది. తాను శబ్దముచేత రాముడు ప్రధానకర్త యైనట్లు బోధపడుచున్నది. కావున తాను శబ్దముతో అన్వయము నొందుటయనగా 'రాముడు' శబ్దముతో అన్వయము నొందుటయనియే చెప్పవచ్చును. ఇట్టియెడల ఆత్మార్థకము బహుత్వబోధకమైయుండి 'రాముడును సీతయును లక్ష్మణుడును తాము వచ్చిరి' అన్నట్లు కూడ వాడుక నొందవచ్చును. ఇక్కడ ఆత్మార్థకమునకు ప్రత్యేక ప్రయోజన మేమియు కనిపింపదు. 'తా వచ్చె సుదర్శనాయుధుడు' అనునప్పుడు 'తాను' అన్నది నిరర్థకముగా వచ్చినట్లే పై వాక్యమునందలి 'తాము' అన్నది కూడ నిరర్థకముగా వచ్చినదనియే అనవలయును. అనగా, ఇట్టి

యెడల ప్రాధాన్యవివక్షనుబట్టియే క్రియాప్రయోగము సాగుచున్న దనవలయును.

మరియొక యుదాహరణము నరయుదము. "విప్రకులుండ వెళ్వెడుము వేగమ నీవును నీనిషాదియున్" అన్నది భారతప్రయోగము. మనము పూర్వము చూచినట్లుగా నైనచో 'నీవును నీనిషాదియున్' అని రెండుకర్త లుండుటచేత క్రియ బహుత్వము నొందవలయును; అన్వయుష్మదర్థకములందు బలవత్తరమైన యుష్మదర్థకముతో అన్వయమును పొందియుండవలయును. పై ప్రయోగమునందు క్రియ యుష్మదర్థకముతోడి అన్వయమునొందినది కాని బహుత్వమును పొందలేదు. దీని నొక విలక్షణరూపముగా గ్రహింపవలయును. 'నీవు' అనునదే ప్రధానకర్తగా గణింపబడినట్లు తోచును. 'నీనిషాదియున్' అనునప్పటి సముచ్చయార్థకము సహార్థద్యోతకము. అనగా 'నీ నిషాదితో నీవు వెళ్వెడుము' అని యనుటకు మారుగా 'నీ నిషాదియు నీవు వెళ్వెడుము' అని యనుట జరిగెనని యర్థము. ఇట్టి ప్రయోగములు పూర్వకావ్యములందు అనేకముగా కలవు; కావున సహార్థమున సముచ్చయార్థకమును వాడుటకూడ ఒక లక్షణవిశేషముగా నంగీకరింపవలయును.

కాక, కాని – యను నవ్యయములకు వ్యంజకత్వము పెక్కురీతులుగా కనిపించును॥ నీవు వచ్చినగాక యిది జరుగదు॥ ఈవాక్యమునందు 'నీవు వచ్చినప్పుడు మాత్రమే జరుగును; కాకున్న నిది జరుగదు' అన్న యర్థము వచ్చును. 'చేసితివిగాక బ్రతికిపోయితివి' అన్నవాక్యమునందు 'కాక' అనునది 'కనుక' అనునర్థమున ప్రవర్తించుచున్నది. 'చేయక పోయినయెడల చచ్చెడివాడవు' అన్నస్ఫురణను కలిగించుచున్నది. 'కాకేమి' యున్నగువిధనుగా వాడినపుడు నిశ్చయాత్మకత్వము వెల్లడి యగును. 'అది కాక మరొకటా!' యనునప్పుడు వ్యతిరేకార్థము స్ఫురించును. 'అదియునుంగాక' మున్నగువిధముగా వాడినప్పుడు 'అదనముగా' అను భావమునే ద్యోతనము చేయును. 'కల్యాణ మగుగాక'

మున్నగువిధముగా వాడినపుడు 'కాక' యన్నది ఆశీశ్శాపాభీష్టములను వ్యక్తము చేయుచున్నది.

'నలున కాని నళినదళనేత్ర వరియింపదట్టె' అని యనునప్పుడు 'నలుని మాత్రమే వరియించును; అన్యుని వరియింపదు' అనుభావము గలదు. 'రామునిగాని కృష్ణునిగాని పూజింపుము' అని యన్నప్పుడు 'కాని' యన్నది వికల్పార్థమును స్ఫురింపజేయును. కొన్నిచోట్ల 'కాని' యన్నది పూర్వోక్తవిరుద్ధమగు నర్థమును స్ఫురింపజేయును॥ వాడు ప్రతిదినము వచ్చును కాని నేడు రాలేదు – వాడు వచ్చును గాని యీపని జరుగదు॥

'అని' యను క్త్వార్థకరూపము పెక్కువిధములుగా నుపయోగ పడును. 'అని' యనుదానికి పలికి, చెప్పి మొదలయిన యర్థములే కలవు. కొమ్మ ఫెళ్ళుమని విరిగెను – అని యన్నప్పుడు విరిగినదియు, ఫెళ్ళుమన్నదియు కొమ్మయే. కావున 'అని' అనుదానిని 'కొమ్మ' యను కర్తకే అన్వయింపవచ్చును. వాడు దభాలు మని పడెను – అని యన్న ప్పుడు పడుటవరకు కర్తృత్వము వానిదే. దభాలు మన్నది మాత్రము వాడు కాదు. వాడు మంచివాడని మెచ్చితిని – అని యన్నప్పుడును అనుటతో సంబంధము లేదు. 'నీవు చెప్పితివని చెప్పితిని' అన్న ప్పుడు 'నీవు చెప్పితివి కనుక చెప్పితిని లేనియెడల చెప్పెడివాడను కాను' అన్న అర్థము గలదు. 'ఏమని వచ్చితివి?' అన్నప్పుడు 'అనుకొని' యను నర్థము సంగతము కావచ్చును. 'ఇది యని అది యని లేదు' అని యన్నప్పుడు 'అనుకొని' అన్న యర్థమును చెప్పుకొనుటకు వీలుకాదు. అనుకరణమునందును, ధ్వన్యనుకరణమునందును మాత్రమేకాక, పైని చెప్పినట్లు ఇంకను పెక్కురీతులుగా 'అని' యన్నది యుపయోగపడు చున్నది.

ఊనిక యొక్కమార్పునుబట్టి తెలుగువాక్యము పెక్కుభావము లను ప్రకటించుటకు సమర్థమై యుండును. 'వాడు వచ్చునా?' అను వాక్యమున్నదనుకొందము. ఒక విధముగా పలికినపుడు 'వాడు రానే

రాడు' అన్న నిశ్చయము ధ్వనించును. ఇంకొక విధముగా పలికినపుడు 'రాడనుకొంటిమే, వచ్చుచున్నాడా?' అన్న ఆశ్చర్యము వెల్లడియగును. ఇంకొకప్పుడు 'మరెవడో వచ్చు ననుకొనగా వీడు వచ్చుచున్నాడా?' అన్న భావము స్ఫురించును. ఇంకొక విధముగా నన్నచో 'వాడు రావలయు ననుకొనవచ్చును, కాని యిక్కడకు చేరడు' అన్న అర్థము వచ్చును. మరొక్కవిధముగా నన్నచో 'వాడు సామాన్యముగా వచ్చువాడు కాడు; బలవంతముమీద తీసికొని వచ్చుచున్నాను' అన్న అర్థము అభివ్యక్తమగును. ఇట్లే ఉచ్చారణదక్షుని నోట ఎన్నివిధములయిన అర్థముల నయిన తెలుగువాక్యము సంగ్రహించుకొనగలదు.

తెలుగువాక్యము సరళమైనది. అయినను అనేక భావభంగులను ప్రకటింపగల సామర్థ్యమును పుష్కలముగా కలిగియున్నది.

# అర్థ ప్రకరణము

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" అని కాళిదాసు పార్వతీపరమేశ్వరులను సంభావించెను. వాగర్థము లొకదాని నొకటి విడిచియుండవు. వాక్కులేనిచో అర్థ మభివ్యక్తము కాదు. అర్థము లేని ధ్వనిని శబ్దమని యనరు. అర్థయుక్త మయిన ధ్వనిసమూహమునే శబ్ద మని యందురు. ఈ శబ్దమునకు అర్థము మూడువిధములుగా నుండు నని కావ్యశాస్త్రజ్ఞుల మతము. 1. రూఢి 2. యోగము 3. యోగరూఢి. ఈ మూడును అభిధాశక్తియందే అంతర్భవించును. ఇవికాక లక్షణ, వ్యంజన అని మరిరెండు వ్యాపారములవలన కూడ అర్థము వ్యవహరించును. అభిధావృత్తి వాచ్యార్థమును, లక్షణావృత్తి లక్ష్యార్థమును, వ్యంజనావృత్తి వ్యంగ్యార్థమును వెలువరించును. 'శక్తిశక్తి మద్భావము' వలననే శబ్దార్థములు ఒకే ఆత్మతత్త్వములోని రెండు అభిన్నాంశములుగా పరిగణింపబడుచున్నవి. వాక్యపదీయమునందు భర్తృహరి 'ఏకస్యైవాత్మనో భేదౌ శబ్దార్థావపృథక్ స్థితౌ' అని యనెను.

వృద్ధవ్యవహారము, ప్రసిద్ధార్థపదసాన్నిధ్యము, ఆప్తోపదేశము - మున్నగునవి అర్థగ్రహణమునకు సాధనములై పనిచేయును. మాటలాడుటలో వక్త సౌలభ్యము నపేక్షించునట్లే వినుటలో శ్రోతయు లాఘవము నపేక్షించును. ఈ లాఘవాకాంక్ష శాబ్దికవిపరిణామము నందువలెనే ఆర్థికవిపరిణామమునందును అధికముగా పనిచేయును. ఒక శబ్దమును విని, దానిని తప్పుగా నర్థము చేసికొనుట సంభవింపవచ్చును. ఒకొక్కప్పుడు అనవధానతవలన సామ్యముగల మరే పదముయొక్క అర్థమునో దీనికి పట్టించుట జరుగవచ్చును. అటుకాక అవసరమునుబట్టి ఒక పదమును విస్తృతార్థములోనో, సంకుచితార్థములోనో ఉపయోగించుటయు జరుగుచుండును. ఈ విధముగా భిన్నభిన్నములగు కార

ణాములు అర్థములలో భిన్నభిన్నము లయిన మార్పులను గొని తెచ్చును. వానిలో కొన్నింటిని ప్రయోగవైరళ్యమునుబట్టి పరిహరించినను, కొన్నింటిని ప్రామాణికములుగా అంగీకరింపక తప్పదు. భాషాశాస్త్రజ్ఞులు ఈ మార్పులను ఐదు విధములుగా నిరూపించిరి.

## అర్థములలో మార్పులు

సంకోచము : సామాన్యార్థమును బోధించు శబ్దము క్రమముగా సంకుచితత్వము నొంది కేవలవిశేషమునే బోధించుట అప్పుడప్పుడు కనిపించును. 'చీర' యను శబ్దమునకు 'వస్త్రము' అని మాత్రమే అర్థము ప్రారంభకాలమున నున్నది. 'సీతారాము లిద్దరును నారచీరలు ధరించిరి.' అనునపుడు 'చీర' సామాన్యవాచకము. నేటికాలమున స్త్రీలు ఉపయోగించు వస్త్రమునకు మాత్రమే 'చీర' యను వ్యవహారము గలదు.

'వ్యవసాయము' అని యనగా 'పని' యని మాత్రమే యర్థము. 'పాపవ్యవసాయమునందు బుద్ధి వదలక నిలిపెన్' అను ప్రయోగము నందు 'పాపకృత్యము' అను నర్థమే సంగతమగును. అయినను ఈనాడు ఈ పదము 'సేద్యము' అను నర్థమును బోధించుచు సంకోచము నొందినది. దీనితో సమానార్థకమయిన 'కృషి' యను పదముకూడ ఇట్టి సంకుచితత్వమునకు కొంతగా లోనైనది. 'శ్రమపడుట' అను అర్థము గల ఈ మాట నేటికి 'వ్యవసాయము'గా మారినది. 'కృషిచేయువాడు' 'కృషికు'డై, గుణమునొంది 'కర్షకుడు'కూడనయ్యెను. 'ప్రయత్నము' అను నర్థము గల 'ఉద్యోగము' అను పదము ఆంగ్లములోని 'Job' అను పదముతో సమానమైనది. ఉద్యోగ పర్వమునాటి 'ఉద్యోగము' నేటి వ్యవహారమున పొరపాటున కైనను కనిపించుట లేదు.

'ధర్మము' అనుపద మొకటి ఉచ్చకోటికి చెందినది. 'ధరతి విశ్వం ధర్మః' అనియు 'ధరతి లోకానితి ధర్మః' అనియు 'ధ్రియతే వా జనైః' అనియు నిది నిర్వచింపబడినది. పుణ్యము, యముడు, నీతి, స్వభావము, ఆచారము, సోమయాజి అను నర్థము లీ పదమునకు గలవు.

ఈనాడు 'ధర్మము' చేయుట యనుమాట 'బిచ్చముపెట్టుట' యను నర్థమునకు కొన్నిచోట్ల దిగజారినది. 'పుణ్యము' అను పదము కూడ ఈ విధమగు మార్పును పొందినట్లు కనిపించును.

ఈ విధ మగు మార్పును ఆంగ్లమున Restriction అని యందురు.

**వ్యాకోచము :** వ్యుత్పత్తినిబట్టి యొక యర్థమున నేర్పడిన పదము విస్తృతముగా నుపయోగింపబడుట కూడ కలదు. 'తైలము' అను పదమునకు 'తిలలనుండి తీయబడినది' అని యర్థము. కావున కేవలము నువ్వులనూనెకు మాత్రమే యిది వాచకము కావలయును. కాని మందారతైలము, భృంగామలకతైలము, మాషతైలము మున్నగు వానియందు 'తైలము' విశేషార్థబోధకత్వమును గోల్పోయినది. ఇట్లే తెలుగునందలి 'నెయ్' అను పదము స్నిగ్ధతాబోధకము. కావున 'ఆవు నెయ్యి' మున్నగుచోట్ల ఆ వైశిష్ట్యమును నిలబెట్టుకొని యున్న దన వచ్చును. కాని 'నువ్వుల నేయి' యను నర్థమున 'నూనె' అని యైనది. కాని, యిది మరల వ్యాప్తినిపొంది నువ్వుల నూనె, ఆవిసె నూనె, వేరుసెనగ నూనె, కొబ్బరి నూనె మున్నగువిధముగా నైనది. 'నూనె' యనునప్పుడు 'సారభూత మగు స్నిగ్ధపదార్థము' అను నర్థము మాత్రమే మిగిలియున్నది.

'భావము' అనగా 'భావింపజేయునది' అని యర్థము. 'భావయతీతి భావః' అన్నట్లే 'భావ్యతే అనేన ఇతి భావః' అనికూడ వ్యుత్పత్తిని చెప్పుదురు. దుఃఖము, సంతోషము మున్నగువానిని భావము లని యందురు. ఇట్టి భావములకు ఆశ్రయమైనది మనస్సు. కాబట్టి 'భావము' అనునటువంటి కార్యమునకు కారణమైన 'మనస్సు' కూడ భావవాచ్య మైనది.

'దీపపు సెమ్మె' యనుమాట తెలుగున వాడుకయందు గలదు. దీనికి దీపము పెట్టుకొను స్తంభము అని యర్థము. పారశీకమునందు 'శమా' అనగా దీపమని యర్థము. అదియే తెలుగున 'సెమ్మె' అని

మారినది. అచ్చట ఆధేయమునకు వాచక మైనది యిచ్చట ఆధార వాచక మైనది.

'మాఘము చదువుచుంటిని' 'భారవి పూర్తి చేసితిని' మున్నగు వాక్యములందు 'మాఘము' మాఘకవి రచనమైన శిశుపాలవధను నిర్దేశించును. 'భారవి' యనునప్పుడు కేవలము కవిని గాక కవికార్య మైన కిరాతార్జునీయకావ్యమును నిర్దేశించును. ఇట్టి యన్వయమును ఆంగ్లేయులు అలంకారముగా పరిగణించి Metonymy అని పిలుతురు. ఇచ్చటకూడ వ్యాప్తియే కనిపించును.

'స్వయంపాకము' అనగా స్వయముగా వండుకొనుట యని యర్థము. కాని వండుకొనుటకు కావలసిన పదార్థములకు స్వయంపాకము అను వ్యవహారము కలదు. ఇక్కడ క్రియాబోధక మగు పదము తత్క్రియోప యోగిపదార్థములకు బోధకమైనది. ఇంతే కాక, దైనందినవ్యవహార ములో ఈ మాటకు చెడ్డ యర్థముకూడ కలిగినది. 'కుతంత్రము పన్ను వాడు' అను నర్థమున 'స్వయంపాకస్వామి' అని యుపయోగించుట కలదు. ఆంగ్లమున Expansion అని యందురు.

గ్రామ్యత్వము : తొలుత మంచి యర్థములో నుండి క్రమ ముగా అంతకంటె తక్కువ స్థితికి దిగజారిన పదములు ప్రతిభాషలో నుండును. తెలుగున 'కంపు' అను పదము అటువంటిది. ప్రారంభ కాల ములో వ్యాపించుట అను స్వభావమును బట్టి సౌగంధ్యమునకు వాచక మైనది. కాని క్రమముగా దుర్గంధమునందు రూఢిని సంపాదించుకొన్నది. ఈనాడు 'వాసన' యను పదముకూడ ఈ స్థితిలో నున్నది. సువాసన అని వాడినప్పుడే పరిమళము అను స్ఫురణము కలుగుచున్నది. అటుగాక 'వాసన' యని వాడునెడల దుర్గంధము అనునదే యెక్కువ వ్యాప్తిలో నున్న యర్థము.

'సంభావన' యనగా 'గౌరవము' అని యర్థము. గౌరవపూర్వ కముగా ఇచ్చిన ద్రవ్యమునకు సంభావన వాచక మైనది. నేటికాలమున సంభావన యిచ్చుచోట్ల గౌరవ మదృశ్యమైనది. 'సంభావన బ్రాహ్మ

ణుడు' అనగా 'బ్రతుకు తెరువు లేనివాడు' అనియే యర్థము స్ఫురించును. 'ఛాందసుడు' అని యనగా వేదవిద్య తెలిసినవాడని యర్థము. ఈ నాడు 'మూర్ఖుడు' అను నర్థముతో వాడుకలో నున్నది. ఇట్లే 'లౌక్యుడు' అను పదమునకు లోకజ్ఞానము కలవాడు అని మాత్రమే యర్థమైనను 'వంచకుడు' అను నర్థముకూడ సరిసమానముగా వాడుక నొందియున్నది.

'శుశ్రూష' అనగా వినవలయు నను కోరిక యని యర్థము. పూర్వము విద్యార్థులు శుశ్రూషతో గురువులను చేరెడివారు; గురుకుల సంప్రదాయానుసారము పరిచర్య చేసెడివారు. కావున అనుచితసంసర్గము (Wrong Association) వలన శుశ్రూష యనగా పరిచర్య యను నర్థ మేర్పడినది. ఈ విధ మగు మార్పును ఆంగ్ల మున Degradation అని యందురు.

సౌమ్యత్వము : ఉత్తమమగు శబ్దము నుపయోగించి నాగరకులు అర్థమునందలి తక్కువదనమును తగ్గింపజూచుట సహజలక్షణము. ఒక విధమగు సౌకుమార్యము నాగరకుల చేతలందును, భాషయందును కనిపించును. 'చచ్చెను' అని చెప్పుటకు బదులుగా పరమపదించెను, పంచత్వము నొందెను, స్వర్గము నలంకరించెను, శివైక్యము నొందెను - మున్నగువిధముగా పలుకుట సౌమ్యత్వము. 'బియ్యము అయిపోయినవి' అని చెప్పుటకు బదులుగా 'నిండుకొన్నవి' అనియు 'దీపము ఆరిపోయినది' అనుటకు బదులుగా 'కొండయెక్కినది' అనియు 'నల్లపూసలు తెగిపోయినవి' అనుటకు బదులుగా 'పెరిగినవి' అనియు పలికి, అమంగళ నిరాసము గావించుట ఆచారము. ఎక్కడకైనను వెళ్ళునపుడు 'వత్తును' అని కాని 'వెళ్ళి వత్తును' అనికాని అనుట ఈ విధమగు మనస్తత్త్వమునే నిరూపించును.

'పాకీవాడు' అను పదము తెలుగున విచిత్రమైనది. 'పాక్' అనగా ఉర్దూభాషలో 'పవిత్రమైన' అని యర్థము. దానిపైని తచ్ఛబము చేరి 'పవిత్రమైనవాడు' అనికాని 'పవిత్రము చేయువాడు' అనికాని

యర్థ మగునట్లు 'పాకీవాడు' అను పద మేర్పడినది. హిందీలో కూడ ఈ విధ మగు చరిత్రయే యిచట కనిపించును. 'పాకీవాడు' అనుటకు 'మహితర' అను పదము కలదు. ఇది 'మహత్తర' శబ్దభవము. దీనికి చాల గొప్ప వా డని యర్థము. వృత్తిలోని నైచ్యమును ఇట్టి సౌమ్యాత్వము తగ్గించునని యూహ యేమో?

'దేవతలకు ఇష్టుడు' అను నర్థముగల 'దేవానాం ప్రియ' యను శబ్దము 'వట్టి మూర్ఖుడు' అను నర్థమును బోధించును. పైకి చూచి నప్పుడు గొప్పగా కనిపించుచు, విపరీతార్థము నిచ్చు ఈ పదములుకూడ సౌమ్యార్థమునకే సాక్ష్యములు. 'అగస్త్యభ్రాత' యనునప్పుడు 'అగస్త్యుడు' మహాతపస్వి కావున అతని సోదరుడు నంతటివాడే యైయుండు ననిపించును, కాని'అగస్త్యభ్రాత' యనగా 'మూర్ఖుడు' అని యర్థము. ఇట్లే 'మహాబ్రాహ్మణుడు, బ్రాహ్మణబ్రువుడు, బ్రహ్మబంధువు' మున్నగుపదములు సంస్కృతనాటకములలోని విదూషకుల పరము గావింపబడియుండును. వీనికి జాతిచేత బ్రాహ్మణుడైనను, వర్తనముచేత ఆ యర్హత లేనివాడే లక్ష్యము. ఈ విధమగు సౌమ్యత్వమును ఆంగ్లమున **Euphemism** అని యందురు.

**సంకేతము :** కొందరు కొన్నిసంకేతములను కల్పించుకొని మాటాడుకొనుచుందురు. ఇట్టి సంకేతములు వృత్తులనుబట్టి, కులములనుబట్టి కూడ ఏర్పడుచుండును. ఒకగుంపు జనము మాటాడు సాంకేతికములు రెండవగుంపువారికి పూర్తిగా ముసుగుమాటలుగా నుండును. వైదికుల పరిభాషలో 'యత్పుణ్యాం' అని యనగా 'పావులా' అని యర్థము. 'ఇంద్రాణి' అని యనగా 'వితంతువు' అని యర్థము. తగవుల మారి స్వభావము గలవారికి 'చండిక' యని, విశ్వామిత్రుడని, దుర్వాసోమహర్షి అనిపేరు పెట్టుట కలదు. తగవులు పెట్టుస్వభావము గల వారికి 'నారదుడు' అనిపేరు పెట్టుచుందురు. స్వాతంత్ర్యమునకు పూర్వము రక్షకభటులకు ఎఱ్ఱటి టోపీలు ఉండెడివి. వానినిబట్టి వారికి 'ఎఱ్ఱఅగ్గిపుల్లలు' అను పే రుండెడిది. చండశాసనుడైన అధికారికి

'యముడు' అని, మంచివానికి 'ధర్మరాజు' అనిపేరు పెట్టుట కలదు. కొన్నియెడల తద్విపరీతముగా కూడ వాడుట కనిపింపవచ్చును. 'హరి శ్చంద్రుడు' అని అబద్ధములు చెప్పువానిని పిలుచుటయు కలదు. అట్లే బుద్ధిమంతుడు, తెలివైనవాడు మున్నగునవి తద్విపరీతులనుగూర్చి యుప యోగించుటయు కనిపించును.

గంగిగోవు, లేడిపిల్ల, తాబేలు మున్నగునవి స్వభావమును, చురుకుదనమును, నడకను బట్టి పెట్టబడి పేళ్ళు. ఎఱ్ఱతేలు, పచ్చిమిరప కాయ, సీమటపాకాయ మున్నగునవి లోపలి చురుకుదనమును గమనించి పెట్టబడి పేళ్ళు. వీనియందు రూపకల్పనమో, సాదృశ్యసంధానమో యేదో యొకటి యుండును.

ఇవికాక వెఱ్ఱినీళ్ళు, తెల్లనీళ్ళు మున్నగుమాటలు 'మద్యము' అను నర్థమున వాడుదురు. వెలిచవి, పై తిరుగుడు మున్నగుమాటలు వ్యభిచారసూచకములు.

ఈవిధముగా మానవుడు తన కందుబాటులో నున్నంత వరకు మాటలను మలుచుకొని యుపయోగించుకొనుచుండును. అర్థగ్రహ ణమునందలి అసమర్థతయే కాక, భంగ్యంతరమున వాడుటలోని ఆకర్ష ణయు ఆసక్తియు కూడ ఈ మార్పులకు కారణములు. మానవుని మనస్తత్వములోని వైశిష్ట్యమే భాషయందలి శాబ్దికార్థికవిపరిణామము లకు ప్రధానమైన కారణమని భావింపవచ్చును. ఇతరములగు కారణ ములు దీనికి సహకారులై పనిచేయును. అర్థములందు గలుగు మార్పు లను దెలుపు భాగమును శాస్త్రజ్ఞులు semantics అని పిలుతురు. వేర్వేరు పదముల యర్థములను, అవి పొందిన మార్పులను, వాని కార ణములను పరిశీలించుట ప్రత్యేక మొకగ్రంథము కాదగినంత విషయము.

# చారిత్రక ప్రకరణము

ఇంతవరకు భాషల యుత్పత్తిని, ప్రపంచ భాషాకుటుంబములను, ద్రావిడ భాషాకుటుంబమును స్థూలముగా పరిశీలించితిమి. ఇతర ద్రావిడ భాషలవైశిష్ట్యమును, సాహిత్యస్వరూపమునుగూడ నిరూపించితిమి. ద్రావిడభాషలలో తెనుగునకు గల స్థానమును, పొరుగుభాషలతోడి పోలికలను భేదములను గమనించితిమి. చారిత్రకమైన సంబంధముతో పాటు భాషానిర్మాణాత్మకమైన సంబంధమునుకూడ సమీక్షించి యేక కుటుంబత్వమును స్థిరీకరించితిమి. ఒకభాషనుండి యొకభాషకు మారు నప్పుడు ధ్వనులలో, అర్థములలో కలుగు మార్పులను గుర్తించితిమి. వానికి కారణమునుగూడ పరిశోధించితిమి.

ఇకముందు తెలుగుభాషను చారిత్రకముగా సమీక్షించుట యవసరము. శాసనకాలమునుండి యేయే కాలములం దేయే మార్పు లకు లోనయ్యెనో, ఏయే ప్రభావముల నంగీకరించెనో, ఏవిధమగు పరి ణామము నొందుట కవకాశము లున్నవో యూహించి, ఒక నిశ్చ యమును కలిగించుకొనినగాని చరిత్రాన్వేషణము సఫలముకాదు.

ఇప్పటికి దరిదాపు రెండువేల సంవత్సరముల వయస్సు కలిగిన తెలుగుభాషను చారిత్రకదృష్టితో సమీక్షించుట యన్న సులభ సాధ్యముకాదు. కావున సౌకర్యాపేక్షతో ఐదుయుగములుగావిభజించి, పరిశీలించుట యపేక్షితము. ప్రారంభకాలమునుండి నన్నయభట్టారకుని భారతరచన ప్రారంభమువరకు నున్నది మొదటియుగము. రెండవది నన్నయ యుగము. నన్నయ తరువాత రాయల పరిపాలనాంతమువరకు నున్నది మూడవయుగము. నాలుగవది దక్షిణాంధ్రయుగము. ఐదవది ఆధునిక యుగము.

మొదటి యుగమును ప్రాఙ్నన్నయ యుగమని పిలువవచ్చును. ఆనాటి శాసనములే ఆనాటి భాషాస్వరూపమును నిరూపించుటకు పరమ






ప్రమాణములు కావున ఆ భాషను శాసనభాష యని పిలువవచ్చును. రెండవయుగమున నన్నయభట్టారకుడు భారతమునందు ప్రతిష్ఠితము చేసిన భాష యొక్కటియే సమీక్షా విషయము. కావున దానిని నన్నయభాష యని పిలువవచ్చును. మూడవ యుగమునందు పురాణములును, ప్రబంధములును భాషా స్వరూపనిర్ణయమున కాధారములు. కావున ఆనాటిభాషకు పురాణప్రబంధభాష యని నామకరణము గావింపవచ్చును. దక్షిణాంధ్ర యుగమునందు ప్రబంధముల రచన సాగుచునే యున్నది; ద్విపదకావ్యములు పుట్టినవి: యక్షగానములు సమ్మానపాత్రములైనవి. ప్రాచుర్యమునుబట్టి ఆనాటిభాషకు యక్షగాన భాషయని పేరుపెట్టవచ్చును. పందొమ్మిదవ, యిరువదవ శతాబ్దము లాధునికయుగమున కాధారశిలలు. ఈ కాలమున సారస్వతము వివిధ ప్రక్రియలను స్వాయత్తము చేసికొన్నది. ఈ యుగమునందలి భాష నాధునికభాష యని యనవచ్చును.

నిజమున కిదియంతయు నొక ప్రత్యేకగ్రంథము కాదగినంత విషయము. ఐనను స్థూలముగా, ఆయాయంశములతో పరిచయము గావించుకొనుటకు యత్నము చేయుదము.

### శాసన భాష

నన్నయభారతమునకు పూర్వమున్న తెలుగుభాషా స్థితిని గుర్తించుటకు శాసనములే ప్రమాణము. ఈ శాసనములు ప్రారంభకాలమునందు ప్రాకృత సంస్కృత భాషలలోనే యున్నవి. వీనియందు గ్రామనామములును, వ్యక్తులు పేళ్లును తెనుగులో కనిపించుచున్నవి. ఏడవ శతాబ్దినాటికి పూర్తిగా తెలుగుభాషనే వాడిన శాసనములు లభించుచున్నవి. వీని నన్నిటినిబట్టి యానాటి యాంధ్రభాషాలక్షణములను ఒకవిధముగా గుర్తింపనగును.

ఈ కాలమునందలి వాక్యరచనము సరళముగా కనిపించును. సంబంధార్థకముల ప్రయోగము లేకుండ రెండువాక్యముల నొకదాని వెంట నొకటి వాడుటచేత ఆ రెండింటికి నొక యనుగతి కలుగును.

'స్తితిచెఱింంచినవాణ్డు భారనాసిఱచినవాణ్డు' అను వాక్యము గలదు. ఇందు 'స్థితి చెరిచినవాడు' అనునది మొదటి వాక్యము. 'వారణాసి వచ్చినవాడు' అనునది రెండవ వాక్యము. ఈ రెండింటిని ఒకదాని వెంట నొకటి వాడుటవలన 'ఎవడు స్థితి చెఱుచునో వాడు వారణాసిలో చంపినవానితో సమానము' అను నర్థము వచ్చుచున్నది. ఇది యొక విశేషము. ఈ రెండు వాక్యములందును నిజమునకు సమాపకక్రియా రూపములు లేవు. కేవలము క్రియాజన్యవిశేషణములతోనే వాక్యమును పరిసమాప్తి పొందించుట యను లక్షణము కనిపించుచున్నది. 'చెఱిచిన వాడు' 'వచ్చినవాడు' అను రెండును భూతార్థకములే కావలసియుండగా భవిష్యదర్థమున వాడబడినవి. కొన్ని ధాతువుల తద్ధర్మార్థక రూపములు భావార్థమునందును వాక్యసమాపనమునందును కనిపించును. పదముల పరస్పరాన్వయమును సాధించుటకు వాక్యనిర్మాణమున క్లిష్టప్రణాళికను అవలంబించుట యిందు కనిపింపదు. 'కి, కు, ను, న' మున్నగు ఏకాక్షర ప్రయోగముననే సంబంధము స్థాపిత మగును. కొన్నియెడల 'ఉండు' 'అగు' మున్నగు క్రియాపదము లధ్యాహృతములగును. సమాపకక్రియ లేకుండగనే వాక్యమును ముగించుట వంటిదే యిదియును. క్త్వార్థకము లును, అన్నంతములును, కర్మార్థకములునుకూడ శాసనభాషలో కని పించును. వ్యతిరేకక్త్వార్థకములుకూడ ప్రయుక్తములై యున్నవి.

శాసనభాషలో 'ఱ' యను నక్షరము విరివిగా కనిపించును. చోఱనిం జేకొని; భారనాసి ఱచినవాణ్డు మున్నగు ప్రయోగములందు గలదు. తత్స్థానమున 'డరల' అను వర్ణము లీకాలమున సాధారణముగా నుపయోగింపఁదగి యుండును.

శకటరేఫము భిన్నాక్షరసంయోగము నొంది కనిపించుచున్నది. ॥వాన్టు; ఱోగొణ్ణవన్టు॥ ఈనాటి భాషలో 'నల' లుండుచోట శాసనము లందు 'ణళ'లు కనిపించుచున్నవి. ॥ఆణతి; వేణ్డికొణి॥ సంస్కృతము నందలి ణకారమునకు నకారము కనిపించు తావులు గూడ కలవు॥ భారనాసి; నివ్వాణ వానంబు॥ సంవత్సరమ్బుళ్; కళరేని మున్నగుచోట్ల

లకారస్థానమున ళ కారము గలదు. పూర్ణబిందుస్థానము న వర్ణానునాసి కాక్షరమును వాడు పద్ధతి యొకటి విరివిగా గలదు. ప్రథమావిభక్తి ప్రత్యయముగా 'ము, బు, వు'అను నక్షరములు కనిపించును. వలపలగిలక వ్రాయుట విరివిగా కలదు; తత్పూర్వము ద్విత్వమునే కూడ వ్రాయు దురు॥ నివ్వఱ్ఱానంబు॥ ఇక దీర్ఘములకు హ్రస్వములును హ్రస్వములకు దీర్ఘములును అనియతముగా కనిపించును. దీనిని నాటి భాషాలక్షణముగా కాక శాసనశిల్పుల లోపముగా గ్రహించుట సముచితము. పై లక్షణ ములనుబట్టి చూడగా శాసనములందలి తెలుగు పదములకును తమిళ కన్నడపదములకును ఎక్కువ సాదృశ్యము కనిపించును.

క్రీ. శ. 848 వ సంవత్సరమునాటి యొక శాసనమును దీసికొని ఆయా లక్షణములను గమనింతము.

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
బలగర్వఱ్ఱం బొప్పంగ బైలేచి సేన
పట్టంబు గటిఇచ్చి ప్రభు బండరంగు
బఇచ్చిన సమత్త పడువతో బోయ
కొట్టంబు ల్వణ్డెణ్డు గొణి వేంగినాణ్టిం
గొళల్చి యాత్రిభువనాంకుశబణ నిల్పి
కట్టెపు దుర్గఱ్ఱంబు గడు బయల్సేసి
కణ్డుకూర్బెజవాడ గావిఞ్చె మెచ్చి

పణ్డరంగు పరమమహేశ్వరుణ్డు ఆదిత్యభట్టారనికి ఇచ్చిన భూమి యెనుబొదివుడ్ల అడ్లపట్టు నేల దమ్మపురంబున దమ్ము౯వులు వీని రక్షిఇచ్చిన వారికి అస్వమేదంబునఫలంబు అగు".

ఇందు మహత్పులింగంబునకు డుజ్వర్ణకము వచ్చిన రూపముతో పాటు రాని రూపముకూడ ప్రయుక్తమైనది. 'పణ్డరంగు' రెండు చోటు లందును డుజ్వరహితముగానే యున్నది. 'పరమమహేశ్వరుణ్డు' అను నప్పుడు డుజ్వర్ణకమున్నది. 'ఆదిత్యభట్టారనికి' అన్నప్పుడు అత్వమున

కుత్వము కలిగి 'భట్టారునికి' అని కావలసియుండగా అట్లు కాలేదు. ఇది ఒక అవ్యవస్థను చూపుచున్నది.

గసడదవాదేశము నిత్యమైనట్లు కనిపించును. పట్టంబుగట్టిన - పట్టంబుగటిఇచ్చి - కొట్టంబుల్వాణ్ణెణ్డు గొణి - దుగ్గఱంబు గడు - బెజవాడ గావిఇచ్చి మున్నగుచోట్ల గసడదవాదేశము కలదు. ఇట్టిది యీనాడును గలుగవచ్చును. 'ప్రభు - పండరంగు' అను పదములు రెండును సాంస్కృతికములు. ఇట్టియెడ గసడదవాదేశము కలుగరాదు. అయినను శాసనమున నాదాక్షరము కలదు. మొదట సర్వత్ర గసడదవాదేశము పాటింపబడి అనంతరకాలమున సాంస్కృతికములకు విడువబడి యుండు ననుట కిది తార్కాణము.

పూర్ణానుస్వారముతోపాటుగా వర్గ పంచమాక్షరము పెక్కు-చోట్ల కనిపించుచున్నది॥ ఏణ్డు; గటిఇచ్చి; పఇచ్చన॥ కొన్నియెడల అర్ధానుస్వారమే యుండవలసి యుండగా వ్రాతయందు పూర్ణానుస్వారము కనిపించుచున్నది. 'వేంగినాణ్టిం' అనుచోట 'వేంగినాణ్టి' అనియే చదువవలయును; కానియెడల ఛందోభంగ మగును. పూర్ణానుస్వార ముచ్చారణమునందు శిథిల మైపోయిన చోటులందుకూడ లేఖనమున నిండుసున్న నిల్పుటయే యప్పటి కింకను అలవాటుగా నిండియుండునని దీనినిబట్టి తెలియుచున్నది.

బలగవ్వఱం బొప్పంగ, త్రిభువనాంకుశబణ - అను వానియందు 'ము' వర్ణస్థానమున 'ంబు' అనియు 'బ' అనియు కనిపించుచున్నవి. రెండవది 'బు' యని యుండెనేమో! ప్రారంభమున 'ంబు, బు, వు' అను రూపములతో నుండిన ప్రత్యయమే మువర్ణకముగా తరువాతికాలమున పరిణతి నొందినది. అరవకన్నడములందు 'బు వు'లతోడనే ప్రథమావిభక్తిరూపములు కనుపట్టును.

'ప్రథమంబునేణ్డు' అనుచోట విశేషణవిశేష్యములకు నడుమ 'అగు' అనునది తరువాతికాలమున వచ్చి యుండును. అట్టిది లేకుండ వాడుట ప్రాచీనపరిపాటి.

ఱ్రావడి యుండవలసినచోట శకటరేఫమును వాడుటకూడ ఇందు గలదు॥ పట్టణ్డు॥ రేఫమునకు పరమందున్న యక్షరమును ద్విత్వముగా పలుకుట, రేఫమునకు బదులు వలపలగిలక వాడుట కూడ ఇందు చూపట్టును॥ బలగవ్వఁర్ణంబు; దుగ్గఁర్ణంబు॥ సంబంధార్థమున నవర్ణకము వచ్చుట యొక్కటి 'అశ్వమేధంబునఫలంబు' అనుచోట కనిపించును.

ఈపైని చెప్పిన లక్షణము లన్నియు సర్వశాసనసామాన్యములై యున్నవి. కావున లేఖకప్రమాదములుగా పరిగణించి నిరసించుటకు వలను పడదు. కొన్ని ప్రమాదములును లేకపోవు. అయినను ప్రాయికములైన వానినిబట్టి లక్షణము నంగీకరించుట యుచితము.

నన్నయ భాష

తెలుగుభాష సాహిత్యరూపము నొంది సౌష్ఠవమును స్థైర్యమును నన్నయభట్టారకుని కాలమున సంపాదించుకొన్నది. అంతవరకు ఒక మాదిరిగా పెరుగుచుండిన తెలుగుభాషను గ్రహించి సముజ్జ్వలమగు స్థితిని గల్పించిన శ్రేయస్సు నన్నయభట్టారకులది. నన్నయభాషలోని విశేషములను గమనింతము.

నన్నయ మహాగ్రంథరచన కుద్యుక్తు డగుటవలన సంస్కృతపద ముల నధికముగా స్వీకరింపవలసివచ్చిన దనుట సర్వవిదితము. అయినను, అది తాను సొంతముగా చేసినది కాదు. తెనుగుభాష ఆనాటికి కటు వంటి పరిణామమును పొందుచున్న సంగతి శాసనములను పరిశీలించిన స్పష్టముగా తెలియును. క్రీ. శ. 898వ సంవత్సరమునాటి శాసన మిది -

'స్వస్తి నృపాంకుశాత్యన్తవత్సల సత్యత్రినేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లు డనవద్యవిఖ్యాతకీర్తిఁ
ప్రస్తుతరాజాశ్రయుణ్డు త్రిభువనాభరనుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజసల్కిభూవల్లభుణ్డు త్తిఁన్.'

ఈ పద్యమునందు ఒక్క ప్రథమావిభక్తిప్రత్యయము తప్ప ఇంక తెలుగుమాటయే కానరాదు. దీనితో నన్నపార్యుని పద్యమును బోల్చి చూచినయెడల ఆయన ప్రతిష్ఠించిన శైలీసౌందర్య మవగతము కాగలదు.

'రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్'

ఈ పద్యమునందుకూడ విభక్తిప్రత్యయము మాత్రమే తెలుగు; తక్కిన దంతయు సంస్కృతమే. వర్ణక్రమమునందు మార్పు స్పష్టగోచర మగు చున్నది. పూర్ణానుస్వారార్ధానుస్వారముల సముచితప్రయోగము ప్రారంభమైనది. తెనుగును సంస్కృతమును గలుపుటలో ఒక చక్కని సౌకుమార్యము కనిపించును; అప్పటికే సాహిత్యగౌరవమును సము పార్జించుకొన్న కన్నడభాషతోడి చెలిమివలన ఆ సౌకుమార్యము తెలుగునకు చేకూరి యుండవచ్చును. శాసనములందు ఆ విధమగు మార్దవము అప్పటికే కలుగసాగినది.

శాసనములందు క్వాచిత్కముగ మాత్రమే సమాపకక్రియ కని పించును. విశేషణవిశేష్యములతోనే వాక్యము పూర్తియగుట యందలి లక్షణముగా కనిపించును. నన్నయ భారతమున నట్టి ప్రయోగములు పెక్కులు గలవు. సమాపకక్రియాసహితములుకూడ అధికసంఖ్యలోనే ఆదరింపబడినవి. "అట్టి కన్యకఁ గానఁ డన్యో మర్త్యమున" అనునపుడు 'కానఁడు' అని యన్నను నదియే యర్థము. ఐనను 'అగు' ధాతువు నుప యోగించి ఒక విశేషమును సాధించుట కవి యభిమతము కావలయును. ఇట్లే 'పొరయర్రైరి; చేయర్రైరి; నాటవయ్యె' మున్నగు రూపములు కన్పట్టును. ఇంతే కాక వెలయు, పొలుచు, అమరు, పరగు, ఒనరు మున్నగునవి సమాపకక్రియలుగా వాడబడెను. ఇట్టి వానిని లోపింప జేసినను గ్రహణమున క్లేశము కలుగదు. ఐనను సమాపకక్రియాప్రయో గము ప్రతిష్ఠను పొందసాగినది. శాసనభాషలో భూత తద్ధర్మార్థకముల యుపయోగము ఈవరకే చూచితిమి.

శాసనభాషలో "వైదుమ్బుళచేత పట్టమ్ కట్టబడియె, వారిచేత పట్టం కట్టబడినవాన్డు" అనియు కర్మార్థకప్రయోగములు రెండు

మాత్రమే కనిపించినట్లు శ్రీగంటి జోగిసోమయాజిగారు గుర్తించిరి. కర్మార్థక ప్రయోగము ద్రావిడభాషలలో చాల తక్కువగా వినిపించును. నన్నయభాషయందుకూడ ఇట్టి ప్రయోగములు మొత్తము 59 మాత్రమే కలవని శ్రీసోమయాజిగారు పరిగణించిరి. సంస్కృతభాషయందు కర్మార్థక ప్రయోగము విరివిగా కలదు. అట్టియెడల అనువాద సమయమున ఆ విధానము సందుచేసికొనుటకు తప్పక యత్నించును. అంతేకాక ఛందోరచనమున నొకొక్కప్పుడు కర్మార్థకము సౌకర్యకారణ మగును. ఐనప్పటికిని నన్నయ దానిని చాలవరకు పరిహరించె ననియే చెప్ప వలయును. వెగడుపడు, వెలువడు, ఒడంబడు, ఎఱుకపడు, ఏర్పడు, ఏటువడు మున్నగుచోట్ల పడుశబ్దముపయుక్తమైనది. అయినను ఇది కర్మార్థమును గాక కర్త్రర్థమునే బోధించుచున్నది. ధాతువుపై ధాతువుచేరి విలక్షణార్థకమై శబ్దపల్లవ మగును. ఇక్కడ కూడ ధాత్వర్థమునకు వైలక్షణ్యమును సంపాదించుటకే 'పడు' ధాతువును అను ప్రయుక్తము గావించుట జరిగినది. నిజముగా కర్మార్థక ప్రయోగము చేయవలసి వచ్చినపుడుకూడ నన్నయ సంస్కృతశబ్దమునే ఆశ్రయించి అభిమతార్థమును సాధించుకొన్నట్లు కనిపించును. భూతార్థకమైన క్రియావిశేషణములను "నిహతులు, దక్షిణాశ్రితులు, రాజరక్షితులు" అనునట్లుగా వాడెను. కొన్నియెడల "అనుగమ్యమానుఁడు, అభిరక్ష్యము" మున్నగువిధముగా భవిష్యదర్థకమునే వాడెను. ఇవియే తెలుగున చెప్ప వలసివచ్చినచో 'చంపఁబడినవారు' మున్నగు విధముగా పడుజ్యనుబంధ ముతో చెప్పవలసివచ్చెడిది. కావున అట్టియెడల సంస్కృతశబ్దమే సాధక మయ్యెను. పడుజ్యనుబంధముతోడి కర్మార్థకప్రయోగములు 'భూసురప్రవరుండు పదరునో బోధింపఁబడి - కడవఁబడి మున్ను వహ్నింగడుకొని పడినవియు - భవదగ్నిహోత్రముల్ పోఁడిగ వేల్వఁగాఁబడియె- పడయఁబడినయట్టి యెఱుక' మున్నగువిధముగా కలవు. సంస్కృతాంధ్ర క్రియలు రెంటిపైని 'పడు' చేరి కర్మార్థకమైనది.

య త్తదర్థకశబ్దముల యుపయోగము సంస్కృతమున నెక్కువగా కలదు. తెలుగున 'రక్షించినవారికి' మున్నగు విధముగానే యుండును. గాని 'ఎవరు రక్షింతురో వారికి' అనునట్లుగా ఉండదు. క్రీ.శ. 1006వ సంవత్సరమునాటి యొక శాసనమందు మాత్రము 'వేంగినాణ్టి కెవ్వరు రాజులై రి వారుం భూవ్వర్ణస్థితిం దప్పక పాలించువారు' అని యున్నది. భారతమునందు నన్నయభట్టు సంబంధబోధకసర్వనామములను ఎక్కువ గానే యుపయోగించె ననవచ్చును. సంస్కృతప్రభావముతో పాటు కథాకథనవిధానమున, ప్రశ్నోత్తరసంవిధానమున ఇట్టి ప్రయోగము సౌకర్యకారణ మైయుండును. ముందు ప్రశ్న వేసి, సమాధానము వచ్చు లోగా దానినే యందుకొని చెప్పుచో ఈ విధ మగు ప్రయోగ మగును. 'అభివాంఛిత మెయ్యది దానిఁ జెపుమ చేయుదు ననినన్' అనునెడల రెండువాక్యములు గలవు. 'అభివాంఛిత మెయ్యది' అనునంతవరకు ప్రశ్న. దాని ననుసరించిన దంతయు రెండవ వాక్యము. ఈ రెండింటిని నిర్వ్యవధానముగా ఏకవాక్యమున వాడుటవలన తెలుగుభాషాప్రయోగ మునకు భిన్నమైన ఒక వైచిత్రి లభించినది. 'ఇష్టం బేయది దానిన తెత్తు - ఇద్ధయశోఽర్థ లెందేనిఁబుట్టె రట్టె కౌరవాన్వయంబు-గాలను క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ జన కగ్నియపోలె నేర్చుచుం డును భయరహితా! వాని నెఱుఁగు బ్రాహ్మణకులుగాన్' ఇట్టి ప్రయోగ ములు బహుళముగనే నన్నయచేత ప్రయుక్తము లయ్యెను.

నన్నయ తనభాషలో 'ఱ' వర్ణమును పూర్తిగా పరిత్యజించెను. ప్రథమావిభక్తి ప్రత్యయమైన 'ము' వర్ణమును పూర్ణబిందుపూర్వ కముగాను, మాముడితోనుగూడ వాడెను. తత్సమ శబ్దములకు నియతి కల్పించెను.

విభక్తుల విషయమున క్రియాపదముల విషయమున కూడ నన్నయభట్టారకుడు ఒక మార్గమును ప్రదర్శించి, తరువాతివారలకు మార్గదర్శియయ్యెను. 'నాకుం గరుణింపుండని' మున్నగు చోటులందు ఈ నాడైనచో ద్వితీయ వాడుదురు; తాను షష్ఠి వాడెను. 'నాకు

వరియింపఁబడిన భార్య' అనుచోట షష్ఠికి బదులుగా తృతీయ వాడి 'నాచేత' అని యందురు. తత్సమపదములను వాడుటలో నన్నయ యొక్క మార్గమును వేసెను. ఆంధ్రశబ్దచింతామణిరచనమున కూడ ఈ దృష్టియే ప్రధానముగా సాగినది. 'పండరంగ' మున్నగు శాసనరూప ములు మారి ఉత్వదుజ్ఞులతోడి 'రాముఁడు' మున్నగు రూపములు స్థిరత్వమును బొందినవి.

## పురాణ ప్రబంధభాష

నన్నయ నెలకొల్పిన భాషయే తరువాతి కవులకు పరమప్రమాణ మయ్యెను. నన్నయ ననుసరించి, నన్నయ వ్రాసినట్లుగా వ్రాయుటయే వారికి పరమలక్ష్యమైనది. కావుననే అప్పకవి-

"ఆమూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కసు
ధీమణి మొదలైన తొంటి తెనుఁగుకవీంద్రుల్"

అని చెప్పెను. పెక్కువిషయములలో నన్నయభాషకును, తరువాతివారి భాషకును భేదము లేదనుట యథార్థమే. 'ప్రవాహినీ దేశ్యా' యని యనుటచేత ప్రవాహసదృశమైన భాషయందు మార్పులు కొద్దిగనో, హెచ్చుగనో కలుగక మానవు. పూర్వగ్రంథప్రపంచమునే లక్ష్యముగా నిలుపుకొన్నను, వర్తమాన వ్యావహారికప్రపంచమును వదలిపోవుట సాధ్యము కాదు; కావున దాని ప్రభావము కనబడక తప్పదు; ఇది యొకటి. మఱియొకటి – లక్ష్యమెంత శుద్ధముగా నున్నను, దృష్టి తత్ప రిసరములందు ప్రసరింపకుండుట యెల్లప్పుడును సాధ్యమగునది కాదు. అందువల్ల లక్ష్యమునకు దరిదాపుగా ప్రయోగము లుండుటయు సంభావ నీయమే. ఇంకొకటి – పూర్వప్రయోగములనుబట్టి క్రొత్తవానిని గల్పిం చుట. ఈ హేతువులవలన, నన్నయ తరువాతికవుల భాషలో సైతము కొన్నిమార్పుల కవకాశము కలుగుచున్నది. వానిని స్థూలముగా గుర్తించుకొందము.

నన్నయ తరువాతికాలమున అర్ధానుస్వారమున కుచ్చారణ లోపించి పోయియుండవచ్చును. అందువల్లనే నన్నయకు సమ్మతముకాని సానుస్వార నిరనుస్వారముల ప్రాసమైత్రి యాదరింపబడినది. అట్లే శకటరేఫ సాధురేఫములకు నన్నయకాలమునందున్న యుచ్చారణ భేదము నశించియుండును. అందువల్లనే యతిప్రాసములందు మైత్రి పాటింపబడినది. లాక్షణికులు పూర్వలాక్షణిక శాసనమునుబట్టి అట్టి మైత్రి నంగీకరింపరా దన్న నిశ్చయముతో ఒకేపదమునందు రెండు విధములయిన రేఫముల నంగీకరించుట సాగించిరి. ఇదియు తద్భేదము నశించె ననుటకు తార్కాణమే.

భారతమునందు లేకున్నప్పటికిని, అనంతరకాలమునం దన్యదేశ్యము లనేకముగా వాడుక కెక్కినవి. పెణ్ణాస, మణ్ణాస, పొణ్ణాస, నంబి, నాంచి, తిరునాళ్లు, తిరువారాధన, తిరుమాళిగ, తిరుమజ్జనము, తిరుమణి, సాపాటు, సాదము మున్నగు తమిళపదములు - మాడబేకు, బిజమాడు, మూర్తమాడు, బిడార మున్నగు కన్నడపదములు-భాషలో ప్రవేశించినవి. జగనొబ్బగండ, మూరురాయరగండ, స్వామిద్రోహర గండ మున్నగు బిరుదపదములుకూడ కన్నడమునుండి వచ్చినవే. ఖుసి, సురధాణి, సురత్రాణ (సుల్తాను), సామాన్లు, వజీరు, ఫౌజు, శాహి, శాహు, పాదుశా, ఝూరీ, మసీదు, మస్తు, పరంజీ, బందా, పైద మొదలయిన అరబ్బీ పదములు నాడు కొన్ని కావ్యములందు నెలకొన్నవి. దట్టీ, కుళాయీ, తేజీ, పల్లకీ మున్నగు దీర్ఘాంతశబ్దములు సంఖ్యాబలమును పెంచుకొన్నవి. 'జయజయ' అను సంస్కృత మధ్యమపురుష రూపము అనుకరణ విరహితముగా ప్రయోగము నొందినది. ఇట్లే 'నమశ్శివాయ' మున్నగు వాక్యములును ప్రయుక్తములైనవి. 'జయజయ' యనుటకు 'జేజే' యను వికృతి యేర్పడినది. 'అవధర' యన్నది 'అవధరింపును' అన్న తత్సమక్రియారూపముతో నన్నయభాషయందు కలదు. తరువాతికాలమున 'అవధారు' అన్నరూప మవ్యయప్రాయముగా ఆవిర్భవించినది.

సంబోధ్యవాచకమునకు ముందు ఓ, ఓయి, ఓరి, ఓసి యన్నవి చేరుట తరువాతి కాలమున నేర్పడిన లక్షణమే. ఇట్టిదే స్త్రీవాచకము లకు పిమ్మట కానరో' మున్నగునవి కల్గుట.

సంఖ్యేయ మహద్వాచకములు ఇర్వురు, మువ్వురు మున్నగు విధముగా నన్నయభాషయందున్నవి; తరువాతికాలమున నిట్టి రూపము లతోపాటుగా, వకారస్థానమున గకారమువచ్చిన ఇర్గురు, ముగ్గురు మున్నగురూపములుకూడ ప్రాపునొందినవి. కొన్ని చకారాంత ధాతు వులు యకారాంతములుగా పరిణతినొందుట యీకాలమున నొక విశే షము॥ దాచు-దాయు; కాచు-కాయు; త్రోచు-త్రోయు; పూచు- పూయు॥

నన్నయ భారతమునందు 'అందుల, ఇందుల' అనువిధముగా నున్న రూపములు 'అందలి, ఇందలి' అని మార్పునొందినవి. విశేషణ విశేష్యముల నడిమి 'అగు' రూపము సంఖ్యావాచకవిశేషణములమీాద 'అవ' అని పరిణామము నొందినది. మేనయత్త, మేనయల్లుఁడు అన్న సంధివిరహితరూపములు తరువాతికాలమున వైకల్పికసంధి నంగీకరించి నవి. షష్ఠ్యంతబహువచనరూపములు తరువాతియచ్చుతో వైకల్పిక సంధి నొందుట నన్నయ భాషాలక్షణము - రాజులొద్ద, రాజుల యొద్ద; తమంత, తమయంత॥ తరువాతికవులు నిగాగమముమీాది వానికి నచ్చటచ్చట సంధిచేయుట కనిపించును - మగనాలు, దీనం ధ్రులు, వానన్న॥ హల్లు పరమైనప్పుడు లడాగమమునందలి అత్వము నకు లోపముచేయుట కొలదిగా కలదు - బింబము్రలుచుల్॥ క్త్వార్థక మైన ఇత్తునకు నన్నయ సంధిచేయలేదు. తరువాతికవులు కలిగుండు, ఎఱింగెఱింగి - అను విధముగా కొన్నియెడల సంధిచేసిరి. నన్నయ ప్రథమపురుష ఇత్వసంధి నిత్యముగా చేయగా తరువాతివారు దానిని సడలించిరి.

కర్మధారయమునందుమాత్రమే నన్నయ టుగాగమము వాడగా, తరువాతికవులు తత్పురుషమునందును దానిని వినియోగించిరి. అచ్చు

పరమైనపుడు పుంపులకు టుగాగమము కలుగుట నన్నయపద్ధతి. తరువాతి వారు కొందరు టుగ్విరహితముగా ఉత్వసంధిని మాత్రమే చేసి సంతృప్తి చెందిరి – పట్టపేనుఁగు, ఆముఁదపాకు॥ అనంతరకవుల రచనలందు ఈదంత స్త్రీసమములకును గొన్నింటికి టుక్కు వికల్పముగా నైనది – వాలు టమ్ము, వాలమ్ము; చిగురుటాకు, చిగురాకు॥ ప్రాతాదులందు పూర్వ పదశబ్దములు నన్నయభాషలో ఆచ్ఛికములై యుండును. తరువాతివారు లేఁబ్రాయము, పెంధూళి, మాఁగోపము మున్నగు మిశ్రసమాసములను సైతము చేసిరి. నన్నయభాషలో 'నాఁడునాఁటికిన్' అనియున్నది తరు వాత 'నానాఁటికిన్' అనికూడ నైనది. 'ఇంచుకించుక' తుదిబ్రాయిని గోల్పోయి 'ఇంచించుక' యనియు నైనది.

నన్నయ ననుసరించియే తత్సమశబ్దప్రయోగము సాగినది. కాని, యచ్చట సైతము కొంత సరుదుబాటు కనిపించును. మిత్రపాత్ర శబ్ద ములను నన్నయ పుంలింగసమములుగానే వాడెను. తరువాతివారు మిత్రము, మిత్రుఁడు; పాత్రము, పాత్రుఁడు – అని రెండువిధములుగా వాడిరి. సకారాంత పుంలింగ శబ్దములను నన్నయ ఉత్వమును డుజ్ఞును జేర్చివాడెను; సమాసోత్తరపదమైన రేతశ్శబ్దమును సకారలోపము చేసియు నుపయోగించెను. పురూరవుఁడు, దుర్వాసుఁడు, భూరి శ్రవుఁడు – అన్నప్పుడు సకారలోపము నిత్యముగా కలదు. అనం తరకవులు అన్నింటికి దాదాపుగా ద్వైరూప్యము నంగీకరించిరి. పరీ క్షిత్, మరుత్ – మున్నగు పురుషబోధకములకు ఉత్వడుజ్ఞులు చేర్చుట నన్నయ పద్ధతి – పరీక్షితుఁడు, మరుతులు॥ అనంతరకవులు పరీక్షిత్తు, మరుత్తులు – అని ఉక్కును ద్విత్వమును చేర్చికూడ వాడిరి. ఋత్వి జుఁడు, భూభుజుఁడు – మున్నగునవి తరువాతికాలమున ఋత్విక్కు, భూభుక్కు, మున్నగు విధముగా నైనవి. సకారాంత నపుంసకములు నన్నయభాషలో సకారమును గోల్పోవుటమాత్రమే కనిపించును. తరు వాతికవులు వీనితోపాటు సకారమున కుక్కును ద్విత్వమును చేర్చి మరొక రూపము కల్పించుకొనిరి – శిరము, శిరస్సు; ధనువు, ధనుస్సు; ఆయువు,

ఆయుస్సు॥ నన్నయభాషలోని 'విశ్వకర్మ' తరువాతిభాషలో 'విశ్వకర్ముఁడు' అను రూపమునుగూడ గ్రహించెను.

నన్నయభాషయం దనౌపవిభక్తికములయిన శబ్దములు తరువాతి కాలమున ఔపవిభక్తికములయినవి. కొన్ని ఔపవిభక్తిక వర్ణమును మార్చుకొన్నవి. ఎదురను, బయలను, మొదలన్ - అన్నవి ఎదుటను, బయటను, మొదటన్ మున్నగువిధముగా మారుట నిదర్శనము.

వారు, వీరు - అను బహువచనరూపములు తరువాతికాలమున వాండ్రు, వీండ్రు - అను రూపములతో చెలిమిచేసినవి. ప్రాఁకులు, కోలఁకులు మున్నగు కుజ్ఞుతోడి రూపములు బహుత్వమునందేయుండి, అనంతరకాలమున ప్రాను, కోలను - అనువానితో పాటుగా ప్రాఁకు, కోలఁకు - అని ఏకవచనమునందు సైతం మేలుబడి సాగించినవి.

నన్నయభాషయందలి విభక్తిప్రత్యయము లన్నియు నుండగా, కొన్ని యదనముగాను రూపాంతరములోను సాక్షాత్కరించును. 'వలనన్' అన్న పంచమి ఒకచోట 'వల్లన్' అన్నరూపు దాల్చినది. 'తోడన్' అన్నది 'తోడుతన్' అని యొకరీతి వాడుక కెక్కినది. నన్నయకాలమున లేని 'కొఱకున్' అన్నది తరువాతికాలమున చతుర్థీవిభక్తిప్రత్యయముగా ప్రతిష్ఠనొందినది. నన్నయ చతుర్థియందు వాడిన 'తదర్థము', పంచమి యందు వాడిన 'కృతమునన్' అన్నవి దాదాపుగా నశించిపోయినవి.

నన్నయభాషయందు వచ్చువాఁడు, చనువాఁడు మున్నగునవి శత్రర్థమున వాడబడినవి. వానిస్థానమున వచ్చుచున్, చనుచున్-మున్నగు రూపములే తరువాతికాలమున స్థిరపడినవి. వచ్చినవాఁడు మున్నగు విశేషణములందు వకారలోపము నన్నయ చేయలేదు. తరువాతికాలమున 'వచ్చినాఁడు' అనువిధముఁగా చేసి సమాపకక్రియగా వాడుట జరిగినది. నన్నయ భాషయందు 'కల' యన్నది అదంతధాతువుగా కన్పడును. 'నీవు శక్తి కలవు' అన్నది 'కలవాఁడవు' అన్నయర్థముఁ కలదు. అనంతరకాలమున 'నీకుశక్తి కలదు' అనురీతి వాడుకయే ప్రసిద్ధి నొందినది. అనుట, వినుట, కనుట మున్నగు భావార్థకములను

నన్నయ యట్లే వాడెను; కొన్నియెడల 'ట' స్థానమున 'డు' కలదనియు నందురు. తరువాతి కాలమునందు 'ను' స్థానమును నిండుసున్న వైకల్పికముగా నాక్రమించుకొనగా అంట, వింట, కంట - మున్నగురూపము లేర్పడెను. వాక్యములు క్రియాజన్యవిశేషణములతో ముగియు పద్ధతి ముగిసిపోయి సమాపకక్రియా సంపన్నములైనవి.

యక్షగాన భాష

రాయలయుగము తరువాత వచ్చిన ప్రబంధములందును, నాయకరాజులకాలమునందు వచ్చిన యక్షగానములందును గల భాషను యక్షగానభాషగా పరిగణింపదగును. పూర్వయుగములందు క్వాచిత్కముగా కనిపించు లక్షణములు కొన్ని యీయుగమున బహుళముగా కనిపించును. కొన్ని క్రొత్తలక్షణములు కూడ ఉత్పన్నములై యుండును. ప్రాచుర్యమునుబట్టియే యీ లక్షణములను పరిగణించుట జరుగును.

తెలుగునందు పరరూపసంధి సర్వసాధారణము. అమ్మ, అయ్య-మున్నగునవి పరమందున్నప్పుడు ఇత్వము నత్వమును గలిసి ఎత్వముగా మారును - చెల్లెమ్మ, అస్తెప్ప, మూర్తెప్ప॥ ఇది విశేషము.

కర్మధారయమునందు 'ము' వర్ణము 'పు' వర్ణమగును. దానికి పరుషసరళములు పరములైనపుడు నుగాగమగును. ఇది సాధారణ విషయము. స్థిరము పరమైనపుడు సైతము నుగాగమము కలుగుట విశేషము. ఈ విశేషకార్యము యక్షగానయుగమునందు సాధారణవిషయమయ్యెను-సిబ్బెపున్మెలుఁగు, ఒయారపునొసఁగసు, కప్రపున్వీడెము॥ కర్మధారయములందు పుంపుల కచ్చుపరమగునపుడు టుగాగమమగును. పూర్వయుగములందు మిక్కిలి యరుదుగా దీనికి వ్యతిక్రమము కలిగెడిది. ఈయుగమున నిది ప్రాచుర్యమును గాంచినది - అబ్బురపుబ్బు॥

క్త్వార్థకమైన ఇత్వమునకు సంధిలేదు. ఆమ్రేడితము పరమగునపుడు కొన్నియెడల సంధియగును. ఇది పూర్వయుగములందలి యలవాటు. ఈ యుగమునందు క్త్వార్థకసంధి ప్రాచుర్యమును పొందినది- జేసిచ్చి, చొక్కఁజేసలను, వావిడిచేడ్చె॥ అనుబంధమైన 'కొను' ధాతు

వునకు 'క' అన్నవర్ణ మాదేశముగా నగుట తరుచుగా కనిపించును- విప్పుక, చేర్చుక, పట్టుక, పారవేసుక॥ దీనికి పైని అనుబంధధాతువు యొక్క యచ్చు పరమైనప్పుడు సంధి వైకల్పికముగా నగును-కాచుక యున్నాడు, కొట్టుకాడుట॥

వ్యతిరేకక్త్వార్థకము కొన్నియెడల ద్రుతప్రకృతికముగా వాడ బడును- ఒంచకనె యొంచు॥ చుట్టులన్, పట్టులన్- అన్నవి నడిమి యుత్వము లోపించుటచేత చుట్లన్, పట్లన్ అనియగును. ఇవి రెండును సప్తమ్యంతములుగా వాడబడినవి. 'నాపట్లన్' అని 'నాయెడలన్' అన్న యర్థమున నుపయుక్తమైనది. ఇటులు, అటులు మున్నగునవి కళలైన యవ్యయములు. వీనిని ద్రుతాంతములుగా 'ఇటులన్, అటులన్' అని వాడుట విరివిగా కనిపించును.

నీ, నా, తన మున్నగువానికి సమాసమునందు దుగాగమము కలుగును. కాని, యీయుగమున ప్రత్యయమైన 'కోసము' పరమందున్న ప్పుడు సైతము దుగాగమ మగుచున్నది- నాదుకోసమై॥ పంచమీ విభక్తి యందు నిన్నుండి, తన్నుండి, నన్నుండి- అనువిధముగా విల క్షణములైన రూపము లేర్పడుట కలదు. ఇతరయుగములం దిట్టిరూప ములు కానరావు. వీనికిపైని ఏవార్థకమైన 'ఏ' చేరి సంధి నొందుటయు జరుగును- నిన్నుండే॥ కొన్నియెడల 'భామనుంచి' మున్నగు విధముగా 'చ' వర్ణముతోడి రూపములుకూడ చోటు చేసికొన్నవి.

'అందులకు' అన్నది నన్నయభాషయందు ప్రదేశవాచకముగా వాడుకనొందినది. తరువాతి యుగమున నది కొంతవరకు హేత్వర్థకముగా సార్థకమైనది. ఈ యుగమున 'ల' వర్ణమునుగూడ చాలవఱకు విడిచి పెట్టి 'అందుకు' అనిగ్రై హేత్వర్థకముగా ప్రతిష్ఠనొందినది. ఆడ, ఈడ - అన్నవి ప్రదేశవాచకములుగా స్థిరపడినవి. భృశార్థమున ద్విరుక్తములై 'ఆడకాడకు' మున్నగువిధముగా ప్రయుక్తములైనవి.

'చేయి' యను రూపము 'చెయ్యి' యని కావచ్చును. యత్వ లోపమువలన 'చెయి' యని కావచ్చును. కాని దీనికి 'చై' యని

రూపమును నిర్మించుట యక్షగాన యుగవిశేషము. 'చెయ్' అను రూపముపై 'ది' అను ప్రత్యయము చేరుటచేతనే 'చెయ్ది' అనురూప మేర్పడినది. మరల దీనిపైని 'అము' ప్రత్యయముచేరి 'చెయ్దము' అని యైనది. అట్లే 'చెయ్' ధాతువుపై 'వు' ప్రత్యయము చేరగా 'చెయ్వు' అని యగును. స్వరపశ్లేషమువలన చెయిది, చెయిదము, చెయువు - మున్నగురూపము లేర్పడును. సంయుక్తవర్ణము నీవిధముగా తప్పించు కొనుట కొందరకు తృప్తికరము కాలేదు కాబోలు! అందువలన చైదము, చైవులు మున్నగువిధముగా ఐత్వముతోడి రూపములను కల్పించుకొనిరి. ఇట్టి రూపములు యక్షగాన యుగమందు అపురూప ముగా నాదరపాత్రములైనవి. వాని ప్రభావముచేతనే 'చెయి' యను రూపము 'చై' యనుటయు సంభవించియుండును.

'ఇచ్చు' ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము 'ఈక' అనికాని 'ఈయక' అనికాని యగును. దీని యకారమునకు ద్విత్వము కలుగగా 'ఇయ్యక' అని కావచ్చును. ఇట్టివే ఇయ్యని, ఇయ్యన్ - మొదలయిన రూపములు; ఇచ్చటి యకారమునకు చెప్పుడు/చెపుడు మున్నగు వాని సామ్యమున లోపమురాగా ఇయక, ఇయని, ఇయన్ - అని కావచ్చును. కాని యిట్టిరూపము లపూర్వములు. ఈ యుగమున వీనికి బాహాటముగా ప్రయోగము కలదు.

లు ల న లు పరమైనప్పుడు ముువర్ణమునకు లోపమును, తత్పూర్వ స్వరమునకు దీర్ఘమును కావచ్చును. కాని, యీకార్యము అదంత నామములకే కలుగుట ప్రచురము. ఈ యుగమున ఎదంతములకు సైతము ఆ నియమము వర్తింపసాగినది - భాళేలు, బల్లేలు॥ 'గుఱ్ఱము' శబ్దము దిత్వమునకు లోపము కలుగగా 'గుఱము' అని యగును. దీనికి ద్వితీయయందు 'గుఱమును' అని కావచ్చును. కాని 'గుఱానిన్' అని ప్రయోగించుట యీ యుగమున కాననగును. కన్ను శబ్ద మేకవచనము నందు ద్వితీయాదివిభక్తులు పరమైనపుడు టి వర్ణమును పొందుటచేత తొలినుండియు ఔపవిభక్తికమగుట యథార్థమే, కాని బహువచనము

నందు కొన్నియాపవిభక్తికముల కగు పరిణతి దీనికి కలుగదు; కనుక 'కన్నులు కనులు' అనువిధముగనే యుండును. పరిణతి కలుగుట యీ యుగమునందు సాధారణమై కనిపించును. అందువలన 'కండ్లు' అను రూపముకూడ నేర్పడుట జరిగినది. 'మ్రాను' శబ్దము బహువచనాంత మైనపుడు 'మ్రాఁకులు' అని కావలయును. ఇట్లు కుఙ్జువచ్చుట నిత్యవిధి. కాని 'వేల్పుమానులు' మున్నగురూపములం దిట్టిది పాటింపబడలేదు. దీనికి ముందరిదైన పురాణప్రబంధయుగమునందే ఒకచోట ఈ వెసులు బాటు కనిపించును. 'ముసలిమానులు' అన్నది అక్కడిప్రయోగము. ముసల్మానులనియు, జీర్ణవృక్షము లనియు రెండర్థములు రావలయును. కావున శ్లేష నిర్బంధముచేత రూపసిద్ధి వ్యాకరణబద్ధము కాకపోయినది. ఇక్కడ అటువంటి నిర్బంధము లేకపోయినను మార్గమదియే యైనది.

లేచు, పోవు మున్నగు ధాతువుల కడ్రాయికి నుడుఙ్జులు పర మగునపుడు లోపమగును. ము వర్ణకమునకు ద్విత్వము కలుగును; డుఙ్జు పూర్ణబిందు పూర్వకమగును. అప్పుడు వెనుకటి దీర్ఘమునకు హ్రస్వము కలుగును - లెమ్ము, లెండు; పొమ్ము, పొండు॥ ఈ నియమమున కప వాదముగా 'లేవుము' అన్న రూపమొకటి కనిపించుచున్నది. ఇది 'కావుము' మున్నగువాని సామ్యమున నేర్పడి యుండును. 'పోవును' అన్నరూపముపై ప్రశ్నార్థకమైన 'ఏ' రాగా 'పోవునే' అని కావలయును. కాని 'వు' లోపము జరుగుట కనిపించుచున్నది - కాలకపోనే॥

పూర్వయుగమున 'వ్రాసినవాడు' అన్నది 'వ్రాసినాడు' అని పరిణతినొందినట్లు చూచితిమి. బహువచన 'రు' వర్ణకము పరమైనపుడు 'వ్రాసినారు' అనియగును. ఇది ప్రథమ మధ్యమ పురుషలకు రెండింటికి బోధకమగును. పై వాని సామ్యమునుబట్టి తక్కిన పురుషప్రత్యయము లను చేర్చి రూపసిద్ధిని గావించుట జరిగినది - వ్రాసినాను, కన్నావు॥

తద్ధర్మార్థకములందు తుదివర్ణమునకు ముందరనున్న ద, డి, డు అను వర్ణములకు లోపము కలిగి, పూర్వస్వరమునకు దీర్ఘము కలుగుట యిచ్చట అపూర్వమై కనుపట్టును- ఇచ్చెదను, ఇచ్చేను; అవధరించె

డిది, అవధరించేది॥ ఏవర్ణ మీానర్ణముగా మారును - ఏచెడిని, ఏచీని; ఇచ్చెడిని, ఇచ్చీని; ప్రశంసించెడిని, ప్రశంసించీని॥ తద్ధర్మార్థక విశేషణ మునకు సైతమీాకార్యము వర్తించును - ఓడం గడపే యుంపు; అయ్యే దినములు॥

ధాతువు తుది యకారమునకు ఇద్వ్యక్రములు పరమైనపుడు సకారము కలుగును - చేయు, చేసి, చేసెను॥ కాని యీా యుగమున నొకచోట 'చేసు' అని సకారముతోడి రూపము కనుపట్టుచున్నది.

'మరలు' అన్నది 'మళ్లు' అనియు 'వెడలు' అన్నది 'వెళ్లు' అనియు రూపాంతరములు పొందినవి.'ఉండుము'అను మధ్యమ పురుషైక వచనరూపముపై నిందయందు 'ర' యున్నది యగును; దానికి దీర్ఘము కూడ కలుగవచ్చును. అప్పుడు ఉండుముర, ఉండుమురా- అన్న రూపము లేర్పడును. ముపర్ణకమునకు లోపము కలిగినయెడల ధాతువు యొక్క తుది ఉత్వమున కత్వము కలుగును. అప్పుడు ఉండర, ఉండరా- అన్నరూపము లేర్పడును. కాని, యీా యుగమున ఇక్కడి అత్వమునకు లోపము కలుగగా, తరువాతి వర్ణముతో సంయోగము నొందుట కాననగును- ఉండ్రా యనుబోధము॥ ఇట్లు స్వరలోపము ధాత్వంతముననే కాక పదాంతమున సైతమగపడుచున్నది. ను, లు, రు ల ఉత్వమునకు పదాంతమునందు లోపము కలుగుట పూర్వముకూడ కలదు. కాని యిచ్చట స్వరవ్యంజనములు రెండును భేదించుచున్నవి- కొండ్రాజు, చిట్రాజు॥ సంజ్ఞావాచకము లగుటచేత ఇట్టియెడల నీ స్వాతంత్ర్యము సమ్మతమే కావచ్చును.

తలంచు, మఱచు మున్నగునవి అన్మధ్యధాతువులు. వీని అత్వమునకు లోపమురాకుండుట సాధారణలక్షణము. కాని దీనికి సైతము లోపము కల్గించుట యీా యుగలక్షణము- తల్చరు, మర్చను॥ 'కాంచుదును' మున్నగుచోట్లనున్న చుగ్ధకారమునకు తకార మగును. అపుడు 'కాంతును' మున్నగువిధముగా నగును. కాని 'చు' వర్ణాంతధాతువులు కొన్ని 'యు' వర్ణాంతములుగా పూర్వయుగమందే పరిణతి నొందినవి-

త్రోయు, కాచు॥ వీనికి త్రోతువు, కాతువు మున్నగు రూపములుండు టనుబట్టి తరువాతికాలమున 'చేయు' మున్నగు ధాతువులయందలి యువర్ణముతోడి దకారమునకు తవర్ణము కలుగుట ప్రారంభమై యుండును. అది యీ యుగమునందు ప్రాచుర్యము నొందెను - సంస్తుతి సేతున్, ఘనతసేతు, ధ్యానముసేతు॥

చేదర్థకము క్త్వార్థకరూపముపై 'తే' యన్నది చేర్పగా నేర్పడు చుండుట యీ యుగమునందు కాననగును - చెనకితే, నిమిరితే, అయితే॥ నిజమునకివి మధ్యమ పురుషైకవచన రూపముపై 'ఏ' యను ప్రశ్నార్థకము చేరగా నేర్పడినవే. వీని నావిధముగా పూర్వయుగములందు వాడిరి. కాని మధ్యమపురుష యన్నది యనుమానమునకైన లేకుండ చేదర్థక రూపముగా వాడుట తరువాత బలపడినది. వీనిపైని ద్రుతము చేర్చి, ఏవార్థకము చేర్చి కూడ నుపయోగించుట కలదు - అయితేను, అల్లితేనే॥ ఇదంతములైన మధ్యమపురుష క్రియలకు సంధి నిత్యము. అది యట్లే యనుసరింపబడినది. కాని, యీ యుగమున క్వాచిత్కముగ సంధికలుగని తావులు కానవచ్చుట విశేషము. ఉత్తమపురుషైకవచనము ద్రుతప్రకృతికము కావున దానికి సంధి కారాదు. కాని, యీ యుగమున సంధియైన చోట్లు గలవు. అస్త్యర్థక వ్యతిరేకరూపము అమహదర్థబోధకమైనపుడు 'లేదు' అని యగును. చివరి వర్ణమునువీడి 'లే' అని వాడుట ఈ యుగమునందు కనిపించును. తమిళభాషా ప్రభావమున నీ పరిణతి కలిగినను కలిగియుండవచ్చును.

షష్ఠీతత్పురుషమందు ఉకారఋకారముల కచ్చుపరమైనపుడు నుగాగమము కావలయును. కాని మోమందము, ఓమ్మందము, శిరసందము మొదలయినచోట్ల నుగాగమము కానరాదు. 'బచ్చెంటన్' మొదలయిన రూపములతో ఈ నుగాగమ క్షతికి బీజము పూర్వయుగమందే పడినది. అది యీ యుగమున బలపడినది.

'ఒద్ద' యనునది ఔపవిభక్తికత్వమును సంపాదించుకొనుట కూడ ఈ యుగముననే జరిగినది - నాయొద్దికి॥ 'వద్ద' అనువిధముగా

రూపాంతరము గడించి 'వద్దికి' మున్నగువిధముగా సహితము వ్యవహరించినది.

బహునాళ్లు, ముదితామణి మొదలయిన మిశ్రసమాసములు కూడ ఆవిష్కృతములై ఆదృతములైనవి. 'బహు' అన్నది 'అధికముగా' అన్న యర్థమున క్రియావిశేషణముగా కూడ ఉపయుక్తమైనది. 'కూఁతు' శబ్దము ప్రథమైకవచనముననే కాక, యితర విభక్తులు పరము లయినప్పుడుకూడ రు వర్ణమును చేర్చుకొనుట విశేషము - కూతుఁరుఁడు, కూఁతురికి॥

ఎడమవైపు, కుడివైపు - అన్నయర్థమున ఎలవంక, బలవంక అన్నరూపములు వాడుకనొందినవి. 'ఎడమ' యనుదాని పరిణతరూపమే 'ఎడ'. దీని డకారమునకు లకారము రాగా 'ఎల' మైయుండును. అట్లే 'వల' అనుశబ్దమునందలి వకారస్థానమును బకారమాక్రమించి యుండును. 'సమ్రాజ్ఞి' శబ్దమునకు వికృతి సాంబ్రాణి, సామ్రాణి యని రెండురూపములప్రాపు పొందినది. ఈకాలమున కారుబారు, ఖాణము, అత్తరు చెంబులు, కుంకుమపింగాళ్లు, సెబాసు, ఖూబు, దివాణము, హాజరము, జులుము, గులాము, హుజూరు, వజీరు, కర్జారుఁడు, సిస్తు - మొదలయిన అన్యదేశ్యము లనేకములు ప్రయుక్తములైనవి. శాహి, శాహు, పాదుశా మున్నగు రూపములతో నున్న ప్రభువాచకము 'పాచ్ఛావు' అన్న వికృతినిగూడ పొందినది. ఖాన్ శబ్దము స్వస్వరూపముతోపాటు ఖాను, ఖానుడు అను రూపములనుగూడ గ్రహించినది. బీబీ, మియా, అంగీ, పట్టా, పావురా, జాళువా, బురుసా - మొదలయిన దీర్ఘాంతశబ్దములు, హత్తు, హావుసు, హోనళి, హోళి, హోమిక, హోయి - మొదలయిన హకారాదిశబ్దములు - ఈభాష యందు మిక్కిలిగా కలవు. అన్యదేశ్యములనుండి చమాయించు, మనాయించు మొదలయిన క్రియాధాతువులేర్పడి యవసరమునను పనికి వచ్చినవి. ఈ యుగము చివరికాలమున కొన్నలు, కప్తాను - మొదలయిన పాశ్చాత్య పదములుకూడ ప్రతిష్ఠనొందసాగినవి.

మొత్తముమీద యక్షగానయుగమందు భాషలో కొన్నిప్రయోగములు (Experiments) జరిగినవని యనిపించును. ఇట్టిమెుదల కొంత

స్వైరప్రవృత్తియెట్లును తప్పదు. ఈ యుగమున అచ్చుతెలుగు మాటల మీద ప్రీతి పెరిగినది. సమాసకల్పనముకూడ కొన్ని క్రొత్తసాగసుల నెన్నుకొన్నది. యక్షగానమందలి వచనములందు ఆనాటి వ్యావహారికమే వాడబడినది. పాత్రౌచిత్యమునుబట్టి ఆయాకులములకు చెందిన భాషాప్రభేదములు ప్రదర్శింపబడినవి. పద్యకావ్యమునకు వ్యావాహారిక భాషాప్రభావము కొంత చొరబడినది. సన్నిహితభాషల ప్రభావము కూడ కొంత కలదనుట వాస్తవము.

## ఆధునిక భాష

ఆధునిక యుగమున సాహిత్యభాష రెండుపాయలైనది. మొదటి పాయ ప్రాచీనముగా వచ్చుచున్న లక్షణముల ననుసరించి సాగినది; దీనికి గ్రాంథికభాష యనిపేరు. రెండవపాయ వాగ్వ్యవహారము ననుసరించి యేర్పడినది; ఇది గ్రంథస్థ ప్రయోగములకు విరుద్ధమగుటచే లాక్షణికుల పరిగణనమందు గ్రామ్యమై తిరస్కారపాత్రమైనది. కాని శిష్టజనుల వ్యవహారమునందున్న భాషయగుటచే దీనిని గ్రామ్యమని పిలువరాదని, ఇదియే గ్రంథరచనమునకు సైతముపాదేయము కావలయునని యొక యుద్యమము సాగినది. మొత్తముమీద శిష్టవ్యావహారికము ఆధునిక సాహిత్యమున నత్యధిక భాగమునకు వాహకమైనది.

గ్రాంథికభాష దాదాపుగా పూర్వయుగములందున్నట్లే యీనాడు కూడ నున్నది. ఈనాడు ద్రుతకార్యము, గసడదవాదేశము, సంధివిధానము, శకటరేఫము, అర్ధానుస్వారము - మున్నగువాని విషయమున ప్రాయోభావమును ప్రదర్శించుచున్నారు. పద్యరచనమునందైనచో ఆ సడలింపు చాలతక్కువ. కావున, ఆధునిక యుగమునందలి గ్రాంథికము పూర్వముకంటె భిన్నముకాదు. శిష్టవ్యావహారికమునుగూర్చి యిక్కడ ప్రసంగించుకొనుట సముచితముగా నుండును.

మువర్ణకాంతశబ్దములు పూర్ణానుస్వారయుతములుగా పరిణమించినవి - సముయం॥ ఇతరవిభక్తులు పరమగునప్పుడు సమయాన్ని, సమయానికి, సమయాన్న (సమయాన) మున్నగు విధముగా రూప

నిష్పత్తియుండును. సమయంలో, సమయంకోసం, సమయంయొక్క –
మొదలయిన విధముగా తక్కిన రూపములుండును.

వాడు, వీడు, ఎవడు అను సర్వనామములు ఇతరవిభక్తులను పొందునపుడు ఇగాగమమును పొందుట ఎక్కువగా కనిపించు లక్షణము. వాడిని, వాడితో, వాడివల్ల, వాడికి మొదలయిన విధముగా రూపసిద్ధి యుండును. ద్వితీయాంతరూపము వాణ్ణి, వీణ్ణి, ఎవణ్ణి మున్నగువిధముగా పరిణతి నొందుట కూడ కలదు. బహువచనమునందు వారు, వీరు, ఎవరు; వారిని, (ర్ని) వీరిని (ర్ని), ఎవరిని (ర్ని) మున్నగురూపములతో పాటు మరొక బహువచన లకారమును చేర్చుకొని వాళ్లు, వీళ్లు, ఎవళ్లు; వాళ్లను, వీళ్లను, ఎవళ్లను మున్నగునవి కూడ ఏర్పడును. వాళ్లని, వాళ్ని మున్నగు విధముగా కూడ ఈ రూపములు మార్పుపొందును. అతడు, ఇతడు అన్నవి ప్రథమాంతము లైనప్పుడుకూడ అతను, ఇతను అని మారుట కలదు. తాను శబ్దము ప్రథమాంతమైనపుడు 'తను' అని రూపాంతరము నొందును. ద్వితీయయందు 'తన్ను' అన్న రూపమే గ్రాంథికము. బహువచనమున 'తమ్ము' అని మాత్రమే యుండును. వ్యావహారికము, 'తనను' 'తమను' అన్న అపరూపములను నిర్మించి గ్రాంథికమును కూడ గారడి చేసినది. ఇవికాక తనని, తమని; తనకి, తమకి మొదలయిన రూపములు సొంతముగా నున్నవి. 'తమరు' అన్న బహువచనరూపము తమరిని, తమరితో, తమరికోసం – మొదలయిన రూపములను చేపట్టినది. అది, ఇది, ఏది శబ్దములు దానిని, దీనిని, దేనిని మున్నగువిధముగా నగును. గ్రాంథికరూపములుకూడ నివియే. నిగామముమీది ఇత్వము లోపించుట వ్యావహారికమునందు ప్రచురముగా నున్న లక్షణము. దాన్ని, దాన్తో, దాన్లో మొదలయిన రూపములు నేర్పడును. అవి, ఇవి, ఏవి అను శబ్దములకు ద్వితీయావిభక్తులు పర మగునప్పుడు గ్రాంథికమునందలి 'ని' స్థానమున 'టి' ఆగమముగా నగును॥ వాటిని, వీటిని, వేటిని; వాటితో, వీటితో, వేటితో॥

సంఖ్యావాచకములందు పది వరకు గ్రాంథిక వ్యావహారికములలో మార్పు లేదు. ఆ తరువాత పదకొండు, పన్నెండు, పదమూడు, పధ్నాలుగు, పదిహేను, పదహారు, పదిహేడు, పద్ధెనిమిది - అన్నరూపము లుండును. 'పందొమ్మిది' రెండింటియందు సమానమే. ఉత్తరపదమైన పది వై, ఫై, భై అని మార్పు పొందును॥ ఇరవై, అరవై; ముప్ఫై; నలభై, ఏభై, డెబ్భై ఎనభై, తొంభై॥ ఐత్వమునకు బదులు 'అయి' అనియు వాడుక కలదు.

పూరణార్థమునందలి 'అవ' అన్నది 'ఓ' అన్నరూపమును ధరించును॥ ఒకటోవాఁడు, రెండోమాట, మూడోమనిషి॥

'చేయుట' మొదలయిన భావార్థకములు చాలవరకు పరిణతిని పొంది చెయ్యటం, చెయ్యడం మొదలయిన విధముగా నగును. దీనికి ద్వితీయ కాని, షష్ఠి కాని పరమైనప్పుడు చెయ్యడాన్ని, చెయ్యడాన్ని బట్టి, చెయ్యడానికి మున్నగువిధముగా రూపము లేర్పడును.

'ఉను' అన్న సముచ్చయార్థకము కడహల్లు ద్విత్వమునుపొంది వ్యవహారమునందు ప్రవేశించును-వాడున్ను వీడున్ను॥ కొన్ని మొడల తుది అచ్చునకు దీర్ఘముకూడ కలుగును - వాడున్నూ వీడున్నూ॥ కొన్ని మొడల తుది అచ్చునకు దీర్ఘము మాత్రమే కలుగును॥ వాడూ వీడూ; సీతారాముడూ॥ ఇది క్రియాదులకు నగును - వచ్చీ రాకా ఒకటే; చేసినా చెయ్యోచ్చు; వెళ్లనూ వెళ్లాడు రానూ వచ్చాడు॥

ధాతువుల కనుబంధమైన 'కొను' ధాతువు 'ఉక' అని 'ఉకు' అని మార్పుపొందును - చేసుక, చేసుకు॥

ఆనంతర్యార్థకముగా 'ఆక' అన్నది వ్యవహరించును. అది ధాతుజవిశేషణముమీాద చేరును - వచ్చినాక, చేసినాక॥ కొన్ని మొడల 'న' వర్ణమునకు లోపమువచ్చును. అప్పుడు వచ్చాక, చేశాక-అనువిధముగా రూపము లుండును. తాలవ్యస్వరమునకు ప్రాధాన్యము నిచ్చుచు కొందరు వచ్చేక, చూసేక, అనువిధముగా వ్రాయుటయు దృష్టిగోచర మగును.

శత్రర్థకముగా 'తూ' అన్నది వ్యవహరించును - వస్తూ, పోతూ॥ కొన్నియెడల దీని ఉత్వమునకు ఓత్వము వచ్చుట కొందర కభీష్టము - వస్తో, పోతో॥ ఉన్నానుబంధముతో కూడినప్పుడు సంధియందు పూర్వ స్వరము నిలుచును. కొన్నియెడల పరరూపసంధియు నగును - వస్తూ న్నాడు, వస్తోన్నాడు, వస్తున్నాడు॥

చేదర్థకముగా 'తే' అన్నది వ్యవహరించును. 'మెచ్చితివి' అన్నది మధ్యమపురుషైకవచన భూతకాలరూపము. దీని అంతిమ వకారమునకు లోపము కలుగవచ్చును. అప్పుడు ప్రశ్నార్థకమైన 'ఏ' చేరగా 'మెచ్చితే' అనియగును. వింటే, అంటే మున్నగువిధముగా భారతము నందే కలవు. ఇవి మధ్యమపురుషక్రియలు. ఆధునిక కాలమున వ్యావహారికమునందు ఇవి చేదర్థమునందు వ్యాప్తి పొందుచున్నవి - మెచ్చితే, చేస్తే॥ పూర్ణబిందువుమీాద ఈ తవర్ణము టవర్ణముగా పరిణతినొందును- వింటే॥

ఆశీశ్శాపములందు నుజ్యంతక్రియ వ్యవహరించును. హ్రస్వము మీాది ద్రుతమునకు లోపము కలిగి, పూర్వస్వరమునకు దీర్ఘము కలుగును - నీ కడుపు పిలకలు పెట్టా; నీనోట మట్టికొట్టా॥ దీర్ఘముమీాది ద్రుతమునకు ఊకారము వైకల్పికముగా నంతాగమమగును - నీయిల్లు వెయ్యిళ్ళ మొదలు కానూ (కాను); నీనోరు పడిపోనూ (పోను)॥

భూతకాలక్రియలుగా తచ్ఛబ్దముతోడి ధాతుజవిశేషములే కొంతమార్పునకు లొంగి వాడుకభాషయందుపయోగపడును. వచ్చిన వాడు-అన్నరూపము పురాణప్రబంధయుగమందే 'వచ్చినాడు' అన్న రూపు ధరించినది. తరువాతి యుగమున వచ్చినాను, వచ్చినావు- మొదలయిన రూపములు గ్రంథములకెక్కినవి. ఇట్టి రూపములు ఆధునికయుగమున నుండును. వీనితోపాటు నకారలోపము కలిగినరూపములును గలవు - వచ్చాడు, వచ్చాను, వచ్చావు॥ బహువచనమునందు వచ్చారు, వచ్చాము, వచ్చారు-అను విధముగా నగును. చేయుధాతువు

చేశారు, వినుధాతువు విన్నారు, పిలుచుధాతువు పిలిచారు - అనువిధముగా నగును. వీనిని బట్టి తక్కినరూపముల నూహించుకొనవచ్చును.

అమహదర్థము గ్రాంథికమునందలిది 'వచ్చినది' మున్నగురూపముల మూలముగా నేర్పడినది. ఇచ్చటి న వర్ణము నిండుసున్న యగును- వచ్చింది, చేసింది, బహువచనమునందు ఆయి యన్నది చేరును - వచ్చాయి, చేశాయి॥ న వర్ణలోపము రానప్పుడు అయి, ఐ- యన్నవి చేరును - వచ్చినయి, వచ్చినై ; చేసినయి, చేసినై॥ విను మొదలయిన ధాతువులు వింది, విన్నది; విన్నాయి, విన్నయి, విన్నై - అను విధముగా పరిణమించును,

వర్తమానక్రియలు 'వస్తున్నాను' మున్నగువిధముగా నుండును. ఇక్కడ 'వస్' అన్నది వచ్చు ధాతు పరిణతరూపము. 'తున్నా' అన్నది వర్తమాన బోధకమైన యనుబంధము. పురుషప్రత్యయము 'ను' చివర పురుషప్రత్యయమును మార్చుటచేత ఇతర పురుషరూపము లేర్పడును. వస్తున్నాము - ఉ. పు. బహువచనము॥ వస్తున్నావు, వస్తున్నారు - మ. పు॥ వస్తున్నాడు, వస్తున్నారు - ప్ర. పు॥ ఇక్కడి నుప్రత్యయము నకు లోపము కలుగవచ్చును. డుప్రత్యయము తక్క తక్కిన ప్రత్యయములమీది ఉత్వము తేలికగా నుచ్చరింపబడును. ఇక్కడ ఇంకొక విషయమును గుర్తించుకొనవలయును. చు, చ్చు - వర్ణములు సకారముగా మారును. గిచ్చు, పుచ్చు, మెచ్చు మున్నగుధాతువులందీమార్పు కలుగదు - గిచ్చుతున్నాడు॥ యువర్ణము సకారమగును - చేస్తున్నాడు॥ అను మున్నగు ధాతువుల కడవ్రాయి నెలసున్న యగును. మీది తకారము టకారమగును - అంటున్నాడు॥ ఉండు ధాతువు డు వర్ణమునకు లోపమగును - ఉంటున్నాడు॥ చెప్పు ధాతువు కడవ్రాయికి 'బు' అగును - చెబుతున్నాడు॥ తక్కిన ధాతువులు యథాస్థితము లై యుండును.

అమహదర్థమునందు వస్తుంది, చేస్తుంది, అంటుంది. ఉంటుంది, చెబుతుంది- అన్నవిధముగా రూపనిష్పత్తియుండును. కాని ఇవేరూప

ములు భవిష్యదర్థబోధకములుకూడ నగుటచేత, స్పష్టతకొరకు 'వస్తున్నది' అనువిధముగా కాని 'వస్తూంది, వంస్తోంది' అనువిధముగా కాని వాడుకల జరుగుచున్నది. బహుత్వమునందు వస్తున్నాయి, వస్తూన్నాయి, వస్తు న్నాయి, వస్తోన్నయి-మున్నగువిధముగా రూపము లుండును.

భవిష్యత్కాలక్రియలుగా వస్తాడు, చూస్తాడు, చేస్తాడు, చెబు తాడు- మొదలైనవి వ్యవహరించును. వీనితో పోలికగల గ్రాంథికరూప ములు కానరావనియే యనిపించును. వచ్చువాడు మున్నగురూపములే వీనికి మూలములనుట యథార్థము. పూర్వము చెప్పికొన్నట్లుగా 'వచ్చు' ధాతువు 'వస్' రూపము ధరించును. 'వాడు' లోని వకారము లోపిం చును. భవిష్యర్థక చిహ్నముగా వ్యావహారికమునందు 'త్' కారము వచ్చును. వస్ + త్ + ఆడు = వస్తాడు అను విధముగా నగును.

అమహత్తునందు 'వస్తుంది' మున్నగురూపములను వర్తమాన మునకే విడిచిపెట్టి వస్తది, వస్తాది, వస్తవి, వస్తాయి - మున్నగురూప ములనే వాడుదురు. గ్రాంథికభాషలో వలెనే వ్యావహారికములో సైతము భవిష్యదర్థమునందు వ్యవహరించునవి తద్ధర్మార్థకరూపములే. 'కల' యన్న యనుబంధముతోడి రూపములు భవిష్యదర్థమునందు కాన రావు. గ్రాంథికమునందుకూడ అట్టిరూపములు చాల విరళములు.

వ్యావహారికసంధికి ఒక వ్యవస్థ నూహించుట సాధ్యముకాదు. అన్ని యచ్చులకును సంధి బహుళముగా నగును. దీర్ఘములమీాద సంధి లేదని సామాన్యముగా చెప్పవచ్చును. వకారాదిపదములు స్వరాదులు గానే పెక్కుచోట్ల వ్యవహరించును - వాడూరెళ్లాడు, వచ్చేశాడు, వెళ్లొచ్చాడు॥ సంధికానిచోట్ల ఆగమముగా యకారమే కాక వకారము కూడ నగును - మాయిల్లు, మావూరు॥ సంధిప్రసంగములేనిచోట సైతము యకార వకారము లచ్చుల నావేశించి యుండుట కలదు - యెవడు, యెక్కడ, యిది; వొకడు, వోర్పు, వురుము॥ ఋవర్ణము రు, రి వర్ణములలో ఒక్కటిగా మారుట బహుళము - కృష్ణుడు, క్రిష్ణుడు, క్రుష్ణుడు॥ అస్పష్టగ్రహణము కారణముగా ఋవర్ణము లేనిచోట సైతము ఋవర్ణమును వ్రాయుట కనిపించును.

ఆంగ్ల హిందీపదములు తత్సమ తద్భవములుగా వ్యావహారిక మందు అత్యధికముగా చేరును. అసలు, రోజు, మామూలు, కూలి, బదిలీ మొదలైన మాటలు పర్యాయపదమునకు చోటులేనంత ప్రతిష్ఠను సంపాదించుకొన్నవి. రైలు, టిక్కట్టు, సినీమా, లేటు, టైము మొదలైనవికూడ అంతటి యోగ్యతను గడించుకొన్నవి. బీరువా, అలమారా, చెంచా, డేగిసా మొదలైనవి అన్యభాషాపదములన్న యనుమానను కూడ రానంతగా భాషలో కలిసిపోయినవి.

కర్మార్థకప్రయోగము పూర్వయుగములం దెందును లేనంత ప్రచారము సాధించుకొన్నది. సంబంధబోధక సర్వనామముల వాడుక విస్తృతి నొందినది.

మాండలిక భాషలు

పరిపాలనసౌకర్యమునకై దేశమును కొన్ని భాగములుగా విభాగించుకొనుట యవసరము. అట్లు చేసిన విభాగములకు 'మండలము'లని పేరు. నేటి కాలమున 'జిల్లా' యను పదము 'మండలము' స్థానమున వ్యవహృత మగుచున్నది. 'దత్తమండలములు' అనుచోట ఈ పదము కలదు. District officer అను పదమునకు 'మండలాధికారి' యనునది యనువాదము. ఒక వర్గమునుగాని, జనసమూహమునుగాని మండలము అనుపేరున పిలువవచ్చును. ఇట్లు మండలములకు సంబంధించిన భాషలను 'మాండలికము' లని యందురు.

దేశమున కంతయు ప్రధాన భాష యొకటి యుండును. ఆ భాష వేర్వేరు ప్రభావములకు లోనై, వేర్వేరు మండలములందు, వేర్వేరు జనసమూహములచేత వేర్వేరువిధములుగా ఉపయోగించుకొనబడును. అట్టియెడల ప్రధానభాషకంటె భిన్నములయిన రూపములు మాండలికములందు గోచరించును. కావుననే యీ మాండలికములను ఉపభాషలనియు, ప్రాదేశికభాష లనియుకూడ వ్యవహారము కలదు.

వ్యవహారమునం దున్న భాష మార్పు పొందుట సహజము. ఇట్టి మార్పునకు శీతోష్ణపరిస్థితులు, వస్త్రసంచలనములు, సాంస్కృతిక

కార్యక్రమములు, చారిత్రకభౌగోళిక పరిణామములు మున్నగున వెన్నేని కారణములు కావచ్చును. ఎన్ని మార్పులు కల్గినను, మూలభాషతోడి సంబంధము స్పష్టముగా నున్నంతవరకు ఆయా భాషలను మాండలికము లనియే వ్యవహరింపనగును. అట్లుగాక, ఏకభాషాసంబంధులైనను, స్థూల దృష్టికి భిన్నభాషలుగా గోచరించుచో అట్టి వానిని మాండలికావస్థ దాటిపోయి నట్లంగీకరింపక తప్పదు. ఒకప్పుడు ప్రాచీనద్రావిడము వ్యవ హారమునం దుండి వేర్వేరు ప్రాంతములందు వేర్వేరు మార్పులకు లోనైనది. అది మాండలిక వస్థ. ఆ తరువాత క్రమక్రమముగా ప్రత్యే కముగా సాహిత్యస్థితిని సంస్థాపించుకొనుట జరిగినది. సాహిత్యస్థితిని పొందిన మాండలికము స్థిరత్వము నొందును. అట్లుగాక, వ్యవహార మాత్రప్రాచుర్యము గల భాష వేగముగా మార్పునొందును. అందు వలన రెండు మాండలికములకును అంతర మెక్కువై భిన్నభాషలవలె తోచును. దీనికితోడు వీరికిని వారికిని సంబంధబాంధవ్యములు కూడ సన్నగిల్లునెడల, రెండు భాషలను బంధించుసూత్రము తెగిపోవును; రెండు భాషలును వేర్వేరు దిశలలో వృద్ధిపొంది ప్రత్యేకస్థితిని స్థాపించు కొనగల్గును. రానురాను, ఒక భాష మాటాడువారికి రెండవ భాష దురవగాహ మైపోవును. అట్లే అరవము, కన్నడము, తెలుగు, మల యాళము మున్నగుభాషలు వేరుపడిపోయి, స్వతంత్రప్రతిపత్తిని సంపా దించుకొన్నవి.

సజీవభాషకు మార్పు సహజ మనుకొంటిమి. తెలుగు భాష తిరిగి యీనాడు అనేకమాండలికములుగా అభివృద్ధి చెందుచున్నది. గ్రియర్సను 'లింగ్విస్టిక్ సర్వే' యందు తెలుగు మాండలికములను గూర్చి పేర్కొనెను. చాందాజిల్లాలోని కోమట్లు వాడు భాషకు 'కోంటావు' అని పేరు. 'గోలరీ' అనియు 'సాలేవారీ' అనియు కూడ వృత్తులను ఆధారముగా చేసికొని యేర్పడిన మరి రెండు మాండలిక ములు గలవు. బెల్గాముజిల్లాయందు స్థిరపడిన తెలుగువారు 'దాసరీ' యనియు 'బేరాడీ' యనియు రెండు విధములగు మాండలికములను

వాడుదురు. బొంబాయిపరిసరములందును బొంబాయియందును ప్రవాసాంధ్రులలో 'కామాఠీ' యనియు, 'వడరీ' యనియు రెండు విధములగు మాండలికములు వాడుకలో గలవు. ఈ విధముగా పరిగణించినచో ఆంధ్రులున్న ప్రతి ప్రాంతమునందును నొక్క మాండలికము తప్పదు.

ఆంధ్రప్రదేశమునందే అనేకమాండలికములు గలవు. తెలంగాణామాండలికమునందు ఉర్దూపదముల కలయిక యెక్కువగా నుండును. జరా, జిమ్మేదారీ, చౌదా, పుర్సత్ మొదలయిన పదములు తెలుగువాక్యాలలో ధారాళముగ కలిసి వినిపించును. ఉచ్చారణలో కూడ ఉరుదూప్రభావము కనిపించును. ఉరుదూ మాటలపై 'వాడు' అను తచ్ఛబ్దమును జేర్చుటవలన వింతరూపము లేర్పడును; గులాపోణ్ణి: గరీబోణ్ణి వంటి మాటలటువంటివి.

విశాఖపట్టణమాండలికమునందు గుంట. గుంటడు మున్నగు పదములు బాలిక, బాలుడు అను నర్థములందు గలవు. సంబోధ్యవాచకమునం దగు 'ఓయి' వ్యస్తముగా ప్రామాణిక భాషయందు సైతము గలదు. విశాఖమాండలికమునందు 'ఏమివోయ్' మున్నగువిధముగా వకారముతోడి ప్రయోగమధికముగా వినిపించును. క్రియాపదములలో 'ఉంటాది, వస్తాది' మున్నగువిధముగా దీర్ఘములుతోడి రూపములు గలవు.

గోదావరిజిల్లాయందు 'ఉంటుంది, వస్తుంది' మున్నగు విధముగా క్రియాపదములు గలవు. 'ఓయి' ప్రయోగము కలదు. కాని సాధారణముగా పూర్వాచ్చుతో కలిసియే యుండును. 'ఏమి' అను ప్రశ్నార్థకము ఏమిటి, ఏంటి, ఏటి అనువిధముగా మారి వినిపించును.

గుంటూరుజిల్లాయందు 'ఉండుద్ది. వచ్చుద్ది' మున్నగు క్రియారూపములు గలవు శత్రర్థకరూపము గోదావరిజిల్లాలో 'వస్తూ, పోతూ' అని కాని 'వస్తో, పోతో' అని కాని యుండగా గుంటూరుజిల్లాలో 'వస్తా, పోతా' అని యుండును. 'పాకాలు' (పాక + లు) మున్నగు విధముగా కొన్నిచోట్ల దీర్ఘముతో పలుకుట కూడ కలదు.

నెల్లూరుజిల్లాలో 'ఉణ్యాది' మున్నగు విధముగా క్రియాపదములు వినిపించును, నెల్లూరుభాషలో తమిళభాషా ప్రభావ మెక్కువగా కనిపించును. 'పూడ్సింవు' మున్నగు ప్రయోగములు తమిళ ప్రభావజన్యములే యనక తప్పదు.

ఒక్క 'ఉన్నది' అను రూపము వివిధమాండలికములలో 'ఉంది, ఉండింద్, ఉన్నాది, ఉండాది' మున్నగువిధములుగా నగును. ఈనిక మార్పువలన ఉచ్చారణలో ఎంతో అంతరము కన్పించును. ఉచ్చారణనుబట్టి, ఎవ్వరే జిల్లావారో చెప్పునంతటి యవకాశము కలదు. అయినను ఈ మాండలికములు ప్రత్యేకపరిణతిని చెందక పరస్పరసంబంధమువలన ఒండొరులకు అవగాహన మగుచునే యున్నవి. ఏమయినను ఈ భేదము పట్టములతో సంబంధములేని గ్రామములలో నధికముగా కనుపట్టును. ఈరోజులలో వార్తాపత్రికలు, ఆకాశవాణి, చలనచిత్రములు మున్నగునవి సంబంధసాధనములై భాషైక్యమును సంరక్షించుచున్నవి. అందువలన ఆంధ్రప్రదేశమునందలి మాండలికములు వివిధత్వములో నేకత్వమును సాధించుకొనుచున్నవి. దేశాంతరమందున్న మాండలికములు ఆయా సన్నిహితభాషలకు లోనుగాక తప్పదు. ఏమైనను లిపియు సాహిత్యమును లేని కాలములో కంటె ఈ కాలమున భిన్నభాషలుగా పరిణమించు లక్షణము స్వల్పతరముగా నుండుట స్వాభావికము. గ్రాంథికభాష ప్రామాణిక భాష standard language గా నుండి మాండలికముల కొక సమన్వయమును సాధించుచుండుటవలన, వేర్వేరు దిశలలో పెంపొందు నావకాశము తక్కువయైపోవును. రాకపోకల సౌకర్యము బాగుగా ఏర్పడుటవలన మండలముల నడుమ దూరము సన్నగిల్లినది. దానితో మాండలికముల నడుమ దూరముకూడ కొంతకు కొంత సన్నగిల్లక తప్పదు. వేర్వేరు వృత్తులలోని పదములనుకూడ ప్రామాణిక భాషలో చేర్చుకొనుట వలన, భిన్నమాండలికములను సమీకరించుకొను ప్రయత్నమువలన భిన్న భాషాపరిణామదశ తెలుగు మాండలికములకు కలుగజాలదనియే నిర్ణయింపవచ్చును.

## అన్య భాషా ప్రభావములు

సామాజికముగా నున్న సంబంధము భాషలో కూడ ప్రతిఫలించుట సహజము. రాజకీయముగను సాంస్కృతికముగను వాణిజ్యసంబంధముగను అన్యభాషీయుల ప్రభావము మనపై పడుట కవకాశము కలదు. అట్లే మన ప్రభావము వారిపై పడుటకును అవకాశము కలదు.

తొలుతటి కాలమున ఆంధ్రుల పరిపాలనవలన ప్రాకృత సంస్కృతములు తెనుగుభాషపై తగినంత ప్రభావమును ప్రదర్శింపజాలినవి. భారతరచనముతో, తత్సమతద్భవరూపములు తెనుగులో ప్రవేశించి స్థిరమగు ప్రతిష్ఠను సంపాదించుకొన్నవి. ఆనాటికి సంస్కృతము సుప్రతిష్ఠితమై సారస్వత వైభవసామ్రాజ్యమును స్థాపించుకొని యుండుట వలన, తెలుగుభాషకు దాని యడుగుజాడలే యొరవడు లైనవి. వ్యాకరణము, అలంకారశాస్త్రము మున్నగువాని విషయమున కూడ సంస్కృతము గురుపీఠము నధిష్ఠించినది. తెలుగు సారస్వతము ప్రారంభదశలో ప్రాయికముగా సంస్కృతానువాదమే యగుటవలన సంస్కృతపునుడికారము తెలుగునకును కొంత పట్టువడి యుండక తప్పదు. ఇంత విరివిగా మరేభాషయు తన ప్రభావమును చూపలేదు. కన్నడము జన్మసంబంధము చేతనే కాక పొరుగుభాష యగుటవలనకూడ తెనుగుపై కొంత ప్రభావము చూపి, పథప్రదర్శక మైనది. కన్నడమున సాహిత్యసృష్టి కూడ జరిగి యుండుటవలన, క్రొత్తగా సాహిత్యమును సృష్టించుకొను తెనుగుజాతి దానిని మూదలగా గ్రహించియుండును. వృత్తనిబంధనము, సమాసవిన్యాసము మున్నగు విషయములలో సంస్కృతముతోపాటు కన్నడము కూడ తెలుగునకు కొంత సహకరించినది. అంతేకాక, కన్నడ దేశమున వీరశైవము బాగుగా విస్తరించినది. కావున తెలుగు దేశమందలి వీరశైవులకు కూడ కన్నడ దేశము స్ఫూర్తి కేంద్రమైనది. సాంప్రదాయికములైన విశేషములతో, కన్నడ భాషా గతములైన విశేషములనుగూడ వీరశైవులు అనుకరింప సాగిరి. తన్మూలముగా కేవలకన్నడపదములు తెలుగులో ప్రవేశించినవి.

తరువాతి కాలమున వ్యాపారనిమిత్తము వచ్చిన మహమ్మదీయులతో సంపర్క మేర్పడినది. పదునాల్గవశతాబ్దికి బహమనీ రాజ్య మేర్పడినది. నాటినుండియు మహమ్మదీయులతో గల సంబంధము మూలముగా తెలుగునందు అనేకపదములు ప్రవేశించినవి. మహమ్మదీయులకు అరబ్బీ పారశీకములు మాతృభాష లనదగినవి. ఉత్తర హిందూస్థానమునందలి అపభ్రంశభాషలతోడి సంపర్కమునలన ఉరుదూభాష యుద్భవించినది. భారతీయమహమ్మదీయులకు ఉరుదూ మాతృ భాషయైనది. ప్రాంతభేదములనుబట్టి అరబ్బీపారశీకపదముల సాంద్రత హెచ్చుట కాని, తగ్గుట కాని జరుగును. ఇట్లు మహమ్మదీయుల యొక్క సంబంధము ఉరుదూ, పారశీకారబీయ పదములను తెలుగులో ప్రవేశ పెట్టినది. దక్షిణమున గోల్కొండ రాజ్యము, నిజాముపరిపాలనము కారణములుగా తెలుగులో ఉర్దూపదములు మరింత వ్యాప్తిని పొందినవి. ఆంగ్ల పరిపాలనకాలములో సైనిక భాష ఉర్దూ యగుట దీనికి మరింత దోహదకారణ మైనది. రాజకీయవ్యవహారమునందలి కొత్వాలు, వజీరు, జమేదారు, సుల్తాను మున్నగునవి, నిత్యవ్యవహారములోని కూజా, మేజా, కుర్చీ, తివాసీ మున్నగునవియు ఉర్దూ పదములే, ఇంతే కాక దైనందినభాషలోని పురమాయించు, పుసలాయించు, సతాయించు, తటపటాయించు మొదలయిన క్రియా రూపములు ఉర్దూభవములే.

ఆంగ్లేయుల పరిపాలన స్థిరపడుటకు పూర్వము ఫ్రెంచి, పోర్చుగీసు, డచ్చి ప్రభుత్వములు తమతమ పలుకుబడికోసము యత్నములు సాగించినవి. ఆ సంబంధము కారణముగా ఆయా భాషలలోని కతిపయ పదములు తెలుగునందు ప్రవేశించినవి. కాని, తరువాతికాలమున ధారాళముగా ఆంగ్ల భాషాప్రభావము పడుటవలన ఏది దేని మూలమున నేర్పడినదో చెప్పుట కొంత కష్టసాధ్యముగా మారినది. ఆంగ్లమున అన్యభాషాపదము లనేకముగా గలవు. కావున ఆంగ్లమునుండియే ఆ యా పదములు ప్రవేశించెనో, మూలభాషనుండియే ప్రవేశించెనో

చెప్పుట పరిశోధనవిషయము. రోడ్డు, సినీమా, బైస్కోపు, స్కూలు, రైలును మున్నగు ఆంగ్లపదములు నిత్యవ్యవహారములో తత్సమము లుగా ప్రవేశించినవి. ఏమాత్రమును అక్షరజ్ఞానము లేనివాడు కూడ వీనిని అలవోకగా ఉపయోగించుచున్నాడు. కనిస్టేబు, సూపర్నెంటు, కలకటేరు మొదలయిన తద్భవములుకూడ నిత్యవ్యవహారములో ఏర్పడియున్నవి. పదములవిషయములోనే కాక, ఆంగ్లభాష వాక్య నిర్మాణ విషయములో కూడ అత్యంతప్రభావమును కలిగియున్నది. తెలుగులో ఈనాడు ఆంగ్లమునందలి Phrases, Idioms కూడ అనూదితములై ప్రవేశించుచున్నవి. విద్యావంతులలో భావనమే ఆంగ్ల మున సాగి, అనూదితమై తెలుగులోనికి అవతరించు చున్న యవస్థ కూడ లేకపోలేదు.

## ప్రస్తుతాంశము

ఇంతవరకూ తెలుగుభాషాచరిత్రను నిర్మాణాత్మకముగా సమీక్ష చేసితిమి. ఇప్పటికి రెండువేల సంవత్సరములకు పూర్వము ద్రావిడ భాషాకుటుంబములో స్పష్టాస్పష్టముగ నుండిన తెలుగు క్రమక్రమ ముగా ప్రాకృతభాషాసంపర్కము నొంది, సంస్కృతభాషాసాహ చర్యము నొంది రూపము దిద్దుకొని, శాసనములలో కాలూదుకొని పదునొకండవ శతాబ్దికి సాహిత్యసామ్రాజ్యమును స్థాపించుకొన్నది. జన్మచేత ద్రావిడమేమైనను సంస్కృత ప్రాకృతముల సహవాసముచే ఆర్యలక్షణముల నలవఱుచుకొన్నది. నేడును ఉత్తరభారతభాషల ప్రభావమే కాక అన్యదేశ భాషాప్రభావమును కూడ ఆదరముతో గ్రహింపగల ఔదార్యము తెలుగుభాషకు పుష్కలముగా గలదు.

భాషకు మార్పు సహజము. పదములలో, వాక్యవిన్యాసములో, వ్యాకరణసంప్రదాయములలో నిట్టిమార్పు లింతవరకు పెక్కు విధ ములుగా చూచితిమి. నవీనకాలమునందు శ్రీగిడుగు రామమూర్తి పంతులు మున్నగువారి యుద్యమముతో వ్యావహారికవాదము తల యెత్తి, దైనికవ్యవహారములో బలపడినది. పత్రికలలో, రేడియోలో,

సినీమాలలో, కథలు, నవలలు మున్నగు గ్రంథములలో వ్యావహారికమే సాగుచున్నది. మాటాడుచున్నట్లుగనే వ్రాయవలయు నని, అట్లు చేసిన కృత్రిమ మైన గ్రాంథిక భాషవలని క్లేశము తప్పుననియు వీరి వాదము లోని సారము.

మార్పును అంగీకరింపక తప్ప దనుమాట సత్యమే కాని, అది సహజపరిణామము కాకున్నయెడల భాషాస్వరూపమే భ్రష్టమగును. వ్యవహారమునందలి భాషనే గ్రంథస్థము చేసినయెడల నున్న చిక్కు లన్నియు తొలగిపోవు ననుట భ్రమ మాత్రమే. గ్రంథస్థభాష స్థిరమై యుండగా వ్యావహారికము రెండు మూడు దశాబ్దులలో మార్పు నొందును. అప్పుడు మరల ఈ దూరము కనిపింపక తప్పదు. అంతే కాక, వాడుకలో భిన్నమాండలికములు గలవు. వీనిని గ్రంథస్థములుగా చేయుట యన్న భిన్న భాషాపరిణామోన్ముఖముగా ప్రస్థావించుట యన్న మాట !

గ్రాంథికభాష యర్థమైనంతమందికి మాండలిక మర్థముకాదు. కావున వ్యావహారికమున వ్రాయుట గ్రంథవ్యాప్తిని సంకుచితము గావించుటయే యగును. ఈనాడు వ్యాకరణము వ్రాసి వ్యావహారికమునే ప్రామాణికముగా గ్రహించితి మనుకొందము. శ్రీ వజ్ఝమూడి గోపాల కృష్ణయ్యగారు 'వ్యావహారికభాషా వ్యాకరణం' అను పేరున పెద్దగ్రంథ మును వ్రాసిరి. దీని ప్రకారముగా నైనచో ఆంగ్లేయులు 'చాసర్' భాషను, హిందీయులు 'తులసీదాసు' భాషను అనువదించి చదువుకొను చున్నట్లుగా, ఆంధ్రమహాభారతాదిగ్రంథవిధానములకు వారసులమైన మనము ఆ స్వత్వమును గోల్పోయి, వ్యావహారికానువాదములపై నాధారపడవలసి వచ్చును. లేదా వంగీయులవలె నిఘంటువులందును వ్యాకరణములందును 'ఇది వ్యావహారికము, ఇది గ్రాంథికము' అని వేర్వేరుగా గుర్తించుకొనవలసి వచ్చును. ఇది సౌలభ్యమును గల్గించుట కాక, పాఠకుని మూపున మోయరాని భారమును మోపుటయే యని విజ్ఞులు గ్రహింపగలరు.

ఒక సువ్యవస్థను పొందువరకు భాష మారుచుండును. తెలుగు భాష అట్లు మారుచు వచ్చినది. సాహిత్యమున సౌష్ఠవము నార్జించుకొని, వ్యాకరణగ్రంథములవలన సుప్రతిష్ఠితమైనది. అన్యానుకరణోద్దేశముతో తెలుగులో కూడని మార్పులు తెచ్చిపెట్టుట శ్రేయము కాదు. ప్రాచీన తాబలము చాలని భాషలు ఈనాడు సూత్రపాతము గావించుకొని బల మును పొందవచ్చును. వానిని జూచి, యిది యేదో యనుకొని, ఉన్న గౌరవమును లే దనుకొని వ్యవహరించుట, నియమముల నుల్లంఘింప జూచుట భాషాప్రతిష్ఠకు మంచిదికాదు. నియమరహితముగా ప్రవర్తిం చుట ఆటవికలక్షణము. నియమములలోనే నిర్ణీతస్వేచ్ఛ ననుభవించుట నాగరకలక్షణము.

కన్నడ తెలుగు లిపు లించుమించుగా సమానముగా నుండును. వానిలో కొంచెముగ నున్న భేదమును దొలగించి ఒకే లిపిగా రూపొం దింపవలయునని శ్రీ సుబ్బరామప్ప మున్నగువారు భావించుచున్నారు. శ్రీసునీతి కుమార చటర్జి భారతీయభాషల కన్నింటికి రోమనులిపినే ప్రతిపాదించుచున్నారు. సాహిత్య అకాడమీ దేవనాగరిలిపిలో ప్రాంతీయభాషాగ్రంథములను ముద్రించి, ఒక విధమగు ఐక్యమునకు దోహదము కలుగజేయుచున్నది.

ఈనాడు నానాత్వములో ఏకత్వమును సాధించుకొన వలసిన యవసర మెంతైన నున్నది. శాస్త్రీయ మైన యభివృద్ధికి తోడ్పడు నట్లుగా భాష సిద్ధముకావలయును. భారతీయభాష లన్నింటియందును శాస్త్రీయపదజాల మొకేవిధముగా నుండుట భాషైక్యమునకు తోడ్ప డును. భాష కేవలము భావవాహక మగుటయే కాక, తద్భాషా భాషుల ఆచార వ్యవహారములకు, సంస్కృతి సంప్రదాయములకు, జీవితవిధానమునకు, భావనవైభవమునకు సజీవసంకేత మను విషయ మును విస్మరింపకుండుట శ్రేయము.

# పారిభాషిక పదములు

| | |
|---|---|
| అంతస్థములు | semi-vowels |
| అకర్మక క్రియలు | intransitive verbs |
| అగ్రిమ స్వరములు | front vowels |
| అఘోషములు | unvoiced sounds |
| అనాగరక భాషలు | uncultivated languages |
| అనుచిత విభాగము | wrong splitting |
| అనుచిత సంసర్గము | wrong association |
| అనునాసికములు | nasals |
| అనునాసికీకరణము | nasalisation |
| అనుబంధ వాక్యకము | subordinate clause |
| అపవాదములు | exceptions |
| అర్ధాచ్చులు | semi vowels |
| అల్ప ప్రాణము | unaspirated |
| అవర్తులములు | unrounded (vowels) |
| అవ్యయములు | indeclinables |
| అవ్యాహతములు | continuants |
| ఆంగిక చలనము | gesticulation |
| ఆకాంక్ష | government/rection/regimen |
| ఆదేయపదములు | loan words |
| ఉన్నత స్వరములు | high vowels |
| ఊనిక | stress accent |
| ఊష్మములు | spirants |
| ఎరువు మాటలు | loan words |
| ఏకాచ్క భాషలు | mono-syllabic languages |
| ఓష్ఠ్యములు | labials |

| | |
|---|---|
| కంఠ్యములు | gutturals/velars/soft palatals |
| కంపితము | trill |
| కఠోరహల్లులు | hard consonants |
| కోమల హల్లులు | soft consonants |
| గొంతు ముడి | Adam's apple larynx |
| గ్రామ్యత్వము | degradation |
| ఘర్షములు | fricatives |
| ఘోషములు | voiced sounds |
| జాత్యాశ్రిత వర్గీకరణము | genealogical classification |
| తాలవ్యములు | palatals |
| తాలవ్యీకరణము | palatalisation |
| దంతౌష్ఠ్యము | denti-labial |
| దంత్యములు | dentals |
| దుర్బల వ్యంజనము | weak consonant |
| ద్రవ వర్ణములు | liquids |
| ద్విరుక్తి | doubling |
| ధాతువు | root |
| ధ్వని నియమములు | phonetic laws |
| ధ్వని పరిణామము | phonetic change |
| నాగరకభాషలు | cultivated languages |
| నాద తంత్రులు | vocal chords |
| నాదములు | sonants |
| నానుడి | idiom |
| నాసికా వివరము | nasal cavity |
| నిమ్న స్వరములు | low vowels |
| నిర్మాణాశ్రిత వర్గీకరణము | syntactical classification |

| | |
|---|---|
| పదబంధము | phrase |
| పదసామగ్రి | vocabulary |
| పరమ ప్రమాణము | chief unit |
| పరిహార దీర్ఘత | compensatory lengthening |
| పశ్చిమ స్వరములు | back vowels |
| పార్శ్వికములు | laterals/side consonants |
| పృథక్కరణము | dissmilation |
| ప్రకంపనములు | vibrations |
| ప్రతిపదాత్మక భాషలు | isolating languages |
| ప్రత్యయాత్మక భాషలు | inflexional languages |
| ప్రధాన వాక్యకము | principal clause |
| ప్రామాణిక భాష | standard language |
| ప్రేరణార్థక క్రియలు | verbs of command |
| బహు సంశ్లిష్టభాషలు | polysynthetic languages |
| భౌగోళిక వర్గీకరణము | geographical classification |
| మధ్యమ స్వరములు | central vowels |
| మహాప్రాణము | aspirated |
| మాండలికములు | dialects |
| మూర్ధన్యములు | cerebrals/retroflexes |
| మూలద్రావిడభాష | proto-Dravidian language |
| మృదు తాలువు | soft plate/velum |
| యోగ్యత | concord/agreement/congruance |
| రూపాశ్రిత వర్గీకరణము | typological/marphological classification |
| లుంఠితము | rolled consonant |

| | |
|---|---|
| వర్ణ వ్యత్యయము | metathesis |
| వర్తులములు | rounded (vowels) |
| వాగ్వ్యవహారము | articulation |
| విధేయము | predicate |
| వివృతములు | open vowels |
| వివృతహల్లులు | open consonants |
| విశ్లిష్ట భాషలు | analytic languages |
| విషయము | proposition |
| వ్యాకోచము | expansion |
| శ్వాసనాళము | wind pipe |
| శ్వాసములు | surds |
| సంకోచము | restriction |
| సంచయాత్మక భాషలు | agglomerating languages |
| సంయుక్త వాక్యము | compound sentence |
| సంయుక్తాచ్చులు | diphthongs |
| సంయోగాత్మక భాషలు | agglutinative languages |
| సంవృతములు | close vowels |
| సంవృత హల్లులు | shut consonants/stops |
| సంశ్లిష్ట భాషలు | synthetic languages |
| సంశ్లిష్ట వాక్యము | complex sentence |
| సకర్మక క్రియలు | transitive verbs |
| సమ స్వరత | vowel harmony |
| సమాచ్చులు | simple vowels |
| సమీకరణము | assimilation |
| సమ్మిశ్రణాత్మక భాషలు | incorporating languages |
| సహకారాక్షరము | glide |
| సహజావబోధము | instinct |

| | |
|---|---|
| సామాన్య వాక్యము | simple sentence |
| సామ్యము | analogy |
| సౌమ్యత్వము | euphemism |
| స్పర్శములు | mutes |
| స్పర్శోష్మములు | affricates |
| స్ఫోటములు | plosives |
| స్వరపేటిక | glottis |
| స్వరము | pitch accent |
| స్వరలోపము | synecope |
| స్వరవిశ్లేషము | anaptyxis |
| స్వరాకర్షణము | vowel attraction |
| స్వరాగమము | prothesis |
| హల్లోపము | haplology |





"స్ఫూర్తిశ్రీ స్పందసౌందర్య మాంధ్రీతత్త్వ నిరూపకం
సేవ్యతాం భాస్కరాలోకం భాషాయాశ్చరితం మహత్"

